శ్రీ స్కాందపురాణాంతర్గత

# నాగరఖండము.

షష్ఠ సప్తమాష్టమాశ్వాసములు

గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా జానపాడు నామకగ్రామ నివాసియు, అభినవసరస్వతీ పత్రికాధిపతియు నగు

జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

ఆంధ్రీకృతము.


గుంటూరు

చంద్రికాముద్రాక్షరశాలయందు ముద్రితము.

శ్రీ విభవసంవత్సర చైత్రమాసము

1928.

# విషయసూచిక.







——(:౦:)——



గ్రంథకర్త,

జానపాటి పట్టాభిరామశాస్త్రి,

అష్టావధాని,

జానపాడు, పల్నాడు తాలూకా.

# నాగరఖండము,

## —॥ షష్ఠాశ్వాసము ॥—

క॥ శ్రీయాదవవరవిమృష్టన్యాయాన్యాయా ! విమర్శనావసరధృతా
మేయసమవర్తికాయ ! మహాయా ! వరబాకరాట్పరాంకుశరాయా ! ౧

క॥ అవధారు, నైమిశక్షేత్రవసచ్ఛౌనకముఖాఖ్యధాత్రీదేవుల్
వివిధపురాణార్థవిదుండవు సూతుంగాంచి యిట్లులనిరి మునీంద్రుల్, ౨

తే॥ "యాజ్ఞవల్క్యునిపేరట నతనిపౌత్రుఁడైన వరరుచిపేరట నతనిచేత
సుప్రతిష్ఠితుఁడై కడు శోభిలెడి వినాయకుని పేరటను బుణ్యదాయకములు ౩

తే॥ తీర్థములు మూఁడుగలవని తెలియఁబలికి తనఘ ! యాయాజ్ఞవల్క్యుని యాత్మజాతుఁ
డైన కాత్యాయనుని పేర నట్టితీర్థ మేల లేకుండినదియొ యూహింపఁబడదు. ౪

తే॥ సిద్ధిదంబగు తీర్థ మాక్షేత్రభూమి నతఁడె నిర్మింపకుండినయట్టివాఁడొ
నిర్మితంబయియున్నను నీవె దానిఁ జెప్పమఱచితో వివరించి చెప్పుమయ్య" ౫

వ॥ అనియడిగిన సూతుండిట్లనియె, ౬

శా॥ "ఆకాత్యాయనవరాని వాస్తుపదమం చందొక్కతీర్థంబు సు
శ్లోకంబుం బొనరించె, వాస్తుపదనుంచుకా దాని కిబ్బంగి పేర్
రాకంగూర్చి వినుండు కారణము, ఘోరంబైన భూతంబొకం
డాక్రవ్యాదులు సృష్టిసేయుడు సురల్ వ్యగ్రాత్ములై యెల్లరున్ ౭

సీ॥ బ్రహ్మసృష్టంబైన ప్రజచేతఁ బూర్వమెన్నఁడుగూడ నీక్షింపఁబడనియదియు
నీక్షితంబగుమాత్ర నెడఁద బ్రద్దలుచేయు నురుభీషణాకార మొనరునదియు
రంగునఁ బదనునం గొంగగుద్దలితోడఁ దులఁదూఁగు బలుకోఱలొలయునదియు
శస్త్రాస్త్రములచేతఁ జంపశక్యముగాక పీనుఁగు మొగముతోఁ బెనఁగునదియు
మోదులట్టులఁ గడునిక్కఁబొడుచుకొన్న చెవులుఁ దలవెంట్రుకలుఁగల్గి యవనిజనులఁ
దమ్ముఁ గబళించునదియునౌ నమ్మహాపిశాచమునుజూచి యాయుధాళ్వేచి రపుడు,

వ॥ అట్లువైచినను నొక్కటియు దానికిఁ దగులదయ్యె, నయ్యది యాథర్వణ
సూక్తంబుచే నమృతబిందువునం బ్రభవించి దైత్యులచేఁ బంపఁబడినదికావున వేయి
యేండ్ల పర్యంతము నట్లయుండుటయుఁ జంపశక్తులుగాక క్రుద్ధులై తదుదరంబునం
బ్రవేశించి మహాయత్నంబున నుండిరి, యంత నయ్యసురులందఱు ౮

ఆ॥ "కావ్యసృష్టమైన కడుభయంకరపు టీభూతమునకు నొకడె భార్యపాయ,
మమరవరులఁబట్టి యసువులఁదీయుఁజే యది తదన్యమింక ననవసరము" ౧౦

వ॥ అని యన్యోన్య మాలోచించి వివిధాస్త్రశస్త్రంబులం బ్రయోగించి కోలాహలం బొనరించుచుండుటయు హరి యరుదెంచి యాభూతంబు నాహ్లాదపెట్టుచు ౧౧

తే॥ "నీకళేబరమునయందు నివ్వటిలెడి నిర్జరు ల్పూజలంబొంది నిన్నుఁ దృప్తి
పఱుపఁజూచెద, నటువంటిపరమపూజ యెవ్వరికిఁగూడసిద్ధింప దిద్ది నిజము" ౧౨

వ॥ అని వాక్రుచ్చుటయు సవికల్పచిత్తంబుతో నది యిట్లనియె, ౧౩

ఆ॥ "కరముమంచిసంధి కావించి, తిద్దాని కేను నిష్టపడుదుఁ, గాని నాకుఁ
బూజచేయునట్టి పూరుషులంబట్టి తినుట నిక్కువంబు వనజనాభ!" ౧౪

వ॥ అనుటయుఁ జక్రధరుండు "వల్లె" యని స్వాస్థ్యంబుఁజెంది చతుర్ముఖుం దిలకించి యాభూతంబునకు "నామంబువిధింపు" మనుటయు నతండు ౧౫

కం॥ "ఏతద్భూతము నీతోఁ బ్రీతిని "వాస్తువిది" యనుచుఁ బ్రియవచనమ్ములన్
స్వీతరవంబునఁ బలుకుటచేతం దా వాస్తువనఁగఁ జెల్లెడి నింకన్" ౧౬

వ॥ అనిపలికి విశ్వకర్మ నాహ్వానించి విస్తరాన్వితంబగు పూజావిధానంబు బోధించుటయు యాజ్ఞవల్క్యసుతుండగు కాత్యాయనుండు తద్దేవశిల్పిం గనుంగొని ౧౭

ఆ॥ "హాటకేశ్వరమున నస్మదాశ్రమ మీవిధానమునను గట్టఁదలఁపుమయ్య,
యేను సకలమెఱిఁగి వృద్ధియొనర్చెద, లెమ్ము, పోదమటకు లీల నిపుడ" ౧౮

వ॥ అని పిలుచుటయు విశ్వకర్మ హాటకేశ్వరంబునకేగి పరమేష్ఠి చెప్పినవిధంబున వాస్తుపూజ నిర్వర్తించెఁ, గాత్యాయనుండు విశ్వహితార్థ మద్దాని శాలాకర్మాదిపూర్వకంబుగా సహస్రధా విభజించె, వాస్తుపదంబు తత్క్షేత్రంబున నేర్పడినవిధం బియ్యది, యీవాస్తుపూజంజేసి మానవుండు పాపవినిర్ముక్తుండయ్యెడు, ౧౯

## అజాగృహోత్పత్తి

తే॥ అట్లజాగృహయను పేర నలరుచుండు మఱియునొకదేవతయు నందు మానులార!
యఖిలరోగక్షయావహ యది, తదుద్భవప్రకారంబు వచియించువాఁడ వినుఁడు,

వ॥ సకలరోగంబులు నెప్పు డజారూపంబులై వర్తించియుండెనో యప్పుడొకరాత్రి వాని నన్నింటిని గుంపుఁజేసి సర్వభూతహితరతుండగు నజాపాలుండు తత్స్థానంబున నుంచియుండె, నంత నాప్రదేశం బజాగృహంబని సర్వజనులచేతను జెప్పంబడుచు దర్శనమాత్రంబున వ్యాధినాశకంబైయున్నయది, యొకద్విజుం డొకరాత్రి యట కరుదెంచి ౨౧

సీ॥ ఎయ్యవి తమతమ యిచ్చవచ్చిన చోటులను హాయిగాఁ బండుకొనినయవియొ
యెయ్యవి నురుఁగు బొట్లిల స్రవించెడిరీతిఁ దిన్నగా నెమరుచుచున్నయవియొ
యెయ్యవి మృగభీతి యేమాత్రమును లేక సుఖముగా నిద్రింపఁజూచునవియొ

..య్యవి జడత్వమై నెవరును దమ నేమియొనరింపరని నమ్మియున్న యవియొ
యట్టియజములఁ బొడగాంచి యాతఁడచటఁ బురుషుఁడొక్కరుఁ డుండంగఁ బోలుననుచు
ఘూత్కృతులొసఁగి కడుఁ బ్రొద్దుపోవుపఱకు నెవరు రామిని మనమునం దిట్టులనియె, ౨౨

తే॥ ‹‹ ఎవ్వరును లేక విజనమౌ నియ్యరణ్యమునను రాతిరి యివి పండుకొనవుగాన
వీని రక్షణకొఱకుఁగా నేనరుండొ వచ్చి, భయమేది శయనించువాఁడ నిచట'' ౨౩

వ॥ అనిపరుండుటయు శ్రాంతుండగుటచేఁ ద్వరితంబుగ నే తెల్లవాఱెఁ, గాని
తచ్ఛరీరంబు కుష్ఠవిశిష్టంబగుటయుఁ గాలుతీసి కాలు పెట్టఁజాలక ౨౪

ఆ॥ ఏమి కారణంబొ యిటు లకస్మాత్తుగా మామకీనతనువు మాఱిపోయె,
నేమి తెగులొ యిద్ది యెఱుఁగంగఁబడదయ్యెఁ, గదల మెదలఁజాలక యిటులుంటి''

వ॥ అనిచింతించుచుండ నొకపురుషుండు వచ్చి యయ్యూథంబును దగ్గఱకుం
జేరి పరామర్శించి రోగగ్రస్తుండై పడియున్న బ్రాహ్మణుం దిలకించి ౨౬

మ॥ ‹‹ ఎవరయ్యా మహీదేవ! నీవు రహిమై నేతెంచినా వెందు? నా
యవనిన్ వేనికి లేవె, నీకు నెటులీవ్యాధుల్, తటస్థించె? నీ
చెవులన్ మామకమైనయాఖ్య పడుచోఁ జెప్పంబడున్ వింము, త
ద్రవిడాంశంబున నాదుజన్య, మజుఁడన్, ధాత్రీతలాధ్యక్షుఁడన్, ౨౭

చం॥ అజములసల్పి రోగముల, నన్నిటి నొక్కెడ గుంపుఁజేసితిన్,
బ్రజలకు మేలుగూర్చుటకుఁ బాలన సేయుచునుంటి వాని, నో
ద్విజవర! తావకంబయిన దేహమునంగల జాడ్య మెయ్యదో
నిజముగ నాకుఁ జెప్పుకొను, నిగ్రహముం బొనరింతుఁ జెచ్చెరన్'' ౨౮

వ॥ అని వాక్రుచ్చుటయు బ్రాహ్మణుండిట్లనియె, ౨౯

ఆ॥ ‹ తీర్థసేవకొఱకుఁ దిరుగుచు నీహాటకేశ్వరమున కోజ నేగుదేరఁ
బ్రొద్దుగ్రుంకుటయును భూమీశ! యెట్టులైన వసతి చూచుకొనఁగవలసివచ్చె, 30

చం॥ ఇచటఁ బసులక్కనంబడుడు నెవ్వరొ మానిసు లుండఁబోలు నం
చచలుఁడనౌచు వీనికడ నట్టె పరుండితి, దస్సియుంట సం
కుచితకళేబరుండనయి కూరుకుఁజెంది ప్రభాతమందు లే
చి చటుకునం గనుంగొనుడు క్షిత్యధినాయక! యిట్టులుండితిన్, ౩౧

క॥ ఎఱుఁగనొకించుక యేనియు మఱియొకకత, మేల పెక్కుమాటలతోడన్,
ధరణీశ! యేమి జరిపెదొ జరిపి మదామయముఁ బాప సమకట్టుమిఁకన్'' ౩౨

వ॥ అనినవిని యజాపాలుఁ డజంబుల దిక్కు మొగంబై 33

ఆ॥ ‹‹ తెగుళులార! యేమి తెగులు పుట్టెను మీకు, నాదుమొదల దాఁటినార లిటుల?

దీనిగూర్చి నేను వేసినిశిక్షింపవలెనో చెప్పుడు మాఱుపలుకకుండ"

వ॥ అని పలుకుటయు నయ్యావియిట్లనియె, ౩౫

కం॥ "కోపింపకయ్యామాపై భూపా! యీదుర్నివార్యపుంబనియెడలన్,
బాపనికిదాపరించిన పాపపుఁదెగుళులనుగూర్చి పరికింపుమీఁకన్ [ముల

తే॥ క్షయముఁ గుష్ఠము గజ్జియు క్ష్మాతలేంద్ర! యంటురోగంబు, లందుమంత్రౌషధ
కాద్యములరెంటిఁ బోకార్ప నలవిగాదు, బ్రహ్మశపియించెనట్లు పూర్వమున నలిగి,

ఉ॥ కావున దీనిఁగూర్చి యెదికర్జమొ యయ్యది యాచరింపఁగా
నీవ కడున్ సమర్థుఁడవు, నేరము మేమునచింప, నీధరా
దేవుఁడు చేతిమీఁదుగను దెచ్చుకొనెంజుమి యీతెగుళ్ళ నో
భూవర! యంటురోగములఁ బోయి స్పృశించిన నూరకుండునే, ౩౮

తే॥ అఖిలజంతువులును సౌఖ్యమందుపొందె నీకు శ్రేయోభివృద్ధియు నెగడుపొందె
మఱియు నొకమాటవచియింప మనసుపుట్టె శ్రద్ధధానుఁడవై విను క్ష్మాతలేంద్ర!

మ॥ క్షయయుం గుష్ఠము గజ్జి కొంతవడి నేస్థానంబునందుండు న
య్యాయనంబందుఁ దదీయవిష్ఠపడు ఱేఁడా! యందుఁ గాలాంతరం
బ యగుంగాక సుఖార్థులైనమనుజు ల్వాదం బిడంగూడ, ద
ట్లయినన్ వారికి సంక్రమింపఁగల దావ్యాధిత్రయం బల్లనన్, ౪౦

ఉ॥ మమ్ముల నీవువిడ్చినను మంత్రము లౌషధము ల్ధరిత్రమ్మ వ
శ్యమ్మనుజేసికోఁగలవు క్ష్మాతలనాయక! యీక్షయమ్ముఁ గు
ష్ఠమ్మును నబ్జయోని వరశాపమునం బ్రభవించియుంట సా
ధ్యమ్ములుగావు లోకమున ధట్టులకేని యిఁకేమిచెప్పనా" ౪౧

వ॥ నావుడుఁ దత్పార్థివుండు బ్రాహ్మణుం గనుంగొని ౪౨

తే॥ "నిష్ఠురంబైన యీ రోగనిచయమునకు భయముపడకయ్య యింక నో బాపనయ్య
నిన్నురక్షించెదనుగానఁ గొన్ని దినము లెదురుచూచుచునుండుమీ నీస్థలమున" ౪౩

వ॥ అనిపలికి యహర్నిశంబులు నాక్షేత్రదేవత నారాధించుచు నీలరుద్రంబుల
వేల్చుటయు హోమకుండంబునుండి క్షేత్రదేవత బయలువెడలి ౪౪

తే॥ "అనఘ! త్వత్క్రియమాణమహాహవనపుం బ్రభావమునఁజేసి నేనిట్లు ప్రభవమైతి,
హర్షమగ్న్యైనుగాన నీయభిమతంబు చెప్పికొను, మిచ్చుటకుఁగాను సిద్ధముంటి" ౪౫

వ॥ అనవుడు రాజిట్లనియె, ౪౬

తే॥ "వ్యాధిసంసర్గదోష మీవసుమతికిఁ బొసంగకుండెడిరీతి నీస్థానమందు
నీవువసియింపవలయు నో దేవి! యెపుడు, నేఁటిసుత విధియింపనానీతి యనియ,

శా॥ లేకున్నం బ్రిజ యీమహీసురుఁడువోలెం బాద మీనేలకున్
ద్రాఁకింపంగనె రోగయుక్తమగు నోతల్లీ! యటుల్కాకయున్
నాకున్ దోషముసంభవింపఁగల దెన్నాళ్ళోయిటన్ వ్యాధులన్
మేఁకల్గాఁగనొనర్చియుంచుట నిఁక న్నీకేమిచెప్పంగనో, ౪౮

ఆ॥ అట్లు భవదనుగ్రహంబునంజేసి యీభూమిసురునిరుజయుఁ బోవుఁగాక,
నిఖిలజగమునిట్లు నీరోగముంజేయు చిట వసింపుమింక నీవు జనని!" ౪౯

వ॥ అని యిట్లు వక్కాణించిన క్షేత్రదేవత ప్రసన్నయై. ౫౦

శా॥ "ఏతత్థ్సానము వ్యాధిదోషములులేకెంతేవిరాజిల్లు, సం
ప్రీతిన్ నేను వసించు చిచ్చట సదా పేర్గాంచి కుష్ఠాదికా
న్వీతుండయ్యును భక్తితోడ నిటకున్ వేవచ్చి నన్గొల్చు నా
పూతాత్మున్ గతరోగుఁజేసి దయతోఁ బోషింతు రాజోత్తమా! ౫౧

ఉ॥ కావున నీమహీసురుఁడు కాదన కిప్పుడలేచి స్నాతుఁడై
భూవర! భక్తితోడ ననుఁ బూజగొనర్చునుగాక, యిచ్చటన్
బావనవారియైన యొకబావి చెలంగును, దానిలోన నే
యీవిబుధుండు ప్రత్యహము నెంతయుశ్రద్ధ మునుంగుఁ గావుతన్, ౫౨

ఉ॥ దక్షునిచే శపింపఁబడి తా క్షయరోగవిశిష్టుఁడౌచు వ్యా
ధిక్షతిగోరి చంద్రముఁడు దీని రచింపఁగఁజేసి క్రుంకి వే
యక్షయుఁడయ్యెఁ బూర్వమున, నప్పటినుండియు నోవసుంధరా
ధ్యక్షుఁడ! చంద్రకూపికయటన్న ప్రథంగనె సార్థకంబుగన్, ౫౩

తే॥ కుష్ఠరోగక్షయార్థమై కుసుమశరుఁడు త్రవ్వి సౌభాగ్యకూపికన్, దాన నాడి
ఖండశిలయను దేవత నిండుభక్తిఁ గొలిచె, నితఁడును నటుచేయఁ గుష్ఠ మెడలు, ౫౪

తే॥ ఉండెమఱియొండు నప్సరఃకుండమనఁగ దండితారాతితండ! యేతత్థ్సలమ
భానువాసరమునఁ గృతస్నానుఁడైనఁ దీఁటంబావెడి నది యొక్క పూఁటలోన" ౫౫

వ॥ అని యనుగ్రహించుటయు నాబ్రాహ్మణుఁడు చంద్రకూపికం గృతాభిషేకుండై యాదేవి నర్చించి రాజయక్ష్మచేతను సౌభాగ్యకూపికం దీర్థమాడి ఖండశిలను దర్శించి కుష్ఠవ్యాధిచేతను భానువాసరంబునం దప్సరఃకుండంబునఁ గృతావగాహుండై విషయాత్మకుండు బుద్ధిచేతంబోలెఁ బామచేతను మాసంబులోఁబరిత్యక్తుండై యవనీశ్వరు నాశీర్వచించి ఖండశిలా క్షేత్రదేవతలకుఁ బునఃపునఃప్రణామంబు లాచరించి యభిమతప్రదేశంబున కరుగం గలిగె, నజాపాలభూపాలుండు హాటకేశ్వరులో నైక్యంబు చెందనయ్యె, నిప్పటికిని యక్ష్మకుష్ఠపామాన్వితు లావిధంబున సేవించిరేని నీరోగులగుదురు,

—: ఖండశిలా సౌభాగ్యకూపికల యుత్పత్తి :—

క॥ మౌనివరులార! పూర్వము వానప్రస్థాశ్రమమున వర్తిలి యట న
న్న్యూనతపమాచరించెను బూనిక హారీతుఁడనెడి భూమిసురుఁడు తాన్, ౫౭

వ॥ ఆయనకు విష్ణువునకు సాక్షాల్లక్ష్మివలెఁ బూర్ణకలయను సుందరి ధర్మపత్ని, యావిడం జూచినఁ దమ్మిచూలియును దత్క్షణము కామవశుఁడయ్యెడుఁ, గామేశ్వర సందర్శనార్థ మా క్షేత్రంబున కొక్కయెడ నరుదెంచిన కామదేవుండె వివస్త్రయై జలకమాడు పూర్ణకలం గని మోహించి రహస్స్థలస్థమగు నొక్కచెట్టుక్రింద బ్రహ్మను ధ్యానించు యోగినాఁ దదేకదృష్టియై, జలంబులనుండి వెలుపలి కేతెంచి ముసిముసి నగవులతో వసనంబు ధరియించు పూర్ణకల సమీపమునకు మెలమెల్లఁ బోయి కృతాంజలి పుటుండై ౫౮

ఛం॥ "వివసనవౌచు నీసరసి వేడుక [illegible]డుచునున్న దాన వీ
వెవరవో యేమొ కాని మదిరేక్షణ! ప్రాణములన్ హరించుచుం
టివి, యటుగాన నేనొకనుడిన్ వచియించెద వినుమ, దేవతా
ప్రవరుల మోసగించు సుమబాణుఁడ నేను, జగత్ప్రసిద్ధుఁడన్, ౫౯

సీ॥ మద్బాణనిహతిమై మహీధరాత్మజ శూలి యర్ధాంగమునఁ జేర్చి యాడినాఁడు,
మద్బాణనిహతిమై మతిశూన్యుఁడై బ్రహ్మ కన్నకూఁతు యభేచ్ఛఁగలసినాఁడు,
మద్బాణనిహతిమై మఘవ యహల్యకై దొంగకంతలలోన దూఱినాఁడు,
మద్బాణనిహతిమై మహనీయులౌ సురల్ వారిజాక్షుల కాళ్ళ ప్రాలినారు,
ఇంక నరుఁడనంగఁ బంకేజముఖి! నాకుఁ జీడపురుగ, వేఱచెప్ప నేల?
పద, పిపీలికాదిబ్రహ్మపర్యంతము మచ్ఛరాగ్ని చేత మండఁబడెడి, ౬౦

ఉ॥ ఈవిధ మెల్లలోకమును నేను మదీయసుమాస్త్రపావక
పాత్రివ్రతముం బొనర్పఁగ నపాంగవిలోకనపావకంబుచే
నీవు ననున్ దహించుటకు నేర్పడి, తందున సాధుప్రాణముల్
వోవకమున్న తిన్న సురతోత్సవసేచన మాచరింపుమీ॥ ౬౧

వ॥ అనినవిని యాయమయుఁ దద్బాణనిర్భిన్నహృదయయై యేమియుం బలుక నేరక బొట్టనవ్రేల భూమిరాయుచుఁ దలవాంచి తడవునిలువఁబడుడు నకృతాశనుండగు హారీతుండు తదాగమనంబున కెదురుచూచిచూచి యందందు వెదకుచు నాస్థలంబునకుఁ జని యొక్కపొదమాటున డాఁగియుండి భ్రాంతుండై బహుభాషలాడు ప్రద్యుమ్నుని వ్రీడావనతవదనయై వినుచు నిలుచున్న తనపెండ్లమును బొడగాంచి కోపంబున ౬౨

కం॥ "పాపాత్మ! యెదియెఱుంగని నా పెండ్లామును భ్రమియించినా విదితగురా?
ఛీ పో కష్టవిశిష్టుఁడవై పోకిరి! నీదురూప మడుగంటు నికన్ ౬౩

చం॥ నినుఁగని సానురాగయయి నేలను వ్రేలను రాసికొంచు ని
ల్చినయది కాని యీచెడిపె లేశముగూడ ననిష్టజల్పనం
బొనరుప, దట్టిదాని నిఁక నొల్లను నేను, శిలాకృతిన్ భజిం
చినదయి యెల్లకాల మవనింబడియుండెడుఁగాక యీకెయున్" ౬౪

వ॥ అని శపించుటయుఁ గాముఁడు కేలు మోడ్చి యిట్లనియె, ౬౫

ఉ॥ "ఎఱుఁగ నొకించుకేనియు మునీశ్వర! యీయమ నీదుభార్యయం,
చెఱుఁగకె యీపెచక్కఁదన మెంతయు నన్ను భ్రమింపఁజేయ నీ
తెఱఁగున మాటలాడితిని, దీక్ష మదీయశరంబు లీకెపైఁ
గురిసితి, నాపై దోష మొకకొంచెముగూడ నెఱుంగ దిందునన్, ౬౬

ఉ॥ మామకపుష్పబాణములు మర్మము భేదిలఁజేసియుంట నీ
రామ సహింపలేక యనురాగమునూనె నెడంద నాపయిన్
మోమును లేవనెత్తి యొకముచ్చటయేనియుఁ జెప్ప, దింతకే
యేసునిశాపమిచ్చితి మునీంద్ర! పదంపడి చింతఁజెందఁగన్, ౬౭

శా॥ రుద్రేంద్రాదిమరుచ్ఛరీరముల నారూక్షుంపుఁబూములుక్కలన్
ఛిద్రంబుల్పడుచుండ బిట్టుబల యీసింగారి, తాదృక్షనే
క్షుద్రగ్రావముగా శపించితిటు లోకక్షోణీసురాధ్యక్ష! బల్
రౌద్రంబియ్యది, పిట్టపిల్లపయి నా బ్రహ్మాస్త్రమున్ వైచుటల్, ౬౮

కం॥ అపరాధం బొనరించిన కృపణుఁడనే, నొప్పుకొంటిఁ, గృపమాలి ననున్
శపియింపు, మంతెకానీ, చపలాక్షుల నిగ్రహింపఁజన దెయ్యెడలన్, ౬౯

ఉ॥ పాపము ముత్తెఱంగుల విభాజ్యము, మానస మొండు వానిలోఁ,
నాపయి వాచికంబు, మఱియావలఁ గర్మజ, మాదిమద్వయిన్
నాపయిమోపి కొంట కొకనాఁటి కసమ్మతముండఁబోదు నా,
కీపెఱఁజెందఁ దగ్గయఘ మెన్నఁగ మానసికం బదొక్కఁడే, ౭౦

ఆ॥ ధర్మపత్ని నీవుఁ, త్రైలోక్యసుందరి, మానవతి, యఘంబు మానసికము,
అట్టిదానిఁబట్టి చట్టుగాఁ దిట్టితి, పాపభీతివలదె తాపసేంద్ర! ౭౧

కం॥ విలయించు మనస్తాపమువలనను మానసిక మఘము, వాచికము కృతాం
జలివలన మాయు, స్మృతులంగల ప్రాయశ్చిత్తమునను గర్మజ మడఁగున్ ౭౨

వ॥ అనియిట్లుపలుకుటయు వెండియు హారీతుం డిట్లనియె, ౭౩

చం॥ "మదన! స్థలాంతరస్థమగుమాట వచింపకు, మన్యసంగమా
ర్థదమగు దీనమానసమ తద్ద ప్రధానము, గాన నీపెకి
య్యదియ సుశిక్ష, పెక్కునుడులాడను నేనిఁక, నీవుఁ జేతనై
నది యొనరించుకొమ్మ చను, మక్కఱమాలినమాట లేటికిన్", ౭౪

తే॥ మొదట మనమునఁ జింతించినదియె నోటఁబలుకఁ బలికినదానినే సలుపఁగాన
మనమె సకలార్థములఁ బ్రథమ ప్రమాణ, మందునం బూర్ణనిగ్రహ మాచరితము'

వ॥ అనిపలికి హారీతుండు వెళ్ళిపోవుటయుఁ దత్క్షణంబ పూర్ణకల ఖండాకాకార శిలయయ్యెఁ, గుసుమాస్త్రుండు కుష్ఠావిష్టుండై నిరుత్సాహంబున వర్తిలుటయు జగంబున సృష్టినిరోధంబు వాటిల్లె, నంత వేలుపులు

సీ॥ మత్స్యకూర్మగ్రాహమకరకర్కటముఖ్యజలజంతువులజాడ తెలియఁబడదు,
సురనరోరగనిశాచరఖగమృగకీటకాదులయభివృద్ధి యాఁగిపోయెఁ,
దివిజగంబులందుండు స్త్రీలలో నొకతెయు గర్భంబుధరియించి కానఁబడదు,
స్వేదజంబులఁదొట్టి చినచిన్న జీవాలపిల్లలే కఱవయ్యెఁ బృథివియందుఁ,
గుసుమధన్వి యింతకుం గుశలంబుగా నున్నవాఁడో, మృతిని గన్నవాఁడో,
యిట్లుగాను మరల నేమిమునింగనో, యీవిపత్తు తొలఁగు టెట్లొ యింక ౭౮

వ॥ అనిచింతించి వ్యాధిగ్రస్తుండై యతఁ డాక్షేత్రమందుంట గుర్తెఱింగిపోయిచూచి

కం॥ "ఏమిది కామా! చెడుకుష్ఠామయయుక్తుండవైతి? వకటకటా! నీ
యామోద మేలతలఁగె? నధోముఖమునఁజూచె దేమితొందర కలిగెన్" ౭౯

వ॥ అనియడిగి తన్ముఖంబున శాపవృత్తాంత మెఱింగి ౮౦

ఉ॥ "యద్విషయంబునం బరుసమాడి యఘంబును జేసియుంటివో
తద్వధువున్ శిలానయ యథావిధిఁగొల్వుము కుష్ఠమేదు, నా
పద్వ్రతి! నీవుచేసినది వాచిక పాపము, గాదు కాయికం,
బాద్విజుఁ డోర్పులేక కరమాఱడిపుచ్చినవాఁడు నిన్నిటుల్, ౮౧

తే॥ కాయికంబౌ మహాపాపకర్మమునను సంభవించినయట్టి కుష్ఠంబుగూడ
నీదుసౌభాగ్యరూపిక నీరమాడి యీశిలం దాఁకఁగలుగుచో నాశమొందు" ౮౨

వ॥ అనిచెప్పి వెళ్లిపోవుడుఁ గాముండు తచ్ఛిలంబూజించి పూర్వరూపంబు పడసి దానికి గుడికట్టించి జగత్సృష్టివిధానంబున దిగె, నట్లుభక్తిచేఁ ద్రయోదశి నాఖండ శిల సేవించినఁ బరపురుషపరదారసంబంధాపవాదము గలుగ దని కార్తికేయుండు వాకుచ్చె; నట్లు కామపరితప్తితుండగు కామేశ్వరుఁ గుంకుమపుష్పంబులచేఁ ద్రయోదశినాఁ డర్చించిన నభాగ్యుండు సౌభాగ్యంబును విరూపుండు సురూపంబును బొందెదరు, పతియుక్తయు సపత్నీజనసంవృతయుఁ గళత్రసంయుతుండగు నాదేవు నట్లు కుంకుమకేసరంబులం ద్రయోదశి నర్చించిన సౌభాగ్యవతియుఁ బ్రజావతియు ధనధాన్యసమృద్ధయు దుఃఖశోకవినిర్ముక్తయు సర్వదోషవివర్జితయునై ఖ్యాతిం గాంచెడి. ౮౩

## —: దీర్ఘికయను నొకపతివ్రత చరిత్రము :—

ఆ॥ అట్లు దీర్ఘికాఖ్య నచ్చట మతియొక్కతుండె సరసి, సూర్యు నుదయవేళఁ
జొచ్చి యందు జ్యేష్ఠశుక్లచతుర్దశి నీరమాడఁ దొలఁగు నిఖిల మఘము, ౩౪

వ॥ వర్ధమానపురవరంబునఁ దొల్లి వేదవిద్యావ్రతస్నాతుండై వీరవర్మయను నొక బ్రాహ్మణుఁడు లోకవిఖ్యాతిం గాంచియుండ నతని కొకప్పుడు ప్రజ పరిహసింపఁ దగినంత పొడవుగలిగి దుర్లక్షణంబులతో నొకబిడ్డపుట్టి యట్టిరూపంబుతోన యౌవనవతియయ్యె, ౩౫

కం॥ అతిసంక్షిప్తశిరోజయు నతిదీర్ఘవపుస్మృతియును నతివామనయుక్
క్షితి నవివాహ్యలు, వారల పతులకు షణ్మాసములకె ప్రాప్తించు మృతుల్, ౩౬

వ॥ అట్లు గావున నెవ్వండును బరిగ్రహింపమి నాకె విరక్తయై ౩౭

సీ॥ చాంద్రాయణంబులఁ జరియించె నెన్నియో, కృచ్ఛ్రంబులొనరించి కృశయునయ్యె,
పారాకములఁగూడ బలుశ్రద్ధఁ గావించె, సాంతపనంబుల సలిపెఁ బెక్కు,
వ్రతములన్నింటి వరుసఁబెట్టి పొనర్చె, నియమంబులన్నియు నెఱపఁజాలె,
సత్కర్మమునఁజెల్లు సకలంబు విడువక యత్యంతనిష్ఠమె నాచరించె,
ఉగ్రతపముండియిట్టు లయ్యెవిధ కడకు ముసలిదేయయ్యెఁ గాని తన్ముఖుని కాస
మెచ్చఁగాఁజొచ్చె దినదిన మేమనందు సూరులార! నెఱ జడదారులార! ౩౮

వ॥ ఆయమ దేవర్షిమతంబువినుటకై నిత్యంబును నిలింపనాథుసభకుఁ బోయి వచ్చుచుండెడిది, కాని లేచివచ్చినపిదప నింద్రసేవకులు తదాసనంబు గడుగుచుండెడివారలు, తద్విధం బొకదిన మాపెకంటఁబడుటయు నలుకవహించి యింద్రుని దిక్కు మొగంబై ౩౯

ఉ॥ "ఏమిదోసంగు గానఁబడె నియ్యెడనీకు మహేంద్ర! నాకడన్ ?
మామకమాసనంబు పరిమార్జితవఱుటకు హేతువెద్ది? నేఁ
దామసురాలనై జరుపు దండియఘం బెదో చెప్పవేని నీ
యేమువడంతు శాపమిడి, యాఁడుఁదియంచుఁదలంప కీ వెదన్" ౪౦

వ॥ అనిహాఱ్చిచ్చుటయు నింద్రుండిట్లనియె, ౪౧

ఉ॥ "ఒక్కదోసంగు గానఁబడుచున్నది నీకడ నోకుమారి, యా
యొక్కటిచేయఁబట్టియె త్వదుజ్జ్వలపీఠముమీఁద నీరముల్
చిక్కఁగఁ జల్లఁగావలసెఁ, జేకొనఁ డెవ్వఁడు నిన్నుఁ బత్నిఁగా,
నక్కట! యట్టికన్యకకు నార్తవమూరుట తప్పగాదొకో, ౪౨

ఉ॥ ఇప్పటికేని కన్నె చెలి యీఁగుట యెంతయు నీకు లెస్స, యీ
త్రిప్పులకన్న నొక్క మహిదేవుని బెండిలియాడు పొమ్ము, నా
చెప్పినచొప్పు దప్పితివొ చేకురఁబోవదు నీకు శుద్ధి, యి
ట్లెప్పటికిం ద్వదంగమున కీయపవిత్రత యుండియుండెడిన్" ౯౩

వ॥ అనియిట్లువక్కాణించుటయు దీర్ఘకకన్యక లజ్జపడి పుడమికి దిగివచ్చి వర్ధమానపురస్థ చతుష్పథంబుల నిలువఁబడి కుడిచేయి లేవనెత్తి యటునిటుం దిరుగుచు నా

కం॥ "కులమున బ్రాహ్మణులగువా రెలమిని నను బెండ్లియాడుఁ డెవ్వరొయొక, రే
సలిపినతపమున సగమిడి బలుభ క్తిం గొలుచుదానఁ బతియగు నతనిన్" ౯౫

వ॥ అని చాటుచుండఁగని పిచ్చిదానింగా భావించి జను లొండొరు పరిహసింపంగడంగిరి యిట్లు కొంత కాలంబు గడవఁ గుష్ఠరోగియగు నొకజన్నిగట్టు చను దెంచి మెలమెల్ల వాయమ్మ బిలిచి ౯౬

ఆ॥ "పడఁతి! నేను నీదు పాణిని గ్రహియించి పెండ్లియాడువాఁడఁ బ్రీతితోడ,
నస్మదుక్తమెల్ల నత్యంతనియతిమైఁ జేయఁగలుగుదేని చేయి యిమ్ము" ౯౭

వ॥ నావుడు దీర్ఘికయిట్లనియె, ౯౮

కం॥ "భవదాజ్ఞ లేశమేనియు జవదాటక సలుపుదాన శ్మాసురవర! య
వ్యవధానంబుగ నను శాస్త్రవిధిం బెండ్లాడు, వలదు సందేహ మిటన్," ౯౯

వ॥ అని యిట్లుపలుకుటయు నతండు గృహ్యోక్తవిధానంబున దేవాగ్నిగురు సన్నిధిం దత్కుమారికపాణి నిజదక్షిణపాణిచే గ్రహించె, నంతఁ గృతవివాహమంగళ యగు నాపె ౧౦౦

ఆ॥ "ప్రాణనాథ! యేమిపనిచేయవలయునో యాలసింపకుండ నాజ్ఞయిమ్ము,
చెప్పినట్టిదెల్ల శిరసావహించినే నిర్వహించుచుంట నిశ్చయంబు," ౧౦౧

వ॥ అనివక్కాణించుటయుఁ బతియిట్లనియె, ౧౦౨

కం॥ "అరువదియెనిమిది క్షేత్రాల్ దరిసించి మునుఁగవలయుఁ దత్తీర్థములన్,
విరిబోఁడి! సాధ్యమగుచోఁ ద్వరగం గొనిపొమ్మనన్నుఁ దత్స్థలములకున్," ౧౦౩

వ॥ అనవుడుఁ దత్పతివ్రత వల్లెయని రయంబ ౧౦౪

సీ॥ తచ్ఛరీరమునకుఁ దగినంత వైశాల్య మాయామమునుగూడ నచ్చుకట్టి
చిరకాలమును జెక్కుచెదరకుండెడియంత శిల్పనైపుణ్యంబుఁ జేరిపించి
చూచువారల మనస్సులు హరింపఁగఁజాలు చక్కనికుదిరిక సంతరించి
కడు మెత్తనగుచు సౌఖ్యము నొడఁగూర్చెడి బాగైన బలు దూదిపఱుపు వైచి
వింతవింతగాను వేణుదండంబులచేత డోలియొకటి సిద్ధపఱచి
ఫాలతలమునందు మేలైన కేల్దోయి యొలమిఁ గీలుకొలిపి యిట్టులనియె, ౧౦౫

కం॥ "ఈ రమ్యకుటీరము నీ కై రహిఁ జేయించియుంటి, నాలస్యంబే
లారోహింపుము, శిరమునఁ జేరిచికొని యేగుదాన క్షేత్రంబులకున్" ౧౦౬

వ॥ అనవుడుఁ గుష్ఠరోగి సంతసించి భూతలంబునుండి మెల్లగా లేచి తొట్టెలోఁ
బరుండుటయు నది మస్తకంబునం బెట్టుకొని క్షేత్రంబులుతిరుగుచుఁ దీర్థమ్ములమునిచిన,
కొలఁది నతనియంగంబు తేజోవంతంబయ్యె, నట్లు త్రిప్పిత్రిప్పి ౧౦౭

సీ॥ బలువైన యెండదెబ్బకు వాడఁబాఱుచు మోటదేలిన మది మొగముతోడ
బహుదూరగమనసంభవమైన తీపుచేతను దూలు హస్తపాదములతోడ
నతిభారవహనసంహతిఁ గుదియంబడి నరములుసడలిన శిరముతోడ
నిడుచోటఁబడక యెండెడఁబడి నడక బొత్తిగ సాఁగనీని యడుగులతోడ
వేఁడినిట్టూరుపులతోడ వివశఁజేయు నిదురకన్నులతోడ నామది నెలంత
హాటకేశ్వరమున కొక్కనాఁటి ప్రొద్దుగ్రుంకుతఱిఁ జేరఁబోయెఁదాఁగొనకు నెటులొ,

వ॥ అక్కాలమ్మున కచట శూలారోపితగాత్రుండై శోకించుచుండు మాండ
వ్యుండు తత్పతివ్రతాశిరస్థ డోలాసంస్పర్శనంబునఁ జలితుండై బాధసహింపనోపక

తే॥ "శూలమున గ్రుచ్చఁగాఁబడి చాల బాధఁబొందుచున్నాఁడనే నితఃపూర్వమునసె,
నైని గదలించి మఱికొంతబాధపెట్టుచుండె, నెవ్వఁడురా పాపిముండకొడుకు?"

వ॥ అనివిలపించుటయు దీర్ఘికయిట్లనియె, ౧౧౧

ఆ॥ "నిద్రమబ్బుతోడ నేనరుదెంచుచుఁ జూడనైతి నిన్ను క్షోణిదేవ!
యధికపాపకారి వస్పృశ్యుఁడవునైన నిను స్పృశింపవలసెఁ గనుక నిపుడు, ౧౧౨

కం॥ కొఱడున దిగవేయఁగఁబడి కఱకఱ తఱుగంగఁబడుచుఁ గటకట! యసువుల్
ధరియించియుంటి, నీతోఁబరుడగు దురితాత్ముఁడున్నె భూలోకమునన్, ౧౧౩

ఉ॥ నేను బతివ్రతన్, మగని నెత్తినిదాలిచి యంగహీనుఁ గ
ష్టానకునోర్చి తీర్థముల స్నాతు నొనర్చుచునున్నదాన, న
న్నైనను నీవు గుర్తెఱుఁగ కజ్ఞునుబోలె ననుం దిరస్క్రియా
ధీనను జేసె దెందులకొ తెల్పుము మూఢమతీ! రయంబుగన్" ౧౧౪

వ॥ అనియిట్లువాకుచ్చుటయు మాండవ్యుండు ౧౧౫

తే॥ "నేను భవదుక్తవిధమున నిశ్చయముగ ముట్టరానట్టివాఁడను మూఢతముఁడ
నధికపాపాత్మకుండనే యగుట కించుకయును సంశయముండ దోకలికి! కాని
తే॥ ప్రాణములు వోవునంతటిబాధ నాకుఁ గలుగఁజేసెను నీపతి, కాన నతఁడు
సూర్యకిరణంబు లొడలిపై సోఁకఁగానె ప్రాణములఁబాయుఁ, దప్పదీపలుకుపొమ్ము"

వ॥ అనిశపించుటయు దీర్ఘిక యిట్లనియె,

కం॥ "సూర్యుని కిరణంబులు మా యార్యునిపైఁ బాజి విలయ మందించెడివోఁ
గార్యము మఱిమిగులదు, సూర్యుం డెటుపొడువఁగలఁడో చూచెదనింకన్" ౧౧౯

వ॥ అని యిట్లుపలికి యా పతిసమేతయగు దీర్ఘిక యంబడమిపైనుంచి యొకచోఁ
గూరుచుండుటయు నాకుష్ఠరోగి ౧౨౦

కం॥ దప్పికబాధించెడినను, జప్పున నెటకేనిపో యిచల్లనిజలమీ
విప్పుడ కొనితేవలయును, దప్పక ప్రాణములువోవుఁ దడసినయెడలన్" ౧౨౧

వ॥ అనితొందరించుటయు నాయమ పాని[illegible]లకై యిటునటుం బరికించి
యెచ్చటంగానక యట్టియశక్తుని బలులబారిం బడఁద్రోసి దూరంబు చనన్నొల్లక కూ
ర్చుండి పెనిమిటిపాదంబులు స్పృశించి విలపించుచు ౧౨౨

తే॥ "తథ్యమైన పతివ్రతాధర్మ మేను జరిపియే యుంటినేని యీస్థలమునందు
నిర్మలజలంబు వెడలి యీనిముసమున మదీయహృదయేశ్వరుని దగ దీర్పుఁగాక ,,

వ॥ అనిపలికి పతిభక్తిం బురస్కరించుకొని తజ్జీవితంబు నిచ్చయించుమం బాదం
బున నేలం దన్నుటయు మాండవ్యుండు చూచుచుండ స్వచ్ఛంబును స్వాదువు నగు
జలంబు బయలువెడలె, నాజలంబుల శ్రీమాతురుండగు మగండును నావిడయు స్నాన
పానాదికంబుల సంతృప్తిం జెందిరి, యంతఁ గాలాతిక్రమం బైనను సూర్యుం డుదయింప
వెలచుటయు దీర్ఘంబగు రాత్రిని విలోకించి ౧౨౪

సీ॥ ఘూకంబు లపగతశోకంబులై కూడె, లీలఁ బిశాచముల్ లేచియాడెఁ,
గన్నములావదువ దొంగలకుఁ గాలంబబ్బె, విటవిటీజనముల వేడ్కలబ్బె,
స్నానాదులొనరించుసమయంబు రాదాయెఁ, జైత్యకకృత్యముల్పడియపోయె,
ధర్మకర్మంబుల తలఁపులు తుదముట్టె, వ్యవహారఘంటయు నడుగువట్టెఁ,
బూర్వదేవతాళి పూర్తిగాఁ జెలరేఁగె, భూమిదేవతాళిబుద్ధు లాఁగె,
దేవతాళి యట్టితీరును దిలకించి యినునిమ్రోలకేగి యిట్టులనియె, ౧౨౫

తే॥ "ఏలయుదయింపవైతివో యీవుసూర్య! లోకమెల్లను వినుమినా వ్యాకులితము,
కాన లోకహితార్థమై క్రమ్మఱ నుదయింపు మధ్వరములుసాఁగ నిర్ధరిత్రి ,, ౧౨౬

వ॥ అనవుడు సూర్యుండు ౧౨౭

తే॥ "ఒకపతివ్రతయాజ్ఞచే నుదయమంద కిట్టులుంటిని సురలార! యేను, గాన
నీర లాసాధ్వి మ్రోలకే యేగియస్మదుదయమునుగూర్చి యత్నింపుఁ డోపినంత, ౧౨౮

ఉ॥ ఆయనయానతిన్ శిరమునందు ధరించుచునుంటి, నన్యథా
సేయ శపించు, మేలుపముచేసి తదంగన తాఁ బతివ్రతా

త్వాయతికిఁ బ్రియయయ్యె, నటులౌటఁ దదుక్తము వేఱుసేయ నే
ధీయుతుఁడే నశక్తుఁడగు, దీనను భీతిలి వెళ్ళకుండితిన్, ౧౨౯

కం॥ ప్రీతిం గ్రతుశతమొనరిచి ఖ్యాతింగయికొన్న వారికబ్బెడి ఫలమున్
బాతివ్రత్యముచే లలనాతతి గడియించు ఫలమునకు సరియగునే, ౧౩౦

వ॥ అనివివరించుటయుఁ దెఱఁగంటులెల్లరు నుత్తమంబగు తత్క్షేత్రంబునకుం
బోయి దీక్షితకయగ్రంబుననిలిచి ౧౩౧

ఉ॥ "భూమిని ధర్మకర్మములు బొత్తిగ నష్టములౌటఁ జేసి యో
శ్రీమతి! నీవు భాస్కరుదు నిషేధముచేయుటఁ జూడ నెంతయున్
క్షేమముగాదు, కాన సుఖకృత్యము లెప్పటియట్లుసాఁగ నా
ధామనిధిన్ మహీప్రజకు దర్శనమిచ్చి వెలుంగనిమ్ము కన్," ౧౩౨

వ॥ అనుటయు నాపతివ్రతయిట్లనియె, ౧౩౩

తే॥ "ప్రాణములకంటెఁ బ్రియుఁడు, నాభర్త యీతఁ
డతఁడు సూర్యోదయంబైన యాక్షణమునఁ
బ్రాణములఁ బాయఁగలఁ, డిట్టి పాపియైన
యట్టి మాండవ్యముని కార్య మరయకుండ ౧౩౪

మ॥ శపియించెన్ సురలార! యిట్టిక జగచ్ఛత్రున్నవుం బ్రాహ్మహీ
ధ్రపుశృంగంబున నెక్కుమందు? నవలం బ్రాణేశు ప్రాణంబువో
నిపుడా జన్మము లాబ్దికంబులని నా కీర బ్రబోధించు? టీ
యుపదేశంబులతోడ నేమిపనిలే, దుండుండు కేల్మోడ్చెదన్," ౧౩౫

వ॥ అనియిట్లువారు ప్రొచ్చుటయు వేలుపులొక్కరిమొగ మొక్కరు చూచుకొని
శోకించుచు వినయోపేతులై ౧౩౬

మహాస్రగ్ధర॥ "ఉదయించుంగాక సూర్యుం, డుచితుఁడయినపై నోజ నీభర్త మూర్తిన్
వదలుంగా, కీవు శోకింపవలదు పతిపై వత్సలత్వమ్ముచేతన్,
బ్రదికింపన్ సిద్ధమున్నారము, మఱి యతఁ డాపంచబాణుండువా ని
ర్వదియైదేడుల్గలాఁడౌ, వఱలెదు తిథిసంవత్సరప్రాయు వీవై, ౧౩౭

కం॥ ఈముని శార్దూలుండును సీమంతిని! శూలవేధచే నిర్ముక్తుం
డై మహితసౌఖ్యమందును దా ముం జేసినయఘంబు దగ్ధముగాఁగన్," ౧౩౮

వ॥ అనివక్కాణించి యాయమచే నల్లెయనిపించుటయుఁ దత్క్షణంబ యతివే
గంబుగా సూర్యభగవానుం డుదయించెఁ, దదంశుసంస్పృష్టుండై సుమ్మరోగి మర

జించియు విబుధకరస్పర్శంబున మరలలేచి పంచవింశతివర్షప్రాయంబున రెండవమన్మ
థుండునాఁ గనంబడియె, దీర్ఘికయు సాక్షాచ్ఛంభునిచేతనే స్పృశింపఁబడి ౧౩౯

సీ॥ అదితినందనయోషి దనవద్యతమభవ్య నవ్యసర్వసులక్షణములతోడఁ
బరిపూర్ణచంద్రబింబము గేలి సేయుచు ముద్దుగాఱెడి లేఁతమోముతోడఁ
కరికుంభములతోడఁ బరిహాసమాడెడిరమ్య పీన పయోధరములతోడఁ
బద్మపత్రముల శోభను జేరలకుమీఱి కళలూరు కాటుకకనులతోడఁ
బిడికిటం బట్టఁదగిన సన్నడుముతోడ డంబువహియించు గౌరవర్ణంబుతోడఁ
గాంచువారల మనముహరించుకొనుచుఁ బదియునైదేండ్లవయసుదై యెదుటనిలిచె,

వ॥ అంత నమరవరులు మాండవ్యు శూలాగ్రంబునుండి దింపి హర్షంబున ౧౪౧

ఆ॥ "త్వత్సమీరితం బతథ్యంబుగాకుండ సలిపినాము, మాటనిలిపినాము,
మృతినిగన్న కుష్ఠి బ్రతికించి పరువంబుగూర్చినాము, కోర్కె తీర్చినాము, ౧౪౨

కం॥ మాదర్శనంబు వ్యర్థముగాఁ దలఁపఁ దటస్థపడదు, కావున నీవి
ష్టేదేనియుఁ గాంక్షింపుము, కాదన కీఁగల మదెట్టికాంక్షితమైనన్ ,, ౧౪౩

వ॥ అనివచించుటయు మాండవ్యుండిట్లనియె, ౧౪౪

ఉ॥ "ఈరిదువాంఛితంబు గ్రహియింతునుగాని సుపర్వులార ! నన్
గూరిచి యాకృతాంతుఁ డొకయింత వచింపఁగనున్న, దేమనన్
ధారుణిలోన నెవ్వరవి తాఁ రొనరింతురొ పుణ్యపాపముల్
వారలు తత్ఫలంబు గుడువం దగియుండుట నిశ్చయంబయ ౧౪౫

క॥ కొఱడునవేయఁగఁబడుటకు జరిపినఘోరాఘ మెద్ది ? సత్వర సువుల్
దొరఁగక వ్యధనొందుచు నీకరణిని వసియించుటకును గారణ మేమో ?" ౧౪౬

వ॥ అనియడుగుటయు యముండు ౧౪౭

చం॥ "తొలిజని బాల్యమందుఁ గడుధూర్తుఁడవై యొకతొంగఁ దెచ్చినీ
వలఘుతరంపుశూలమున నయ్యది హాయన గ్రుచ్చియుంటి, వీ
కొలకయి శూలఘాలమునఁ గూలఁగనైనది యిప్పు డిట్టు, ల
ప్పులుఁగును నప్డు ప్రాణములువోవక శూలమునందుఁ గుందదే" ౧౪౮

వ॥ అనివాక్రుచ్చుటయుఁ గోపఘూర్ణితలోచనుండై మాండవ్యుండిట్లనియె, ౧౪౯

ఉ॥ "ఈయధమాపరాధమున కింతటిదండనమున్ విధింతె దు
ష్టా ! యమ ! తత్ఫలంబుగ రసాస్థలి శూద్రకుఁబుట్టు, మెన్మిదౌ
హాయనమేగులోపల మహాఘమొనర్చినవారుగూడ నా
చేయువ్యవస్థమూలమున శిక్షకుఁ బాత్రులు కారు పొమ్మికన్" ౧౫౦

వ॥ అనిశపించి వెళ్ళఁబోవుటయుఁ గ్రతుభుజులు గడగడవడంకుచు ౧౫౧

కం॥ "భగవానుఁడ! యీయంతకుఁ డగుఁగాక కృతాపరాధుఁ, డంతకె శూద్రుం
డుగ శపియించు టన్యాయము, పగుడించి వరంబుగొనుము మావలన నీకన్" ౧౫౨

వ॥ అనిప్రార్థించుటయు మాండవ్యుండు వెండియునిట్లనియె, ౧౫౩

శా॥ "నానోటం బలుకంగఁబడ్డనుడి యేనాఁడున్ వృథాగా, దటుల్
గానన్ భానుతనూభవుండు వృషలీగర్భంబునం బుట్టుచే
నూనం, బైనను నూనుహీనుఁడగుచుం గొన్నాళ్ళ కేతత్సమా
చీనంబైన స్వధర్మరాజపదవిన్ సేవించుఁ దాఁ గ్రమ్మఱన్. ౧౫౪

క॥ ఈసు క్షేత్రమునన దిగ్వ్యాసు నచంచలత నితఁడు భజియించునుగా,
కాసర్వేశ్వరుకృపచే వాసిం ద్వరలోనె మృత్యువశుఁడయ్యెడుఁ దాన్, ౧౫౫

కం॥ నాకు వరంబీవలెనని మీకుం గలదేని నాదుమెయితోడఁ జిరం
బాకలితమైనశూలిక ప్రాకటమహిమంబుగలిగి పరఁగెడుఁ గాతన్" ౧౫౬

వ॥ అనినవిని దేవతలు మాండవ్యునుద్దేశించి ౧౫౭

కం॥ "ఏతచ్ఛూలము నెవ్వఁడు ప్రాతఃకాలంబునందు భక్తి స్పృశించున్
ధూతాఘుఁడగుచు వాఁడీభూతలమున దేహయాత్ర పొనరుపఁగలుగున్" ౧౫౮

వ॥ అనిపలికి భర్తృయుక్తయగు పతివ్రతదిక్కు మొగంబై ౧౫౯

కం॥ "నీవును వరవర్ణినిరో! మావలన వరంబొకండు మానకకొను, నీ
భావము వెలిపుచ్చినచోఁ గావలసిన దిపుడె తప్పకయ యీఁబడెడిన్" ౧౬౦

వ॥ నావుడుఁ బతివ్రతయిట్లనియె ౧౬౧

కం॥ "నా పెనిమిటి దగదీర్చుటకై పదమున నేలఁదన్న నట నొకగర్తం
బై పానీయమునిడియెను, నా పేరట నదియె పుణ్యనదమగుఁగాతన్" ౧౬౨

వ॥ అనియిట్లు కోరుకొనుటయు నిర్జరులు ౧౬౩

కం॥ "ఇది మొదలీగర్తము పుణ్యదమై మహి దీర్ఘికాఖ్య నలరారుచు ర
వ్యుదయమునఁ దన పవిత్రపుటుదకములం దాడువారి యుర్వ్యఘమణఁచున్ ౧౬౪

కం॥ రవి కన్యనుండఁ బంచమిఁ దవిలి యపుత్రకులువచ్చి తత్తీర్థమునం
దవగాహనమొనరించినఁ బువుబోఁడి! సపుత్రులగుచుఁ బొలిచెద రంతన్" ౧౬౫

వ॥ అనిచెప్పి స్వర్గమునకు వెళ్లిపోవుటయు

సీ॥ రతనంపుగనులతో రమణీయతమములై చెలువారు భూమిభృచ్ఛృంగములను
జల్లచల్లగవీచు పిల్లగాడుపులకు నెలవైన ఘన నదీపులినములను

మల్లికా చాంపేయ మాలతీముఖర ప్రసూనపూరిత మహోద్యానములను
శుకపికారావ విస్ఫురణఁ జెన్నొందుచు విభ్రమంబునుగొల్పు విపినములను
జేరి నూతనమన్మథాకారుఁడైన మగనితోడుత నేప్రొద్దు మనసుదీర
రతులఁదేలెఁ బతివ్రతారత్నమైనదీక్షికారోహ ధృతరత్నదివ్యభూష, ౧౬౭

వ॥ అంతఁ గొంత కాలంబునకుఁ బచ్చిమవయస్సు ప్రాప్తించుటయుఁ బతియుం దానును నాత్మీయంబగు తత్తీర్థంబున సేవించుచుఁ దత్తోయంబులన కాయంబుల వదలి బ్రహ్మలోకంబునకరిగిరి ,, యని యిట్లువక్కాణించుటయు శౌనకాదులు ౧౬౮

—♦ మాండవ్యమహామునిని గొల్లవాండ్రు కొఱత వేయుట ♦—

తే॥ ,, మునివరేణ్యుఁడు, నత్యంతముం దపస్వి, యట్టిమాండవ్యుఁ డెవనిచే నకట! యట్లు
కొఱత వేయంగఁబడె? నింతఘోరశిక్షనంద నేయపరాధంబు నాచరించె? ” ౧౬౯

వ॥ అనియడిగిన సూతుండిట్లనియె, ౧౭౦

క౦॥ ఆ మాండవ్యమునీంద్రుఁడు తా మును దీర్థాటనంబు దలపడి యొకచో
నీమహితహాటకేశ్వరసామీప్యమ్మునకువచ్చె శ్రద్ధాన్వితుఁడై, ౧౭౧

వ॥ అట్లువచ్చి విశ్వామిత్రీయంబను విశ్రుతతీర్థంబున భాస్కరుంగూర్చి వ్రతస్థుండై విభ్రాట్టను సూక్తంబును జపించి పితృతర్పణంబుఁ జేయుచుండుటయు నొక తస్కరుం డొకగొల్లని ద్రవ్యంబు హరియించి జనులు తెలిసికొని తఱుముచుండఁ బరువెత్తివచ్చి మౌనవ్రతమూనియున్న యమ్మునిసత్తము నగ్రంబునఁ బడవైచి గుహాంతరంబునం బ్రవేశించె, నింతలోపలఁ దల్లోప్త్రంబునకై వాని వెన్నంటిన జనంబులాయన యగ్రమందున్న యద్దానివీక్షించి ౧౭౨

తే॥ " హస్తమందున నొకలోప్త్రి మపరఁబట్టి యీపథంబున నొకచోరుఁడేగుదెంచె,
నిచటనుండి యెచ్చటి కేగినాఁడొ శీఘ్రముగమాకు బాపఁడా చెప్పవయ్య,, ౧౭౩

వ॥ అనిపలుమాఱు ప్రశ్నించినను మలిమ్లుచుండు బిలంబునందుండుట యెఱింగియుఁ దజ్జీవితంబుఁ గాపాడుచు మౌనవ్రతంబూని పరచింతాపరాయణుండై యుండు నాప్రాజ్ఞుఁ డొకించుకయును మాఱుపలుకమికిం గినిసి యాగొల్లలెల్లరును

తే॥ 'వాస్తవముగ మదీయమౌ వస్తువెత్తుకొని యిటులేగుదెంచిన చోరుఁడీఁడె,
మనము వెన్నంటివచ్చుట మాఱుపలుక నెఱియుఁదోఁపక మునివేసమేసినాఁడు,,

వ॥ అనియాలోచించి దురాత్ములై యవిచారంబుగా వనాంతరంబునకుం గొనిపోయి శూలంబునం బడఁద్రోసిరి, దోషహీనుండును బుద్ధిమంతుండును నగు నమ్మునికిఁ బూర్వకర్మవిపాకంబునంజేసి కఠినంబగు దండనంబు సంభవించుటకుండు కారణం బెయ్యది” యని యిట్లుతెలంగించిన విని వెండియు నమ్మహర్షులు ౧౭౪

## —* యముండు దాసీగర్భంబునం బ్రభవించుట *—

కం॥ "మాండవ్యునిశాపంబుననుండి విముక్తుండుగా మహోద్దండుండా
దండధరుం డెవ్విధిం దపముండుచు ధ్యానంబుచేసెనో చెప్పుమయ్యా!" ౧౭౭

వ॥ అని పృచ్ఛఁజేయుటయు సూతుండు వెండియునిట్లనియె, ౧౭౮

శా॥ "మాండవ్యుండు శపింప దుఃఖయుతుఁడై మార్తాండసూనుం డటు
న్జండీనాథున కాలయంబు మరల న్గట్టించి యవ్యగ్రిచి
త్తుండై పుష్పసుగంధధూపముల సంతుష్టాత్మఁగావించు చు
ద్దండంబైనతపంబు సల్పసలుపం దచ్ఛూలి ప్రత్యక్షమై ౧౭౯

వ॥ వరంబడుగుమనుటయు నతండు ౧౮౦

శా॥ "నే నోయీశ! స్వధర్మమందు మనుచున్ నిర్దోషినైయుండఁగా
మౌనీంద్రుండు నమర్షపూరితుఁడునై మాండవ్యుఁ డంఘ్ర్యుద్భవా
యోనింబుట్ట శపించె, జ్ఞాతిజనము ల్యుద్ధంబునన్ ప్రమంద న
న్యాయంబౌ వ్యథగూడఁ గల్గునఁట, యయ్యో! యేమిచేయంగనౌ, ౧౮౧

ఆ॥ శూద్రయోనిఁబుట్టి శోకింపకుండంగఁ గరుణతోడ నన్నుఁ గావవలయు,
నందుకొఱకె నిన్ను నాశ్రయించినవాఁడ, నంబరీకృతాశ! యఘువినాశ!" ౧౮౨

వ॥ అని యభ్యర్థించుటయు భగవానుండిట్లనియె, ౧౮౩

ఆ॥ "అమ్మునీంద్రువాక్య మన్యథాయొనరింపఁ దరముకాదునాకు ధర్మరాజ!
కాన నీవు శూద్రగర్భంబునం బుట్టి జ్ఞాతిజనులవధయుఁ గాంచవలయు, ౧౮౪

ఆ॥ శూద్రకులమునం బ్రసూతుండవయ్యును బుత్రపుత్రికలను బొందవీవు,
జ్ఞాతిజనవధంబు కనులారఁ గాంచియు నుమ్మలికము నొందకుండఁగలవు, ౧౮౫

చం॥ వలదని నీవు చెప్పినను వారు త్వదుక్తము నాలకింప, రం
దులకె సపిండనాశనము దుఃఖకరంబయి కానుపింపఁ, ద
ట్టిలపయి నూఱువత్సరము లీవు జఘన్యుఁడవై వసించి య
త్యలఘుతరంపుధర్మమున నాస్థవహించి చెలంగు దెంతయున్, ౧౮౬

తే॥ సర్వదా పాపకర్మము ల్జరుపుకొనుచు శ్రద్ధలేకయయున్నను జ్ఞాతిజనుల
మేలుకై యుపదేశము ల్బాలఁజేసి వర్షశతపూర్తియగుటయు వసుధ రోసి

కం॥ బ్రహ్మద్వారమునుండియు బ్రహ్మధ్యానమున వదలి ప్రాణంబులు త
ద్బ్రహ్మమున నైక్యమొందెదు బ్రహ్మాదిసుపర్వులెల్ల బొగనియనఁగన్" ౧౮౭

వ॥ అని యిట్లువాక్రుచ్చి భగవానుఁ డదర్శనంబుఁజెందుటయుఁ బరేతరాట్టు
వ్యాసునివలన దాసీగర్భంబునం బ్రభవించి విదురరూపంబునఁ బృథివీస్థలం బలంకరించె.

## —♦ మరణించిన విప్రబాలకుఁడు మరలజీవించుట ♦—

హాటకేశ్వరంబునఁ దొల్లి యుపాధ్యాయుం డను బ్రాహ్మణుండు కశ్యపాన్వ
యాభరణంబునా జనించి వేదవిద్యాపరాయణుండై వర్తిలుచుండుటయు నపరవయ

సునం దతని కొక యాత్మజుం డుదయించి తలిదండ్రుల దాటరాని దుఃఖసాగరంబునం
బడఁద్రోసి పంచమవత్సరంబునన పంచత్వంబునొంద నయ్యవనీసురుండు హాయని వాపో
వుచు యమునిపై నలిగి హస్తంబున నంబువులఁ బట్టి ౧౮౯

తే॥ "నను నపుత్రకుఁగావించెఁగనుక దుష్టుఁడైన యముఁడు నపుత్రకుం డగునుగాక,
యన్యదేవతలకుఁబోలె నతని కిలను బూజ నైవేద్యములు లేకపోవుఁగాక, ౧౯౦

తే॥ అతని నామంబుసహితి మియ్యవనిజనము లొక్కమాఱును గీర్తింపకుండ్రుగాక,
ప్రొద్దుపొడుపునఁ దన్నామమును స్మరింపఁ గార్యవిఘ్నంబు వాటిల్లుఁగాక ప్రజకు"

వ॥ అని శపించుటయు జముండు చింతించుచుం దాతపాలికిఁ బోయి ౧౯౨

శా॥ "నాధర్మంబున నేను వర్తిలుదు, నన్యాయంబునా నెట్టిదో
బోధింపంబడియుండ, దట్టులయినన్ భూదేవుఁడొక్కండు స
క్రోధుండై శపియించెనన్నుఁ, గను మీఘోరంబు నో భారతీ
నాథా! కావున నీదుశాసనము నీనాఁడే విసర్జించెదన్, ౧౯౩

తే॥ మున్ను మాండవ్యమునిశాపమునను జేసి యుద్భవించితి నల శూద్రయోనిలోనఁ
బ్రస్తుతి నపుత్రకుఁడఁ జేయఁబడినవాఁడఁ, బూజనీయుండఁ గాకుండఁబోయినాఁడ"

వ॥ అనిచెప్పుకొనుచుండుటయుఁ దత్కాలోచితంబుగాఁ శతక్రతువిట్లనియె, ౧౯౫

ఉత్సాహము॥ "వాగధీశ! త్వన్నియోగవర్తియౌటఁజేసి బ
ల్బాగుగా వచించినాఁడు పాకశాసనుండు తాఁ,
బ్రాగుపార్జితాఘవశత బాల్యయౌవనాదులన్
వేగ వధ్యమౌను జనము, వింతయేమి యిందుఁకన్, ౧౯౬

తే॥ మర్త్యలోకంబునం దెల్లమానవులు నవశ్య మీసమయంబున వర్తిలుదురు,
అందుకై కాదె ధర్మరాజాఖ్యయిడితి వీవు సమమిత్రశత్రువౌ నితని కార్య! ౧౯౭

శా॥ కాలాకాలవివేచనంబు సలుపంగాఁబోక తత్తత్కృతా
ఖిలాఘంబుల లెక్కవేసి యెవఁడే వేళన్ వధార్హుండొ యా
వేళన్ వానిని ద్రుంచుచుంట విధిగా విప్రార్భకుం జంపు టిం
కేలాతప్పగు? దోషియేలయగుఁదా నీతండు చర్చింపఁగన్, ౧౯౮

కం॥ కావున బాగుగ యోజనగావించి యితండు దోషకలితుఁడు గాన
ట్లీవ విధింపు ముపాయము తావకమగు శాసనంబు తల ధరియింపన్" ౧౯౯

వ॥ అనినవిని బ్రహ్మదేవుండు ౨౦౦

తే॥ "బ్రాహ్మణోత్తముఁడిడిన శాపంబు ద్రిప్ప నాకుమాత్రము వశమౌనె నాకనాథ!
యెడఁదయోజించి సదుపాయమెదొ వచింతుఁగూరుచుండుఁడుమీరిందుఁగొంతతడవు"

వ॥ అని సమాహితుండై కూర్చుండి కొంతతడవు ధ్యానించుటయు భయంక
రంబులగు వాతగుల్మకఫాద్యష్టోత్తరశతజాడ్యంబులు సశరీరంబులై చనుదెంచి ౨౦౨

ఆ॥ "ఎందుకొఱకు మమ్ము నీవు సృజించితో యాలసింపకుండ నాజ్ఞయిచ్చి
దేవ! తావకీన దివ్యపదంబులు సేవనంబు కరుణ సేయుమయ్య" ౨౦౩

వ॥ అని విన్నవించుకొనినఁ జతుర్ముఖుండు ౨౦౪

కం॥ “ చనుఁ డవనికి శీఘ్రింబుగ, మనుఁ డచ్చట సంశయంబు మదినుంపక యీ
యినతనయుఁడు మొదల మానవతనువులలోఁ జేరియుండెఁ దలఁపడుఁ డింకన్” ౨౦౫

వ॥ అంవ కాకర్ణించి యధోముఖుండైయున్న ధర్ముం బొడగాంచి ౨౦౬

ఉ॥ “ ఈ సకలామయంబులు మదీరితముగ్ శిరసావహించి నీ
చేసెడి యెల్లచేఁతలను జేయుచునుండును సహ్య, మాయువుగ్
బాసినయట్టిమానవులపజ్జకు వానిన పంపుచుండు, మీ
మోసముచేత నవ్వె పోరిపుచ్చెనటంచుఁ దలంత్రు భూజనుల్, ౨౦౭

కం॥ లోకాపవాదమంతయుఁ బ్రాకటరోగములపైని బడుఁగాని నినుగ్
సోఁక దోకించుకయేనియు, నీకృత్యం బెప్పటట్ల నెఱవేఱు నొగిన్, ౨౦౮

కం॥ నాయానతి తలఁదాలిచి నీయుద్యోగంబునీవు నెఱవేఱుచు పో,
మ్మోయమ! హంతకుఁడితఁడని యేయవనీజనుఁడుగూడ నిం కనఁడు నినుగ్, ౨౦౯

వ॥ అని వాక్రుచ్చుటయు వ్యాధులందోడ్కొని స్వలోకంబునకరిగి ౨౧౦

చం॥ “ అదుగుఁడుచిత్రగుప్త, నతఁ డాజ్ఞయొసంగినవారి క్రోలకుగ్
వడిఁజని తచ్ఛరీరముల వాసముఁ జేసి వధింపుచుండుఁ, డ
ప్పుడమిని హాటకేశము పుణ్యపుక్షేత్రమునందు నే నొక
ప్పుడు శివలింగము న్నిలిపి పూజయొనర్చినవాఁడ భక్తిమై ౨౧౧

ఆ॥ అఖిలకలుషహారియైన తల్లింగంబుఁ గల్యమందలేచి కాంచుజనుల
వదలి దూరమంద వర్తింపుచుండుఁడీ తెగుళులార! నేను దెలుపురీతి” ౨౧౨

వ॥ అనిబోధించి బ్రాహ్మణవేషధారియై బ్రాహ్మణబాలుం దోడ్కొని తన్మం
దిరంబున కరుగుటయు నుపాధ్యాయుండు సంతోషంబుతో సకళత్రంబుగా హాకుమార
యని యెదురేగి కౌఁగలించుకొని కనుల నీళ్లుగార్చుచు శిరంబుమూర్కొని ౨౧౩

చం॥ “ యమపురినుండి యెప్పగిది నాగతుఁడైతివిరా కుమార! యీ
క్రమమున నెంతగట్టిఁడును గ్రమ్మఱిరాఁ గనియుండఁ, డింద్రజా
లమొయిది, దృష్టిదోషమొ, కలంగనినాఁడనో యేమొ, నీదుపా
ర్శ్వమునను దివ్యతేజమున వర్తిలు విప్రుఁడెవండొ చెప్పుమా” ౨౧౪

వ॥ అనియడిగినఁ బుత్రుండిట్లనియె. ౨౧౫

ఉ॥ “ ఈయన యంతకుండు, కరమేద్చుచునుంటివి నీవటంచు న
త్యాయతమౌకృపగ్ మహీసురాకృతిఁదాలిచి తా స్వయంబుగా
నీయిలు సేరవచ్చె, మరణించినన న్గొనితెచ్చియిచ్చె, నో
నాయన! శాపమోక్షణమొనర్చి సమాదరణంబు సేయవే, ౨౧౬

వ॥ అనివాక్రుచ్చుటయు బ్రాహ్మణోత్తముండు యమునకు నమస్కరించి ౨౧౭

తే॥ "ఇపుడు నాజన్మసాఫల్య మెనయనయ్యె, జీవితముగూడ నిపుడు సుజీవితంబు,
మదసినటువంటికొడుకును మగుడఁబడయుటకంటె వేఱైనభాగ్య మొకండుగలదె"
వ॥ అనినవిని యాతనికొమరుండు ౨౧౯

కం॥ "నీవు సహపుత్రకుఁడవయి కావలసినయంతముదము గాంచితిగానన్
వైవస్వతుని సపుత్రకుఁగావింపుముజనక! పూర్ణకరుణామతివై" ౨౨౦
వ॥ అనుటయుఁ దండ్రియిట్లనియె, ౨౨౧

తే॥ "హాస్యమున నేనుబలికినయట్టిమాటగూడ సత్యంబుగాఁ, దింకఁ గొడుకుమృతికి
గోడుమని యేడుచుచుఁ గిన్క నాడినట్టి వాకు నెట్టు లబద్ధమౌరా కుమార! ౨౨౨

ఉ॥ కావున నీకృతాంతునకుఁ గల్గెడుపుత్త్రుఁడు దేవయోనిలోఁ,
గావలెనన్న నింక నరకామినిగర్భమునన్ జనించు, స
ర్వావనికిం బ్రభుండునయి యాతఁ డొనర్చెడి రాజసూయమున్,
వేవచియింప నేమిటికి విన్ముతదీయకరిష్యమాణమున్ ౨౨౩

కం॥ హయమేధపురోగములౌ నయములఁ బెక్కింటిఁజలిపి యాత్మజుఁ డుదయం
బయి చేయందగు పనియంతయుఁ బూర్తియొనర్చుఁ దండ్రి తరియించునటుల్ ౨౨౪

ఆ॥ పూజ్యతయును లేకపోవుఁగాకయటంచు నిలకనొక్కశాప మిచ్చియుంటి,
దానిఁగూర్చికూడఁ దనయా! వచించెద, వినుము సావధానమనసుఁడగుచు, ౨౨౫

కం॥ శ్రుతి మర్త్యమంత్రముల నర్చితుఁజేతురుగాని తక్కత్రిదశులఁబోలన్
శ్రుతిమంత్రంబుల నీపితృపతిఁబూజం జేయ రెట్టిపట్లను మనుజుల్" ౨౨౬
వ॥ అని యిట్లువక్కాణించుటయుఁ బుత్రుండు ౨౨౭

కం॥ "తక్కంగలవేల్పులతో నక్కజి నా కొక్కయింతయైననులే, దీ
దక్కనపుంబతి ప్రతిమను జక్కఁ బ్రతిష్ఠించి పూజసల్పెద నింకన్, ౨౨౮

ఆ॥ భవదనుగ్రహంబు పరిపూర్ణముగనున్న మానవీయమౌ విధానమునను
మానవీయమైన మంత్రంబులే పఠించుచుఁ దదర్చ సేతుఁ, జూడుతండ్రి!" ౨౨౯
వ॥ అని "సుగంనఃపంథా" యను మంత్రంబును జపించుచు నర్చించుటయు
యముండు ప్రసన్నుండై హర్షగద్గదస్వరంబున నుపాధ్యాయునితో నిట్లనియె, ౨౩౦

కం॥ "ననుఁదొట్టివేలుపులదర్చన మెప్పటికిని పృథాగ సంప్రాప్తముకా,
దనఘాత్మ! యేదియొయొక ఘనవరముం గోరుకొనుము కాదన కిత్తున్" ౨౩౧
వ॥ అని నొడువుటయు నతండు ౨౩౨

కం॥ "భవదీయవిగ్రహంబును దవిలి ప్రతిష్ఠించె నాదుతనయుం డిచటన్,
రవినందన! పూజితమై యవని నభీష్టంబునిడిన నది సార్థకమౌ, ౨౩౩

ఉ॥ కావున నొక్కఁడబ్ద మధికంబగుభక్తిని బంచమీతిథిన్
దావకమైన తత్ప్రతిమ దైవతబుద్ధి భజించుమానవుల్
జీవములుండుదాఁకను గృశింపఁగఁజేసెడి పుత్రదుఃఖమున్
గ్రేవకుఁజేరనీక కడుఁబ్రీతిమనంగ వరంబొసంగవే'' ౨౩౪

వ॥ అని వేఁడుకొనుటయు నతం డవ్వుఁగాకయని యాత్మీయలోకంబునకరిగి తన యుద్యోగంబునఁ బ్రవేశించె, భూసురడింభకుండు గొప్ప కోవెలం గట్టించి తన్మధ్యంబున దండధరుం బ్రతిష్ఠించి పూర్వోక్తమంత్రింబునన పూజించి పౌత్రులంగూడఁ బడసి బహుకాలంబునకుఁ బంచత్వంబునొందెఁ, బంచమీదినంబున నెవఁ డీకథఁ గీర్తించు వానికిఁ బుత్రదుఃఖంబు లేకుండెడి''నని యిట్లు వాక్రుచ్చుడు మహర్షులిట్లనిరి,

## యుధిష్ఠిరోపాఖ్యానము

కం॥ "యమునికి మానుషవిగ్రహముఁ డమలగుణుం డుదయమందెనని చెప్పితి, వ
య్యమరవరేణ్యునకుం బ్రియతముఁడై యెవ్వండుగలిగె దయ నుడువఁగదే'' ౨౩౬

వ॥ అనియిట్లుప్రశ్నించిన సూతుండు ౨౩౭

కం॥ "అతనికిఁ బాండుక్ష్మావిభుసతిగర్భమునను జనించె సత్పుత్రుఁడు, త
త్క్షితిపతి యుధిష్ఠిరాఖ్యను బ్రతిగానక యఖిలభూమిభరము వహించెన్, ౨౩౮

వ॥ మఱియు నతండు శౌర్యాతిరేకంబున సకలక్ష్మాపాలురవలనను గప్పంబు పుచ్చుకొని సంపూర్ణదక్షిణంబగు రాజసూయం బొకండును ధరయంతయుం దురగంబును జరింపఁజేసి యశ్వమేధంబు లైదును గావించి సద్గతిం బొందె, నొక్కఁడైనను గయకుఁబోయి పిండంబు వేయునుగానఁ బడసినఁ బెక్కండ్రుకొడుకులనే పడయవలయుఁ, జేసిన నశ్వమేధంబునే చేయవలయు, వేసిన నల్లయెద్దునే వేయవలయు, బ్రాహ్మణానుగ్రహంబునఁ బుత్రవంతుఁడైనందులకుఁ దత్పుత్రుఁ డనేకాశ్వమేధయాగంబు లాచరించుటంజేసి శ్రాద్ధదేవుండు తన్నుఁ గృతకృత్యుంగాఁదలంచుకొనియెఁ, గన్న నట్టికొడుకులఁ గనవలయుఁగాని వంశముద్ధరింపలేనివారి నెంతమందిని గన్న నేమి, తొల్లి బృహత్కల్పంబున వసుసేనుఁడనునొకరొడయఁ డానర్తదేశంబును బాలించుచు

## అన్నోదకదానఫలము

సీ॥ సమధికాష్టైశ్వర్యసహితుఁడై మహితుఁడై యఖిలభోగంబుల ననుభవించె
గజవాజిరథపత్తికలితుఁడై లలితుఁడై యరులకు దుర్భేద్యుఁడై రహించె,
విజితాఖిలద్విషద్వీరుఁడై ధీరుఁడై నిఖిలేంద్రియంబుల నిగ్రహించె,
ధర సాటిలేని వదాన్యుఁడై మాన్యుఁడై సంచితమఖిలముం బంచిపెట్టె
గ్రహణసంక్రాంతిముఖపర్వకాలములను వజ్రవైడూర్యమౌక్తికవ్రజముచేత
భూనిలింపుల కభిషేకము ల్పొనర్చి కరులఁ దద్ద్వారసీమలఁ గట్టివెచె, ౨౪౦

వ॥ కాని సులభంబుగాఁదలంచి యన్నోదకంబులమాత్ర మొక్కనికేని నొ
సంగక చిరకాలంబు ధరాతలంబుం బాలించి కొడుకులకొడుకులంగూడఁ బొడ
గాంచి కాలధర్మంబునొందుటయు మంత్రులతని తనూజు సత్యసేనుఁడనువానిఁ దద్రా
జ్యంబునకుఁ బట్టంబుగట్టిరి. వసుసేనుండు తాసలిపిన దానధర్మంబులవలన స్వర్గంబునకుఁ
బోయి దివ్యాంబరధరుండును దివ్యరత్నవిభూషితుండును నై విమానశ్రేష్ఠం బధిరోహించి
సకలలోకసంచారంబును సలుపఁగలిగెం గాని యాఁకలిదప్పికలచేమాత్ర మత్యంతచింత
నొందవలసినవాఁడై వాఁడఁబాఱినవదనకంజంబుతో నెటు చూచినను నన్నభక్ష్యములు గాని
యుదకపాయులుగాని యన్నోదకంబులుగాని కానరామిని సహస్రాక్షునపాలికి జని
మొగంబు వ్రేలవేసికొని ౨౮౧

ఉ॥ ఏనొకరుండఁదప్ప నిట నింకొకఁ డీక్షుధకుం బిపాసకున్
లోనయి తాఁ గనంబడఁడు, లో జఠరాగ్ని దహింపఁజేయఁగా
నీ నగలేల చేలముల నేమిప్రయోజనముండె? దేవతా
యానముతోడ నేమిపని, యంతయు వ్యర్థముగాక వృత్రహా!, ౨౮౨

ఉ॥ ఏమయియుండునిద్ది యమరేశ! త్రివిష్టపరూప నారకం
బై మది నిప్పువెట్టినటు వ్యాకులపెట్టె, క్షుధోపశాంతికై
శ్రీమదనుగ్రహంబు ప్రసరింపఁగఁజేయుము, మటు లొప్పనర్పఁగా
నీమన సొప్పదేని పడనెట్టుము దుర్గతిలోనె కూలెదన్ ౨౮౩

వ॥ అనియిట్లు వక్కాణించుటయు నింద్రుండు ౨౮౪

చం॥ నిరయమునన్ వసించుటకు నీవెటు లర్హుఁడవౌదువయ్య? నీ
జరిపినదానధర్మములు చాలఁగనున్నవి, కాని యేరికిన్
గరము సుసాధ్యమంచు నుదకమ్మిడ, వన్నముగూడఁబెట్ట, వా
దురితమ క్షుత్పిపాసలయి తోనరుదెంచె నీఁకేమిచెప్పుదున్, ౨౮౫

సీ॥ గుఱ్ఱంబు లేనుఁగులొక్కల్లవెట్టితి కాన దేవయానము లెక్కి తిరుగుచుంటి,
మంచి స్వెల్లోడులం బంచిపెట్టితి కాన దివ్యాంబరాల్గట్టి తేజరిలెదు,
హేమంబు వీథులం దెగఁజల్లితివి కాన స్వర్ణభూషల మోయఁజాలకుంటి,
మణులు దోసిళ్ళనే మఱి పెట్టితివి కాన మణిహారములఁదాల్చి మసలుచుంటి,
నీచమనియెంచి చెంబెఁడు నీరమేని పిడిచెఁ డన్నంబు నేనియుఁ బెట్టకుంట
నిట్టు లాఁకలిదప్పిక లుట్టినిన్నుఁ గరము వేధించుచున్న వో ధరణిపాల! ౨౮౬

కం॥ అన్నోదకంబు లెన్నఁగఁ జిన్నవియొకొ, యవియ పెద్దఁజేసెడి దాతన్,
దన్నుద్ధరించుకొనఁ దలఁపున్నన్ వానిన యొసంగు నున్నతుఁ డెపుడున్, ౨౮౭

కం॥ మన్నీఁడ! యిహపరంబుల నౌన్నత్యమునొందఁగోరునటువంటి జనుం
డన్నము సదక్షిణముగను సొన్నముగ జలంబు నొసఁగనగు నతిథులకున్ ౨౪౯

వ॥ అనిచెప్పిన రాజిట్లనియె,

కం॥ నాకాధినాథ! మందులు మాఁకులు నున్నయవి యెన్నొ మదినారసి నా
యాఁకలిదప్పికలను వెసఁ బోకార్పఁగదయ్య కేలుమోడ్పులొనర్తున్" ౨౫౦

వ॥ అని యిట్లనొడువుటయు మఱియు నమ్మహేంద్రుండు ౨౫౧

ఉ॥ "నీకొక పుత్రుఁడుండి యవనిన్ నినుఁగూరిచి భక్తియుక్తుఁడై
యాఁకలిగొన్న పేదలకు నన్నమునీళులఁ దృప్తిసేయుచో
నీకును దృప్తియౌనిచట, నీచమటంచని యొక్కగింజయున్
గాకికినేనియీని నినుఁ గాల్పదె యాఁకలి కాకయుండినన్, ౨౫౨

కం॥ నీకు జలాంజలినీయక యాఁకలిగొనువారి కుదక మన్న మిడక యి
ట్లో కాలముగడపినచో నీకొడుకును దా క్షుధార్తి నీవలెఁ గుడుచున్', ౨౫౩

వ॥ అనివాక్రుచ్చుచుండ బ్రహ్మలోకంబునుండి నారదమహాముని యరుదెం
చుటయుఁ బాకశాసనుండు దిగ్గునలేచి యర్ఘ్యంబొసంగి ౨౫౪

కం॥ ఎచ్చోటనుండివచ్చెదొ యెచ్చోటికిఁబోవుచుంటొ యెయ్యదొపని నా
క్రుచ్చుటకును వీలుండినఁ జెచ్చెరఁజెపు మేను సంతసింతు మునీంద్రా! ౨౫౫

వ॥ అనియడిగిన నతండిట్లనియె, ౨౫౬

తే॥ "బ్రహ్మలోకంబునుండినేఁ బ్రస్తుతమున వెడలివచ్చుచున్నాఁడ, వేల్పుఱేఁడ!
తీర్థసేవార్థ మవనిపై దిగుదునింక, నింతకన్న నుగలచైద మేది నాకు,, ౨౫౭

వ॥ అనవుడు వసుసేనుండు హృష్టుండై ౨౫౮

శా॥ "దీనాత్ముండ, ననుగ్రహింపవలయున్ దేవర్షి! భూలోకమం
దానర్తంబనుదేశమేలు పురుషుం డస్మత్తనూజుండు, త
త్స్వామినాథుం డటు సత్యసేనుఁడను సత్సంజ్ఞం బ్రవర్తిల్లు, న
వ్వానింగూరిచి వక్ష్యమాణమగు నీవాక్యంబులం జెప్పనౌ, ౨౫౯

సీ॥ నీతండ్రి వసుసేనుఁ బ్రీతిఁగన్గొని మాటలాడి నేనరుదెంచినాఁడననుము,
స్వర్గంబునం దింద్రసభలోన దెఱగంటులుదండఁ దాఁ గూర్చుండియుండెననుము,
క్షేమంబుకాని యాభూమిమీఁకు నచటను క్షుత్పిపాసలు వీడఁజూడవనుము,
సత్యమునంబాలించు సత్పుతుఁడవగుచున సతనిసెవ్వఁగఁదీర్చు టర్హమనుము,
పిలిచి బీదల కన్నంబుఁ బెట్టుమనుము, ఉదకమిప్పించి తద్దాహ ముడుపుమనుము,
అట్లుకావింపకున్న నీయయ్య యచట నాఁకటను దప్పి కడువంత నందుననుము"

వ॥ అనుటయు నతండు భూతలంబున కవతరించి యానర్తదేశంబునకుం జని సత్యసేనుం గని పితృసందేశంబు వాని కిచ్చుటయు నాతఁడు చలిపందిరులు సంస్థాపించి నిత్యసహస్రబ్రాహ్మణభోజనంబు నిర్వర్తింప మొదలిడియెఁ గాని కొంతకాలంబునకు ద్వాదశవర్షక్షామంబురా సంకల్పితమ్ము సాఁగింపమిని జనకుండు స్వప్నంబున వచ్చి ౨౬౧

ఉ॥ "నీవు సుతుండవౌ కతన నేను దివంబుననుండియుండియున్
దేవురు గొట్టుఁగావలసెఁ దీఱని యాఁకటు దప్పిఁ గుందుచున్
గావున నీవు నిక్కముగ నాకె జనించితివేని నాకుఁగాఁ
బావనవారి యుక్తముగఁ బాపల కన్నముఁ బెట్టు లెమ్మిఁకన్" ౨౬౨

వ॥ అనిపల్కుటయు నతండు మేల్కాంచి యంతయు మంతురులకు వినిపించి

కం॥ "ఏను వృషధ్వజుఁ గొల్తును, బూని సుభిక్షంబొనర్తుఁ బుడమిని, మగుడన్
సేనరుగుదెంచువఱకుఁ బ్రధానులు! మీరేలుఁడయ్య ధాత్రీతలమున్" ౨౬౪

వ॥ అనిచెప్పి హాటకేశ్వరంబున కేతెంచి యీశ్వరుం బ్రతిష్ఠించి పూజింప నాతఁ డబ్దాంతంబున నరుదెంచి వరంబడుగుమనుడు రాజిట్లనియె, ౨౬౫

కం॥ అన్నప్రదానమునరుప సన్నియమము పట్టియుంటి, సస్యోజ్ఝితమై
యున్నది పంటవలంతి, యిఁక నన్నాకు సువృష్టికన్నఁ గాంక్షితమున్నే, ౨౬౬

కం॥ జలసస్యసమృద్ధంబై యిలయెల్లఁ జెలంగవలయు, నేఁబట్టిన యా
బలునియమము సాఁగించుడు నల స్వర్గతుఁడైన తండ్రి యలరఁగవలయున్" ౨౬౭

వ॥ అనియిట్లు కోరుటయు భగవానుండు ౨౬౮

చం॥ "కురియుఁ బ్రభూతవృష్టి ధరఁ, గోరిన సస్యజలాదులన్నియున్
విరివిగఁ గల్గుఁ గాన నిజవేశ్మముఁ జేరఁగఁ బొమ్ము నీవిఁకన్,
మఱియును ద్వత్ప్రతిష్ఠితము మద్వరలింగ మహార్మ్యఖంబునన్
బోరి దరిసించువాఁడు ప్రతిపుట్టువునం దిను మృష్టమన్నమున్, ౨౬౯

వ॥ అనిపలికి యంతర్ధానంబుఁ జెందుటయు నయ్యుదయుండు స్వస్థానంబునకుఁ జేరంజని యన్నోదకదానంబునం గన్నతండ్రి కడుపుమంటఁ జల్లార్చెఁ, గష్టతరంబగు కలికాలంబుననైతె మామృష్టాన్న దేశ్వరుఁ బ్రొద్దుప్రొద్దున దర్శించిన సకాముండు మృష్టాన్నంబును నిష్కాముండు శివపదంబును జెందఁగలిగెడిని, ౨౭౦

—• పార్వతి గణపతిని సృష్టించుట •—

సీ॥ యత్సేవనంబున నైహికాముష్మికాల్ సమకూరుచుండు భూజనములకును
యత్సమర్చనము సర్వాంతరాయంబుల వారింపఁ బెట్టినపేరు జగతి
యత్పదయుగము సర్వార్థసమారంభమునను వాగీశాదులును భజింత్రు
యత్పూజనము నిరయాధ్వముం దప్పించి దేవతానగరికిం ద్రోవఁజూపు
యత్సంకీర్తన మవనిపై యశము విద్య మొదలు గాఁగలవాంఛితంబుల నొసంగు
దన్మహోత్తమ గణపతిత్రయముగూడఁ దత్స్థలంబున వర్తించు ధన్యులార!"
వ॥ అనిచెప్పుటయు ఋషులిట్లనిరి, ౨౨౨
ఉ॥ "ఉత్తమమధ్యమాధమత నుద్భవమందుచునుండు భూజనం,
బుత్తమ మెత్తఱిన్ మరల నుర్వికిఁదాఁ జనుదేరకుండ న
త్యుత్తమమైనమోక్షమున నొంద యతించును, మధ్యమంబు స
ద్వృత్తి సురాంగనారతుల దివ్యసుఖానుభవంబుఁ గోరదున్, ౨౨౩
చం॥ అధముల కేమిపుట్టె, విషయాత్మకులై విషకీటమట్టు లీ
పృథివియె స్వర్గమంచుఁ గడుఁబ్రీతి వసింత్రు? తదర్చ్యమానుఁడై
మధువును మాంస మాదియగు మర్త్యసుఖంబులొసంగిప్రోవ నే
విధముగ నీగణాధిపతి వేడ్కపడుం గృపఁజేసి చెప్పవే, ౨౨౪
ఆ॥ హాటకేశ్వరమున నా గజవదనులం బూర్వ మెవఁడు నిల్పి పూజచేసె?
ననఘ! యెప్పుడెపుడు జనము తద్దర్శన మాచరింపవలయు? నానతిమ్ము" ౨౨౫
వ॥ అనవుడు సూతుండు ౨౨౬
శా॥ "ఉర్విం బూర్వము సర్వమానవగణం బుద్యత్తపశ్చర్యచే
స్వర్వాస్తవ్యులు కాఁదొడంగుటయుఁ దత్సంబాధమీక్షించి యా
గీర్వాణేశుఁడు పర్వపర్వమను దాఁ గ్రేవ ల్సర లర్వఁగాఁ
బార్వత్యన్విత మొక్కయాసనముపై భాసిల్లు గంగాధరున్ ౨౨౭
వ॥ చేరంజని యిట్లనియె, ౨౨౮
శా॥ "దేవా! కావవె, నీవె మాకు జగతిన్ దిక్కెల్లమర్త్యుల్ తపః
ప్రావీణ్యంబున స్వర్గమంతయును దా వ్యాపింపఁగంజొచ్చినా,
రేవేళ్మంబున కేగిచూచినను వారేయైరి; మా కచ్చటన్
దావే చిక్క, దిఁకేదొ ముందుగతి నిర్ధారింపు మీవే దయన్" ౨౨౯
వ॥ అనినవిని విరూపాక్షుండు గౌరీవదనచంద్రుం గనుంగొనుటయు నాయువ
యొడలంతయు నలిచి యట వెడలినమట్టిచే ౨౩౦

సీ॥ చేతులమరి తేసి చెవులుఁ దొండముఁ గల్గి నగవుపుట్టించు నేనుఁగుమొగంబు
గుడుముల నుండ్రాళ్ళఁ గొబ్బెరకాయలఁ బూర్ణంబులా నాల్గు పొట్టచేతు
లీక్షించువారల కెంతవింతో యొనర్చుచుం బొల్చు వాఁడెడు స్థూలకాయ
మాకంఠపూర్తిగా నన్నంబుదిన్నట్లు పరఁగుచుండెడు పెద్దబానపొట్ట
పెట్టి యొకబొమ్మఁజేయ నాపొట్టివేలు పట్టె సప్రాణుఁడై లేచి యమరు లలర
సవినయంబుగ మ్రొక్కి "యోజననీ! నన్ను నేలపుట్టించి" తన నాకె యిట్టులనియె,

కం॥ "తనయా! జనమంతయు దివమునకుం జనుదెంచుచుండెఁ బుణ్యపుఁగృతులన్,
గొనసాఁగకుండ నీవప్పనులకు విఘ్నంబుసలుపఁబొల్పడు మింకన్, ౨౫౩

సీ॥ తనుజ! ముప్పదిసముద్రముల డెబ్బదియేడుశంకుల యఱువదిసరసిజముల
యిఱువదిఖర్వాల మఱియును బదివేలయర్బుదంబుల తొంబదైదుకోట్ల
యేబదేన్లక్షల యిఱువదేన్వేయిల యఱువదితొమ్మిదియగుశతముల
గణములున్నవియిందు గణియింపఁబడినవి, గణియింపఁబడనివి కలవిఁకెన్నొ,
నందియును మహాకాలుండు నిందుఁ బెద్ద, లిందఱును నీకుఁ గైవస, మీవమేటి,
వాధిపత్యంబొసంగితి, నదివహించి యుర్వి విఘ్నంబులొనరించుచుండు మింక"

వ॥ అనియిట్లు వాక్రుచ్చి యాదేవి యోషధీభరితంబులును దీర్థాంభఃపూరితంబులును
మహోదయంబులును నగు బంగరుకుంభంబులం దెప్పించి గీతవాద్య వినోదంబులతో
డను నృత్యమంగళజస్వనంబులతోడను దనచేతిమీఁదిగా నభిషేకంబుగావించెఁ, ద్రయ
స్త్రింశత్కోటిదేవతులునుదత్సమయంబునం దరుదెంచిమంగళాశీర్వాదంబులొసంగిరి,

సీ॥ కఱకైనగొడ్డలి కఱకంఠుఁడును దండిగుడుములపళ్ళెముం గుధరతనయ
మూషకవాహనమ్మును గుమారస్వామి జ్ఞానముం ద్రైకాలికము విధాత
ప్రజ్ఞావిశేషముం బంకజనాభుండు సౌభాగ్యమును బాకశాసనుఁడును
సుందరాకారంబు సూనకోదండుండు వైభవంబును నరవాహనుఁడును
భూరితరమౌ ప్రతాపంబు వారిజాప్తుఁ డూర్జితంబగు కాంతి నయ్యోషధీశుఁ
డొసఁగిరిక్కొండనయది వారలెల్లసురలు గణపతి కభీష్టములనీయఁగలిగి రపుడు, ౨౫౪

వ॥ దేవీదేవులసంతుష్టికై యెవరివస్తువులు వారట్టులిచ్చుటయు లబ్ధవరుండగు
గణనాథుండు దేవకృత్యపరత్వంబున నిత్యము నాముష్మికార్థమై యత్నించు భూజనుల
పుణ్యకార్యంబుల విఘ్నంబు సేయంగడంగ, నంతఁ గొంద ఱాగణేశున కొనితెచ్చి హాట
కేశ్వరంబున స్థాపించుటయు స్వర్గకాములు సర్వార్థోపక్రమంబునను విఘ్ననివార
ణార్థ మాయనం బూజించిరి, కొందఱు సత్యగణపతిని నిల్పిరి. మఱికొందఱు మత్స్యద
గణపతిం బ్రతిష్ఠించిరి. తద్దేవుఁబూజింప నెన్నటికిని నరకాదికంబుగాని తిర్యక్త్వంబు

గాని కృమిత్వంబు గాని స్థావరత్వంబు గాని సంభవింపదు, భాద్రపద శుక్లచతుర్థి నతనిఁ బూజించువారి కొకయేఁడాదిపర్యంతము విఘ్నంబులు కలుగనేరవు, ౨౯౬

—* రంభ జాబాలి తపోవిఘ్నంబొనర్చుట *—

తే॥ అట్లు లాహాటకేశ్వరమందుఁ జిత్రపీఠమధ్యస్థలస్థుఁడై పేరుగాంచి
యుండెఁ జిత్రేశ్వరుండను నొక్కదేవుఁ డొసఁగుచుం జిత్రసౌఖ్యంబు లుర్విఁ బ్రజకు

వ॥ ఆదేవున కభిషేకంబుఁ జేసినను బూజించినను దర్శించినను బరభార్యా సంగమపాతకంబును నుపపాతకంబులును నాశంబునొందు, మఱియును ౨౯౭

సీ॥ పుత్రవత్సలతమైఁ బూర్ణానురాగయౌ గురుపత్నిఁ జపలుఁడై కోరుఁగాక,
పక్కల నెక్కలంబడి బిడ్డవలెనుండు జ్ఞాతికన్యకతోడఁ గలయుఁగాక,
కనుముక్కు చక్కనై కానుపించెనటంచుఁ గడజాతిదానిపైఁ బడునుగాక,
వ్రతవర్ధమానసుద్యుతితోడహావణించు స్త్రీని బలాత్కృతిం జెఱచుఁగాక,
చైత్రశుక్లచతుర్దశిం జిత్రపీఠసంస్థుఁ జిత్రేశ్వరుని బూజసల్పునెడలఁ
బాతకమునుండి విడువంగఁబడుటె కాక స్వర్గలోకంబునకుఁ గూడ సరగ నరుగు,

వ॥ అట్లు తత్క్షేత్రంబున వివస్త్రయగు తనూజతోడం గూడి జాబాలియు జాబాలిచే శపింపఁబడిన చిత్రాంగదుండును నున్నవారు. తచ్చతుర్దశీదినంబునం దాముప్వురిం బూజించు పురుషుండు కోరుకొన్న నారీమణిని మనోభీష్టంబును బడయు" ననినవిని మును లిట్లనిరి, ౨౯౦

తే॥ "ఏల చిత్రాంగదుండు జాబాలిచేత శప్తుఁడయ్యెను? తత్తనూజాతయచట
నిప్పటికిని వివస్త్రయై యేలయుండవలసె లోకులుహాసియింపఁ? దెలుపుమయ్య"

వ॥ అనియిట్లుప్రశ్నించిన రౌమహర్షణి యిట్లనియె, ౨౯౧

స్రగ్ధర॥ "కౌమారబ్రహ్మచర్యాకలితుఁడగుచు సుక్షాంతి జాబాలి తా ముక్
శ్రీమత్తద్ధాటకేశస్థితుఁడయి తపముం జేయ ఘోరంబుగా స్వ
ర్ధాము ల్భీతాత్ములై తత్తపమున కిదియో దండివిఘ్నం బొనర్పన్
దామాహేమాద్రిపై నందఱునొకటయి మంత్రంబుగావించి రిట్టుల్ ౨౯౩

ఆ॥ "దినదినాభివృద్ధిగనినవో నీతప మింద్రుఁ గ్రిందుపఱుచు, నిదినిజంబు,
గాన రంభ నితనికడకుఁ బంపంగనౌ బ్రహ్మచర్య మడుగుఁ బట్టఁ జేయ ౨౯౪

క॥ తపమున కెల్లనుమూలము విపులంబగు బ్రహ్మచర్యవిధి, యదిలే కే
యుపవాసంబులతోడనొ జపములు గావింప రిత్తశ్రమము ఫలంబౌ" ౨౯౫

వ॥ అనియిట్లు నిశ్చయించుకొని మహేంద్రసహితంబుగా సకలదేవతలు నప్సరశ్రేష్ఠయగు రంభను జేరంబిలిచి ౨౯౬

తే॥ "తరుణి! జాబాలిముని యుగ్రతపముఁజేయు హాటకేశ్వరమునకు నీవరుగు సరగ,
నీటు గోటునుజూపి నీనేర్పుచూపి నీనేర్చుకొలఁది మోహమునముంచి చెఱుపు మమ్మునితపంబు"

వ॥ అనిపలికిన నదియిట్లనియె, ౨౯౯

కం॥ "ఆముని యిదివఱకెన్నడుఁ గాముకధర్మంబు నడపఁగడఁగియెఱుంగం,
డేమని యరసికుపైఁబడి నామురిపెముదీర్చ నమరనాయక! చెపుమా" ౨౯౯

వ॥ అనియిట్లునొడువుటయు మహేంద్రుండు ౩౦౦

మత్తకోకిల॥ ఈవసంతుఁడు నీకుఁదోడుగ నేగుదెంచి మదాజ్ఞచే
భావజాతవికార మావెడబాపనయ్యమనస్సునం
దావహింపఁగఁజేయుఁగావున యామినీముఖి! యేగి వే
దేవకార్యము నిర్వహింపుము, దీన నీకు యశంబగున్" ౩౦౧

వ॥ అనిసెలవిచ్చుటయు వాబిడ యతనికి దండమర్పించి సహవసంతంబుగా క్ష్మాతలంబునకుఁ బయనంబయ్యె, నంత ౩౦౨

సీ॥ స్త్రీపాదహతిలేకె స్థిర నకస్మాత్తుగాఁ బూసె నశోకము ల్బాసురముగఁ,
దీరుతీరగు దండితియ్యమామిడుతెల్లఁ బూగుత్తులం బరిపూర్ణమయ్యె,
శరదృతువునయందు సరసులం దెల్లెడ వికసించెఁ బద్మము ల్వేలకొలఁది,
మలయానిలమువీచె మందమందంబుగాఁ గమ్మనివాసనల్గలదియగుచు,
నట్టియెడ రంభ యొకసలిలాశయంబుదరిని రుద్రాక్షమాలికం దాల్చి చాల
శ్రద్ధమై నిష్టమంత్రంబుజపముసేయు ఘనుఁడు జాబాలియెదుట సాక్షాత్కరించె, ౩౦౩

వ॥ అట్లు సమీపించి యయ్యప్సరోవర యాయన యవలోకించుచుండ నధోంశుకంబువిడిచి యవగాహనార్థ మంబువులం బ్రవేశించుటయు నతండు యామ్యానిలస్పర్శంబునంజేసి యనంగవశుండు నఖిలాంగసంగతపులకుండునై హస్తంబునుండి యక్షమాల జాఱిపో నతులనుండి యత్యుష్ణంబులగు నశ్రువులంగార్చుచు నవనీతలంబు నార్ద్రంబు గావించె, నంత నంతరంగవేదినియగు నచ్చరమచ్చెకంటి పానీయంబులనుండి వెకిఁబలితెంచి పరీధానంబు మరల ధరియించి తత్సకాశంబుఁజేరి దండంబువెట్టి తగునాదరంబును గనంబఱచుచుఁ దదీయహృదయవికారంబు పెంపొందించు మధురభాషణంబులతో నిట్లనియె, ౩౦౪

సీ॥ "స్వాధ్యాయపాఠము ల్చక్కఁగా నేఁపొద్దు జరుగుచున్నవటయ్య క్ష్మాసురాగ్య్ర!
యేవిఘ్నములులేక యీవానర్చుతపంబు సాఁగుచున్నదికదా! సంయమీశ!
శిష్యులెల్లరు నీవుచెప్పినవిధముగా వర్తించుచుండ్రె విపశ్చిదింద్ర!
పశులు మృగము లేబాధలులేకుండఁ జక్కనున్నవియో సదయహృదయ!

తే॥ శ్రీమదాశ్రమ మాశ్రయించి వసియించు ప్రాణివర్గంబు కుశలంబె భావితాత్మ!
పెట్టలేటికి నినుఁగూర్చి ప్రీతినడుగ సకలమును బాగెగా మునిసార్వభౌమ!" ౩౦౫

వ॥ అనియిట్లు పృచ్ఛఁజేయుటయు నమ్మునివర్యుండు ౩౦౬

తే॥ "అన్నిటంగూడఁ గుశలంబ యంబుజాక్షి! యఖిలసల్లక్షణాన్విత వైననీవు
స్వయముగా నిట కాగతవయితి కాన నెంతయుం గుశలంబిపు డేరుపడిరో, ౩౦౭

సీ॥ భూభువనస్థితు లొప్పడగాంచవచ్చిన దైవతసుందరీతల్లజమవో,
కాంతుతోడంగూడి కాంతారభూములం దిరుగవచ్చిన పూర్వదేవసతివో,
కేళికూళిఁజరించువేళ నెట్టులో తప్పి పైకివచ్చిన భోగిపద్మముఖివో,
వనవిహారమొనర్పఁ జనుదెంచినటువంటి మానవాధీశుని మానవతివో,
యెవ్వగవో నీవు వచియింపు మిందువదన! మోహవారిధిలోన సన్మోంచుచుంటి,
కానఁబడవో కో నీకు నాకనులనుండి పడెడి యశ్రులు గగ్గురుపాటు వణఁకు?" ౩౦౮

వ॥ అనినవిని రంభ మఱియునిట్లనియె, ౩౦౯

కం॥ "కనఁబడుచున్నదికానీ, మునివర! యది నీదు కాయమునకు స్వభావం
బో నలిరొ స్వాస్థ్యంబే తప్పెనో యని యనుకొంటిఁగాని పెద్దగఁదలఁపక" ౩౧౦

వ॥ అనియిట్లు తెలుంగనిదియుంబోలె వాక్రుచ్చుటయు మఱియు నాజాబాలి

కం॥ "కాయస్వభావముంగా, దీయది వ్యాధియునుగా, దిఁకేమన నీమై
చాయఁగనుంగొనుటాదిగ శ్రీయుత! నాకీయవస్థ సిద్ధంబయ్యెన్, ౩౧౧

తే॥ బ్రహ్మచర్యవ్రతంబును బట్టినట్టి దిట్టనగునన్ను లలన! త్వదీయదర్శ
నంబొనర్చుటయాది మన్మథగ్రహంబు పట్టి బాధింపఁగఁజొచ్చె, నెట్టులోతు?" ౩౧౨

వ॥ అనిచెప్పుటయు రంభయిట్లనియె, ౩౧౩

తే॥ "అట్టులగుచో ద్విజోత్తమ! హాయిగాను భోగమొనరింపు నాతోడ బుద్ధిధీర,
గణికనగుటను నాతోడికలయికొక్క తప్పుగాగణియింపరు తద్జ్ఞజనులు, ౩౧౪

తే॥ సర్వసాధారణులనుగా స్రష్ట మమ్ము జగతి సృష్టించు చంద్రజాతులకు వి
శేషబాధ్యతయుండంగఁజేసెఁ గాన నాదుసంబంధ మొకతప్పుగాదు నీకు, ౩౧౫

క॥ నేనును సూనశరాంగుఁడవో నినుఁగని వాఁడిపూవుటమ్ములచేతన్
మేనెల్లగ్రుచ్చఁబడితిని, యానంబొనరింపఁజాల నావలకింకన్,

సీ॥ అల జయంతుండొట్టి యమరకుమారులం బొడగాంచుమందు నేప్రొద్దు నేను,
గిన్నరసుందరుల్ కిన్నెరల్మీటుచు వెన్నంటిరేయే యాంధ్రు నన్నుసతము,

విద్యాధరు ల్వాదువిద్యావినోదముల్గని సెబాసనుచుందు రనుదినంబు,
యక్షగుహ్యకసిద్ధచక్షుశ్శ్రవోయువ వీక్షింపఁబడుచుందు రేక్షణంబు,
మానవులనంగ నొకలెక్కలోనె లేరు, కాని నినువంటిసుందరాకారుఁడొక్క
రుఁడును వీరలలోఁ గనంబడఁడు నాకుఁ, గనుక నినునేను వలచితి, మునికుమార!

తే॥ వలచి తనకయి తావచ్చు కలువకంటిఁ గలయనొల్లనిమూర్ఖుండు కాలదండ
నిహతుఁడై కడుఘోరమౌ నిరయమందుఁ గూలి కలకాల మంద తాఁగుందుచుండు"

వ॥ అని యిట్లు వక్కాణించి మునివర్యుఁ గౌఁగలించుకొనుటయు నతండు వలదు వలదని వాక్కుచే వారించినను హృదయంబున నిష్టపడియ యూరకుండె, నంతనాపె యాయన నొకలతానికుంజంబునకుం గొనిపోయి కామశాస్త్రోదితకృత్రిమభావంబులన్నియుం గనఁబఱచుచుం గ్రీడించె, ననంగసంగరాసక్తి నతఁడట్లు సంత్యక్తాశేషసత్కర్మండై సాయంకాలంబువఱకు నాయనం గూడియుండి యపుడు నిష్కాముఁడగుచు నన్యులు కనుగొందురన్న సిగ్గుచే నప్సరసం దిగనాడి యవగాహనార్థ మవలనరిగె, నట్లతనిచేత విడువంబడి యవ్విలాసిని కృతకృత్యురాలగుట సంతసించుచు స్వర్గంబునకుం జని ససురుండగు శక్రుంగని ౩౨౦

—§ జాబాలికి రంభాగర్భంబున ఫలవతి జనించుట §—

కం॥ "దేవా! దైవవశత సద్భావుఁడు జాబాలి కష్టపడిసల్పిన యా
యావత్తపమును నష్టముగావించితి, హృదయమెల్లఁ గలఁచితిఁ, గానన్ ౩౨౧

సుముఖి॥ సుగముగనుండు సురేశ! యిఁకన్, దిగులెదఁబాసి దివానిశముల్,
మొగమునఁ దేజముపోయి కడుం బొగులుచునుండె మునీంద్రుఁ డటన్, ౩౨౨

వ॥ అనిచెప్పి బర్హిర్ముఖులచేఁ బ్రశంసింపఁబడి యమోఘరేతస్కుండగు నమ్ముని వలన గర్భంబుధరించియుండె, జాబాలి పలువిధంబులఁ బశ్చాత్తాపపడి యయ్యాశ్రమంబునన మరలఁ దపంబునకు దొరకొనియె, నంత దశమమాసమం దాయప్సరఃప్రకాండము పద్మపత్రాక్షియు దివ్యలక్షణలక్షితయు నగు కన్నియఁగని తదాశ్రమంబున కేతెంచి ఋషిసమక్షంబున విడిపించి ౩౨౩

శా॥ "నీవీర్యంబుననుండి భూమిసురవరానీ! నాదుగర్భంబునం
దావిర్భావముఁజెందినట్టినిసుఁ గీయంభోజపత్రాక్షి, దే
వావాసంబున మర్త్యు లుండఁజన, దట్లౌటన్ సమర్పింతునీ,
కీవే దీనిని బెంచి పెద్దయగు నయ్యేర్పాటుగావింపనా" ౩౨౪

వ॥ అని వాక్రుచ్చి యాక్షణంబ స్వర్గంబునకు వెడలిపోవుటయు జాబాలి యక్కన్నియం బొడగాంచి సస్నేహుండై గుప్తంబగు నొకపొదరింటనుంచి సమృద్ధఫలరసంబులచే రాత్రిందివమ్ములుం బోషించె, నక్కన్నియ శుక్లపక్షచంద్రకలంబోలి దినదినప్రవర్ధమానయగుచు జాబాలిప్రేమంబును వృద్ధినిబొందించె, నట్లు శోభాయుక్తయగు నాబాల పచ్చికగలమృగంబులతోడం గ్రీడించుచు సంయమినిసంతోషపెట్టిపెట్టి బాల్యంబు దాటుటయు నారచీరలం గట్టి మొదలిడి యడవినుండి యత్కించిత్సమిత్కుశఫలపుష్పాదికంబులం దెచ్చియిచ్చుచును సర్వకృత్యంబుల సాయపడుచును బ్రీతి పెచ్చుపెరిఁగించి యొకయెండకాలంబునం బండులుత్రెంపికొనిరా దూరంబరుగ నయ్యెడఁ జిత్రాంగదుండను గంధర్వుండు విమానంబుపై నేగుచుఁ బూర్ణచంద్రనిభాననయై విజనప్రదేశంబున ధరాతలపతితచంద్రలేఖవిధంబున నున్నదాని నీక్షించి మోహించి భూతలంబున కవతరించి యంజలిఘటియించి ౩౨౫

— ఫలవతీచిత్రాంగదుల సమాగమము —

కం॥ "ఎవ్వరితవె బాలామణి! పువ్వుంబోఁడివయికాడఁ బొరుగున సాయం
బెవ్వరును లేక తిరిగెద వివ్వనమధ్యంబులోన నేకాకినివై" ౩౨౬

వ॥ అనియడిగిన నాకెయిట్లనియె, ౩౨౭

తే॥ "నేను జాబాలినామకమౌనినాథు ముద్దుకూఁతుర! ఫలపుష్పములకుఁగాను
వచ్చితిరుగుచునుంటి నివ్వనమునందు, ఫలవతీ యంచు ననుఁ దండ్రి పిలుచుచుండు"

వ॥ అనియిట్లనిన వెండియునతండు ౩౨౯

క్రీడ॥ "కుమారబ్రహ్మచారిఁగా క్షమన్ నేనాతనిన్ విందున్,
సుమాంగీ! పెండ్లమేలే కే క్రమం బాతండు నిన్గాంచెన్ ?" ౩౩౦

వ॥ అనవుడుఁ గన్యకయిట్లనియె, ౩౩౧

తే॥ "సత్యమియ్యది, యమ్మునీశ్వరుఁడు తాను బరిణయములేని నైష్ఠికబ్రహ్మచారి,
యట్టివానికి నేనెట్లుపుట్టినానో యవధరింపుము వైమానికాగ్రగణ్య! ౩౩౨

తే॥ రంభయనియెడి యప్సరోరమణి యొకపు డాఋషీశ్వరుదృష్టులం దట్టైపడుడుఁ
గామవశుఁడయి యామెతోఁ గలసెనతఁడు, పుట్టితిని నేను దద్గర్భమునను దివిని, ౩౩౩

కం॥ దివమునఁ బ్రభవించినను భువికింగొని తెచ్చి భుక్తపూర్వుఁడు జాబా
లివశంబుఁజేసి చనె నయ్యువిద, యిఁకేమనివచింతు నోమహనీయా! ౩౩౪

చం॥ ఫలములతోడ నంతననుఁ బాయని ప్రేమను బెంచి పెద్దఁగా
జలిపినవాఁడు కష్టపడి సంయమివర్యుఁడు, సార్థకంబుగా
ఫలవతియంచు ముద్దునకుఁ బల్మరుఁ బిల్వఁగఁ బిల్వ నాదుపే
రిల నదెయయ్యె, నాకుఁబిత యాగతినయ్యె నతండు ఖేచరా!" ౩౩౫

వ॥ అనియిట్లువా ప్రశ్నించిన విని చిత్రాంగదుండు వెండియునిట్లనియె, ౩౩౬

క౦॥ "నీరూపుగాంచి మారునిబారినిబడినాఁడ, నన్నుఁ బాలింపవె రం
భోరూ! చిత్రాంగదుఁడను పేరిటిగంధర్వుఁడను, లభించితి నీకున్" ౩౩౭

వ॥ అనవుడుఁ గన్యక మఱియునిట్లనియె, ౩౩౮

ఉ॥ "పెండిలి గాకయున్న పృథివీసురపుత్రిక నేను, మన్కి యా
తండ్రియధీనమందు, సుమధన్వునిచేష్ట లెఱుంగ బోత్రిగాఁ,
గొండిక దానఁ, గాన మునికుంజరుపాలికిఁబోయి వేఁడు, మా
తండ్రి సురూపయౌవననిధానమ నాతగునీ కొసంగెడిన్, ౩౩౯

క౦॥ నాకును హృదయంబున నీవా కభిమతమయ్యెఁ, బుణ్యవతినగుచో నో
యాకాశచర! యథేచ్ఛగ నీకంఠాలింగనంబు నేఁ గావింతున్" ౩౪౦

వ॥ అనియిట్లునొడువుటయుఁ జిత్రాంగదుండు ౩౪౧

చ౦॥ "ఒకకడనుండి కామశిఖి హోరున నాదుకళేబరంబు గా
ల్చుకొనుచు వచ్చుచున్నయది, చూడఁగఁజాలనిఁ కంతదాఁక, నో
సకియ! యనుగ్రహింపఁగదె సంగమదానమునన్, భవత్పితృ
ప్రకృతియుఁ గీదృశంబుదొ యెవండెఱుఁగంగలఁ డింత కిచ్చుటన్" ౩౪౨

వ॥ అనినవిని కన్యక మఱియునిట్లనియె, ౩౪౩

క౦॥ "కోపిష్ఠుఁడు నాజనకుం, డీపాటను నన్నుఁగూడి యీవుండుట యా
తాపసున కెఱుకయగుచో శాపాగ్నికి నీదుతనువు సమిధను జేయున్" ౩౪౪

వ॥ నావుడుఁ జిత్రాంగదుండు ౩౪౫

క॥ "నీయయ్య శాపశిఖిఁ బడఁద్రోయుంగా కెపుడొవచ్చి తోయజముఖిరో!
యీయతనువహ్ని బూడిదెచేయుం దానిపుడ, యేమిచెప్పెద వింకన్, ౩౪౬

వ॥ అని లజ్జచే వడఁకుచున్న యాబాలికను జేయిపట్టి సమీపస్థశివాలయమ్ము లోనికిం దోడ్కొనిపోయి కామజ్వరపీడితుండగు నతండు గ్రామ్యధర్మంబున నుపక్రమింప నావిడయుఁ దత్కాలజాతరాగాంధయై సిగ్గువిడిచి యందులకియ్యకొనియె, నిట్లతనింగూడి క్రీడించు కన్నియకుఁ బెద్దకాలంబు నిమిషంబువోలెఁ జనుటయు రవి యస్తమించె, నంత జాబాలి బిడ్డ యాశ్రమంబునకు రామికిం జింతించుచు ౩౪౭

మ॥ "అకటా! పాములె పట్టిపీఁకినవొ, లోఁ తజ్ఞాతమైయుండ డీ
ర్ఘికకున్ నీళ్ళకుఁబోయి మున్గినదియో, వృక్షాగ్రమందుండి నే
లకుఁదాఁ గూలెనో, యేమియైనయదో, నాలావణ్యవారాశి పు
త్రిక, దానింగనుఁగొకయున్న నిఁక నీపృథ్విన్ మనన్ నేర్తు నే, ౩౪౮

వ॥ అని విలపించుచు గహనంబగు వనమంతయుం గ్రుమ్మరి కుశకంటకవిద్ధాం గుండును క్షుత్పిపాసాసమాకులుండు నై రాత్రియగుట ఖగమృగరుతంబు విన్నను ఫలవతిభాషితంబుగాఁ దలంచి యచ్చోటికెల్లం జనిచని క్రమంబుగా సంశయంబుడిగి కన్యకాజనంబులకును విశేషించి బ్రహ్మజాతలకు ననర్హంబులగు నానాప్రకారరాగ వాక్యంబులు భాషించుచుఁ జిత్రాంగదోపేతంబుగా నక్కన్నెమిన్నయున్న శివాలయంబు చెంతకుం జని వాని నన్నింటిని దూరస్థుండై సాశ్చర్యంబుగా విని తచ్చేష్టితంబుం గని కోపఘూర్ణితలోచనుండై రయంబున నావారి నిరువురం గొట్టిచంపుటకుఁ గాఁ గట్టియం బట్టుకొని బిట్టు బెదరించుచు ౩౪౯

స్రగ్ధర॥ "ఛీఛీ నీచాత్మురాలా! చెడిపెవగుచు నీచెట్టఁ జేపట్టినావే!
నీచేతం గన్యలెల్లన్ నిధువనరతులన్ నిందకుం బాత్రులైనార్,
ప్రాచీనోద్యత్సుకీర్తిప్రశమనచణమై బల్కళంకంబు నాకీ
క్ష్మాచక్రంబెల్ల నిండెం, గనుక నికనినుం జంపెదన్ రమ్ము ముండా!" ౩౫౦

వ॥ అని యెప్పుడు దెబ్బవైచెనో యప్పుడ చిత్రాంగదుండు గగనపథంబున కెగసి కానరాకుండనయ్యె, రతిమధ్యంబుననుండుటం జేసి యూడిపోయిన వస్త్రంబు తోడను మెయియెల్ల దిగజాఱెడి చెమ్మటలతోడను గూడి యక్కన్నియ పడుకొన్న చోటునుండి లేచి యడుగేని యిడఁజాలక పడియుండుటయుఁ గ్రోధపరిపూరితుండగు జాబాలి కట్టియలు విఱుగం గొట్టికొట్టి యూపిరివిడిచినదానింగాఁ దలంచి యంత నత్యంతభీతుండై యంబరమార్గంబునం బఱచు చిత్రాంగదుం గనుంగొని ౩౫౧

కం॥ "ఎవ్వాఁ డస్మత్పుత్రిక రవ్వలపాల్గాఁగఁ బట్టి రతమొనరిచెనో
యవ్వాఁ డెఱకలువిఱిగిన గువ్వగతిం బుడమిఁబడెడుఁ గుష్ఠయుతుండై" ౩౫౨

వ॥ అని శపించి యాక్షణంబ యాకాశమార్గంబునుండి యవనింబడి కుష్ఠవిశిష్టతం గ్రుళ్ళిన యవయవంబులతో నడుగుదీసి యడుగు వెట్టఁజాలకుండు చిత్రాంగదు సమీపించి కాష్ఠోద్యతకరుండై కరంబు క్రోధంబున ౩౫౩

కం॥ "ఎవఁడవురనీవు పాపీ! యవివాహిత నాదుబిడ్డ నక్రమముగ దా
నవుఁడట్లు పట్టి చెఱిచితి?, భువి కిఁక బలియిత్తురమ్ము పొలియించి నినున్" ౩౫౪

వ॥ అనవాఁ డఱచుటయుఁ జిత్రాంగదుండిట్లనియె, ౩౫౫

తే॥ "ఏను జిత్రాంగదుండన నెసఁగునట్టి యొక్క గంధర్వవరుఁడను యోగిచంద్ర!
తీర్థసేవాప్రసక్తిమైఁ దిరుగుకొనుచు వరుస నీక్షేత్రమునకును వచ్చినాఁడ, ౩౫౬

ఉ॥ వచ్చుటలోన చుక్కవలెవచ్చి భవత్సుత నాదుదృష్టులన్
జొచ్చుటయున్ భ్రమించి విసమానశరాహవమందుఁ దేలితిన్,

జెచ్చెర నన్ క్షమింపుమిఁకఁ, జేసినపాపము చెప్పఁదీఱె, యు
ష్మచ్చరణాంబుజంబులకు సల్పెద వేయినమస్కృతుల్ ప్రభూ ! ౩౫౭

శా॥ మౌనీంద్రుండవునీవు, సజ్జనుఁడవున్, క్ష్మాదేవవర్యుండ, వె
ల్లైనం గ్రోధము చాల న్యూనముగ నీయందుండు, నల్లాటచే
దీసుకో నన్ గృపఁజూచి యెప్పటివలెన్ దివ్యద్విమానంబుపై
నానాలోకములం జరింపుమని రుజ్ఞాశంబు గావింపవే" ౩౫౮

వ॥ అనియిట్లు ప్రార్థించుటయు నత్తపస్వి ౩౫౯

తే॥ "ఇట్టిరూపంబుతోన నీ విటువసింపు మంచు నింకొక్క-మాఱంటి నటుగు దుష్ట !
కడుపుచెడఁబుట్టినట్టి యీచెడిపె యిల్లై దిసమొలం బడియుండు నీదెసను సతము,

కం॥ బ్రదుకదు వేవిధములకిది, బ్రిదికిన నీదిస్సమొలయు ప్రాప్తం, బటుగా
కెదఁ బటుమ తాల్పఁదలఁచినఁ బదిపదివిధములయి శిరము పడుఁ బుడమిపయిన్ ౩౬౧

వ॥ అనిపలికి నిజాశ్రమంబునకుఁజనియెఁ, జిత్రాంగదుండు ఫలవతీసహితంబుగా
నచట నదేవిధంబునం బడియుండె, నంతఁ గొంతకాలంబునకుఁ జైత్రశుక్లచతుర్దశీ
దినంబునం దాక్షేత్రంబునకుఁ జిత్రేశ్వరపీఠసందర్శనార్థమై శశిశేఖరుండు గణంబుల
తోడను యోగినులతోడను గూడుకొని చనుదెంచుటయు నర్ధరాత్రంబునం దయ్యో
గినులు మహామాంసంబు మహామాంసంబని పెద్దయెలుంగున నర్తమానులగు గణంబుల
తోడి స్పర్ధమై దేవదేవుముందఱ నర్తనంబొనరించిరి, యయ్యెడ జాబాలితనూజయగు
ఫలవతియుఁ జిత్రాంగదుండును సమీపించి ౩౬౨

ఆ॥ "అస్మదీయమైనయట్టి మాంసంబు మే మిచ్చుచున్నవార మెలమి మీరు
బాగుగా గ్రహించి యోగినులార ! మీయిచ్చవచ్చినట్టు లిది తినుండు" ౩౬౩

వ॥ అనిపలుకుటయుఁ గుష్ఠవ్యాధిసమావృతుండగు నప్పురుషుని వివస్త్రయగు
కన్యకం దిలకించి యోగినులును గణంబులును మహాదేవుండు నందియును వెఱఁగందిరి,
యందుఁ ద్రిలోచనుండు చిత్రాంగదుఁ జేరంబిలిచి యిట్లనియె, ౩౬౪

ఉ॥ "మీమలకుం బ్రియంబయిన జీవము యిచ్చెదమంచుఁ బూన్కి-మై
వేముఱుఁ జాటుచుంటిరిటు, విస్మయమయ్యెను జూడ మాకుఁ గు
ష్ఠామయపీడ్యమాన ! యెవరయ్యెదవీవు ? వివస్త్రయైన యీ
భామిని దా నెవర్తు ? తెలుపంగదె వేడుకయయ్యెడిన్ వినన్" ౩౬౫

వ॥ అనియిట్లడుగుటయు నతండు కన్యాసంగమ మునీశ్వరశాపప్రభృతి స్వకీయ
వృత్తాంతం బంతయు వక్కాణించె, నంత దేవతలలోఁ జేరిన గంధర్వుండగుటవలనఁ
దథారూపుండగు చిత్రాంగదునెడలఁ గృపాళుండై శంకరుండు ౩౬౬

క॥ “ననుదర్శించితి రీరలు, చెనయదుమిము నృత్యువింకఁ జిత్రాంగద! యె
ట్లును గాక నాదు సందర్శనము వృథా గాదు, కోరు సమ్మతి, మిత్రున్ ” ౩౬౭

వ॥ అనిపలుకుటయు నతండిట్లనియె. ౩౬౮

ఆ॥ “ వ్యాధి నన్నుఁబట్టి వేధించుచున్నది, వదలదద్ది తనువువదలువఱకుఁ,
గాన వ్యాధిపీడి గగనచరుండఁగాఁ గరుణసేయు, మమరపురికిఁ జనుదు ” ౩౬౯

వ॥ అనియిట్లు వేఁడిన విని శంకరుండు. ౩౭౦

—• చిత్రాంగదేశ్వరుఁడు ఫలవతికి వరములిచ్చుట •—

ఉ॥ “ నీవిట నాదులింగమును నిల్పి యొకబ్దము పూజసేయు మో
దైవతయోని! యెట్టులటు దానికిఁ బూజలొనర్తు యట్టటుల్
తావకమైన జాడ్యమును దా తుయమందును, ఖేచరత్వముల్
నీవశమౌ ననంతరము, నీవు త్రివిష్టప మొందు దాయ్యనన్, ౩౭౧

ఆ॥ పీఠమధ్యమునఁ బ్రవేశించుటంజేసి ఫలవతియును యోగపట్టదాల్చి
వస్త్రహీనముగనె ప్రజ కర్చనీయయై తత్సమస్తకాంక్షితముల నొసఁగు, ౩౭౨

తే॥ ప్రథమ మీయమఁ బూజించి భక్తితోడఁ బిదపఁ జేయఁగవలయును బీఠపూజ,
యట్లుగావించువారల కర్థసిద్ధి ఘనమె యరచేతి యుసిరిక కాయగాక ” ౩౭౩

వ॥ అని వచించుటయు ఫలవతి యత్యంతసంతుష్టస్వాంతయై యోగినీబృంద మధ్యంబున నిలిచి యాడందొడంగె, నానృత్యంబునకు మహేశ్వరుండు మహామోదంబునం దేలుచు నావిడం బిలిచి ౩౭౪

కం॥ “ నీయాటయు నీపాటయు నాయంతటివాని నధికనవ్యామోద
శ్రీయుతుఁ గావించెను, వత్సా! యందున నస్మదుక్తి శ్రవణింపు మికన్; ౩౭౫

కం॥ ఎవఁ డాగమమంత్రంబుల నవనతుఁడై కల్లు మాంస మర్పించుచు నీ
దివసంపు టర్ధరాత్రిము భవదర్చనసేయు వాఁడు పగరం గెలుచున్, ౩౭౬

సీ॥ గగనచారికి నేని గట్టుగట్టి యతండు కదలకుండఁగఁజేయు గడియలోన,
మతిమంతునకు నేని మంతిరించి యతండు తెలివిదప్పఁగఁజేయుఁ దలఁచుమాత్ర,
బ్రహ్మరాక్షసు నేని పట్టుఁబట్టి యతండు పాఱఁదోలును చెప్పపాటులోన,
మేదినీశ్వరు నేని బూదిఁజల్లి యతండు తనవశంబుననుంచుఁ దత్క్షణమున,
దిట్టి యతఁ డెట్టిశ్రీమంతుపట్టి నేని బిచ్చమెత్తించినటి విడ్చిపెట్టు నవల,
దీవనమొసంగి యతఁ డెంతదేబె నేని సమధికైశ్వర్యవంతుని సలిపితీరు, ౩౭౭

సీ॥ ఇంద్రాగ్ని యమ నైరృతేశాన యాదసాంపతిముఖ రాష్ట్రదిక్పాలకులను
గంటిని యెప్పు వైఖరి ననుక్షణమును దలఁగకుండెడి క్షేత్రదైవతమును
ప్రత్యహంబును వచ్చి పైపరామర్శంబు గావించు నాకాశదేవతలను
నఖిలసత్కర్మంబు లాచరించుటకు మూలాధారమైన యీయంగణమును
నిన్ను విధియుతముగ నిష్ఠఁ బూజించి త్రికోణకుండమునందు గుగ్గులమునఁ
గాని వైరి నుడమకాలి ధూళిఁగాని వేయుపరులెవండు వేల్చు వాఁడు ౩౨౮
కం॥ శత్రుస్తంభన మొనరిచి ధాత్రిం బృథుయశము గాంచుఁ దన్వంగి! యిఁకన్
శత్రూచ్చాటన మోహనసూత్రములను వినుతు వినుము సుశ్రీ ప్రేమముగన్, ౩౨౯
కం॥ శాత్రవు మదినిడుకొని తచ్ఛత్రూద్వర్తనమలాక్త ధాత్రీఫలముల్
పాత్రముగ వేల్చునాతఁడు పుత్రీ! సమ్మోహనంబు పూర్తిగ జరుపున్, ౩౩౦
కం॥ శివనిర్మాల్యముతో శత్రువు స్నానముచేసినట్టి తోయముబూదన్
భవదగ్రిమ్మున వేల్వఁగనవు శత్రూచ్చాటనమున కబలామణిరో! ౩౩౧
కం॥ ఈచిత్రాంగదుఁడును దా నీ చెట్టుంబట్టి బిట్టు నెచ్చెలియయ్యెన్,
నీచెలిమి నీతఁడును సంకోచములే కర్ఘ్యపూజఁ గొనుఁ బ్రజచేతన్" ౩౩౨
వ॥ అనివక్కాణించుటయు ఫలవతియిట్లనియె, ౩౩౩
కం॥ "నాపై నీకు ననుగ్రహమే పొడమిన మఱియునొకటి యిమ్ము వరమ్మున్,
శ్రీపార్వతీమనోహర! యూపని నన్నధికసమ్మదాంబుధి ముంచున్, ౩౩౪
తే॥ నాదుజనకుండు జాబాలి నావిధమున నుత్తమోలతోడ నటఁ బడియుండుఁగాక,
బ్రహ్మవర్ణవిరుద్ధమై పరఁగు నాదు నాటుగాంచి తపించు చహర్నిశములు, ౩౩౫
కం॥ కలు మూచూచును, వండినపోలఁ బొడగాంచును, యథేచ్ఛఁ బొలుపారెడి నా
చెలువున కలమటుగుడుచును గలకాల మతండు నాదుకట్టెదుట శివా!" ౩౩౬
వ॥ అనినవిని మహాదేవుండు ౩౩౭
కం॥ "ప్రకృతము నీవాక్రుచ్చిన సకలము నేతద్విధమున జరుగునుగానన్
సుకముండు మిఁక శుభాంగిరో! స్వకీయలోకమున నేను జనుచున్నాఁడన్" ౩౩౮
వ॥ అని చెప్పి యంతర్ధానంబుఁ జెందుటయుఁ జిత్రాంగదుం డచ్చోట గొప్ప దేవళంబుగట్టించి దేవదేవుండగు శంకరుని లింగంబును సంస్థాపించి దివారాత్రంబు లతంద్రితుండై యర్చించి సంవత్సరాంతంబున శమితజాడ్యుండై సురూపంబుధరియించి విమానంబుపై స్వర్గంబునకుఁజనియె, జాబాలి ప్రజ పరిహసింప దిగంబరుండై యా పీఠంబున కేతెంచి నిజపుత్రీప్రదర్శ్యమాన తత్తద్వికారవీక్షణసంజనితదుఃఖయుతుండై సర్వదా యుండుచు ... ౩౩౯

— స్త్రీల యుత్కృష్టత్వాపకృష్టత్వ ప్రశంస —

శా॥ 'ఇస్సీ! బ్రాహ్మణవర్ణమందు మనెఁగా యీదృగ్దురాచార, మే
నస్సంపన్నుఁడ యాఁడుసంతుఁగనుఁ, దన్నారీసకృత్సంగమే
నస్త్రీమానుదమయ్యెనాకు, నధము ల్నిత్యంబుఁ దద్యోని రే
తస్సిక్తంబును జేయుచుండు, రెఱుఁగం బద్ధస్యమౌ దుర్గతుల్" ౩౯౦

వ॥ అని యాఁడుపుట్టువున గర్హించుటయు యోగినులు కోపాన్వితలై ౩౯౧

ఉ॥ "యోగముఁబూని నాఁడనని యుద్ధురగర్వముతోడ మూర్ఖ! సు
స్త్రీగణమెల్లఁ దిట్టుదువు, స్త్రీలకుఁ బుట్టిరి శేషకూర్మ, లా
భోగిపకూర్మరాజముల భూమి భరించుచునున్న, వాభువిన్
బాగుగ నిల్చియున్నది ప్రపంచముసర్వము, నట్లుగావునన్ ౩౯౨

తే॥ స్త్రీలచేతన సుప్రతిష్ఠితము విశ్వ, మల్పకాలంబులోనన యధికయోగ
మెనసి యున్నతపదమున కేగనున్న యుష్మదాత్మజయును జాల యోగ్యురాలు,

తే॥ నీవ యింకను ఛాందసభావమూని శుద్ధమూర్ఖుండవగుచుంటి చూచుకొనుము,
నీవ యింక నవిద్యాప్రభావమునను ఘోరసంసారవారిధిం గూలుచుంటి" ౩౯౪

వ॥ అనినవిని జాబాలియిట్లనియె, ౩౯౫

ఉ॥ "స్త్రీలు వినింద్య, లేపనిని దీఱఁ దుఃఖము దెచ్చిపెట్టుచుం,
ద్రీలలనొఘుమిచ్చుసుఖ మిందును నందును గానరాదు, వ్యా
చ్యాలము పూరుషాళికిది, శుంభనిశుంభదశాననాదులీ
స్త్రీలనుగూర్చి కాదె మును తీఱినవారయి రెందఱెందఱో, ౩౯౬

క॥ తాదృగ్బ్రాహ్మణు గౌతము గాదిలి పెండ్లా మహల్య, కడ కావిడయున్
డా దేవేంద్రునితోడం బోఁదలపడె, స్త్రీస్వభావమును గనుగొనుఁడీ" ౩౯౭

వ॥ అనియిట్లు వక్కాణింప ఫలవతియతనిదిక్కు మొగంబై యిట్లనియె, ౩౯౮

శా॥ "మూఢాత్మ! యబలాజనమ్ము సకలమ్మున్ నింద్యమం చెద్దియో
గాఢంబైన పరిసక్తి యోగినులతోఁ గావించుచున్నాఁడ, వా
ప్రౌఢిన్ నాకడఁ గానిపింపు, మిపుడే ప్రత్యుత్తరంబిచ్చి నీ
రూఢాహంకృతి పెల్లడంతు నెట నూరుం బేరు లేకుండఁగన్, ౩౯౯

శా॥ "స్త్రీహత్యాఘము సంఘటించునని యుం జింతింప కం దాత్మజన్
దేహంబెల్లను వాయఁగొట్టితివె, యీదృక్కర్మ మస్పృశ్యుఁడే
నావా! చేయునె, బుద్ధియున్నె యిసుమంతేనన్ మదిన్ నీకు, నీ
మాహాత్మ్యంబిం బద్ధుగం బ్బో బేలకు మీఁకన్ మత్సన్నిధానంబునన్, ౪౦౦

తే॥ కోసినంగూడ నీమెయిం గొంచెమేని కరుణయన్నది యేపారం గానఁబడదు,
మరల నేమంచు సిగ్గును సెరములేక ధర్మపన్నంబులం జెప్పఁ దరలినావు ౪౦౧
కం॥ పోవును బ్రాయశ్చిత్తము గావించినపిదప నెట్టికలుషములైనన్,
స్త్రీవధపాపముఁ బాపెడి తోవం జెపు మీవ పదికిఁ దోఁచినయెడలన్ ౪౦౨
శా॥ నీచే దెబ్బలుతిన్న యందులకు నేనిట్టేను జింతిల్లరా
నీచా! నన్ను శపించి దిస్సమొలదానిం జేసి, తాపాతకం
బాచంద్రార్కము నిన్ను వీడిచన, దజ్ఞాటం బదేనఃఫలం
బీవోటం బడియుండుచుం గుమువు మే నేకాకిఁ గాకుండఁగన్, ౪౦౩
కం॥ తిట్టవు స్త్రీల నిఁకెన్నడుఁ గొట్టవు కట్టియలతోడఁ గూఁతుండ్రి నిఁకన్,
దిట్టతనం దగినంతటి చెట్టుతనం బేమిగలదొ స్త్రీకడఁ జెపుమా, ౪౦౪
కం॥ నెలనెలకుం బ్రవహించెడి యలఘుతర రజఃప్రవాహమందునఁబడియే
కలుషంబుఁ గొట్టుకొనిపో నలినేణులు నింద్యలెట్టులగుదురు సుమతీ!" ౪౦౫
వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు జాబాలి ౪౦౬
కం॥ "పరపురుషసంగమంబునఁ దరుణులు చాండాలులగుట తప్పనియది, యా
దురితాత్మ రాండ్ర నిప్పులఁ బొరలించినైనను విశుద్ధి పొనరుపవశమే" ౪౦౭
వ॥ అనుటయు మఱియు నక్కన్యక యిట్లనియె, ౪౦౮
ఆ॥ "ధీవిహీన! మరల స్త్రీజన మపవిత్రమనుచు బిట్టు పేర్ల కాలకింపు,
మనువు దీనిఁగూర్చి మును రచియించిన పద్దియంబొకండు పఠనసేతు, ౪౦౯
ఆ॥ విప్రపాద మావుపృష్ఠ మ్మజాహయముల ముఖంబుఁ బెరియతములు ధరిత్రి,
నంగనాశరీర మాపాదమస్తకమ్మును బవిత్రమగుచుఁ బొగడఁబడెను" ౪౧౦
వ॥ అనవుడు మఱియు జాబాలి ౪౧౧
ఆ॥ అంతటను విశుద్ధులరయ గోబ్రాహ్మణు, లజను హయము ముఖమునందు శుద్ధ,
మంగనాశరీర మాపాదమస్తకమ్మును నశుద్ధ, మద్ది ముట్టనగునె ౪౧౨
వ॥ అనిపలుకుటయు వెండియు ఫలవతియిట్లనియె, ౪౧౩
ఆ॥ "కాంతయున్న యిల్లు కల్పకావాసంబు, ధనదుఁ డాగృహస్థు ననుచరుండు,
వానికరమునంద వఱలుఁ జింతామణి, లేనివాఁడె కాంతలేనివాఁడు" ౪౧౪
వ॥ అనినవిని మఱియు నమ్మునీశ్వరుండు ౪౧౫
తే॥ "కామినీభూతమేయింటఁ గదలకుండు నష్టకష్టంబులను దాని నంటియుండుఁ
దద్గృహస్థుండు సకలసంతాపములకు నాస్పదంబయి నారక మనుభవించు" ౪౧౬
వ॥ మరల నక్కన్నియ యిట్లనియె, ౪౧౭
కం॥ "ధర్మార్థకామమూలకకర్మములన్నియును భోగసంస్థాయములుక

నిర్మించువారలల సహధర్మిణులయినట్టి స్త్రీలు ధారుణిలోనన్" ౪౧౮
వ॥ వెండియు జాబాలియిట్లనియె, ౪౧౯
కం॥ "ధర్మార్థకామనాశకకర్మములును సమధికంపుఁ గష్టశతములున్
దుర్మార్గురాండ్రు స్త్రీలు వినిర్మింతురు గాన వాండ్ర స్నేహము తగునే" ౪౨౦
వ॥ ఫలవతి యిట్లనియె, ౪౨౧
కం॥ "నాలుగు పురుషార్థములును నాలుగు వహ్నిప్రదక్షిణంబులచేతన్
బాలలగు స్త్రీలు పరిణయవేళనె మాపించుచుండ్రు విభులకు నెలమిన్" ౪౨౨
వ॥ జాబాలి యిట్లనియె, ౪౨౩
ఆ॥ "వహ్ని చుట్టు బిట్టు వైవాహికములోనె త్రిప్పమొదలుపెట్టు స్త్రీ స్వకాంతు
సంతతంబు నిన్ను సంసారవహ్నిట్లు త్రిప్పుచుండుననుచుఁ దెలుపుపోలె" ౪౨౪
వ॥ ఫలవతి యిట్లనియె, ౪౨౫
తే॥ "కర్ణములదాఁక వ్యాప్తమౌ కన్నగవయు బలిసినటుకంటి చన్నులుం గలవధూటిఁ
గాంచి సుజ్ఞానియైనను గామవశుఁడు గాక యేమానవుం డుండఁగలుగు నిలను"
వ॥ జాబాలి యిట్లనియె, ౪౨౭
ఆ॥ "రంతుకాముఁడగుచు రమణి డగ్గఱిడి యేయజ్ఞజనుఁడు నాశమందకుండుఁ
బండటన్న భ్రాంతి మండెడియగ్నిలో మ్రింగనెంచిదూకు మిడుతవోలె" ౪౨౮
వ॥ ఫలవతి యిట్లనియె, ౪౨౯
సీ॥ "మొనలుండుచో నెదో కనుగొనరానంత బలుపునై నునుపునైఁ దెలఁగునవియు
బలుగుండురాతికిం దులయనం, దగినంత కాఠిన్యమును గల్గి కాల్చునవియు
రోమ్మున వలయంపుదిమ్మతేర్పఱచిన ట్లుద్ధృతాకృతితోడ నుండునవియుఁ
జూడఁగన్న మాత్రానఁ బురుషులహృదయముల్ హరియింప దక్షమై యలరునవియు
నైన స్త్రీస్తనముల నాసక్తి సేవించువాఁడె పుణ్యజనుఁడు వాస్తవముగఁ,
బుణ్యజనతముండుపో మధుమాంససేవనము నాచరించువాఁడు మఱియు, ౪౩౦
వ॥ జాబాలి యిట్లనియె,
కం॥ "మండలఘనము నాభోగు లఖండాకృతి నపుడ ముత్తకకంచుకములు నా
కుండల్లులఁదాఁకుపనియును దండిద తాద్యత్తనములఁ దాఁకుటకంటెన్" ౪౩౨
వ॥ ఫలవతి యిట్లనియె, ౪౩౩
కం॥ "హృదయంగమాంగులగు నీసుదతుల సంభోగమొకటె సుఖదముగా దె
న్నఁ దదుపగూహనమును సమ్మదముంగలిగించు, మేన మొలిచెదుఁ బులకల్"
వ॥ జాబాలి యిట్లనియె, ౪౩౫
కం॥ "మదమత్తలన యేతత్సుదతులసంభోగ మొకడె దోషముగా దె
న్నఁ దదంగస్పర్శనమును దుదిగూర్చును నరకమునను దోయిను బురుషున్"
వ॥ ఫలవతి యిట్లనియె, ౪౩౭

ఆ॥ అంగనానురాగ మాజ్ఞింపుమతఁబ్రాత నెవ్వఁ డధిక సౌఖ్య మెనయకుండు,
నెవఁడు కాఁడుపత్నిజకు నెంతయు స్పృహణీయుఁ, డెవనిసుకృత మోజవృద్ధి కాదు" ౪౩౯
వ॥ జాబాలి యిట్లనియె,
కం॥ స్త్రీలంపటుఁడగువానికి నేలీలను ముక్తిగలుగు, నెటులాతనికిన్
మేలొనఁగూడెదు, నెవ్వఁడు చాలఁబ్రశంసించు వాని సజ్జనుఁడనుచున్ ౪౪౦
వ॥ ఫలవతి యిట్లనియె, ౪౪౧
కం॥ సంసారంబునఁజొచ్చి రిరంసుతమను కీటమునకు రమణీయస్త్రీ
మాంసలతనువు రుచించుఁ, బుమాంసునకిఁకఁ జెప్పనేల మతియుతుఁడగుటన్
వ॥ అనవుడు జాబాలి వేఁడియునిట్లనియె ౪౪౩
కం॥ "మలమునఁబుట్టిన క్రిమికిన్ మలము సదా యభిరుచించుమాదిరిగా ని
చ్చలు సంసారమునంబడి పలవించెడి కాముకునకుఁ బడఁతి రుచించున్" ౪౪౪
వ॥ నావుడు ఫలవతి ౪౪౫
కం॥ "పురుషుల కత్యంతము సుఖకరమగుస్థానం బొకండు కనఁబడమిని ద
త్పరమేష్ఠి యరసియారసి స్థిరముగనుండఁగ సృజించె స్త్రీరత్నంబున్" ౪౪౬
వ॥ అనినవిని మునియిట్లనియె, ౪౪౭
కం॥ "జగమునుబంధించుటకుం దగుసాధన మెదియటంచుఁ దడవారసి యీ
వగలాడుల సృజియించెను భగవానుఁడు బ్రహ్మ పురుషపదనిగళముగన్" ౪౪౮
వ॥ అనియిట్లు మునిశార్దూలుండు బదులుచెప్పియు మాటకుమాట తెగులను
సామెత ననుసరించి పదపడి ప్రత్యుత్తరంబునీయనొల్లక ౪౪౯
ఆ॥ "బాలవయ్యుఁ బూర్వపక్షంబు సేయుచు నున్నదాన వస్మదుక్తులెల్ల,
నట్లుగాన నా కనర్హంబు నీతోడ వాదులాడు టింక వాస్తవముగ, ౪౫౦
కం॥ ఈదృక్శాస్త్రవిచక్షణ వీదృక్షవు నాదుబిడ్డ, వేధన్యుండన్,
లేడిఁక నీపైఁగోప మ్మోదుహితరో! స్వేచ్ఛఁ గ్రీడనొనరుచు మింకన్" ౪౫౧
వ॥ అనిపలుకుటయు యోగినీమధ్యగతయగు ఫలవతి బిడియపడి స్నేహవత్సలుఁ
డగు తండ్రికి నమస్కరించి యిట్లనియె, ౪౫౨
కం॥ "తెలిసియొ తెలియకొ నే నీపలుకుల నన్నిటిని బూర్వపక్షము సేయన్
దలపడినదాన, నది మదినిలుపకు, క్షంతవ్యురాల, నేఁగడు బాలన్, ౪౫౩
కం॥ ఈపీఠమందుఁ బ్రథమము నీపూజయచేయు భక్తి నిత్యంబు జనం,
బాపైని సకలపీఠశ్రీపూజన, మూర్ధ్వగతినిఁజెందుదు రవలన్" ౪౫౪
వ॥ అనియిట్లు వక్కాణించె, జాబాలియు నతని సుతయుఁ జిత్రాంగదేశ్వరుం
డును దత్స్థానంబున నిట్లువసించిరి, వారి ముగ్గురిం బ్రత్యహంబును బూజించువాఁడు
సిద్ధింబొందెడు, భూతలంబున వాని కసాధ్యం బొకింతయు నుండదు, రాజముఖ్యు
లచేఁ బూజింపఁబడి దివ్యభోగంబు లనుభవించెడి, నీయాఖ్యానంబుఁ జదివినవారును
విన్నవారు నిందు నందు సర్వకామంబులం బొందుదు"రనుటయు ఋషులిట్లనిరి,

### —♦ హరలబ్ధవరులైన యమరు లసురులఁ బాఱఁదోలుట ♦—

కం॥ "అడిదములం దులఁదూఁగెడి బడితెలచేఁ జావమోదఁబడినదయియు నా
బిడ జీవించుటచూడఁగఁ గడువెఱఁగుజనించెఁ, జెపుము కారణ మనఘా!"
వ॥ అనియడుగుటయు సూతుండు, ౪౫౭

తే॥ "మాఘకృష్ణచతుర్దశి మహితుఁడైనయట్టి గంధర్వుతోడ నా యవనిదేవ
తనయ పుణ్యదమైనట్టి తదమరేశ్వరంబునఁ బ్రవేశమొనరించె దంబుమీఱ,
ఆ॥ అది యకాలమృతిని హరియించుటయె కాక కాలమృతినిగూడఁ గలుగనీయ,
దికతంబుగాఁగ నమ్మునికన్యక బిట్టుకొట్టఁబడియుఁ గిట్టదయ్యె" ౪౫౯
వ॥ అనుటయు మునులు వెండియునిట్లనిరి, ౪౬౦

కం॥ "అమరత్వము కృపసేసెడి యమరేశ్వరుఁ డెవరిచేత నాస్థలమునఁ బూ
ర్వమునఁ బ్రతిష్ఠితుఁ? డెట్టిమహిమగలఁ? డంతయును జెప్పవే దయతోడన్"
వ॥ అని యిట్లడిగిన సూతుండు ౪౬౧

కం॥ "దక్షప్రజాపతికి సుత లక్షీణద్యుతిసమేత లదితియు దితి, యా
ఋక్షేశముఖులఁ గశ్యపుఁ డీక్షించి వివాహమాడి యెంతయుఁ బ్రీతిన్ ౪౬౩
వ॥ కాఁపురంబుసేయుచుండుటయు నదితికి దేవతలును దితికి రాక్షసులును
ప్రభవించి రాక్షసులచే దేవతలుకొందఱు ధ్వంసముచేయఁబడిరి, కొందఱు పరాజితు
లైరి, కొందఱు దెబ్బలుతిని భయంబునఁ బాఱిపోయి,రంత దేవమాత యచ్చోటికేతెంచి
నక్తందివంబులు తపంబుండుడు యుగచతుష్టయంబున దుర్వ్రం బగుల్చుకొని శివలిం
గంబు వెలువడియెఁ, బదపడి యాయమ ప్రస్తుతించి ప్రణిపాతంబొనరించుటయు ౪౬౪
కం॥ "భవదభిమత మెయ్యదియో పువుఁబోఁడిరో! వేఁడు, మిచ్చిపోదుమ వేగన్,
ధవళాంశుశేఖరుఁడ, నీస్తవనములకు మెచ్చి సుప్రసన్నుఁడనైతిన్" ౪౬౫
వ॥ అని గగనాంగణంబున నశరీరవాణి వెడలుటయు నదితి ౪౬౬
ఆ॥ "మామకీనసుతుల నదమున దితిసుతుల్ యుద్ధమునఁ బొకార్చుచున్నవారు;
వారు వారిచే నవధ్యులై మఱి నిరామయాసులై వసింప నగు మహేశ!" ౪౬౭
వ॥ అని ప్రార్థించుటయు భగవానుండు ౪౬౮
ఆ॥ "అస్మదీయమైన యట్టి యీలింగంబు సంస్పృశించి యెవరు సంగరమున
కరుగఁగలరొ వార లబ్దంబువఱకు నవధ్యులగుచునుండ్రు వాస్తవముగ, ౪౬౯
వ॥ అని గగనముఖంబునం బ్రకటించి విరమించుటయు నదితి హతశేషులగు
సుతులం దోడ్కొనివచ్చి యాలింగంబును గనంబఱచి తన్మాహాత్మ్యంబంతయు వక్కా
ణింప వారలెల్లరు నమస్కరించి శక్రపదం బాక్రమించుకొని స్వర్గభోగంబు లనుభవిం

చుచు నందనవనంబున విహరించు దానవులపైఁ గవిసి, రంత వార లదిగనుంగొని ధృతశస్త్రాస్త్రవర్ములై యెదురునడచుడు నుభయబలంబులకును ఘోరయుద్ధంబుజరగ, నంత నమరు లసురుల ఛిన్నభిన్నంబుగావించిన హతశేషు లచ్చోటువాసి పలాయితులై పాథోధి నాశ్రయించిరి, పదపడి పాకశాసనుండు స్వరాజ్య మఖిలంబును స్వాధీనపఱచుకొనియె, దానవులు తత్క్షేత్రమహత్త్వమంతయు శుక్రముఖంబునవిని మాఘకృష్ణచతుర్దశీదినంబునం దామును దల్లింగంబు నర్చింపఁ బ్రయత్నించుటయు నింద్రుఁడయ్యది నారదువలన నెఱింగి తల్లింగసంరక్షణంబునకుఁగా ముప్పదిమూఁడుకోట్ల దేవతలంగూడి తత్క్షేత్రంబుఁ బరివేష్టించె, రాక్షసు లయ్యది వీక్షించి భయంబునం బాఱిపోయి, రంతఁ బ్రభాతంబున మరల సురలెల్లరుం గూడుకొని ౪౨౦

తే॥ "ఈమహాక్షేత్రమునువీడి యిపుడుమనము స్వర్గమున కేగుదో రాక్షసప్రవరులు
లీలఁజనుదెంచి భక్తి నీలింగమునకుఁ బూజచేసి యవధ్యతం బొందఁగలరు,
ఆ॥ కానఁ గోటిసంఖ్యకరుగా మనలోపలి వీరు లిచట నుండితీరవలయుఁ,
దక్కఁగలిగినట్టి దైవతములు నింద్రుఁ డేగి స్వర్గలోక మేలవలయు" ౪౨౨

వ॥ అని యాలోచించి యష్టవసువులును ద్వాదశాదిత్యులును నేకాదశరుద్రులును నశ్వినులును లింగసంరక్షణార్థ మందువసించి తక్కఁగలవార లింద్రసహితంబుగాఁ ద్రిదివంబునకరిగిరి, యి ట్లదితిచేఁ బ్రతిష్ఠింపఁబడి దేహులకు మృత్యువుతేకుండఁజేయు కతంబున నాలింగంబును దక్షేత్రంబును నమరేశ్వరంబునాఁ బ్రఖ్యాతంబులయ్యె, జాబాలిచేఁ గొట్టఁబడియు నాకన్యక సమయమికేఁగల కారణంబిది" యని వక్కాణించుటయు నమ్మహర్షులు ౪౨౩

## — వసురుద్రాదిత్యులపేళ్ళు —

కం॥ "వసురుద్రాదిత్యులయును నసమవయోరూపులైన యశ్వినులయుఁ బే
ళ్ళసదృశవాగ్వైభవయుత! విసువక వేర్వేఱఁ జెప్పవే దయతోడన్" ౪౨౪

వ॥ అని యడుగుటయు సూతుండిట్లనియె, ౪౨౫

తే॥ "త్ర్యంబకాహ్వయుఁడును మృగవ్యాధుఁడును వృషధ్వజుండు నజైకపాత్సంజ్ఞుఁడీశ్వ
రుఁడుఁ గపాలియు మఱి యహిర్బుధ్న్యుఁడుం బినాకి శర్వుండుదహనవృషాకపులని

వ॥ ఏకాదశరుద్రులయు ధరుండు ధ్రువుండు సోముండు మఖుండు ననిలుండు ననలుండుఁ బ్రత్యూషుండుఁ బ్రభాసుండు నని యష్టవసువులయు సూర్యుండు భానుండుఁ దాపనుండు నర్యముండు ధాత భగుండు గభస్తి ధర్మరాజు స్వర్ణరేతుండు దివాకరుండు మిత్రుండు వాసుదేవుండు నని ద్వాదశాదిత్యులయు నాసత్యుండు దస్రుండు నని యశ్వినీదేవతలయు నామంబు, లీముప్పదిముగ్గురు సురనాయకులును దానవవధా

ర్థమై నిత్యంబు నీక్షేత్రంబున నందుందురు, పరమపదంబునభిలషించువిచక్షణు లష్టమీ చతుర్దశీతిథుల రుద్రులం బూజించునది, స్వర్గంబువాంఛించువారు దశమియందును విశేషించి యష్టమియందును వసువులనారాధించునది, సత్వంబుగోరువారు సప్తమియందును షష్ఠియందును దివాకరులసేవించునది, ద్వాదశినాడు దేవవైద్యులైన యశ్వినుల నర్చించునది, దాన నీరోగులగుదు"రని యిట్లు వక్కాణించి మఱియునూతుండు

—— • శుకవ్యాససంవాదము • ——

తే॥ "అట్లు వటికేశ్వరుండను నాఖ్యగలిగి యింకనొక దేవుఁ డచ్చోట నెసఁగుచుండు,
హరుఁడు పుత్రప్రదుండు నాపాపహరుఁడు ధీరవరులార! శౌనకాదిమునులార!

వ॥ శుకుం డరణ్యంబునకుఁజనుటయు హాటకేశ్వరంబునఁ దొల్లి వటిక తపంబుండి వ్యాసునివలనఁ గపింజలుఁడను పుత్రుంగనియుండె" ననిన విని మునులిట్లనిరి,

తే॥ "ఎవ్వరీవటి కాహ్వాయ? యెందుకొఱకుఁదపముజలిపెను? శుకుఁ డేల తల్లిదండ్రి
విడిచి యడవికిఁజనియె? నావెనుక వ్యాసునెనసి వటిక కపింజలు నెట్లుకనియె?"

వ॥ అనియిట్లు ప్రశ్నించుటయు వెండియునూతుండు ౪౮౧

సీ॥ స్వాంతంబులోన నీషన్మాత్రమేనియు నభిలాషములులేని యతివిరాగి
తనోర్ఁరు ల్దూషించుచున్నప్పుడైనను నలుకవహింపని యధికశాంతుఁ
డవయిదియనకుండ నఖిలవిద్యలఁగూడఁ గొనవెళ్ళఁజదివిన కోవిదుండు
ఎదఁదలంచినమాత్రి నెటువంటిపని నేని లీలఁ గావింపఁజాలినమహాత్ముఁ
డట్టి మహనీయతముఁడైన వ్యాసునకును మదిని గార్హస్థ్యమునెపూని మంచిదైన
గతినిసాధింపఁ గోరికగలిగె, వంశ మంతరింప నుపేక్షించు టర్హమగునె, ౪౮౨

వ॥ జాబాలికడకేగి యతనిసుతను వటికయనుదానిఁ బింజలాపదనామధేయ నిమ్మని ప్రార్థించి యొసంగినఁ బరిణయంబై తత్సమేతంబుగానుండ నావిడ గర్భంబు ధరియించెఁ, బండ్రెండువత్సరంబులు గతించినను శిశు వుదయింపక గర్భస్థుఁడయియె విన్నవానినెల్ల హృద్గతంబుచేసి, ౪౮౩

సీ॥ అభ్యసించెను జతురామ్నాయముల శ్రద్ధ సస్వరంబుగ నంగసహితముగను,
మనుయాజ్ఞవల్క్యాది మహనీయకృతములౌ ధర్మశాస్త్రములను దగఁ బఠించె,
స్కాందాదికాష్టాదశమహాపురాణంబు లుపపురాణంబులు నొగి గ్రహించె,
సుజ్ఞానబోధకసూత్రోపనిషదాదిమోక్షశాస్త్రములును గుక్షినిలిపె,
నవ్విధమైనట్టి యుచ్చస్వనమున సలిపె రమణ స్వాధ్యాయపారాయణమును సతముఁ
గడుపులోనన యంతయు నడపెఁగాని యివలకరుదేర నెంచఁ డొకింతయేని,

వ॥ జఠరమాశ్రయించి యతఁ డట్లు వృద్ధిఁజెందిన కొలందిఁ దల్లి యత్యంత బాధితయై యుమ్మలికంబుగుడుచుటయు వ్యాసుండు విచారపడి ౪౮౪

ఆ॥ “ఎవఁడవీవు? నాదునింతిగర్భంబునఁ జొచ్చి బాధపెట్టుచుం గరంబు
నివలకరుగుదేర వెన్నాళ్ళకుం, బిశాచంబువో లెనుంటి సత్యముగను” ౪౮౬
వ॥ అనినవిని గర్భంబిట్లనియె, ౪౮౭

సీ॥ నీచాతినీచపిశాచంబు నేనాదు, జనులఁబీడించు రాక్షసుఁడనాదు,
సేవనీయంబైన దైవతంబును నాదు, నవనిఁ బ్రాపైన మానవుఁడనాదు,
దండికాయముగల దంతావళమునాదు, రయమునఁబాఱు గుఱ్ఱంబునాదుఁ,
గుజనభక్ష్యంబైన కోడిపుంజును నాదు, మిక్కిలిసన్నువైన మేఁకనాదు,
వృధ నెనుబదినాల్గులక్షలయోనులలోనఁ బుట్టి బిట్టుతిరుగునట్టిచెట్ట
నే నెవండననుచు నీతోడఁజెప్పికొందును మునీంద్ర! జ్ఞానధూతతంద్ర! ౪౮౮

ఉ॥ ఇయ్యెడలన్ నరుండనయి యీనరగర్భము నాశ్రయించి యి
ట్లొయ్యన నేను వృద్ధియగుచుంటిని, నావల కేగుదేరఁగా
నియ్యకొనన్ హృదబ్జమున, నెంతయు సంసృతివార్ధి ముక్కలన్
గుయ్యిడు టేకదా యవలకుం జనుదెంచి యొనర్చ్చెదమున్, ౪౮౯

శా॥ అత్రత్యుండనయై నిరంతరము యోగాభ్యాసముం జేయుచున్
శత్రుప్రాయపుసంసృతింబడక మోక్షంబేను సాధింతు, ని
ద్ధాత్రిన్ గర్భములోననుండువఱకే తజ్జ్ఞానవైరాగ్యప్రా
గ్గాత్రజ్ఞప్తులు సర్వజంతువులకుం గల్గున్ నిజంబారయన్, ౪౯౦

ధ్రువకోకిల॥ ఎపుడు గర్భమునుండి యీవల కేగుదెంచునో జీవుఁ డ
ల్లపుడె వానిని విష్ణుమాయ సమావహించెడు, నంతటన్
విపులమై మునుపున్నయట్టి వివేకమంతయు విచ్చిపో
సుపథదూరగుఁడౌచు సంసృతిఁజొచ్చి వందురు నిచ్చలున్,

ఆ॥ కాన నెంతమాత్ర మేనుగర్భమునుండి నిష్క్రమింపఁదలఁప నిశ్చయముగ,
నిటనె యుండి మోక్ష మే గడియించెద క్ష్మాసురాగ్రగణ్య! జనశరణ్య!” ౪౯౨
వ॥ అనియిట్లు పలుకుటయు సాత్యవతేయుండు ౪౯౩

మత్తకోకిల॥ “అవహింపదు విష్ణుమాయ త్వదంగ మింతయుఁ బుత్ర! నిం
దావహంబగు గర్భనారక మందఁ కీవల కేగుదె,
మ్మావలన్ ఘనయోగమూని భవాబ్ధిదాటుదు, వౌదునేఁ
దావకాననదర్శనంబునఁ దల్పితృణవిముక్తుఁడన్” ౪౯౪
వ॥ అనవుడు మరల గర్భంబిట్లనియె, ౪౯౫

ఆ॥ “విష్ణుమాయనన్ను వేస్పృశింపకయుండ నీవు విష్ణుఁ బూటయున్నునావు,
నట్టులిత్తువేని యీవలకరుదెంతు, లేకయున్న నిదియె నాకువసతి” ౪౯౬

వ॥ అనియిట్లు నొడువుటయుఁ బారాశర్యుండు ద్వారక కేగి సమాచారమంతయు జక్రపాణికి నివేదించి తనగృహంబునకుఁ దోడ్కొనివచ్చినఁ దద్వ్యాసుదేవుండు

ఆ॥ "మామకీనమైనమాయ నిన్ స్పృశియింపకుండఁ బూటపడితినో కుమార !
నాదుమాటయందు నమ్మకముంచి యీవలకురమ్ము, ముక్తిబడయఁగలవు" ౪౯౮

వ॥ అని వాక్రుచ్చుటయుఁ గుక్షిస్థుండు తత్క్షణంబ వెలువడి దైత్యారికిని దలిదండ్రులకును జోతవెట్టి వనవాసంబునకుఁ బయనమైన వ్యాసుండిట్లనియె, ౪౯౯

ఆ॥ జాతకర్మముఖరసకలసంస్కారమ్ము లొనరుపంగవలయు ఘనతనీకు
సాయనుంగుగొడుక ! నీయింటనీవుండ కకట ! యడవికేలయరిగెదయ్య" ౫౦౦

వ॥ అనవుడుఁ గుమారుండు ౫౦౧

క॥ వెనుకటి జన్మములందున ననఘా ! సంస్కారశతము లైయున్నవి, యీ
ఘనసంస్కారంబులెకా నను సంసారార్ణవమ్మునకు నీడ్చ నలల్, ౫౦౨

వ॥ అనిన విని శ్రీకృష్ణుండిట్లనియె, ౫౦౩

కం॥ "శుకమువలెనీభవత్సుతుఁ డకలంకుఁడు పలుకుచుండె, నాహేతువునన్
శుకుఁడను పేరఁ బరంగెడునిఁక జగతిని యోగవిద్య నెంతయుఁగృతియై, ౫౦౪

ఉ॥ ఈతఁడు మోహమాయల జయించినవాఁడు, స్వగేహమందు సం
ప్రీతివసింపఁ, డట్లగుటఁ బృథ్వ్యమరేంద్ర ! యథేచ్ఛ నేగుఁగా,
కీతనిపుట్టువున్ గుఱిచి యెంతయుఁ బ్రేమమునుంపఁబోకు, నీ
పైతృకమైన యాబుణము పాసె సుతాస్యముఁ జూచుమాత్రనే" ౫౦౫

వ॥ అని యిట్లు చెప్పి హృషీకేశుండు వెడలిపోవుటయుఁ బుత్రుంగాంచి వ్యాసుండు ౫౦౬

శా॥ "గార్హస్థ్యంబుననుండకున్నఁ బితృవాక్యంబుం బ్రపోషింపరా,
దర్హంబైనతదుక్తి చేయక యెవం డజ్ఞానసంయుక్తతన్
గర్హించుంగడు వాఁడు దుర్గతిఁబడుం గాఁబట్టి యోపట్టి ! నీ
దుర్హేత్వాఘము గట్టిపెట్టి చనకెందున్ మామకీనాజ్ఞచే" ౫౦౭

వ॥ అనుటయు శుకుండిట్లనియె, ౫౦౮

ఉ॥ "ఎట్లిపు డేను నీకు జనియించినవాఁడనో యోగిచంద్ర ! నా
కట్లుజనించియుండితివి యన్యభవంబుననీవు, నీకున
ప్పట్లను నేనుగూడఁ బితృపాదుఁడ, నీనుడినాకుఁగార్యమై
నట్లుఁ మదుక్తి నీకును సమాచరణీయము ధర్మమైనచోన్, ౫౦౯

కం॥ కానఁ దపోవనమునకుఁ బ్రయాణం బొనరించు నాకు నడ్డము చెప్పం
గా నీవు ప్రయత్నింపకు మౌనీశ! సదావిరచ్యమాణసుకోశా!" ౫౧౦

వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు వెండియు వ్యాసుండు ౫౧౧

కం॥ "ప్రశ్నము లెన్నియొ యొనరిచి యున్నను బ్రాహ్మణుని యింట నుదయించు నరుం,
డున్నతి నట శ్రుతిసంస్కారియలన్నియు జరుపుకొని ముక్తి నందును గానన్" ౫౧౨

వ॥ అనినవిని శుకుండు మఱియు నిట్లనియె, ౫౧౩

ఆ॥ "జ్ఞాని గాక యుత్తసంస్కారములతోనె పూరుషుండు ముక్తి పొందునెడల
వ్రతముఁ బూనినట్టి షాపండజనమెల్ల ముక్తినొంది బిట్టు మురియఁగలదు" ౫౧౪

వ॥ నావుడు వ్యాసుండు ౫౧౫

సీ॥ "ఉపనీతుఁడై విప్రుఁ డుచ్చైస్స్వనంబుతో స్వాధ్యాయపాఠంబు జరుపవలయు,
నటుమీఁదటను గృహస్థాశ్రమమ్ముం బూని దయతోడ నతిథులం దనుపవలయు,
నంత వానప్రస్థుఁడై ఘోరతపముండి యణిమాదిసిద్ధుల నందవలయుఁ,
బదపడి ముండియై బ్రహ్మవస్తు వెఱింగి జనులకు సద్బోధ సలుపవలయు,
నిట్లు క్రమక్రమముగ నెల్లయాశ్రమముల ధర్మములనుగూడఁ దప్పకుండ
నడపఁగలిగినట్టి నరుఁడె మోక్షంబును బొందుఁగాని యొరులు పొందఁగలరె"

వ॥ అనుటయు మఱియు శుకుండిట్లనియె, ౫౧౬

సీ॥ బ్రహ్మచర్యమున నిర్వాణంబు గలుగుచో నలి నపుంసకులకుం గలుగవలయు,
నలగృహస్థుఁడు ముక్తుఁడగుచో జగంబెల్ల భవబంధమున వీడఁబడఁగవలయు,
వనవర్తులకు నపవర్గంబు దొరకుచో దుష్టసత్వములకు దొరకవలయు,
సన్న్యాసులకు మోక్షసామ్రాజ్యమబ్బుచో నతిదరిద్రులకును నబ్బవలయుఁ,
గాన బ్రహ్మచర్యగార్హస్థ్యవనవాససన్న్యసనము లెట్లు సాధకంబు
లగును మోక్షమునకు నవనీసురశ్రేష్ఠ! నిజయశోధవళితనిఖలకాష్ఠ! ౫౧౭

వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు మరలఁ బారాశర్యుండు ౫౧౮

కం॥ "రెండవయాశ్రమమందున నుండుచు సత్సరణి నరుగు నుర్వీప్రజకున్
దండిగ నియ్యిహపరములు రెండును గీర్తించె మనువు సృష్ట్యాది సుతా!"

వ॥ అని పలుకుటయు శుకుండు వెండియు నిట్లనియె. ౫౨౧

కం॥ "గృహకారాగారంబున బహుబాంధవబంధనముల బద్ధంబగుచున్
సహమోహరాగమగు ప్రజ కహహా! సత్సరణి నరుగ నగునో కో యరయన్ ౫౨౨

వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు సాత్యవతేయుండు వెండియు ౫౨౩

ఉ॥ "కష్టము సార్వకాలమును గానభూములనున్కి పుత్రకా!
కష్టమె కాక దేవపితృకర్మము లెవ్వియు సాఁగనేర, వీ
నష్టికిఁ గుందు కంటె సదనంబుననుండి సుఖంబు గానె యా
త్మేష్టము చింతచేసికొను టెంతయు మంచిపథంబు గాదొకో" ౫౨౪
వ॥ అనినవిని శుకుండిట్లనియె, ౫౨౫

ఉ॥ "భావమునం బరాత్పరుని భావన సేయుచునుండునట్టి స
ద్భావులకుఁ సకాలమునఁ బ్రాప్తములౌను దపఃఫలంబు, లే
భావనలేక గేహమునవర్తిలువారికి సజ్జనాననం
బేవడిఁ గానఁగాఁబడ దిదే యనుభావ్యఫలంబు వారికిన్" ౫౨౬
వ॥ నావుడు వ్యాసుండు ౫౨౭

ఆ॥ "తనదు నింటిలోనఁ దానుండుచునుసదా ధనముఁ గూడఁబెట్టి దయ దరిద్ర
తతికి నింత పెట్టి తానింత తినియెడి గృహియె సుఖముఁ గాంచు నిహపరముల, ౫౨౮
వ॥ అనుటయు శుకుండు మఱియు నిట్లనియె, ౫౨౯

తే॥ "దైవవశమునఁ జేసి చంద్రమునివలనఁ దాపముజనించు, వీతిహోత్రంబువలనఁ
గలుగు శీతము, ధనపరిగ్రహమువలన సౌఖ్యమును లేకపోవు నోసంయమీంద్ర"
వ॥ అనినవిని పారాశర్యుండు వెండియు ౫౩౦

కం॥ "బలుపుణ్యంబులచేతనె యిల దుర్లభమైనయట్టి యీనరదేహం
బొలయు, నదిగలుగు పై నెది గలుగకయుండును గృహస్థు గాఁగల్గినచో
వ॥ అనివచించుటయు మఱియు శుకదేవుండిట్లనియె, ౫౩౩

తే॥ "జనుఁడు జనియించినప్పుడు జ్ఞానయుక్తుఁడగుచునున్నను గృహమేధియైన వెన్క
దారపుత్రాదులం గూడి తానుబడు నవస్థఁ గనుగొన నయ్యది వాసిపోవు" ౫౩౪
వ॥ మఱియుఁ బరాశరసూనుండు ౫౩౫

ఉ॥ బూడిదలోపలంబడి ప్రమోదమునం బొరలాడునట్టి యా
గాడిదపిల్లకోమలత గన్గొనువారికె ప్రీతిపుట్టఁగా
బూడిదబుస్సనాకృతిని బొల్చుచు నాడుచుఁ బాడుచున్ సదా
కూడఁజరించునర్భకుని క్రొన్నుడి బిట్టుముదంబు గూర్పదే" ౫౩౬
వ॥ అనవుడు శుకుండు మఱియు నిట్లనియె ౫౩౭

కం॥ "దుమ్మునఁబడి పొరలాడుచుఁ గమ్మగఁ బొక్కుచు నశుద్ధికరుఁడగు బాలున్
రమ్మని యెద్దకుఁ జేర్చి ముదమ్మునఁబడువాఁడు మూర్ఖతముఁడనవలదే"
వ॥ నావుడు సాత్యవతేయుండు ౫౩౮

క॥ "పున్నామంబగునరకం బున్నది యమపట్టణమున నొక్కటిభయదం,
బన్నరకంబునఁ గూలు సమున్నతిఁజెడి పుత్రహీనుఁ డో తనుజాతా!" ౫౪౦
వ॥ అనివచించుటయును శుకుండు వెండియు నిట్లనియె; ౫౪౧
తే॥ "పుత్రువలననె స్వర్గంబుపొందు నెడల శునకములు శలభంబులు సూకరములు
నన్నియుం బొందవలయు సంయమివరేణ్య! యింక మానుష్యనుండేమి హెచ్చుగలదు
వ॥ అనినవిని వ్యాసుండు వెండియు ౫౪౩
క॥ పుత్రుఁడు పితరులఋణమను పౌత్రుఁడు వేలుపుల ఋణము ప్రభవించు నహో
రాత్రులనె తీరిచెదరు ప్రపౌత్రుఁడు స్వర్లోకమునకుఁ బంపును మనుజున్
వ॥ అని వక్కాణించుడు శుకుండు వెండియు నిట్లనియె, ౫౪౫
ఆ॥ గద్దగూడఁ జాలకాలంబుజీవించుఁ, బిల్లలను మఱెన్ని పెట్టిపెంచు,
నదియుఁ దాను మోక్షమార్జింపఁగలదొకో యబ్ధిమేఖలామరాగ్రగణ్య! ౫౪౬
వ॥ అనివాక్రుచ్చి వనమ్మునకుఁ జనుటయును ౫౪౭

— • వ్యాసునకు వటికయందుఁ గపింజలుఁడుపుట్టుట • —

ఆ॥ ఇట్లు తనతనూజుఁ డింటిపై నిస్పృహుండగుటయెఱిఁగి పింజలాభిధాన
కనులనిండ నీరుగమ్మ నేడ్చుచు వ్యాసఋషివరేణ్యుతోడ నిట్టులనియె ౫౪౮
క॥ "పుత్రునిబడయుటకై నే గాత్రముశోషింపఁజేసి కావింతుఁదపం,
బాత్రిణయను మెప్పింతు, ధరిత్రీసురవర! యనుజ్ఞ కృపసేయఁగదే" ౫౪౯
వ॥ అని తననిశ్చయంబుఁజెప్పి తదనుజ్ఞవడసి హాటకేశ్వరంబునకరుగుదెంచి శంకరుం బ్రతిష్ఠించి తదగ్రంబున నిర్మలోదకంబును విస్తీర్ణంబును నైన యొకవాపిం ద్రవ్వించి తపంబుండి భగవంతుండగు త్రిపురాంతకుండు సంతుష్టుండై వరంబడుగుమన ౫౫౦
తే॥ "జననముద్ధరించు సౌశీల్యమును నస్మదీయహృదయహృద్విధేయతయును
గలిగి లలిఁజెలంగఁగలిగిన సుకుమారు నొకకుమారు నొసఁగు మోగిరీశ'! ౫౫౧
వ॥ అని యిట్లు ప్రార్థించుటయును శంకరుండు ౫౫౨
మ॥ 'కలుగున్ నీకు నభీష్టుఁడైన సుతుఁడో కల్యాణి! వేఱొక్కటో
య్యలియైనం బ్రతిశుక్లపంచమిని నొక్కబ్దంబు త్వన్నిర్మితో
జ్జ్వలవాపీసలిలాభిషిక్తయయి యుష్మత్స్థాపితాస్మద్విని
ర్మలలింగార్చన సేసెనేనియు సుపుత్రప్రాప్తియౌ రూఢిగన్' ౫౫౩
వ॥ అని యంతర్థానంబుఁజెంద వ్యాసునివలనఁ బింజల కపింజలుంగనియె, నతండు హాటకేశ్వరంబునఁ గేలీశ్వరుం బ్రతిష్ఠించి యారాధించె'' ననిన విని ఋషులిట్లనిరి,

## —త్రిపురాసురసంహారము—

కం॥ "కేళీశ్వరీప్రభావం బోలిం దజ్జనన మేటికుదయించెనొ యే
కాలమునందో యిదంతయు నాలింపఁ దలంపుగలిగె ననఘా! మాకున్, ౫౫౫
కం॥ శ్రీమాతయుఁ గాత్యాయనిచాముండులయుం జరిత్ర శ్రవణించితి, వి
వే మాకుఁ జెప్పియుంటివి, యీమాతచరిత్రగూడ నెఱిఁగింపు దయన్, ౫౫౬
ఆ॥ నమనమాదియైన నానావిధోపచారములచేతఁ దన్ను రహిఁ భజింప
నేమిఫలమొసంగు నీదేవతేశి? కేళీశ్వరాభిధాన మేలవచ్చె?" ౫౫౭

వ॥ అనియడిగిన సూతుండిట్లనియె, ౫౫౮

మ॥ "ఒకటే దేవత దేవదైత్యనివహం బోమన్ వధింపన్ ధరన్
బ్రకటించున్ బహురూపముల్, త్రిదశు లెప్పట్లన్ వ్యధోపేతులై
సుకముం బాయుచునుండఁగాఁ గలరొ యచ్చో నప్పరాశక్తి శాం
చక లోకత్రయ మాక్రమించి యొకచో సంజాతయౌచుండెడిన్, ౫౫౯

వ॥ మహిషాసురవధార్థమై కాత్యాయనీరూపంబునను శుంభనిశుంభులంబరి
మార్పఁ జాముండారూపంబునను గాలయవనుఁబోకార్ప శ్రీమాతృరూపంబునను నంధ
కాసురుసమయింపఁ గేళీశ్వరీరూపంబునను నవతీర్ణయయ్యె" ననిన మునీశ్వరులు ౫౬౦
తే॥ "అంధకాసురుఁ డెవ్వనియాత్మజుండు? కింప్రభావుం? డెటులవ్వాఁడు కీర్తిశేషుఁ
డైనవాఁ? డెందుకొఱకుఁగా నంబ వానిఁ బిలుకుమార్చెను? సకలంబుఁ దెలుపు

వ॥ అనియడుగుటయు సూతుండిట్లనియె, ౫౬౨ (మయ్యె'' ౫౬౧
ఆ॥ "దక్షుబిడ్డ దితికిఁ దనయుఁడై జన్మించి యలహిరణ్యకశిపు వనుసురారి
యిందు్రిఁదొట్టిసురల నెల్లరనోడించి స్వయమయేలియుండె స్వర్గమతఁడు, ౫౬౩

వ॥ తద్వధార్థ మమరులు వర్మచర్మయుతంబులగు నతిముఖ్యానేకశస్త్రింబుల
నిర్మించియుఁ జంపఁజాలమిని విష్ణుండు దొడలపైనిడుకొని గోళ్ళచేఁ జీల్చివైచె, వాని
కిరువురు కొమరులు, జ్యేష్ఠుండు ప్రహ్లాదుండు, కనిష్ఠుఁ డంధకుండు, హిరణ్యకశిపువు
మృత్యువువాతఁబడినపిదప నమాత్యులు ప్రహ్లాదుంగూర్చి వినయోపేతులై ౫౬౪
కం॥ "పితృపైతామహమగు నీవితతాఖిలరాజ్యభరము వేడుకమైను
న్నతభుజపీఠి వహించుచుఁ గ్రతుభుజులజయింపుమయ్య కదనములోనన్" ౫౬౫

వ॥ అనుటయుఁ బ్రహ్లాదుండిట్లనియె, ౫౬౬
ఉ॥ "చేయనురాజ్యమేను నరసింహునిసాక్షిగ నెంతమాత్రమున్,
జేయమికుండు హేతువును జెప్పెద శ్రద్ధమెయిన్ వినుండు, దై

తేయులడైనరాజ్యమున దేవత లాళను బెట్టికోరుతా,
మాయసురారులందఱికి నంబుజనాభుఁడు రక్షకుండుతాన్, ౫౬౮

తే॥ విడుతుఁ బ్రాణంబులైనను, విడుచువాఁడ నింటనుండిన సర్వస్వమేని గాని
భక్తి నర్చించి కేల్మోడ్చఁబడిన చక్రితోడ సంగరమొనరింప నోడువాఁడ" ౫౬౯

వ॥ అని వక్కాణించుటయు మంత్రు లన్యోన్య మాలోచించి రెండవపుత్రు రాజ్యంబున స్థాపింప వాఁడు రాజ్య మమాత్యులపైనుంచి పితామహు ధ్యానించుచు

సీ॥ పండి శైర్యాఁకుల నుండిరాలిన పండ్ల విరచితాహారుఁడై వేయియేండ్లు
అగ్గలంబుగ జీర్ణమైన పర్ణములనె విసువక మెసవుచు వేయియేండ్లు
కడుశిథిఁ బలుపరు ల్వాడియఁబోసినయట్టి తోయంబు ద్రావుచు వేయియేండ్లు
యాదృచ్ఛికంబుగా నగ్రభాగముఁజేరు వాయువుంబీల్చుచు వేయియేండ్లు
తపముఁజేయఁజేయఁ దచ్చతుర్వర్ష సహస్రముల కుఁజివర నంతరంగ
మతిదయాసమేతమగుటయు సంప్రీతి హంసవాహుఁడచటి కరుగుదెంచి ౫౭౦

వ॥ "నీతపంబునకు మెచ్చి వరమీయవచ్చితి నడుగు" మని యతండు జరామరణంబులు లేకుండ ననుగ్రహింపుమనుటయు, ౫౭౧

ఉ॥ "ఉండునె యొక్కఁడేనియును నుర్వి జరామరణోజ్ఝితుండు? జా
తుండగువానికెల్ల నవి తో నరుదెంచెడి, నైననేమి, ధ
న్యుండవు, నీకు నీఁదగని దుండదు, కావున నిచ్చివాఁడఁ, బ్రీ
తుండవుకమ్ము, లెమ్ము, పరితుష్టిగ రాజ్యముఁజేయు, పొమ్మఁకన్" ౫౭౨

వ॥ అనిపలికి యంతర్ధానంబుఁజెందుటయుఁ గొంత కాలంబున కంధరుండు,

ఉ॥ "మాజనకుం బితృవ్యుఁ బరిమార్చిరి వేల్పులు మాయఁబన్నితా,
మీజగజెట్టులం గపటమే యొనరింపకయున్న చో సురల్
తేజముచేత నాలమునఁ దీర్పఁగఁజాలరు, కాన నట్టి దు
ర్బీజులఁ బట్టి యందఱిఁ బీఁచమడంచెద, సంహరించెదన్, ౫౭౪

ఉ॥ స్తవ్యములైనకార్యముల సల్పి స్వకీయకులాన కంతకున్
నవ్యయశంబు తేకమను నందనుఁ డాలయసన్నిధాన వా
స్తవ్యమహాధ్వజంబువలె ధారుణి నెంతయు నిప్పు రోజకుం,
డావ్యవహారశూన్యుఁగను నయ్యును భాగ్యవిహీనుఁ డారయన్" ౫౭౫

వ॥ అనినవిని మంత్రిసత్తములు ౫౭౬

శా॥ "యుక్తంబియ్యది దానవేంద్ర! మన కెంతో వైరు లవ్వారు, దో
శ్శక్తిం బట్టి వధింత మందఱిని, యుష్మత్పాల్యమా స్వర్గ మా

సద్భక్తిం బాలనసేయు వీరెవరు, యజ్ఞంబందుం బూజించి త్వ
ద్భోక్తవ్యంబును వీరికిచ్చుటకు నా భూదేవు లెవ్వారిలన్, ౫౭౭
కం॥ లోకంబులెల్ల బలిమిని గైకొని సంరక్షణంబు గావింతము, త
న్నాకిస్వీక్రియమాణములౌ క్రతుభాగంబులెల్ల హరియింత మికన్'' ౫౭౮
వ॥ అని సమయంబొనరించి శత్రునిపై దాడివెడలుటయు నతండును సకలా
మరులతో నెదురునడచి మహాభయంకరంబగు వజ్రంబు నంధకునుద్దేశించి విడువ నా
దనుజోత్తముండు దానిచేం గొట్టంబడి హాసంబొనర్చుచు ౫౭౯
కం॥ చూచితి బహుకాలమునకు నీచేతులదైనలావు నేను మహేంద్రా!
నాచేతిలావదెట్టిదొ చూచెదుగా కరుగుదెమ్ము చూపింతు నికన్,, ౫౮౦
వ॥ అనిపలికి ౫౮౧
సీ॥ గణగణమనిమ్రోయు గంటలేయొకనూఱు చుట్టును శెలువారునట్టియదియు
విశ్వకర్మయె తాను విశ్వప్రయత్నంబులొనరించి నిర్మించి యొసంగినదియు
యమజిహ్వచాడ్పున నత్యంతభయదమై గుండె జల్లనంజేయుచుండునదియు
నూఱ్వెట్టికొలిచిన నూఱుమూరలకును దరుంగనిపొడవునం దనరునదియు
పలురకాలయినుముకలిపి విస్పష్టమై యెత్తనలవిగాక యొసంగునదియు
నైన గదనువైవనద్దానితాంకుచే నష్టమూర్ఛనొంది యమరవిభుండు ౫౮౨
వ॥ జెండాకట్టియం బట్టుకొని గజమూర్ధంబున నొరగుటయు మహాసేనుండు
శక్తినివిడువ దానవుండు గ్రమ్మఱించె, నంత నా షడాననుండు విల్లందుకొని హస్త
లాఘవంబు గనంబఱచుచు ననేకబాణంబు లవ్వానిపై నేయంబ్రారంభించుచు నఖిలా
మరులు నదియె సందుచేసికొని బాణవర్షంబున దానవానీకిని గప్పివైచిరి, పదపడి
రాక్షసులెల్లరును దేవతాసైన్యంబునంబడి ప్రహారంబులం బీడవెట్ట వారు పరువెత్తిరి,
తాదృగ్భంగపాటునొందిన సురల విలోకించి వృషవాహనుండు సగణుండైవచ్చి
భయపడకుండని యాశ్వాసించి యాథర్వణమంత్రంబులం బరాశక్తి నాహ్వానించి సహా
ద్భవతంబుగా సాష్టాంగపడి స్తుతించుటయు దేవి యిట్లనియె, ౫౮౩
తే॥ "నను నథర్వణమంత్రంబులను బఠించి యేలయాహ్వానమొనరించి తిందుమౌళి!
చెప్ప మేంజేయవలసిన చేతయున్న నిపుడె యద్దాని నెఱవేర్చి యేగుదాన'' ౫౮౪
వ॥ అనియిట్లు వక్కాణించుటయు మహేశ్వరుండు, ౫౮౫
శా॥ "ఈ యింద్రాదిసమస్తదేవతల దైత్యేశానుండౌ నంధకుం
డాయుశ్శేషులంజేసి వెళ్లనడంచెన్ హా స్వర్గమందుండి, యా

న్యాయాపేతుని సంహరింపఁ జనుచున్నాఁడన్ శుచీ! కావునన్
సాయంబీవుపొనర్పఁ గావలయుఁ దత్సంగ్రామరంగంబునన్, ౫౮౬

కం॥ కేళీమయంబవగుచును వేలకుమించినటువంటి వికృతాకృతులన్
దాలిచి వైశ్వానరమున హేలం బ్రభవించియుంటివీ వటుగానన్, ౫౮౭

కం॥ కేళీశ్వరియనఁబరఁగుచు హోళిఁ జతుర్దశిని మఱియు నష్టమి నీదృ
గ్లీలాన్విత నినుఁగొలిచెడి త్రైలోక్యస్థితుల కిమ్ము తదభీష్టంబుల్'' ౫౮౮

వ॥ అని వక్కాణించుటయు నా కేళీశ్వరి, ౫౮౯

సీ॥ శ్రవణించుమాత్రాన జనులు దిగ్భ్రమఁజెంది భువిమీఁదఁబడిపోవ బొబ్బలిడుచు
వీక్షించుమాత్రాన వెఱపుఁజెంది భటాళి వెనుకకేగ నొడళ్ళు వంచికొనుచు
సమరమన్ మాత్రాన శస్త్రాస్త్రములఁబట్టి బ్రహ్మర్షిముఖారులపైని బడుచు
వనిఁజొచ్చుమాత్రాన నత్యంతమును బొంగి విఱిచి తల లొక్కటఁ బెట్టుకొనుచు
మాతృగణములు తన కతిమాత్రముగను సాయమొనరింప నీశాన సైన్యములకు
నగ్రభాగంబునంజేరి యాహవంబు జరుపఁదలపడుటయు దైత్యసముదయములు ౫౯౦

వ॥ హసించువారును భర్త్సించువారును స్త్రీబలంబను లజ్జచేఁ గొట్టనుంకింపక పౌరుషంబున నిలుచువారును నై యుండునెడ నారదుం డంధకుసకాశంబునకుం జని

తే॥ "యుద్ధమొనరింప సిద్ధమైయున్నవీరు స్త్రీలుకా రంధకాసుర! స్త్రీజనౌఘ
సహితరై చక్రిచిహ్నితళయముతోడనున్న కేళీశ్వరీనామ్ని యొక్క కృత్య, ౫౯౧

కం॥ హరుఁడు తనమేనికండలు కఱకఱను నితఱిగి నిప్పుకల వ్రేలిచి యీ
పరమేశ్వరిఁ బుట్టించెను, దురమొనరుచు నతఁడు నాపె తోడుగ నీతోన్, ౫౯౩

తే॥ మంత్రబలమున స్త్రీజనమహితముగను వహ్నికుండంబునను సింహవాహయగుచు
జననమందిన యాపెతో సహితుఁడయియె యుగ్రుఁ డుగ్రాకృతిని వచ్చుచున్నవాఁడు,

శా॥ "మీమీయిండ్లవసింపుఁడీ కరితుభుజుల్! మీరంచు దైత్యారులన్
శ్లేమోపేతులుగాఁగనుంచి వెస నీజీవంబులం దీయనా
కామధ్వంసి విరించిముందఱఁ బ్రతిజ్ఞంబట్టెఁ గాఁబట్టి నీ
వేమాలోచనచేతొ చేసి తగుచెద్దియుంజేయు మోహాంధకా!'' ౫౯౪

వ॥ అనివారుపిచ్చుటయు నంధకుండిట్లనియె, ౫౯౬

క॥ "రుద్రునకును జడియను, దద్రుద్రునితాతకును జడియ రూఢిగనే, నీ
క్షుద్రలగు స్త్రీలతోడ నసద్రీతిగ నాచరింప సంగ్రామంబున్'' ౫౯౭

వ॥ అనియిట్లు వక్కాణించుటయే తడవుగా శక్తిమంతులై యుద్ధమొనరించుచును మాతృగణంబులచే సాయుధంబుగను సవాహనంబుగను నర్ధభక్షితులై కొంద

లును బూర్ణభక్షితులై కొందఱును వధింపఁబడి కొందఱును మహాక్రందనం బొనరింప విని యంధకుండు క్రోధమూర్ఛితుండై ఖడ్గంబు కేలనందుకొని పరువెత్తి విధ్వస్తులను భక్ష్యమాణులను బలాయనపరాయణులను నిహతుల నికటంబునంబడి ప్రలపించు తత్ప్రియభార్యలను సమరోద్యతలగు యోగినులను వీక్షించి యదలించినను వార లెంతమాత్రము భయపడక దానవులం బట్టి సంహరించుచును భక్షించుచును బ్రవర్తించుటయు నతండు తనశరీరంబు దాఁ గాపాడుకొనుచుఁ బెద్ద బొబ్బవెట్టి తమోస్త్రంబుం బ్రయోగింప ముల్లోకంబులును నంధకారబంధురంబులయ్యె, నట్టిది మిట్టని కాని యిది పల్లని కాని తాఁదప్ప నితరుఁ డొకించుకయుఁ దెలిసికొనఁజాలక పరితపించుచు నయ్యోగినులఁ దీక్ష్ణశరంబులం బరిహరించియుఁ దాదృగ్రూపలగు తరుణులు పదిరెట్లు ప్రభవించుటం దిలకించి యస్త్ర ముపసంహరించి శుక్రాచార్యుపాలికింజని

ఉ॥ "యోగిను లేచి యెప్పగిది యుద్ధమొనర్చుచునున్నవారో యీ
భాగమునం గనుంగొనుము భార్గవ ! మంత్రబలంబు పేర్మి నీ
స్త్రీగణ మస్మదస్త్రములచేత నవధ్య, మెటో వధించినన్
వేగజనించి క్రిమ్మఱి ననిం దెగటార్చెడి మద్బలంబులన్, ౫౯౯

కం॥ కావున వెసఁ దద్విద్యను నీవును సాధింపవలయు నే శ్రీయుతుఁడన్
గావలెనని నీకుండిన నీవిధ మొనరింపు మార్య ! హితమతివగుచున్ " ౬౦౦

వ॥ అని ప్రార్థించుటయు శుక్రుండు సిద్ధిప్రదాయకమ్మగు హాటకేశ్వరక్షేత్రమ్మునకుం జని త్రికోణకుండంబును నిర్మించి విధ్యుక్తంబుగా వీతిహోత్రంబున స్వమాంసంబు వేల్చిన రుద్రునకుం బోలెఁ గేళీశ్వరి సంతుష్టయై వచ్చి ౬౦౧

తే॥ "మాంసముంగోసి కృష్ణవర్త్మంబునందు వేల్చితి వకో భార్గవశ్రేష్ఠ ! వితగనీవు,
ప్రమథపతిచేత భావింపఁబడినదాన, జేయవలసిన దెదో నీకుఁ జెప్పుమద్ది " ౬౦౨

వ॥ అనియడిగిన శుక్రుండిట్లనియె, ౬౦౩

ఆ॥ 'త్రిణయనునకుఁబోలె దేవి ! యంధకునకు నొగిని సాయపడుచు నుండవలయు,
మాతృగణముతిన్న మనుజాళినులఁ గ్రన్న మరల నెట్టులేని మనుపవలయు' ౬౦౪

వ॥ అనియిట్లు వాంఛించుటయుఁ గేళీశ్వరి ౬౦౫

ఆ॥ 'మాతృగణముతిన్న మనుజాళినులఁదొట్టి సమరనిహత సర్వసైన్యములును
బ్రతుకఁగలవు శుక్ర ! మృతవతీవిద్యామహత్త్వమునను, శాంతినందు మింక' ౬౦౬

వ॥ అనిచెప్పి మృతుల బ్రతికింపఁజేసెడి యావిద్య నుపదేశించుటయు శుక్రుండు ప్రహృష్టాంతరంగుండై యంధకుపాలికేఁగి, ౬౦౭

తే॥ "శంభునకుఁబోలె నాకుఁ బ్రసన్నయగుచు నొసఁగెఁ గేళీశ్వరీదేవి యొక్కవిద్య,
తన్మహత్త్వను హేతులైన దైత్యవరుల నెల్లరను బ్రతికించెద నింకఁజూడు, ౬౦౮

ఉత్సాహము॥ పరమశక్తియగుచు జగముఁ బర్వియుండు నీపయి
నరసి భక్తినిలుపుచుండు మష్టమిం జతుర్దశిన్,
సురవిరోధి! భక్తిచేత సులభసాధ్యగాని నీ
జరుపుదండనమున కాపె సాధ్యగా దెఱుంగుమా" ౬౦౯

వ॥ అని బోధించుటయుఁ దద్దానవేంద్రుండు భావభక్తి సమన్వితుండై యాదేవిని మాతృకల నందఱిని యథాజ్యేష్ఠంబుగం బూజించి నానావిధస్తోత్రంబుల స్తుతించి,

కం॥ "అజ్ఞానంబున నీతోఁ బ్రజ్ఞలు భాషించి కోపపడితిని, ద్రిజగ
ద్రాక్షీ! క్షమియింపుము నావిజ్ఞప్తం బాలకింపి, వినతుఁడనయితిన్" ౬౧౧

వ॥ అని యభ్యర్థించిన దేవి యిట్లనియె, ౬౧౨

కం॥ "ఉశనఃప్రభావమున నను వశురాలనుజేసికొంటి వత్స! యగును నీ
వు శుభంబు, కాదు నాదుదరిశనము వ్యర్థముగ, నడుగు ప్రీతి వరంబున్" ౬౧౩

వ॥ అనవిని యంధకుండు, ౬౧౪

మత్తకోకిల॥ "ఈసురూపముతోడి నీదగు నిద్ధవిగ్రహ మెంతయున్
భాసురస్థలమందుఁజేరిచి భక్తిఁ బూజయొనర్చు నా
ధీసమేతుల వాంఛితంబులఁ దీర్చి ప్రోచుచునుండినన్
నీ సుకీర్తి జగంబునందున నిల్చియుండెడి నిచ్చలున్" ౬౧౫

వ॥ అనవుడు వెండియు దేవియిట్లనియె, ౬౧౬

ఉత్సాహము॥ ఎవఁడు నా కిదేసురూప మేరుపఱచి యొక్క స
ద్భవనమునఁ బ్రతిష్ఠఁజేయు భాగ్యమును గడించునో
భవవిముక్తియుం ద్రివిష్టపంబుఁ బ్రాజ్యరాజ్యమున్
దివిజవైరి! వానికేను దృప్తిమై నొసంగుదున్" ౬౧౭

వ॥ అనియిట్లువాక్రుచ్చి యాదేవి మాతృగణంబులతోడం గూడి యంధకుండు చూచుచుండ నంతర్ధానంబుఁజెందుటయు శుక్రుండు సిద్ధించిన యావిద్యచే మృతులగు రాక్షసులనందఱను బ్రతికించె, వారిం గూడుకొని దానవేంద్రుండు ప్రహృష్టాంతరంగంబున సురపురంబుం బ్రవేశించి నిత్యంబును విశేషించి యష్టమీచతుర్దశులను దద్దేవిని ధ్యానించుచును బూజించుచును నింద్రవైభవం బనుభవించె, నంతఁ దత్పవిత్రభావంబువిని వ్యాసపుత్రుఁడగు కపింజలుండీస్థానంబునఁ గేళీశ్వరిం బ్రతిష్ఠించి పరమసిద్ధిం బడసెఁ, బరమేశ్వరియగు కేళీశ్వరీదేవి యీవిధంబున నేర్పడినది, కావున స్థాప్యయు ధ్యేయయుఁ బూజ్యయు నయ్యెడి ౬౧౮

ఆ॥ అంధకుఁడును దనదు నాచార్యుఁడిడినట్టి పృతవతీసమాఖ్య మేటివిద్యఁ
గీర్తనీయమైన కేశీశ్వరీకృపాబలము నలుకయుడు నవధ్యతయును ౯౯

వ॥ చూచుకొని మహేశ్వరుపై ద్వేషించి దూతంబిలిచి ౬౦

కం॥ "చను కైలాసంబునకుం, జని శంకరువంకఁదిరిగి చక్కఁగ నేఁజె
ప్పిన సందేశంబంతయు వినిచి మరలిరమ్ము పొమ్ము వేగమ దూతా ! ౬౧

ఉ॥ ఇందునిని జంకఁబెట్టుకొని యేమెం యొనర్పఁగఁజూచుచుంటి, వా
యిందునిని విడ్చి పెట్టిన యథేచ్ఛ వసింతువునీవు, లేనిచో
నింద్రుని నిన్ను నీదుసతి నీవువసించు గిరిన్ గణంబులన్
సాంద్రమదీయబాణహతి నాశమెంనర్తుఁ బ్రమాణపూర్తిగన్" ౬౨

వ॥ అనియిట్లు వక్కాణించుటయు నాదూత ద్రుతంబుగం బోయి యప్పురుష
వచనంబుల వినిపింప వృషభధ్వజుండు కుపితుండై ౬౩

సీ॥ దక్షయజ్ఞవినాశనక్షముఁడగుచుఁ దా వినుతికెక్కినయట్టి వీరభద్రు
గణములలో నగ్రగణనీయుఁడై చాల ఖ్యాతిగాంచిన మహాకాలసంజ్ఞు
వాహనాకృతిఁ దన్ను వదలక యేప్రొద్దు నమసేవరుఁడైన నందికేశు
బ్రహ్మాదిసురలకుం బ్రథమపూజ్యుండౌచు సిద్ధులనొడఁగూర్చు సింధువదను
ఘోరనాదు మహాబలు ఘోరకంఠు నయ్యఘోరు నొక్కొక్కరుఁ దనుచరులను
గోటికోటిగఁ గైకొని కుమతియైన యంధకాసురుఁ జంపిరా ననుపుటయును ౬౪

వ॥ తద్గణంబులు బలవంతుఁడగు నా దానవునిచే నాసాదింపఁబడిన యింద్రపురికి
ధృతాయుధులై యరిగిన దానవులును ధృతాయుధులై కదనంబున కెదురునడచి, రంత
గణంబులు దైతేయులతో రౌద్రంబుగం బోరి జితులై శితికంఠుకడకు బాఱిపో
నతండు తాన బయలువెడలుటయుఁ దక్కంగల దానవులు దశదిశలకుం బఱచిరి కాని
యంధకుం డెదురుచనియె, నంత, ౬౫

సీ॥ కటకటమని గొంతు తఱుగుకొం చవలకు గ్రక్కునఁజనెడి చక్రములతోడ
గుఱిచూచివిడిచినంత రయంబ పోయి వర్మముగూడఁ జించు బాణములతోడ
నొరనుండి పెఱుకఁ గన్ మిఱుమిట్లుగొలిపెడి యమలాతినిశిత ఖడ్గములతోడఁ
జేకొద్ది యెత్తి వైచినయంతమాత్ర శిరముఁ బగుల్చెడి ముద్గరములతోడ
నన్యతోమరాదికాయుధంబులతోడ వృత్రిగోత్రభిదుల విధముదోఁప
నొండొరు లగ్రిణంబు నొనరించి యొనరించి ముష్టియుద్ధమునకు మొనసిరపుడు,

వ॥ అప్పటికిని నంధకుండు చంపశక్యుఁడుగాక తనపట్టునం ద్రవ్యంబకు బం
ధించి మూర్ఛితుం గావించుడుఁ జటిక సేపటిక శితికంఠుండు తెలివినొంది వింతగదం

దచ్ఛిరంబున వైచె, వాఁడును ఖడ్గంబున వ్రేయుటయు ఖండపరశువు కౌబేరాస్త్రం
బుం బ్రయోగించి తద్హృదయంబునఁ దాడనంబొనరించె, నంత నతండు నెత్తురుగ్రక్కు
చుఁ దలక్రిందుగా ధరణింగూలుటయు శూలంబున గ్రుచ్చియెత్తి గిరగిరం ద్రిప్ప
దానవుండు వినుతించుటయు హరుండు పరితుష్టుండై ౬౨౭

క॥ "భగవానిచేతఁబడియును బిగివిడి సామంబుగొనుట వెరవీరునకే
మగటిమిగా, దనుజుఁడ, వీవగఁబొగడుట నీకు వీరవ్రతమగునొకో,, ౬౨౮

వ॥ అనినవిని యంధకుండిట్లనియె, ౬౨౯

క॥ "శూలాగ్రంబునఁజేరిచి ఖేలన మొనరింపకుండ గెడపుమునను, మా
ర్జాలముచెరలాటుమహా! చాలఁగ నెలుక కగుఁ బ్రాణసంకట మెపుడున్, ౬౩౦

వ॥ నావుడు భగవానుండు ౬౩౧

ఉత్సాహము॥ 'లేదునీకుఁ జావు గాన లీల శూలమున నిటుల్
నీదువక్షమునను గ్రుచ్చి నింగికెత్తినాఁడ, మ
ర్యాద! యందువలన నీవిఁ కఘసముజ్ఝితుండవై
నాదుగణములందుఁజేరి నన్ భజించుచుండుమా, ౬౩౨

వ॥ అనుటయు నంధకుండిట్లనియె, ౬౩౩

ఆ॥ "నేటినుండినీకు నేను నాతోడుచుఁ గింకరుండనగుచుఁ గొలనుందు,
నపగతంబు మామకాసురభావంబు, గిరినివేశ! ఘోరదురితనాశ!" ౬౩౪

వ॥ అని యిట్లువక్కాణించిన వెండియు శంకరుండు ౬౩౫

క॥ "నీయెడలఁ జాల సంతసమాయెను వత్సా! వచింపు మభివాంఛితమీ,
వీయఁగఁదగనిదె యగుఁగా, కేయభ్యంతరము చెప్ప కిచ్చెద నీకున్" ౬౩౬

వ॥ అనవుడు మఱియు నంధకుఁడు ౬౩౭

క॥ శూలాగ్రస్థాపిత మత్తాలోపమతనుఁడవగుచుఁ దనరెడి నీ యా
భీలార్చఁ బ్రతిష్ఠించు సుశీలున కపవర్గమిమ్ము శివ! కృపగలవేన్, ౬౩౮

వ॥ అని యభ్యర్థించుటయు మహేశుండు వల్లెయని యస్థిశేషుండును గృశాం
గుండును నగు నయ్యసురుని శూలాగ్రంబునుండి తప్పించె, నంత వాఁడు గణంబులంజేరి
దేవదేవునిముందర గీతంబుఁబాడుటయుఁ దద్రటనంబు భృంగరటనంబువోలె శ్రోత్ర
సుఖావహమగుటంజేసి త్రిపురారి భృంగిరిటుండని నామంబువిధియించె, నిట్లతండు
దేవదేవుని గణంబులలోఁ జేరి సర్వకృత్యంబులయందును విశ్వసింపఁదగినవాఁడయ్యె,
నదిమొదలుకొని యీలోకంబున దేవదేవుండగు మహేశ్వరుండు తాదృగ్రూపంబున నె
జనులచే స్థాపింపఁబడుచు నలౌకికంబగు పరమసిద్ధి ప్రసాదించుచున్నవాఁడు, ౬౩౯

—• నారసింహమంత్రప్రభావము •—

చం॥ అవతలఁ గొంత కాలమున కంబుజమిత్రకులప్రసూతుఁడై
తవుననఁ జేజరిల్లు సురథక్షితిపాలుఁడు భ్రష్టరాజ్యుఁడై
యవనిసురాగ్రగణ్యుఁడగు నాత్మపురోహితు నవ్వసిష్ఠు పా
దవనజయుగ్మమందుఁ బడి తాఁ గడు దైన్యముతోడ నిట్లనున్, ౬౪౦

ఉత్సాహము॥ మామకీనమైనయట్టి మంచిచెడ్డలరసి బి
టోముచుండునట్టినీవి టుండఁగానె విద్విష
ద్భూమిపతులు నాదురాజ్యమున్ హరించి రయ్యయో!
యేమటంచుఁ జెప్పుదున్ మహీసురేంద్ర! కావునన్ ౬౪౧

తే॥ భాగ్యహీనుండనైన నాపయి ననుగ్రహించి రాజ్యము మగుడ లభించుమార్గ
మెడఁదయోజింపవలయును బుషికులాగ్రగణ్య! నీకన్న గతి నాకుఁ గానఁబడదు ౬౪౨

వ॥ అనియిట్లువచించుటయు వసిష్ఠుండు ౬౪౩

తే॥ "అట్టులగుచో మదుక్తంబు నాలకించి యఖిలసిద్ధిప్రదాయకమైనయట్టి
హాటకేశ్వరమునకునీ వరుగు సరగ సురథభూపాల! యత్యంతసుగుణజాల! ౬౪౪

తే॥ అరిగి ద్విభుజోద్యతోగ్రశూలాగ్రవిద్ధదీర్ఘపీనాంధకాసురదేహుఁడగుచు
భైరవాకారముననుండు పార్వతీశు నటఁ బ్రతిష్ఠించి పూజింపు మధికభక్తి, ౬౪౫

ఆ॥ రక్తపుష్పములను రక్తానులేపనంబులను ధూపములను బూని నార
సింహమంత్రమునను జేయుము తత్పూజ, బలయుతుండవగుచుఁ బగరఁద్రుంతు ౬౪౬

కం॥ కరముశుచియగుచునుండుము సురథా! తత్పూజసల్పుచో, లేకున్నన్
దొరలెడుఁ బ్రత్యూహంబులు, చిరమువిచారించి నిజముచెప్పినవాఁడన్" ౬౪౭

వ॥ అనినవిని యారాజతిత్వరితంబునఁ దత్క్షేత్రంబునకుంబోయి భైరవుం
బ్రతిష్ఠించి శుచియై బ్రహ్మచర్యంబునఁ బదివేలనారసింహమంత్రంబు జపించుటయు
భైరవుండు సంతుష్టుండై ౬౪౮

కం॥ "ఏతన్మంత్రజపంబునఁ బ్రీతింబొందించితీవు పృథివీధవ! నన్,
నాతోడఁ జెప్పుకొనుమిఁక, నీతలఁపు నొసంగువాఁడ నిశ్చయముగ నేన్" ౬౪౯

వ॥ అనివక్కాణించుటయు సురథుండిట్లనియె, ౬౫౦

ఉ॥ "వైరులు నాదురాజ్యమును వచ్చి బలాత్కృతిమై హరించి, ర
వ్వారల సంహరించి యది వైళమ నాకు ననుగ్రహించుచున్
వేఱొకఁడేని యీమనువు వేయిపరు ల్జపియించుచో నిటన్
గూరిమి వారివాంఛితముగూడ నొసంగుచునుండు భైరవా!" ౬౫౧

వ॥ అని వేఁడుటయు భైరవుండు వల్లెయని యంతర్ధానంబుఁ జెందె, సురథుండు రణంబున రిపులుల రూపుమాపి నిజరాజ్యంబు గైకొనియె" ననిన విని మునీశ్వరులు.

—• చక్రపాణి ప్రతిష్ఠ •—

సీ॥ "ఇంద్రాదిక శ్రేష్ఠబృందారకులు లోకహితమునకై సృజియించినవియు
నల విభీషణపురోగామరారులచేత భక్తిమై రచియింపఁబడినయవియు
హనుమదాది కపీశు లరుదెంచి సంప్రీతి మంచిగా నేర్పతిపించినవియు
భీష్మాదులెందఱో పేర్నిల్పుకొనుటకై మిగులశ్రద్ధను వినిర్మించినవియు
నైన తీర్థదేవతాయతనంబులు వేనవేలు మాకు విశదపఱచి
నావు, మఱియు దర్శనస్పర్శనములనే యెవి యభీష్టదములో యావు చెపుమ"

వ॥ అనవుడు సూతుండిట్లనియె, ౬౫౪

తే॥ "వాస్తవంబిది సంయమివర్యులార! యచటఁగల యాలయంబుల యాశ్రమముల
లింగముల లెక్కఁ జెప్పంగలేను నేను, బ్రహ్మకేని యసాధ్య మిప్పని తలంప,

వ॥ అందు శంఖతీర్థంబున సమాహితుండై యేకాదశిని స్నాతుఁడగువాఁడు సమస్తఫలంబులం బొందఁగలిగెడిఁ, బ్రొద్దుపొడుపునలేచి శ్రద్ధాభక్తి సమన్వితులై జనులు సిద్ధేశ్వరసమానులగు నేకాదశరుద్రుల దర్శించిన సకలరుద్రులను వటాదిత్యుని దర్శించిన ద్వాదశాదిత్యులను మాహిత్థనుదర్శించిన సకలదుర్గలను స్వర్గద్వారప్రదుండగు వినాయకుదర్శించిన సకల వినాయకులను శర్మిష్ఠప్రతిష్ఠించిన జ్యేష్ఠగౌరినిదర్శించిన సకలగౌరులను జక్రపాణినిదర్శించిన సకలవిష్ణుమూర్తులను దర్శించినవారలగుదు" రని యిట్లు వాక్రుచ్చుటయు శౌనకాదులు ౬౫౬

తే॥ 'ఈవుచెప్పినవానిలో నింతవఱకుఁ జక్రపాణి చెలంగుఁ డాస్వామి నెవఁడు
తాఁ బ్రతిష్ఠించె? నెట్టిది తత్ప్రభావ? మెపుడుతద్దేవు దర్శించి యెరఁగవలయు'?

వ॥ నావుడు సూతుండిట్లనియె, ౬౫౮

ఆ॥ "అర్జునుండెనిలిపె నాచక్రపాణిని, శయనబోధనములఁ జని యుపస్సు
నందు నీరమాడి యాదేవు నీక్షింప బ్రహ్మహత్యయేని బాయఁగలదు, ౬౫౯

వ॥ భూభారోత్తారణమునకును ధర్మసంస్థాపనమునకును నరనారాయణు లుభయులును బ్రహ్మచే నవతరింపఁజేయఁబడిరి, యీనరనారాయణులే ద్వాపరాంతంబునఁ గృష్ణార్జునులై ధరాపృష్ఠంబునం దవతరించి పరస్పరాత్యంత స్నేహంబునం బ్రివర్తించిరి. రక్షోవినాశార్థమై దశరథాత్మజుండగుచు రాముండువోలెఁ గృష్ణుండు నవతరించినవాఁ, డయ్యెడ యుధిష్ఠిరుచే నాజ్ఞాపింపఁబడి యింద్రప్రస్థపురంబునుండి యర్జునుండు తీర్థ

సేవనంబునకు వెడలియుండె, ధర్మజుం డల్లేలయాజ్ఞాపించెనన్నఁ జెప్పెదవినుండు,
ద్రౌపదీసహితుండై రహస్స్థలమందున్న యన్నయగు యమనందను సందర్శించి యింద్ర
నందనుండు ప్రణతుండును వినయావనతుండును నై ౧౬౦

తే॥ "మానవాధీశ! విప్రులధేనువులను దోలుకొనిపోవుచున్నారు దొంగవాండ్రు,
ఆదురాత్ములవధియించి యాల మలప, వలయు నాయుధ, మందుకై వచ్చినాఁడ"

వ॥ అనివిన్నవించుటయు యుధిష్ఠిరుండిట్లనియె, ౧౬౨

కం॥ "పొమ్ముధనంజయ! యచటికిఁ, జి మ్మాతస్కరుల నీదుశితశస్త్రమునన్,
దెమ్ము మహీసురగోవుల, సమ్మతియిచ్చితిని లెమ్ము సత్వర మింకన్, ౧౬౩

చం॥ పరసతిఁ గన్నతల్లివలె భావనసేయు వివేకి యౌనుగా,
కొఱఁడు వివిక్తదేశమున యుగ్మలిఁగూడి వసింపఁ గాంచునో
హరహరయంచుఁ దోల్గవలె నావల, కట్టు తొలంగఁడేని దు
ష్పురుషుఁడె వాఁడు, పాపియును, జుట్టమెయైన నీఁకేమిచెప్పనా, ౧౬౪

తే॥ కాన నేకాంతమందునఁ గాంతతోడఁగూడివర్తించువానిని జూడఁగూడ,
దందు బంధువుఁజూచుట యతివిగర్హ్య, మాత్మహితకాంక్షి పాటింపనగునుదీని,

శా॥ ఏనున్ ద్రౌపది యొక్కశయ్య మనుచో నేతెంచితీ, వందునన్
ధేనువ్రాతము గ్రమ్మఱించుపిదపం దీర్థంబులం గ్రుంకిర,
మ్మేనస్సంతయు ద్వాదశాబ్దములుగా నీఁగున్, ధరిత్రీజనం
బానానంచు నుతించు నిన్ను విజయా! యావీఁకఁ గావించుటన్" ౧౬౬

వ॥ అని యిట్లు వచించుటయు వల్లెయని ధనుర్బాణంబులం గైకొని తత్క్షణంబ
రథం బధిరోహించి శితశస్త్రధరుడై ద్విజులఁ దిరస్కరించి దొంగలు గోవులఁ దోలు
కొని పోవు మార్గంబునం జని వేగంబ వారి సంహరించి మహాత్ములగు బ్రాహ్మణు
లకు ధేనువుల సమర్పించి యనేకతీర్థంబులం దాడుచును ననేకాయతనంబుల
దర్శించుచును పాండునందనుండు క్రమంబుగా నీ క్షేత్రంబునకు నరుదెంచె, నతఁడు
పూర్వ మాక్షేత్రమును దఱచుగా నవలోకించియున్నవాఁడె, దుర్యోధనువివాహంబున
కేగుచు నటు వచ్చియుండుట వినియుండరో కో, యంత మున్ను తాఁబ్రతిష్ఠించి
యున్న యర్జునేశ్వరలింగంబును బుష్పధూపానులేపనంబులం బూజించి కౌరవులును
పాండవులును స్థాపించిన తక్కటిలింగంబులకును మ్రొక్కవెట్టి యాత్మగతంబున

కం॥ "నేను నరుండను, గృష్ణుఁడు శ్రీనారాయణుఁడు తాను, సిద్ధమిది, యటుల్
గాన నిటఁ జక్రపాణిని బూని ప్రతిష్ఠింతు జనులు పూజయొనర్పన్, ౧౬౭

తే॥ ఉర్విఁ గనివినియెఱుఁగని యొక్కగుడియు రాణఁ గట్టింతు నీచక్రపాణికిచటఁ
జెడదు కల్పాంతమునను నీక్షేత్రరాజ, మట్లె శాశ్వతమైయుండు నాలయమును"

వ॥ అని నిశ్చయించుకొని యాపాండవానుజుండు విష్ణ్వాలయంబు వినిర్మింపించి చమత్కారపురస్థులగు భూసురులఁ బిలువంబంచి తన్మతానుసారంబుగాఁ జక్రపాణిం బ్రతిష్ఠించి యనేకదానంబులం గావించియు ననేకశాసనంబుల వేయించియు నా బ్రాహ్మణులకుఁ బరమసంతోషప్రదంబులగు మఱికొన్నింటి సమర్పించియు వారిం గూర్చి దోసిలి యొగ్గి నిల్వఁబడి

చం॥ "నరుఁడని పూర్వజన్మమున నన్ను వచించెడివార, లొక్క భూ
సురునకు నాత్మజుండఁ, గడుసుందరమౌ బదరీవనంబునన్
జిరము తపంబొనర్చితిని, సిద్ధినిగాంచితి, నంతఁ బాండుభూ
వరసతి కుంతి గర్భమున వచ్చి జనించితి మానవుండనై, ౬౭౧

భుజంగప్రయాతము. జగత్ప్రసిద్ధమై రహింప శ్రద్ధ నస్మదాఖ్యతో
నగోపమానమైన యాలయంబుఁ గట్టఁజేసి యం
దగణ్యశోభమైన విగ్రహంబు నిల్పినాఁడఁ గా
నఁ గొల్వఁడీరు చక్రపాణినా వచించుచున్ సదా, ౬౭౨

ఉ॥ సూర్యుఁడుఁ జంద్రుఁడున్ మఱియుఁ జుక్కలు వర్తిలుదాఁక నాదుపే
రార్యులు విష్ణులోకమున నన్వహమున్ స్మరియింపఁ జేయుఁడీ,
భూర్యఘమీఁగెడిన్, శయనబోధనవేళలఁ జైత్రమాసపున్
హార్యహమందు నుత్సవము నాచరితవ్యము మీకు భక్తిమై, ౬౭౩

చం॥ బదరినివీడి నేను బహుభక్తియుతంబుగ నీయుపేంద్రు స
త్పదములు పూజసేయుదును బ్రాహ్మణులార! మదుక్తమైన నై
యదనుల నీచతుర్భుజుని యర్చనచేయుజనం బఘంబులన్
వదలి వికుంఠలోకమున వాసముచేయుచునుండు హాయిగన్, ౬౭౪

కం॥ ఏవంవిధముగ మఱియును నీవిష్ణుక్షేత్రమందు నెసఁగెడి తత్త
ద్దైవతములఁ గడుభక్తిని సేవించెడిజనము గూడ శ్రేయము గాంచున్" ౬౭౫

వ॥ అనికీర్తించుటయు నమ్మహీసురులు వల్లెయని, రటు పాండునందనుండు తద్భరము వారలపైఁబెట్టి ప్రశాంతమైన యంతరాత్మతో నన్యతీర్థంబులును సేవించి కృతకృత్యుఁడయ్యె, హృషీకేశుం డిట్లు చక్రపాణివపుర్ధారియై జంతువుల పాపంబులం బోఁదోలుచు నరుదు వెలసియున్న వాఁ, డిప్పటికిని నవ్విష్ణుకల చైత్రమాఘకార్తికాదులం బూర్వోక్తవిధానంబునఁ బూజనీయుఁడు విశేషించి వందనీయుఁడు నయ్యెడి,

—• అప్సరఃకుండనిర్మాణము. •—

తే॥ అట్టిమహిమయొక్కటియెఁగల దాస్థలమున రూపతీర్థంబనం గడు రూఢమగుచు,
నట విరూపుండు భక్తి నీరాడెనేని యగుసురూపుండు సరవి మహర్షులార! ౬౭౭

వ॥ తొల్లి లోకకర్తయు భగవంతుండును నగు బ్రహ్మ విస్తృతంబగు చతుర్విధ సృష్టిం గావించి రూపసంచయసంయుతయగు నొక్క దివ్యాప్సరసం బుట్టింప నుద్దేశించి సకలదేవతాశరీరంబులనుండియు నొక్కొక్క నువ్వుగింజయంత రూపంబును దీసి తన్నుఁగూడ మోహింపఁజేయఁగల యత్యాశ్చర్యకరశరీర సృజియించి కైలాసంబున కరిగి మహాదేవునకు జోహారొనర్చిరమ్మని యనుపుటయు నయ్యది సత్వరంబుగం బోయి పార్వతీపరివేష్టితుండగు శంకరుదర్శింప నతండును నావిడం గనుంగొని పరమాశ్చర్యభరితుండై పార్శ్వస్థయగు పర్వతరాజపుత్రివలని భయంబున దృఢదృష్టిం బఱపఁడయ్యె, నంత నయ్యచ్చరనచ్చెకంటి మహేశ్వరునకుఁ బ్రణామంబొనర్చి శ్రద్ధాపురస్సరంబుగం గృతాంజలిపుటయై ప్రదక్షిణంబాచరించుడు నాదేవుండు తదాకృష్టలోచనుండై యాపె యేదిక్కునకుఁదిరిగిన నాదిక్కునకెల్ల ముఖంబుగల్పించుకొని గౌరీభీతచిత్తంబునఁ గంఠంబు నొకించుకయుం గదల్పకయె వర్తిల్లెఁగాని యాసమయమం దందున్న నారదమహాముని హైమవతి కభివందనంబొనర్చి ౬౭౮

కం॥ "నీమగని కాముకత్వం బేమాదిరి నున్నయదియొ యీక్షింపు మమా!
యీమగువ సొగసునంతయుఁ దా మొగములు నాలుగింటఁ దాలిచి కనెడిన్,

చం॥ జగములమూఁట దివ్వటులు చాలరహిన్ వెలిగించి కాంచినన్
సొగసున నిన్నుఁబోలఁగల సుందరియుండమి నే నెఱుంగుదున్,
మిగిలినవారికండటికి మిక్కిలి వేద్యమె యిద్ది, ప్రౌనగల్
దగిలిచి మేనినిండఁ దెయితక్కను బోగము దెంత నీకడన్, ౬౮౦

శా॥ వారస్త్రీయఁట, పార్వతీసహితుఁడై వర్తించు గంగాధరున్
జేరన్ వచ్చినదంట, యాపెపయిఁ దచ్చిత్తంబు లగ్నంబఁట
య్యారే! తా నటనుండఁగానె శివుఁ డన్యాసక్తచిత్తుండుగా
గౌరీరూప మదెంతయుంచుఁ గ్రతుభుక్కాంత లక్కుడున్ నవ్వరే, ౬౮౧

చం॥ మనసటు నాటిపోయినది, మానక యాయన ప్రాజ్ఞకోటిచే
ననయము దూరముంచఁబడు నగ్గణికం దనమేడమీఁద నే
యునుపఁగలాఁడు, నీదుపని యుత్తదియేయిఁక, సిగ్గుచేతఁ గి
మ్మనక కిటుకూరుచుండెనిపు డంబరో! బెల్లముఁగొట్టు రాయినాన్" ౬౮౨

వ॥ అనిబోధసేయుటయు ముఖచతుష్టయంబుచే వికృతుండైయున్న నిజనాథు వీక్షించి యాపర్వతాత్మజ బిట్టుకోపంబున మహిషీధర్మమాశ్రయించినదై యాయన కన్నులన్నియుం గప్పివైచె, నంత నఖిలశైలంబులును విరిసిపోయె, సప్తసముద్రంబులును జెలియలికట్టలుదాఁటె, నట్లు ప్రళయంబుతోఁచుటయు నిమిషమాత్రంబున బ్రహ్మకు దినక్షయమై రాత్రిసంప్రాప్తించె, సకలంబును జలమయంబయ్యె, నంత భృంగినందిపురస్సరులగు సర్వగణంబులును దక్కలహాళనుండును భయంపడి యాసురేశ్వరిదిక్కు మొగంబై ౬౧౩

కం॥ "విడువుము విడువుము జననీ! మృడుని కనులుమ్మోసి యేలమిడికింతు మమున్
విడువకయుండినచో నిప్పుడె నాశమునొందఁగలదు భువనత్రయమున్" ౬౧౪

వ॥ అనిప్రార్థించినను విడిచిపెట్టమిఁ బ్రాణంబులకంటె గరీయసియగు నాయమను వారింపనేరక మహాదేవుండు లోకంబులపైఁగల కృపాళుత్వంబున లోకరక్షాకరంబై చెలంగ లలాటంబున నొకనేత్రంబు సృష్టించె, నంతదేవతలు ౬౧౫

ఆ॥ "త్ర్యంబకములచేత నలగారుచుంటచేఁ ద్ర్యంబకుండటంచు నధికభక్తిఁ
గీర్తనీయుఁడింకఁ గృత్తివాసుండు తా నఖిలసురనరోరగాదులకును" ౬౧౬

వ॥ అని వాఁక్రుచ్చి, రంతఁ బర్వతపుత్రిక యాదేవుని కనులమీఁది చేతులుదీసి కోపసంరక్తలోచనయై ముందఱనుండు తిలోత్తమం దిలకించి ౬౧౭

కం॥ "పాపాత్మురాల! యుష్మద్రూపముచేతను విడంబితుండయ్యె నిసీ
నాపతి, నాలుగుమొగములు ప్రాపించె, విరూపవగుచుఁ బడియుండు మిఁకన్"

వ॥ అని శపించుటయు

సీ॥ చతికిలఁబడి చూడఁ జాల నసహ్యమై జలుబునీళ్ళుస్రవించు చట్టిముక్కు
విరియఁబాఱినయట్టి కుఱుచవెండ్రుకలతోఁ జెలువుచు గోళ్ళేవు చిట్టనెత్తి
నిసువులు బెదఱిపో నిమ్నోన్నతములౌచుఁ బాచిపీడని పెద్ద బల్లిపండ్లుఁ
గుండేఁడు ముదిజొన్నకూడేని క్షణములోఁ బట్టింపఁదగినంత బానకడుపుఁ
గలిగి యొకనిమేష కాలంబులోపలఁ జారుదేహమెల్ల మాఱిపోవ
వేపమానయగుచు నాపె యాపార్వతి కెఱఁగి దోసిలొగ్గి యిట్టులనియె, ౬౨౦

చం॥ "ననుసృజియించి తత్క్షణమె నల్వ గిరీశునకుఁ భవానికిన్
బ్రణతియొనర్చి రమ్మనుచుఁ బంపఁగ వచ్చినదానఁగాని నీ
పెనిమిటిమీఁదికోర్కి భ్రమపెట్ట సమాగతఁగాను, దోషహీ
నను శపియించి తంబ! యిది న్యాయముకాదు, మరల్పుశాపమున్" ౬౨౧

వ॥ అని యిట్లు వేడుటయు సత్యంబును దీనంబును నగు తద్వాక్యంబును విని భవాని పశ్చాత్తాపసమేతయై ౬౯౨

తే॥ "స్త్రీస్వభావముననుజేసి శీఘ్రకోప మాగతంబయ్యె, నగుఁగాక యరుగుదెమ్మ,
భూస్థలంబున కిప్పుడే పోద, మచటఁ గలదు రూపదమనుతీర్థ మలఘు వబల! ౬౯౩

ఆ॥ మాఘసితతృతీయ మజ్జనమొనరింప నేరుపఱచియుంటి నేనెదాని,
బోయిదానఁ బ్రొద్దుపొడువకమున్నె నీరాడుచేడె సుందరాంగియగును, ౬౯౪

కం॥ నిరతము మాఘతృతీయను జరుపుదుఁ దత్తీర్థమందు స్నానము, నేఁడా
వరతిథి; యచటికి స్నానముకొఱ కేగఁగ నిశ్చయించుకొంటిని గలికీ!" ౬౯౫

వ॥ అని చెప్పి యాతిలోత్తమను హాటకేశ్వరక్షేత్రమందలి రూపతీర్థమునకుఁ దోడ్కొనిపోయి విధిపూర్వకంబుగా మొదటఁ దాఁ దీర్థంబాడి యావిడచేత నాడించుటయుఁ దత్క్షణమ యాభామిని యథాపూర్వంబుగాఁ గాంతిమతియై సంతసించి సురేశ్వరికిఁ గేలుమోడ్చి యాశ్చర్యపడుచు హర్షగద్గదభాషణంబుల నిట్లనియె, ౬౯౬

కం॥ "మున్నున్నయట్టి నాదగు సన్నుతరూపంబు నాకు సమకూరెను గా
న న్నలువపట్టణమునకు నున్నతిమెయి నేగుదాన నొసఁగు మనుజ్ఞన్" ౬౯౭

వ॥ అనియిట్లు వక్కాణించుటయు గౌరి ౬౯౮

కం॥ "ఏదేని యొక్కవరమును నీదలఁచినదాననీకు నిందునిభాస్యా!
నాదగుదర్శన మెపుడును గాదు వృథా, కోరుకొమ్మ గ్రక్కున, నిత్తున్" ౬౯౯

వ॥ అనినవిని తిలోత్తమ మఱియునిట్లనియె, ౨౦౦

కం॥ "నేనీక్షేత్రములోన భవానీ! నాపేర నొక్కవరతీర్థంబున్
వే నిర్మింపఁగఁదలఁచినదానను, ఖ్యాతంబొనర్పు ధర నద్దానిన్, ౨౦౧

తే॥ అఖిలకాంతలు రూపభాగ్యములుగలిగి యలర నటఁగూడ వర్షాంతమందు నీవు
స్నానమొనరించుచుండఁగాఁజను మహేశి! కరుణసేయుమిదే నాకు ఘనవరంబు"

వ॥ అనిప్రార్థించుటయుఁ గ్రమ్మఱగౌరీదేవి ౨౦౩

ఆ॥ "చైత్రసితతృతీయ సర్వదా మధ్యాహ్నమునను నీదుతీర్థమునను స్నాన
మాచరించుదాన నఖిలకాంతాజనక్షేమమునకు నీవుచెప్పినట్లు, ౨౦౪

ఉ॥ ఎవ్వతె యాతృతీయఁ గర మెక్కుడుభక్తిని నేగుదెంచి తా
నివ్వరతీర్థమందుననుఁ నెంతయు నాచరితావగాహయౌ
నవ్వనితాశిరోమణి సుఖాన్విత రూపసమేతగూడనై
నివ్వటిలున్ సమస్త రమణీస్పృహణీయతమై ధరాస్థలిన్, ౨౦౫

కం॥ పురుషుం డేనియు నెవఁ డవ్వరతీర్థమునను మునుంగు వాఁడును సప్తో
త్తరజన్మంబుల సుఖియును దరుణీభ్రమకృత్సురూపధరుఁడును నగుఁదాన్" ౨౦౬

వ॥ అనివార్యప్రచ్యుతయు నయ్యుచ్ఛగమచ్చెకంటి విస్తీర్ణంబును విపులోదక పూరితంబును నగు నొకకుండంబు ద్రవ్వించి తత్సవిధంబునఁ బార్వతిం బ్రతిష్ఠించి సంతుష్టాంతరంగయై బ్రహ్మలోకంబునకుఁజనియె, నది మొదలుకొని యయ్యప్సరః కుండంబు స్నానమాత్రంబున సకలజనులకును సౌభాగ్యంబొసంగుచును జలజాక్షులకు విశేషించి సంతతిప్రదమగుచును జగత్ప్రఖ్యాతంబయ్యె! ౨౦౭

శా॥ ఏమీనాంబక భక్తి రూపమయమౌ నీ యప్సరః కుండమం
దామూర్థంబును దీర్థమాడి సితికంఠార్ధాంగి దర్శించి యి
ల్లే ముమ్మాలులొనర్చుఁ దత్తణము యాయేణాక్షి జన్మాదిగాఁ
దా మున్ జేసిన ఘోరపాపములచేతన్ ముక్తయై ప్రాలెడిన్, ౨౦౮

వ॥ అచ్చట నే గౌరీకుండసమీపమం దాయమ కింకరియగు జయ యొకకుండ మేర్పఱచియున్నయది, తృతీయాదివసంబునం దందుఁ గృతాభిషేకయగు నబల సంతతి సౌభాగ్యసంపన్నయుఁ బతివల్లభయు నయ్యెడి, నట్లందు విజయాకుండమని మఱి యొక తీర్థంబునుం గల, దందు గొడ్డురాలైనను స్నానమొనర్చిన బిడ్డలంగని స్వప్న మందైనను బుత్రమరణదుఃఖంబునుగాని పుత్రవియోగదుఃఖంబునుగాని పొందకుండెడుఁ గాక వంధ్యయైనను దత్తీర్థంబునం గ్రుంకఁబెక్కండ్రు కొడుకులంబడసి స్వర్గంబున వసించు"నని యిట్లు నొడువుటయు బుషీశ్వరులు ౨౦౯

కం॥ "శుద్ధాంతఃకరణులు ప్రతిషిద్ధప్రాణివధులైన క్షితిసురులకు సం
సిద్ధి తడవైనయప్పటి శుద్ధతి సమకూరుమార్గ మొగిఁ జెప్పఁగదే" ౨౧౦

వ॥ అని వక్కాణించుటయు సురల సూతుండిట్లనియె, ౨౧౧

ఆ॥ "మాఘమాసమునను మాని విశ్వామిత్రు ప్రాదములో నుమస్సునందుఁ గ్రుంకి
ద్విజున కధికభక్తిఁ దిలపాత్రమిచ్చుచో బ్రహ్మలోక మొందుఁ బాపమెడలి, ౨౧౨

వ॥ మఱియు సుపర్ణేశ్వరుమ్రోల నుపవసించి ప్రాయోపవేశంబునఁ బ్రాణంబులు వదలువాఁడు జన్మరహితుండయ్యెడు, నియ్యవి బ్రాహ్మణులకు దేవతలుగూడ మెచ్చఁ దగు సాత్త్వికసిద్ధులు, తక్కటితీర్థంబులును దక్కటి దేవాలయంబులును స్వర్గప్రదంబులే కాని మోక్షదంబులు కానేరవు. సకలతీర్థంబులవలనను సకలదానంబులవలనను గలుగు ఫలంబును శ్రద్ధాసమన్వితులై యీయాఖ్యానంబు శ్రవణించువారు కాంచుదురు, జను లేతచ్ఛ్రవణంబువలన జన్మకోటి సంసిద్ధంబులగు కలుషంబులు వదలి నూరుతరముల వారి నుద్ధరింపఁగలుగుదురు, శ్రవణాంతంబున గోభూహిరణ్యవస్త్రాలంకారాది వివిధ దానంబులం గథకుండు పూజనీయుం, డెవండట్లు పూజించు వాఁడు సాక్షాత్సత్యవతీ సూనుండగు వేదవ్యాసుఁ బూజించినవాఁడయగు, ౨౧౩

## —• మణిభద్రోపాఖ్యానము •—

కం॥ "తనరెడుఁ బుష్పాదిత్యుండను మఱియొక దేవుఁ డచటఁ, నాదేవుఁడు తా
మును యాజ్ఞవల్క్యనామక మునిచేతఁ బ్రతిష్ఠితుండు మునివరులారా ! ౨౧౪

సీ॥ పుత్రసంతతిఁగోరి పూజించుమనుజుండు సత్పుత్రులం గాంచి సంతసించు,
నర్థంబుఁ గాంక్షించి యర్చించుమర్త్యుండు లక్షాధికారియై లలివహించు,
నరివినాశముగోరి యజయించు సుజనుండు హతసమస్తారియై యశముఁ బెంచు,
విద్యార్థియైకొల్చు విమలవంశభవుండు విద్వద్వరిష్ఠుఁడై విపులమించు,
మిత్రవారసప్తమీకృత తద్దేవదర్శనంబువలనఁ దద్దినంపుఁ
బాపమెల్లఁ దొలఁగు బ్రాహ్మణవరులార ! తద్దఁ బెద్దదయ్యుఁ దత్క్షణమున, ౨౧౫

వ॥ ఆ సప్తమీభాను వాసరంబునం జేయు పుష్పాదిత్యపూజచే సూర్యోదయంబునఁ జీకట్లువోలె సంవత్సరకృతంబగు పాతకంబును సంక్షయంబుఁ జెందెడి, ఫలహస్తులై యాదేవునకు నూటయెనిమిది ప్రదక్షిణంబు లొనరింపఁ బుట్టినది మొదలు గిట్టువఱకుం జేసిన యెట్టికలుషంబులును విలయంబునందు, నదియునుం గాక యాప్రదక్షిణంబులుచేయు జనం బేకోర్కులుగోరిన నాకోర్కులెల్ల సిద్ధించు, నిష్కామునకు మోక్షంబే ఘటియిల్లెడు, మేషసంక్రమణంబుగాని తులాసంక్రమణంబుగాని యాదిత్యవాసరసంయుతంబైనప్పు డాదేవునకు స్నపనక్రియ యొనరింప నభీష్టంబు సిద్ధించుఁ గావునఁ బుష్పాదిత్యుండు పూజనీయుండును దర్శనీయుండును నయ్యెడిఁ, జమత్కారపురస్థ సర్వదేవతాదర్శనంబునంగలుగు ఫలం బీయొక్కని దర్శనంబుననే చేకూరెడు" నని యిట్లు వక్కాణించుటయు ఋషులిట్లనిరి, ౨౧౬

ఆ॥ "వాస్తవముగ యాజ్ఞవల్క్యవాచంయమవరుఁడు తత్ప్రతిష్ఠ జరిపియున్న
నీ సుదైవతమున కిట్లు పుష్పాదిత్యనామ మేరుపడుట కేమికతము ?" ౨౧౭

వ॥ అనిన వెండియు సూతుండు ౨౧౮

కం॥ "ఏతద్విషయంబున నొకరయైతిహ్యముఁ జెప్పువాఁడ, నదివినుపైఁ ద
ద్ధేతువు తెల్లంబగుమీ కోతాపసపర్యులార ! యూకొట్టుఁ డిఁకన్, ౨౧౯

సీ॥ తోవలరాయిడికాని త్రోవ కడ్డంబాచుఁ గోఁటగోడలు చాలఁ గొమరుమిగుల,
గురుతల్పమెక్కిన కూళ వీఁడని శశిం బ్రాసాదముల సతు ల్బందినుంప
నారామతరుశాఖలందలి పుష్పము ల్పగటిచుక్కలుగ నభ్రమునఁ దోఁప
సింధువు ల్చుట్టును జేరివసించె నాఁ గమలాకరములు లెంకలను వెలయు
నై దిశంబని విఖ్యాతివడయు నొక్కపట్టణంబునఁ దాఁ బట్టభద్రుఁడగుచు
వ్యాధిదుర్భిక్షచోర వివర్జితముగ వసుధఁ బాలించె మును చిత్రవర్మనృపతి, ౨౨౦

వ॥ ఆపురంబున జాతిచే క్షత్రియుండై మణిభద్రుండని యొక్కఁడుండెడు,

సీ॥ తెంపలిచెట్లకే వేసి దోఁటీలను గుంజంగఁదగు మరుగుజ్జతండు,
కాయమంతటఁగూడ ఘనమైనముడతలు గలిగియున్నట్టి దుర్గలితుఁడతఁడు,
తలయును మొలయును వెలతెలగా మేనిపస గోలుపోయిన ముసలియతఁడు,
సౌష్ఠవశూన్యమౌ సర్వాంగములతోడ రోఁతఁబుట్టించు విరూపుఁడతఁడు,
వలసినంత ధనముగలిగినవాఁడయ్యుఁ దానుదినక యొరులకేని యిడక
వడ్డిఁబెంచి బీదవారల కొంపలమ్మించిమించుచుండు కించతండు, ౭౨౧

సీ॥ ఎద్దానియధరోష్ఠ మీక్షింప దొండపం డెద్దానివిగ్రహం బించుకోల
యెద్దానికనుదోయి యిందీవరవిశాల మెద్దానిగుల్ఫంబు లెఱుఁగరాని
వెద్దానినెన్నడు మెన్న ముష్టిగ్రాహ్య మెద్దానియందంబు హృదయహారి
యాత్సప్తగాత్రంబు లత్యంతరక్తముల్ యన్నారి మూఁడింట నతిగభీర
యట్టి యఖిలలక్షణాన్విత నిజజాతికన్య యొకతె తనదుకంటఁబడఁగ
నట్టివికృతుఁడయ్యు నమ్మణిభద్రుఁ డాతన్విఁ బెండ్లియాడఁదలఁచి యపుడు

వ॥ దారిద్ర్యపీడితుండగు దానితండ్రిం బిలిచి తన కిమ్మని యడుగుటయునాతఁ డాసంగతి భార్యకు వినిపింప నాయమ దుఃఖితయై మూర్ఛిల్లెనంత నానిరుపేద యాపె సేదదేర్చి

సీ॥ "ధనవంతునకుఁ గన్యధారవోయఁగలేని విత్తహీనునివిద్య విద్యయొక్కొ,
యైశ్వర్యసంయుతు నల్లుఁగాఁబడయని నిర్భాగ్యునేరుపు నేరుపొక్కొ,
యర్థవంతునియింటి కాత్మజం బంపని యర్థశూన్యుని యర్థ మర్థమొక్కొ,
భాగ్యవంతున కాత్మభవఁ బత్నిఁజేయని భాగ్యహీనుని ప్రజ్ఞ ప్రజ్ఞయొక్కొ,
భాగ్యయుతునకుఁ జుట్టమౌఁ బరుఁడుగూడఁ, జుట్టమును బరుఁడగు భాగ్యశూన్యునకును
గిరులనుండి సరిత్తులక్రియఁ బెరుంగు నర్థములనుండి పనులెల్ల నగుచునుండు,

ఉ॥ పూజ్యుఁడు కానివానికిని బూజయొనర్చుచునుందురి పోయి సం
త్యాజునిగూడ శ్రద్ధమెయి దగ్గఱఁజేరి నుతింతు రన్వహం
బిజ్యునక ట్లవంద్యునకు నెంతయు వందనమాచరింతురి త
త్ప్రాజ్యధనప్రభావమున ధారుణిలోపల సర్వమానవుల్, ౭౨౬

చం॥ అశనమునుండి యిందిరియముల ట్లఖిలక్రియ లౌనుగానఁ దా
దృశమగు కార్యసాధనము పృథ్విఁ గనంబడ దెంచిచూడఁగా,
శిశువులుమున్నుగాఁగలుగు జీవులు సర్వులుగూడ దానికి
వశులయి నిప్పులోనయిన వచ్చి పడన్ గమకింతు రెంతయున్, ౭౨౭

క॥ ధనవిరహితు లగుచోఁ దమ జననీజనకులనుగూడ సంత్యాగముఁజే
యను సాహసింతు రితక్కిన జనులను విడుచుటకు నేమిసంశయముండుఁగ" ౨౨౮

— మణిభద్రుఁడు పుష్పుఁడను బ్రాహ్మణుని గొట్టించి యవమానించుట —

వ॥ అనియిట్లు రహస్యంబుగా బోధించుచు నాయమయు నందుల కియ్యకొనియె నంత నాక్షత్రియుండు మణిభద్రుని పాదంబులుగడిగి హస్తంబున సాక్షతంబగు జలంబు విడుచుటయు నతండు ౨౨౯

ఆ॥ "పెండ్లిసేయు మిపుడె ప్రీతి నాకును నీదుకూఁతునను నెలమిఁ గూడియుండఁ,
దన్నిమిత్తముగనె త్వద్గృహంబున కేను వచ్చినాఁడ మామ! వాస్తవముగ" ౨౩౦

వ॥ అనిపలుకుటయు నా క్షత్రియుండిట్లనియె, ౨౩౧

క॥ "దినవారగ్రహము లిప్పుడ ననుకూలములై రహింప, వదియుఁ గాకి
ప్పుని దక్షిణాయనమునను బొనరింపఁగ రాదటండ్రు భూసురవర్యుల్, ౨౩౨

ఆ॥ ఇట్టిసమయమునను నెవతెవివాహంబు జరుపఁబడునొ వెస విచారముడిగి
దాని కొక్కయేడు దాఁటకమున్న వైధవ్యమేరుపడును దప్పకుండ, ౨౩౩

ఉ॥ జ్యోతిషికు ల్వచింప నిటు సంశ్రవణంబొనరించినాఁడ, నా
హేతువుచేత వేగపడ కీవు శుభగ్రహదినాదికాన్వితం
బై తగు నుత్తరాయణమునం దరుదెంచి వివాహమాడి సం
ప్రీతినిబొమ్ము, కల్గుదురు బిడ్డలునీకు, శుభంబుచేకురున్" ౨౩౪

వ॥ అనియిట్లువాక్రుచ్చుటయు మణిభద్రుండు ౨౩౫

ఆ॥ "అగ్నిదేవతాక మగుఁగాక నక్షత్రమగునుగాక దక్షిణాయనంబు,
మంచిమూర్తమునకు మనము యోజింప సంవత్సరాంతమగును వాస్తవముగ, ౨౩౬

ఆ॥ మన్మథాగ్ని లేచి మామకదేహంబుఁ దగులఁబెట్టఁజొచ్చెఁ, దాళఁజాలఁ,
గరుణయుంచి యిపుడె కల్యాణమొనరింపు, మడిగినంత విత్త మిడుదునీకు" ౨౩౭

వ॥ అని వేగిరించుటయును నాక్షత్రియుండు ధనలోభంబునం జేసి యిష్టంబు లేమి దుఃఖార్తయు నశ్రుపూర్ణేక్షణయు నగు నాత్మజాత నగ్నిసాక్షికంబుగా నతని కంటఁగట్టి యాతనింబ యంపించె, మణిభద్రుండు తత్సుందరాంగిని దనయింటికిం దోడుకొనిపోయి వలదు కుయ్యో మొఱ్ఱో యని వాపోవుచున్నను బలాత్కారంబున సురతంబున కుపక్రమించి యనేకవిధంబుల బెదరించియుఁ బీడించియుఁ దెల్లవాఱు వఱకు కెల్లెల్లో తన వ్యసనంబు తాఁ దీర్చుకొనుచు నిదియేమియంత్యకాలమని యొక్కనాఁ

జీవాట్లు పెట్టుదురోయను నీర్ష్యం బరిచారకుల నందఱిని వెడలనడచి పుంస్త్వహీనుండగు పురుషునొక్కనిమాత్ర ముంచుకొని ౨౩౮

సీ॥ "పూర్వంబు మద్గృహంబున జీతమునకుండి ప్రీతిపాత్రుండైన భృత్యు నేని
కడుపు కాటుకకట్టఁ గట్టినకడ పెల్లఁ గలయఁదిర్గెడి బిచ్చగాని నేని
యింద్రియపాటవం బిసుమంతయును లేక వర్తించు ముదుసలివాని నేని
వ్రతశీలుఁడై యెల్లవాంఛల దిగనాడి చరియించుచుండెడి సాధు నేని
గీ॥ నాదుకడపలోనఁ బాదంబునిడకుండ నీ వహర్నిశములు నిలువరింపు"
మనుచుఁ గాఁపుపెట్టి తనదైన వడ్డివ్యాపారమునకు రాచబాటలోన ౨౩౯

వ॥ ఒక్క మేడయేర్పఱచుకొని పుత్రులుం దానును బగలెల్ల నందయుండుచు దురాత్ముండై పిల్లనిచ్చిన మామకుంగూడఁ బిడికెఁడన్నంబు పెట్టక కట్టు పుట్టంబులం దప్పఁ గాంత నేని కనకాభరణంబులం గైసేయక యామద్వయంబున కావాసంబున కరుదెంచి భార్యకును దనకును బ్రాహ్మణున కొక్కనికిని సరిపోవు తండులంబులం గొలిచిపోసి యన్నంబు తిన్నతోడన వ్యావహారికమందిరంబున కరిగి మరల సాయంకాలంబున కరుదెంచుచుండుటయు ౨౪౦

సీ॥ పాథఃప్రపూర్ణమౌ పల్వలంబుననుండి మహిమీఁదఁబడినట్టి మత్స్యభంగి
రవి యస్తమించినయవల నెటో త్యక్తవల్లభయౌ చక్రవాకిపగిదిఁ
బతిసంచరించెడి పథ మెఱుంగఁగలేక యల్లాడు నల రాజహంసిమాడ్కి
నతిభయంకరమైన యటవీస్థలంబులో మగఁడు మార్పడఁ గుందు మృగివిధమునఁ
దద్దురాత్ము పత్ని తాదృఙ్మహాహర్మ్య మంతటికిని నొకతయగుచు నెంత
వఱకుఁగూడఁ బ్రొద్దు జరుగమికిని నిత్య మమ్మలికము గుడుచుచుండవలసె, ౨౪౧

వ॥ అతం డహరహంబును నన్నమున కరుదెంచెడి యవనీసురుం జూచి ౨౪౨

తే॥ "బాపఁడా! మద్గృహమున నాపడెడియంత సేపుఁదలవంచుకొనియుండు, చెప్పినాఁడ,
నట్లు కాకుండఁ దలయెత్తి యస్మదబలవంకఁ జూచితివేని నీ బింక మనవు" ౨౪౩

వ॥ అని చెప్పుచుండెడివాఁడు, చెప్పుటయేకాక తలయెత్తి తనతరుణిం బరికించి నందులకై యనేకుల తలలు బ్రద్దలొనరించికూడ నున్నవాఁడు, దానంజేసి భీతిల్లి యెవ్వరును వానియింటికి భోజనంబునకుఁ బోవకుండిరి, యంతఁ గొంతకాలంబునకుఁ బుష్పదను భూసురుండు తీర్థయాత్రాప్రసంగంబునఁ దత్పురంబున కరుదెంచె, నతండుచూడ సొంపైనవాఁడును బూర్వవయస్కుండును, దారి నడచినడచి యూఁకలిగొని మట్టమధ్యాహ్నంబున నం దరుదెంచి యాయా గృహస్థులయిండ్ల కన్నార్థియై యరుగనరుగ నంద

అను మణిభద్రునింటికిం బొమ్మని చూపుటయు నతనిఁ గదియనేగి భోజ్యంబును యాచించి ౨౪౪

కం॥ "తలకాయ వంచుకొనియే సలుపఁగవలె భోజనంబు భూమ్యమరవర! యా
లలి సలుప కస్మదంగనఁ దిలకించితివేని పైని దెబ్బలువడెడిన్" ౨౪౫

వ॥ అని తాను నాజ్ఞాపింపఁబడి ౨౪౬

కం॥ వేదాధ్యయనమొనర్చితిఁ, బోఁదలఁచితిఁ దీర్థసేవఁ బొనరింపఁగ, నా
మీఁదట నాకలిగొంటిని, దాదృశుఁడ నీకేల యన్యదారనుఁ జూతున్" ౨౪౭

వ॥ అని వాక్రుచ్చుటయు మణిభద్రుండు మంచిదిరమ్మని తనవెంట రాజమార్గంబునం దోడ్కొనిపోయి ద్వారపాలకుఁడగు శాజ్ఞవాని సమీపంబునం దాబాపనిం గూర్చుండఁబెట్టి గృహంబునం బ్రవిష్టుండై పరిమితధాన్యంబు భార్యకుం గొలిచియిచ్చి దేవతార్చనచేసికొని వైశ్వదేవాంతంబున వసుధామరు నాహ్వానించి చరణంబులు గడిగి యర్ఘ్యపాద్యాదులాచరించి యన్నంబువడ్డించుటయు నతండు కూర్చుండి భుజించుచు నధోముఖుండయియె యంబుజసన్నిభంబులగు నతని యర్ధాంగి యంఘ్రులవలోకించి యవలోకించి వయోవంతుఁడగుట వలపుపట్టనేరక ముఖంబువీక్షించె, నంత మణిభద్రుండు కుపితుండై నపుంసకుంబిలిచి వీని విడంబింపుమనుటయు వాఁడువచ్చి ధరామరు శిరస్స్ఫోటనంబుగావించెఁ, దత్క్షణంబ యతఁడు నెత్తురుగ్రక్కుచు నేలంగూలుడుఁ దద్భృత్యుం డాయన పాదంబులు రెండుం బట్టుకొని జనసంచారభూయిష్ఠంబగు చతుష్పథంబువఱకు జఱజఱ నీడ్చుకొనిపోయె, నప్పు డప్పురవరంబునంగల ప్రజ లెల్లరు నది విలోకించి యత్యంతము హాహాకారంబునొనరించి, రందుఁ గొందఱు జాలిం దూలి చల్లనీళ్లుచల్లి చెవులుమూసిరి, యంతఁ గొంతవడికి నెట్టకేల కాబ్రాహ్మణుండు తెలివినొంది ౨౪౮

ఆ॥ "ఎవనిముల్లెఁగూడ నే దొంగిలింపను, నెవనియాలిమీఁద నేని పడను,
నిట్టివానిఁబట్టి కొట్టించె మణిభద్రుఁ, డార్యులార! చూడుఁడయ్య మీరు, ౨౪౯

ఆ॥ తీర్థములనుగుఱింకఁ ద్రిమ్మరుచున్నాఁడ, బ్రాహ్మణుఁడను, మఱియు బ్రహ్మచారి,
నట్టివాని నింటి కన్నంబునకుఁబిల్చి యిట్లొనర్చినాఁడు, హితమెయిద్ది? ౨౫౦

కం॥ ఱేఁ డెవ్వఁడు నీపురమున లేఁడొకో జనులార! యున్న లేశముగూడన్
గీడొనరింపనిబాపని మా డేలా పగులఁగొట్టు మణిభద్రుఁ డిటుల్" ౨౫౧

వ॥ అని విలపించుటయు జనులిట్లనిరి, ౨౫౨

శా॥ "రాజానుగ్రహపాత్రుఁడైన యితఁ డీర్ష్యాపూరితుండౌచు నీ
యోజం బెక్కురుజన్నిగట్టులను గుయ్యోయ్యనాఁగఁ గొట్టించె, ని

స్నీ జాల్మ ! యనలేఁ డొకండుఁ, గనుకం జింతిల్ల కేతెమ్ము, నిక్
బూజింపంగలవార మన్నమిడి యోభూదేవ ! మేమియ్యెడక్” ౨౫౩

—* పుష్పుండు సూర్యునివలన వరంబును బడయుట *—

వ॥ అనియిట్లు బోధించుటయుఁ బుష్పుండు క్రుద్ధుండై ౨౫౪

ఆ॥ “ ఈదురాత్మకునకు నేను బ్రీతిక్రియ యాచరించుదాఁక నన్నమును భు
జింపఁ గానఁ దెలియఁజెప్పుఁడీ యేదేవుఁ డిట వరప్రదుండొ యిద్ధమతులు!” ౨౫౫

వ॥ అనియడుగుటయు మఱియుఁ బ్రజలిట్లనిరి, ౨౫౬

తే॥ “ ఒక్కఁడే దేవుఁ డిచ్చోట నున్నవాఁడు శీఘ్రసిద్ధిప్రదుండయి క్షితిసురాగ్ర్య !
మఱియునొక దేవతయు నిందుఁ బరఁగుచుండె, భర్తలకు నా వెగూడ శుభంబు

వ॥ అనినవిని క్రమ్మఱఁ బుష్పుండు ౨౫౭ [ లొసఁగు, ౨౫౮

తే॥ “ ఎవ్వరా దేవి? దేవుండు? నీస్థలమున కెంతదవ్వనను న్నార? లేదిస్థాన?
మంతయును మీర లోజనుల్ ! సుంత కరుణయుంచి వాక్రువ్వుఁడయ్యా, నుతించువాఁడ,

వ॥ అని వేఁడుటయు వెండియుం బ్రజలు ౨౬౦

తే॥ “ అల చమత్కారపురమున యాజ్ఞవల్క్యసుప్రతిష్ఠితుఁడైనట్టి సూర్యదేవుఁ
డున్నవాఁడని మును వినియున్నవార, మనఘ ప్రత్యయకారకుండఁట యతండు,

ఆ॥ సవితృవారయుక్తసప్తమి నూటయెన్మిదిప్రదక్షిణములు మిగులభక్తి
హస్తధృతఫలముగ నా దేవునకుఁ జేయ నభిమతార్థసిద్ధి యగునటంద్రు, ౨౬౧

తే॥ అట్లు కాశ్మీరసంస్థితయైనయట్టి శారదాదేవిముందఱఁ జాలభక్తి
నుపవసించినయంతనే యొనరుసిద్ధి, యేమిగలదింకఁ జెప్ప మహీసురేంద్ర!” ౨౬౩

వ॥ అనినవిని యప్పు డచ్చోటనుండి చమత్కారపురంబునకరిగి సప్తమీభాను వాసరంబున స్నానంబొనరించి శుచియై సమాహితమతిం దద్యాజ్ఞవల్క్య ప్రతిష్ఠితుం డగు నాదిత్యున కేకైకనారికేళ ఫలప్రదానపూర్వకంబుగా నష్టోత్తరశత ప్రదక్షిణంబు లాచరించి క్షుత్క్షామకంఠుండును బరిశ్రాంతుండును దృఢభక్తియుతుండును నై తదగ్రం బునం గూరుచుండి “యదేతన్మండలంజపతి, సప్తయుంజంతి రథమేకచక్రం” మొద లగు మంత్రంబులును మఱియు సూర్యప్రీతికరంబులగు స్తోత్రంబులును మఱియొక భానువారంబువఱకు నుచ్చైస్స్వరంబునం బఠించినను దద్దేవుండు పరితుష్టుండు గాకునికిని బౌర్ణమాసీదినంబునఁ బరమవైరాగ్యమూని భూనామమంత్రంబున స్థండిలార్థంబుగా భూమి నుపార్జించి హస్తమాత్రంబగు స్థండిలంబు స్థండిలంబునం గల్పించి యగ్నిమీ ళేయను మంత్రంబున నం దగ్ని నారోపించి త్ర్యక్షః పరిస్తృణామి యను మంత్రంబున

బ్రహ్మాసనంబొసంగి సుత్రామాణ మను మంత్రంబున సమిధల స్థాపించి ప్రోక్షణ పాత్ర లాసాదించి సకలపాత్రలను స్రువాదులను యథాక్రమంబుగం బ్రోక్షించి యంత హవిస్థానంబున నిజతనువుం గల్పించి యాచార్యవిధానంబుచే నూర్గ్యాయత్వా యనుమంత్రంబున దేవతాస్థానమందు న్యాయమైన గ్రహణప్రోక్షణంబులు గావించుచు "అయంతఇధ్మఆత్మా" యనుమంత్రంబున సమిధల మంత్రించి "అగ్నయేస్వాహా, సోమాయస్వాహా, యను రెండుమంత్రంబుల రెం డాజ్యాహుతులు వ్రేల్చి భూర్భువ స్స్వయని వ్యాహృతిహోమంబొనరించి 'ఏతేశత"మున్న గు మంత్రంబుల దారుణంబుగా వ్రేల్చి దేవా! పత్యక్షుడగుమని యాహ్వానించి పదపడి శస్త్రంబుచే ఖండించి లోమంబులనుండియు దిశలనుండియు విదిశలనుండియు నిజమాంసములు హవిర్భుజుని యందు వ్రేల్చివ్రేల్చి తుద కాత్మనుగూడ వ్రేల్వంబోవుటయుసూర్యుండుప్రత్యక్షంబై సాదరంబుగా స్వకరంబునం బట్టుకొని ౨౬౪

చం॥ సలుపకువిప్ర! సాహసము, క్ష్మాస్థలి నెవ్వడు నెప్పుడేని యే
స్థలమున నిట్టిహోమమును సల్పియెఱుంగడు గాన నేను నీ
సలిపినదాని కెంతయును సంతసమందినవాడ, నేమిగా
వలయునొ చెప్పు, మీదగనివాంఛితమేని యొసంగిపోయెదన్" ౨౬౫

వ॥ అని యనుగ్రహించుటయుఁ బుష్పదంతుఁడిట్లనియె, ౨౬౬

కం॥ "తుష్టిం జెందితివేని మదిష్టం బొడఁగూర్చెదేని యి మ్మిరుఘుటికల్,
దుష్టాత్ముఁడొకఁడు నాకు ననిష్టము గావించెఁ, జని జయింపఁగవలయున్, ౨౬౭

సీ॥ క్షత్రియజాతినే జననమందెనుగాని కులమున కయశస్సు గూర్చినాఁడు
అర్థార్జనంబునం దాటితేఱెనుగాని పిసినిగొట్టుతనంబుఁ బెంచినాఁడు
వామనుండనుఖ్యాతి వడయఁగల్గెనుగాని కరము వైరూప్యముం గాంచినాఁడు
ముడతలువడ నొడలున్మదకుఁడయ్యెనుగాని స్త్రీమోహమునఁ బిట్టు చిక్కినాఁడు
పాడుదేహాభిమానంబు వీడలేక పరమనీచాత్మకుం డనంబడుచు సకల
జనులచే దూష్యమాణుఁడై జగతి వైదిశాఖ్యపురమున మణిభద్రుఁడనెడివాఁడు

తే॥ గుటికలను రెంట నొకదానిఁ గొంచు నేను బుక్కటం బెట్టుకొని యెన్ని పూఁటలుందు
నన్ని పూఁటలు మణిభద్రుఁడగుచు నుండవలయును వికల్ప మొక్కింత గలుగకుండ,

తే॥ వెండియును దాని నానోటినుండి తీసి యెపుడు రెండవదానిని నే ధరింతు
నపుడు నారూపమును నేన యందవలయు వాని చెడురూపు వానికే వదలిపెట్టి,

చం॥ ఇదియునుగాక వానియిలు నేఁజని చూచినయంతమాత్ర నే
పదిలముచేసిగుప్తపఱచు బంగరు వెండి ధనంబు ధాన్యమున్

విదితమునై చెలంగవలె, వేయివచింపఁగ నేల, వాని యా
స్పద మఖిలం బెఱింగి ప్రజ వాఁడె యనంగ మెలంగఁగావలెన్, ౨౨౧

ఆ॥ వానిరూపుదాల్చి వానిగృహంబులో నుండునపుడు తత్పరోత్తమమున
నెవని కేని భేద మేర్పడరాదుచూ సకలవర్తనమున సవితృదేవ!" ౨౨౨

వ॥ అనియిట్లు వరంబుఁ గోరుటయు భాస్కరుండు ౨౨౩

తే॥ "నోటధరియించుమాత్రన నూత్నరూపమలవడం జేయుఘుటికాద్వయము గ్రహింపు,
మొకటి నల్లని దందులో, నొకటి తెల్లనిదిగ నుండును బుష్పవనీసుపర్వ! ౨౨౪

క॥ నల్లనిఘుటికం బుక్కుట నల్లనధరియింప నతనియాకృతి వొడమున్,
తెల్లనిది దాల్పఁ గ్రమ్మఱఁ ద్వల్లలితాకృతి ఘటిల్లుఁ దప్పక నీకున్" ౨౨౫

వ॥ అని వక్కాణించుటయు వెండియుఁ బుష్పండిట్లనియె, ౨౨౬

ఆ॥ "అస్మదీయహృదయమం దొక్కసందేహ మేరుపడియె నోసురేశ! యిపుడు,
దానిఁ దీర్చితేని తప్పక నీకీర్తి విస్తరించు, దానివిను వచింతు, ౨౨౭

మత్తకోకిల॥ ఆదివారపుసప్తమిన్ ఫలహస్తుఁడై యొకనూటికి
నిమ్మఁద నెన్మిదివారముల్ రహి నీకుఁ దా వలగొన్నచో
నేదురాత్మునకేని మెచ్చి యభీష్టమిత్తువటంచు నే
వైదికస్థజనుల్వచింప దివాకరా! శ్రవణించితిన్, ౨౨౮

ఉ॥ పాపికి మూఢచిత్తునకె వైశమ సిద్ధియొసంగు నీవు యా
త్రాపరతం జతుశ్శ్రితులఁ దప్పక పాతము సేసినట్టి యీ
బాపని సప్తరాత్రు లుపవాసములం గృశియింపఁజేసి హా
మోపరి దర్శనంబిడి, తహా! యిది యేమికతంబొ చెప్పుమా" ౨౨౯

వ॥ అని యిట్లు ప్రశ్నించుటయు సూర్యుండు ౨౩౦

కం॥ 'తామసభావముతోడను నో మహిసుర! నీ విదంతయును జేసితి, విం
కేమని చెప్పుదు నీతోఁ, దామసమునఁజేయుపని వృథాయగుచుండున్" ౨౩౧

వ॥ అనివాక్రుచ్చి సూర్యుండు ఖండితంబులగు నతని యవయవంబులు నిర్వ
ణంబులుగా స్వకరంబున స్పృశియించి ప్రసన్నవదనుండై మఱియు నిట్లనియె, ౨౩౨

ఉ॥ ఇట్టులె సౌమ్యభావమున నెంతయు నర్కసమిత్కృశానుతల్
వెట్టి సహస్రవారములు వేల్చినవాని మనంబులోన ను
న్నట్టి సమస్తవాంఛలను నాతఁడు కోరనివానిఁగూడ నే
బట్టుమటంచు నిత్తుఁజుమి బ్రాహ్మణ! యున్ననిజంబుఁ జెప్పితిన్" ౨౩౩

వ॥ అనియిట్లు పలికి సహస్రాంశుఁడే మార్గంబునఁ జనినదియు నేర్పడకుండ దీపంబు
వోలెఁ గనఁబడక యచ్చటనే యంతర్ధానంబుఁ జెందె, ౨౩౪

—౿ మణిభద్రుఁడు రాజభటులచేఁ జంపఁబడుట ౿—

ఆ॥ పుష్పుఁడట్లు తమ్మిపూనేస్తివలనను ఘుటికలను గడించి కొలఁదిమీఱు
చిరబుభుక్షదీఱ విరివిగా భుజియించి వైదిశాఖ్యపురికి వచ్చి యంత, ౨౭౬
వ॥ నీలఘుటికం దన తాలువునఁ బెట్టుకొనుటయుఁ దత్క్షణంబ మణిభద్రుఁడై
కనుపట్టె, నంత సంతసంబునం బొంగుచు రాజమార్గంబునం జని మణిభద్రునింటం
బ్రవేశించి ద్వారపాలుండగు షండు దండకుఁజేరి వసనంబులు పసదనం బొసంగి
తే॥ "షండ! బహురూపములవాఁ డొకండువచ్చి నాదువేషము వేయుచున్నాఁడు వీట
వాఁడు మనయింటిలోనికి వచ్చునెడల నడ్డగింపుము, మోసమా నరుగుదెంచు" ౨౭౭
వ॥ అని యానతిచ్చుటయు వాఁడు వల్లెయని ద్వారంబు గాఁచియుండె, నంతఁ
బుష్పుండు మాహికాస్వామిని మణిభద్రు మగువం గాంచి ౨౭౯
ఉ॥ "మాహిక! యీపురంబునను మాజనకుండగు వీరభద్రుఁడు
స్నేహము దూలియుండెడి, నతండు ధరించినపాత్రచేలముల్
నాహృదయంబుగూడ మలినంబునొనర్పఁగఁ గానవచ్చి నేఁ
డీ హితబోధఁజేసెఁజుమి యెంతయుఁ గోపమునన్ బజారునన్, ౨౮౦
శా॥ "ఛీఛీ! తండ్రిని మోసగించి మిగులన్ సింగారియౌకన్య నో
నీచా! పెండిలిసేసికొంటి, వొక కానిన్ వాని కీఁజూడ,వా
సూచీమధ్యను ముందమోపి కరణిన్ శుక్లాంశుకచ్ఛన్నగా
నీచేఁ జేయఁగఁబడ్డ, దింత తినసేనిన్ దాని కీరావొకో, ౨౮౧
ఉ॥ కావున దానితండ్రికిడు గట్టిగ వే పదివేలమాడలీ,
వావిరిఁబోఁడి సంతసిల నాత్మ రుచించినయన్ని కొన్నిగల్
శీవినొసంగు, సంతసములేనిచి గర్భముదాల్ప, దాత్మజా
భావముచేత వంశము దివంబుననుండియుఁ గ్రిందికింబడున్, ౨౮౨
కం॥ చిరకాలమునుండియు సత్పురుషులకున్ నిలయమైన పూతాన్వయమున్
గొఱివివలెఁ దగులఁబెట్టకు, కొఱమాలినవాఁడవౌదు కొడుకా! తుదకున్"
కం॥ ఏతత్పితృపదేశము నాతిరో! నాలొభ్యమునకు నాశకము, భవ
చ్చేతఃప్రీతింజేతును, దేతెమ్మిఁక నింటిలోని దివ్యాంబరముల్, ౨౮౪
కం॥ వ్యవహారంబులలోపల నవనీపతిమెప్పువడసి యార్జించిన వ
స్త్యావి, యతనికరుణ నాపయి యువతీ! పంచాంగమగుచు నుండెడి నెపుడున్,
ఉ॥ ఈవిఁక వాని నంగముల నెల్ల ధరింపుము, వస్త్రభూషణ
ప్రావృతచారుదేహవయి హర్షపయోధిని నోలలాడు, మి

ఉ॥ రెండవపూరుషుండు పోసరించెను నైహికసౌఖ్య మెంతయున్,
కొండిజరీచెఱంగుగల వింతదుకూలములుం బసిండితో
నిండిన దండి క్రొన్నగలు నేఁడె యొసంగినవాఁడు, రేపు మా
తండ్రికి నిత్తునన్న కలధౌతము నీయఁగలాఁడు, కావునన్ ౨౧౮

కం॥ ఇతఁడే నా పెనిమిటియని కుతుకంబునఁ జేయిపట్టుకొనియెద నింకన్
మతిహీనుఁడైన ప్రథముని బతియని నేఁ బడయునట్టి భాగ్యము లేమిన్" ౨౧౯

వ॥ అని తనలోఁ దాననుకొని రత్నకాంతుండు ప్రథమమణిభద్రుంగాఁ దెలిసి
కొని ద్వితీయుని కరంబు గ్రహియించి జనులందఱు శ్రీవణింప ౨౨౦

కం॥ "నను నాతండ్రి యథావిధిఁ, దనకొసఁగిన వహ్నిసన్నిధానంబున నీ
యనఘుఁడ ననుఁ బెండ్లాడెను జననాథ పవిత్రవంశజలధిశశాంకా!

ఆ॥ ఈద్వితీయుఁ డధముఁ డెంతయు వేషము దీర్చి కడపకడపఁ దిరుగుచుండు,
నింటిలోకివచ్చి యేమేమొ యడిగికొం చగడువిడిచి తుదకు మగఁడ యయ్యె"

వ॥ అని వాక్రుచ్చుటయుఁ బార్థివుండు మణిభద్రుఁ జెట్టునకు వ్రేలాడఁగట్ట
నాజ్ఞాపించి వధకులవశంబు గావించె, నతఁడు వృక్షసమీపమునకుఁ గొంపోవఁబడుచు

సీ॥ "కలుగనే కలుగదు కలిగెనేబో నిలువదు కరుణ దంతావళగామినులకు,
విడువనే విడువదు విడిచెనేబో వడియదు ద్రోహచింత మృణాలబాహువులకుఁ
దొలఁగనే తొలఁగదు తొలఁగెనేబో వలుగదు కుటిలభావము పుష్పకోమలులకు,
నుండనే యుండదట్లుండెనేబో నిండదాచారంబు భామినీసంఘమునకుఁ
దొయ్యలుల, కివి తోఁబుట్టు దుర్గుణములు పైకి గురిగింజలంబోలె బాగుగానె
యుండుదురు కాని లోపలనున్న దంతయు విషంబు పరీక్షింప యుగ్మలులకు.

తే॥ శుక్రనీతిని సాంగిరసుం స్మృతులను బ్రకట మన్వాదిధర్మశాస్త్రములయందు
మఱచియైనను స్త్రీబుద్ధి నంచితమని చెప్పఁబడియుండ దవ్వారిచేత నచట,

తే॥ అమృత మధరోష్ఠమున హృది హాలహలము నిండియుండు సదా యాఁడుముండలకును,
దానఁజేసియె యధరోష్ఠపానమునకుఁ బూని హృదయంబు మర్దింతు పురుషవరుల

తే॥ లత్తుకంబోలి రక్తుఁడై లలిఁ బీను కాముకుని స్త్రీపిశాచముల్ కాళ్ళపైని
బలిమిఁ బడవైచికొందు, రాపాపకారిణుల కకృత్య మెయ్యది గలిగియుండు,

తే॥ దుష్క్రియాసుమభరితంబు దుర్గతిఫలమైన సంసారవిషశాఖి కబల మూల,
మట్టివాఁ డది కడు దూరమందు నేని గానఁబడ వేని కింకఁ బీడ గలుగకుండు,

తే॥ సంసృతిమహాటవీస్థలీసంచరణము నగ్నిదేవప్రదక్షిణవ్యాజమునను
దనదు ప్రథమసమావేశమునసె వనిత చూపు మగవాని, కద్దాని జూడనగునె,

ఆ॥ నిత్యవర్తియైన నిర్దయత్వమునను జాడ్యకృత్యమునను స్వకులమెల్ల
నిందపాలుసేయుచుందు రీసుందరుల్, కుందవలదె వీరిగుణములకును,
తే॥ పూర్వికుల్గడియించిన భూరికీర్తి ధవళితములగు నిజకులత్రయాగృహముల
నల్లఁజేయు నకృత్యంపుఁజెలువలన దీపపుంగొడవిధమునఁ దీఁగఁబోఁడి,
సీ॥ పురుషహృత్పద్మముల్ పొంపొరి ముకుళింపఁగఁజేయఁ జంద్రముఖాంతిగాఁగ
ధర్మసత్ప్రేమమౌ ధరణిపైఁ బెళ్ళఁగఁ గూలఁద్రోయుట కొరుగాలిగాఁగ
గామార్ణవంబులోఁ గాలు వెట్టుటయును వెస లోపలికినీడ్వ మొసలిగాఁగ
మోక్షంబు పేరిటి ముఖ్యమౌ నగరంపు మార్గంబునకు గడిమ్రానుగాఁగ
సంతతిచయంబునకుఁ జెఱసాలగాఁగ ఘన త్రివిష్టపస్థితి కొక్క కర్తగాఁగ
ఘోరసంసారవిపినవాగురయుఁగాఁగ బ్రహ్మచేత సృజింపఁగఁబడియెఁ బడఁతి
కం॥ మగవారిని బంధింపఁగఁ దగుసాధన మింతయేని దక్కటి దేవ
ద్భగవానున కగుపడమిని వగలాడి సృజించె సుదృఢపాశముగాఁగన్" ౨౩౦

వ॥ అను పద్యంబులు చదువుచు బహుప్రకారంబుల విలపించి స్త్రీనిగూర్చి
చింతించి ౨౩౧

సీ॥ "సంసారసంబంధి సౌఖ్యంబు లేనియు ననుభవింపఁగనైతిఁ దనివిదీఱ,
గడు లోభిఁగుచు నొక్కడ నేని యింత దానముఁజేసికొనఁగనైతి విమలమతిని,
నొక్కదినంబేని జక్కఁగాఁ గూర్చుండి జపియింపఁగానైతి శైవమనువు,
జ్వలితాగ్ని నాజ్యాహుతుల భక్తి నేనాఁడు వ్రేల్పఁబూనఁగనైతి విధియుతముగఁ,
గావలసినంత విభవంబు గలిగియుండియును బొనర్పఁగనైతి నే నొక్కసుకృతి,
గడియ తీఱిక లేకుండఁ గాలమెల్ల వ్యర్థపుచ్చితి నకట! ధనార్జనమున, ౨౩౨
తే॥ లోభికిం దుల్యుఁడగు దాత లోకమునను బుట్టియుండఁ, డింకెన్నఁడుం బుట్టఁబోఁడు
తాను దన ధనమును జేతఁ దాఁకనైనఁ దాఁక కితరుఁ కర్పించు ధన్యుఁ డతఁడు, ౨౩౩
కం॥ దానము భోగము నాశము మానుగ నివి మూఁడుగతులు మహిఁ ధనమునకున్,
దేని నిడఁడో భుజింపఁడో దానికి మూఁడవదియైన ధ్వంసమె గతియౌ, ౨౩౪
ఆ॥ ద్రవ్యవంతుఁడయ్యు దాతగాకుండెనో క్షితి దరిద్రులందుఁ జేర్పఁబడును,
దాహమార్తునికిఁ దత్సముద్రము నిర్జలప్రదేశముగఁ దలంపఁబడదె, ౨౩౫
కం॥ ఎపుడును వచ్చుచుఁ బోవుచు నపయుక్తంబయి ధనంబు యోగ్యులయొద్దన్
విఫలవ్యధాన్వితంబగుఁ, గృపణునికడ నిరువోవుఁ గిమ్మనకుండన్, ౨౩౬
కం॥ దీనుల కీవలెఁ దినవలెఁ గానీ సంచయము తగదు కలిమి ఘటిల్లన్,
మ్రానుల నీగలు కూర్చిన తేనియ పెరజనులు త్రావి తృప్తులు కారే, ౨౩౭

తే॥ ఏది యాచింపఁబడి యర్థి కీయఁబడదొ యేది యజ్ఞంబులోన వ్యయింపఁబడదొ
యా కదర్యసురక్షితం బైనధనము చోరపార్థివగృహముల జేరుచుండు,

ఆ॥ దానమే గుణంబు ధనవంతులకుఁ జూడ దాతలకు గుణంబు ధనసమృద్ధి,
రెండుగూడ నొకట నుండక యున్నచో నగును మోస, మిది యథార్థ మరయ,

ఆ॥ పసవుఁజెలిమినయు నఁ పతిసలక్షం గూడ భోగ్యగాక భార్యపోల్కి నెపుడు
నొంటినియుంటిలోనె యుండెడి లక్ష్మిచే నేమి వేయఁబడెడి నెంచిచూడ, ౭౮౦

కం॥ జనులకుఁ బ్రాణాధారము ధనమే యగుఁగాని భక్ష్యతతిగా దరయన్,
ధనిమైన లోభి యతిశయ ముననే ధరియింపఁబడెడి భూమి నిజముగఁ ౭౮౧

తే॥ పసిడికొట్టులకృపచేతఁ బృథివిఁ దాను మోయుచున్నాఁడు గూఢపాపాన్వయుండు
తత్ఫణీంద్రుని యూషచేతను ధనంబు భూగతంబొనరింతురు పూనివారు" ౭౮౨

వ॥ అని తన్నుఁదాఁ దిట్టుకొని బహుభంగులం బ్రలపించు మణిభద్రుం బట్టుకొనిపోయి రాజభటులు నిష్ఠురంబుగం దిట్టుచుఁ గొట్టుచును వ్రేలఁగట్టుటయు ౭౮౩

— పుష్పుండు మణిభద్రుని గృహక్షేత్రాదులు స్వాధీనము చేసికొనుట —

తే॥ పుష్పుఁ డుమశంకతూర్యము లొప్పమ్రోలఁగ మాహికాఖి శ్రీమైన హర్మ్యమునఁగూడి
బంధువులు వెంటరా మోదమందుచును సరగనరిగెను మణిభద్రు సద్మమునకు,

వ॥ ఆదిత్యు ననుగ్రహంబున నొక్కండును నతని వాస్తవస్థితి యెఱుంగకయుండ నట్లు పితృపైతామహంబగు మందిరంబునకుం బోలె నరిగి తన్మధ్యంబునం గూర్చుండి బంధుల నందఱ బిలిచి ౭౮౪

ఉత్సాహము॥ గ్రాసువిరకనుండి యొకగి తా నదీగులక్ష్మి నేఁ
డీను ధర్మ మాటవలన నెట్లొ నిల్చెఁ బ్రహ్మఁడున్,
దీనముగను వెదకుచు నేను లౌల్యమూనుటన్
బాసిపోవదు డెలక్ష్మి బాగుగా నెఱింగితిన్, ౭౮౫

కం॥ కావున మద్బంధువులకు దేవబ్రాహ్మణులకును నుదీర్మైశ్వర్యం
బే విభజించి మొసంగెదఁ, బోఁడెవెఁదఁ బెనితనము పూర్తిగ నింకన్,

వ॥ అని యొకరికిఁదగినరీతి వారికి వస్త్రభూషణంబు లొసంగి వేదవిదులగు విప్రులం జేరు పేరునఁ బిలువఁబంచి యొక్కొక్కరికొక్కొక సేబుజోడు సదక్షిణంబుగా సమర్పించి యాటపాటలవారికిని విశేషించి యాంధపంగ్వాదులకు నన్నంబు వెట్టించియు నంతుకంబు లిప్పించియు నందఱం బుచ్చివైచి తరుణియుం దానును భుజిం

ఆ॥ ఇంతవఱకు నీవు కోరికించుకయైనను బంచబాణసుఖముఁ బడసితివి యుఁగ,
మసలియొద్ద నేమిముచ్చటఁ దీరు, నీ కగ్గమైతి స్వేచ్ఛ ననుభవింపు॥ ౨౫౯

వ॥ అని వాకుచ్చుటయుఁ బుష్పుండిట్లనియె, ౨౬౦

ఆ॥ "యుష్మదవయవముల నొగిఁ బ్రవేశింతునా? యైక్యమందుదున త్వదంగమందుఁ
బెద్దకాలమునకుఁ బ్రేయసీ! లభియించి, తేమిసేయఁదోఁప, దేమనందు" ౨౬౧

వ॥ అని పలికి మన్మథవశుండై మైథునంబున కుపక్రమించి యెంతప్రొద్దు చని నదియు నెప్పుడు తెల్లవాటినదియు నెఱుంగనేరక యింతియుం దానును నేకాకృతిని భజించి యిత్తుఘనుఁ కలాశిక్షాదక్షులై యనుం డదయించుటయు నల్లయుండ మెల్లన నోటంబెట్టుకొని మరల మణిభద్రురూపంబు ధరియించి యట్లు పగలెల్ల మణిభద్రుండును రాత్రిఁ బుష్పుండును నై పెద్దకాలముండి కొడుకులను బిడ్డలను గొడుకుల కొడుకులను గాంచి వృద్ధుండై ౨౬౨

ఆ॥ "మాయఁబన్ని నేను మణిభద్రుఁ జంపించి మగఁడనైతి వాని మానవతికి,
సంతుగూడఁ గంటి, నెంతయఘమిమ్మది, హాటకేశ్వరమున కరుగువాఁడ, ౨౬౩

## —• పుష్పాదిత్యమాహాత్మ్యము •—

వ॥ అని చింతించి కొడుకులకు వేఱువేఱ భాగంబులు పంచియిచ్చి లెక్కలేని రొక్కంబును గొంచుఁ జమత్కారపురంబున కరిగి యాదిత్యున కాలయంబు గట్టించి సర్వాంగక్షౌరంబుఁ జేయించుకొని చాతుశ్చరణబ్రాహ్మణులకు సతీసహితంబుగా సాష్టాంగపడి ప్రాయశ్చిత్తముచేయించుటకును దద్దేవునకుఁ బుష్పాదిత్యసంజ్ఞం బొనరించుటకును బ్రార్థింప వారలు

ఆ॥ "త్వచ్ఛుద్ధికొఱకుఁ దగిన ప్రాయశ్చిత్త మాచరించువార మంతెకాని
యాజ్ఞవల్క్యకీర్తి హరియించుటకుమాత్ర మేము నిశ్చయముగ నిష్టపడము"

వ॥ అని చెప్పుటయు నందు మధ్యస్థవృత్తులగు మఱికొందఱు ౨౬౪

కం॥ "ప్రాయశ్చిత్తనిమిత్తము దేయుం బొకలక్షధనము ద్విజతతి, కటులే
యీయాదిత్యుని వృత్తికినై యిమ్మొకలక్షతీర్త మభిలషితంబుల్" ౨౬౫

వ॥ అని యందఱుంగలసి లక్షద్వయపరిమితధనంబు పుష్పునివలనం గైకొని తదారాధితుండగు దేవుఁ బుష్పాదిత్యసంజ్ఞం బిలువఁదొడంగిరి, యాజ్ఞవల్క్యప్రతిష్ఠితుండైనను నాదేవునకుఁ బుష్పాదిత్యసంజ్ఞ యీవిధంబుగా నేర్పడినది, ౨౬౬

## —పురశ్చరణసప్తమీవ్రతవిధానము—

సీ॥ పుష్పాదిత్యుఁడటంచుఁ బేరుఁగొని యాభూదేవు లాభాస్కరున్
బుష్పా ద్యర్చితుఁ జేయుచుండుటయు సంపూర్ణప్రమోదంబుతోఁ
బుష్పం దమ్మణిభద్రు భూమిపతిచేఁ బోకార్పఁగం జేసి త
త్పుష్పాంగిన్ హరియించుటాది సకలంబున్ స్వీయవృత్తాంతమున్ ౧౬౯
వ॥ వక్కాణించుటయు వార లలిగి ౧౭౦

కం॥ "చీపాపిష్ఠుఁడ! నీకిఁక నేప్రాయశ్చిత్తముండ, దీనీవిత్తం
బీపాటఁ దీసికొనిచను, నీపాలిట బ్రహ్మహత్య నిలఁబడియుండెన్, ౧౭౧
తే॥ భూసురుఁడు క్షత్రియుఁడు బేరి మూవురును ద్విజాతులని స్మృతిశాస్త్రవిచక్షణులు వ
చించుదురు కాన క్షత్రియుఁద్రుంచినట్టి యీవు బ్రహ్మఘ్నుఁడైతి విసీ కుశీల!"
వ॥ అని నిందించుటయుఁ బుష్పాంగుఁడు దుఃఖించుచు బ్రహ్మస్థానంబునుండి
బయలువెడలె, రోరూయమాణుండగు నతని విలోకించి నాగరబ్రాహ్మణులు కొందఱు
సీ॥ "సర్వజ్ఞప్రతిముండు గానిద్విజుఁ డీస్థానంబునం దుండఁ, డా
యుర్వీదేవులయిండ్ల లేని స్మృతిముఖ్యోద్గ్రంథము ల్గాన రా,
వీ ర్వీక్షింపుఁడు వానిఁ బ్రాజ్ఞులుకరం, బేదేనిసంశుద్ధి యా
పూర్వాచార్యులు వ్రాసినట్టిసుకృతు ల్బోధింపఁగంగల్గెడిన్" ౧౭౪
వ॥ అని వాకుచ్చుటయుఁ జండశర్మయను నొకబ్రాహ్మణుం డిట్లనియె, ౧౭౫
తే॥ "ఏను స్కాందపురాణమం దెప్పుడును బురశ్చరణసప్తమియటంచు రమణఁ జదువు
చుందును, బురశ్చరణమునసుండిపోలె దానసుండియుఁ బోవుఁ బాతకము, నిజము,
కం॥ కానఁ బురశ్చరణాభిధమై నెగడెడి సప్తమిని మహాశ్రద్ధమెయిన్
దానొనరించును గావుత, మేనఃక్షయమగును వెంటనే రూఢముగన్, ౧౭౭
తే॥ ఇదియునుంగాక తన్మేదినీశ్వరుండె భటులచేతను మణిభద్రు బ్రాణములహ
రించెఁగావున బాప మేతెంచునెడల దానికిన్ బాధ్యుఁ డాతండె తథ్యముగను,
తే॥ ఎవఁడు న్యాయాధికారియై వ్యవహృతిఁగల నిజమెఱుంగక నేరంబు నిర్ణయించి
శిక్షఁ జెప్పును దాన సంసిద్ధమైనపాతకంబున కాతఁడే బాధ్యుఁ డరయ, ౧౭౯
తే॥ మఱియు నాతండ్రి భూసురమధ్యమునను బ్రీతి నీతనికిచ్చి నా పెండ్లిచేసె
ననుచు వచియించె నాతని యర్ధదేహి యాపె కే కాక యెవరి కాయఘము చెందు ?
కం॥ ఆపకృతుఁడైయీతఁడు తా నపకృతి గావించెను గుడ, నా హేతువునన్
విపరీతము గాదిది, యిఁక సుపథముగనె నిశ్చితంబు సుజ్ఞానులచేన్, ౧౮౧
కం॥ కృతమునకుం దగుమాదిరి ప్రతికృతియును హింసమునకుఁ బ్రతిహింసనమున్
గృతమైన దోషముండదు, హితము యగును దుష్టు దౌష్ట్యవ్యాహృతుఁ జేఁత కనన్"

వ॥ అనియిట్లువాక్రుచ్చుటయు భూదేవులు ౮౮౩

తే॥ "అట్టులగుచో ద్విజోత్తమ ! యా పురశ్చరణసమాహ్వయసప్తమి రమణ మీవ
రాజునకు నీవు వాకొను, రమణ దానివలన సంశుద్ధుఁడయ్యెడు వడి నితండు" ౮౮౪

వ॥ అనిపలుకుటయుఁ జండశర్మ యతని కదివచియించె, నతండు దాని నాచరించి యొక్క సంవత్సరమునకు గతకల్మషుండయ్యె" ననిన మునులిట్లనిరి, ౮౮౫

ఆ॥ "ఆ పురశ్చరణాభిధమైనయట్టిసప్తమిని నెట్టివేళను సలుపవలయు ?
సలుపువేళను దానికి వలసినట్టి విధియదెట్టిది ? చెపుమయ్య విస్తరించి" ౮౮౬

వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు సూతుండు ౮౮౭

తే॥ "రోహితాశ్వుఁడడుగ రూఢి నా మార్కండముని వచించెఁ బూర్వమునను దీని,
నిపుడు మిమ్ముఁగూర్చి యే వచియించెద, వినుఁడు శౌనకాదిమునులు! మీరు, ౮౮౮

వ॥ మార్కండమహామునిని హరిశ్చంద్రకుమారుండగు రోహితాశ్వుండు డగ్గతి

కం॥ "తెలిసియొ తెలియకొ జన మియ్యిలపై నొనరించుపాప మేమార్గమునన్
దొలఁగంగలదో యించుక తెలుపంగదె సంయమీంద్ర ! తేజస్సాంద్రా! " ౮౯౦

వ॥ అనియడుగుటయు మార్కండేయుండిట్లనియె, ౮౯౧

ఆ॥ "మానసిక మొకండు మఱి వాచికము రెండు కాయికంబు మూఁడుగా నఘంబు
మూడువిధములుగను భువిలోన జనులకుఁ గలుగుచుండుఁజుమ్ము కాశ్యపీశ! ౮౯౨

కం॥ వాని వినాశనమునకై భూనాయక! మూఁడుపాయములుగల, వవి నీ
కేనువచించెదఁ గర మవధానముతోఁ గూరుచుండి తప్పక వినుమా, ౮౯౩

కం॥ మానసమై యేపాపము మానవులకు సంఘటించు మహిఁ బశ్చాత్తా
పానంతర మదియుండదు క్ష్మానాయక! నిముసమేని సత్యంబిదిమా, ౮౯౪

ఆ॥ వాచికంబు వేగపడి యాచరింపక మది విమర్శచేసి మానవుండు
మానుకొనినయెడల మాసెడి నయ్యది యర్కతేజ! రోహితాశ్వరాజ! ౮౯౫

ఉ॥ కాయికపాతకంబు ద్విజకాండమునొద్దకు నేగి చెప్పి యా
ధీయుతు లాజ్ఞ యిచ్చినవిధిం గృతనిష్కృతి యైయొ లేక భూ
నాయకుచే విమృష్టుఁడయి న్యాయ్యపుఁబద్ధతిఁ దత్సుశిక్షితుం
డైయొ తొలంగఁద్రోసికొననౌను యథార్థముగన్ మహీవిభూ ! ౮౯౬

ఆ॥ సిగ్గుచేత ద్విజులఁజేరి వచింపక రాజదండనంబు నోజనొంద
కెవఁడు మేనునున్న యేనస్సుతోడనే కూలు వానిశిక్షకుండు యముఁడె, ౮౯౭

కం॥ కావునఁ బాపాత్మకుఁ డిల జ్ఞానిబుధులనడిగి వారియానతి యెటులౌ
నావిధిఁ బ్రాయశ్చిత్తము గావించుకొనంగవలయుఁ గడుయత్నమునన్" ౮౯౮

వ॥ అని యిట్లు చెప్పుటయు రోహితాశ్వుండు ౧౯౯

ఆ॥ "అఖిలపాతకముల నపనయించుటకుఁగా నుపకరించు వ్రతము హోమవిధియొ
దానమో వచింపు దయఁ బురశ్చరణవివర్జితముగ నఘముఁబాయుపొంకె, ౨౦౦

ఆ॥ అనుదినంబు మర్త్యుఁడఖిల కార్యములలో సలుపు నింతో యంతో కలుష మొర్వి
వానికన్నిటికిని వరుసఁ బ్రాయశ్చిత్తమాచరించుకొనఁగ నలవియగునె?" ౨౦౧

వ॥ అనినవిని వెండియు మార్కండేయుండిట్లనియె, ౨౦౨

కం॥ "కలదు పురశ్చరణంబను కలుషఘ్నవ్రత మొకండు, గ్రహపతిహితమై
చెలఁగుఁ బురశ్చరణాహ్వయమిళితంబైనట్టి సప్తమీతిథి యధిపా! ౨౦౩

ఆ॥ ఆచరింపఁబడిన యద్దానిచే మేనఁజెలఁగుచున్నయట్టి చిత్రభానుఁ
డపనయించుఁ బ్రాగ్భవార్జితపాపంబ, యేతదుద్భవాఘ మేమిలెక్క, ౨౦౪

కం॥ కావున నేవాకుఱిచ్చిన యీవిధమునఁజేయఁగడఁగుమీ నరనాథా!
తావకదేహమునంగల యావత్కలుషమున ధుతుఁడవయ్యెదు వేగన్" ౨౦౫

వ॥ అనవుడు రోహితాశ్వుండు ౨౦౬

కం॥ యమివర! పురశ్చరణసప్తమి యేవిధిచేతఁజేయవలయునో మఱియున్
శ్రమమన కది సలుపందగు సమయంబెదో యానతిమ్ము శోధించి తులకిన్"

వ॥ నావుడు మఱియు మార్కండేయుండిట్లనియె, ౨౦౮

ఆ॥ "మాఘశుక్లసప్తమీఘస్ర మర్కవాసరసమేతమగుచుఁ బరగునెడల
మకరరాశిలోన మార్తాండుఁడుండఁగా నావ్రతంబుఁజేయనగును రాజ! ౨౦౯

శ్లో॥ పురశ్చరణకృత్యాయాం సప్తమ్యాం దివసాధిప!
ఉపవాసం కరిష్యామి అద్య త్వం శరణం మమ ౨౧౦

తే॥ ఆనెడిమంత్రంబు జపియించి యరుణుపాదుపుకంటెఁ బూర్వమ పలుదోమి యధిక
బలితపాషండజనములఁ బలుకరింపకుండ నుండంగవలె నాఁడహో నృపాల! [నిష్ఠఁ

తే॥ అంత నపరాహ్ణసమయమం దధికభక్తి స్నానమొనరించి శుభ్రవస్త్రములుదాల్చి
చిత్రభానుని ప్రతిమను సిద్ధపఱిచి దానికిం బూజగావింపఁదగు ధరేశ! ౨౧౨

సీ॥ మఱి పతంగాయ నమయని పాదములను మార్తాండయని జానుమధ్యమునను
దివసనాథాయని దీప్తగుహ్యమునను ద్వాదశాత్మాయని తత్సునాభి
పద్మహస్తాయని బాహువులను దీక్ష్ణదీధితేయనుచు హృద్వీథియందుఁ
గమలాభయంచును గంఠంబు తేజోమయాయయంచును మస్తకాంతరమున

పాదమాదిగ శీర్షపర్యంత మిట్లు రక్తపుష్పంబులను సమర్చనముచేసి
విధియుతంబుగ ధూపంబు వేసి యవల నెలమిఁ గప్పురహారతి నీయవలయు,
క॥ ఎఱ్ఱనివసనముచేతను బిఱ్ఱుగఁజుట్టంగఁబడిన పృథుపాత్రములో
నెఱ్ఱని బెల్లపుటన్నము నొఱ్ఱుగ నైవేద్య మవల నొసఁగఁగవలయున్,
ఆ॥ ఎఱ్ఱదారములను నెంతయు వింతగా వత్తిఁజేసి తైల మెత్తిపోసి
వేడ్కతోడ జ్యోతివెలిగించి యారాత్రికంబొసంగవలయు క్ష్మాతలేశ!
తే॥ శంఖముననుండి యుదకంబు సంగ్రహించి సఫలమును రక్తచందనసంయుతమును
నాచరించి యథావిధి నర్ఘ్యమీయవలయుఁ దదనంతరంబున వసుమతీశ! ౯౧౭
క॥ "తెలిసియొ తెలియకయో నాచే సలుపంబడియున్న యట్టి సకలాఘములన్
దొలఁగింపు మర్ఘ్యముంగొని బలుప్రాయశ్చిత్తమిది దివాకరదేవా!" ౯౧౮
క॥ అనియిటు సూర్యుం బూజితునొనరించి యనంతరమున నుర్వీసురపూ
జన మాచరింపవలయును ఘనముగఁ బుష్పానులేపగంధాదులచే, ౯౧౯
ఆ॥ కుడువఁబెట్టి శక్తికొలఁది దక్షిణనిచ్చి తృప్తుఁజేసి యవనిదేవునిట్లు
పుచ్చుకొనఁగవలయుఁ బో పంచగవ్యంబు కాయశుద్ధికొఱకుఁ గాను దాను
ఆ॥ దోసిలొగ్గియంత నాసూర్యభగవాను వంక నిశ్చలముగఁ బఱపిదృష్టి
వక్ష్యమాణమంత్రవరమును బఠియింపవలయు లోపితాస్య వసుమతీంద్ర! ౯౨౦
శ్లో॥ "ఇదంవ్రతం మయాదేవ గృహీతం పురతస్తవ
అవిఘ్నం సిద్ధిమాయాతు ప్రసాదాత్తవ భాస్కర," ౯౨౧
ఆ॥ మాఘమాసమాది మార్తాండదేవున కావిధమునఁ బూజయాచరించి
ఫాల్గునాది పుష్యపర్యంత మట్టులే చేయుచుండవలయు క్షితిబిడౌజ! ౯౨౨
ఆ॥ కుందకుసుమపూజ గుగ్గులుధూప మన్నము నివేదనంబు విమలగోమ
యంపుఁ బ్రాశనంబు నర్హంబులయ్యెడి ఫాల్గునంబులోనఁ బార్థివాగ్ర్య! ౯౨౩
తే॥ చైత్రమందున సురభిచే జరపి పూజ గుణిక నైవేద్యమును బెట్టి కోరి సర్జ
రసముతో ధూపమును వేసి రహిఁ గుశోదకమును బ్రాశన మొనరింపఁ గలుగు శుద్ధి,
క॥ మోదుగుపూలం బూజయుఁ గాదనక నివేదనంబు కలు మాంసంబున్
గా దధి ప్రాశన మొనరిచి యొఁదగు వైశాఖమునను ఘృతధూపంబున్, ౯౨౪
క॥ కలిగొట్టుపూలచేతను బెలుచన పూజించి పేలపిండి నివేదిం
చి లలిం గపిలాఘృత ముత్కలికం బ్రాశనముచేయఁదగు జ్యేష్ఠమునన్, ౯౨౫
ఆ॥ అవిసెపూలఁ బూజ యగరున ధూపంబు విమలధారికను నివేదనంబు
సలిపి ఘృతమొ మధువొ యెలమి నాషాఢమాసమునఁ బ్రాశనంబు జరుపవలయు,

ఆ॥ కడిమిపూలఁ బూజగావించి దగరపుంబొగల నెగయఁజేసి మోదకములు
లలి నివేదనంబు సలిపి గోమయజలాశనము చేయవలయు శ్రావణమున,
తే॥ జాజిపూవులచేతఁ బూజనముచేసి నఖసముద్భూతధూప మెంతయును వేసి
పాలు నైవేద్యమొనరించి భాద్రపదములోనఁ బాలనె త్రావనోఁ దానుగూడ, ౯ ౨౯
తే॥ ఆశ్వయుజమాసమందున నంబుజములఁ బూజ ఘృతపూరి నైవేద్యమును బొనర్చి
కుంకుమంపుఁబువుం బొగకుఁ విధించి కప్పురము ప్రాశనముచేయనొప్పు భూప!
కం॥ తులసిం బూజ నివేద్యము కలకండయుఁ బొగకు రమ్యకౌసుంభికముఁ
వలయు లవంగప్రాశన మల కార్తికమాసమున మహావీరనృపా! ౯ ౩౧
తే॥ గుంటగలిజేరుపూవులు గుడము పేణి వేడ్క నర్చనధూపనైవేద్యములకు
నోలి నుపయోగపఱచి కంకోలభోక్త కావలయు మార్గశిరమున గహ్వరీంద్ర!
కం॥ శతపత్రికచేఁ బూజన మతులితసహజంబు ధూప మల పౌషమునఁ
దతశుష్కలి నైవేద్యం బతిబల! ప్రాశ్యక్త మెల్లఁ బ్రాశ్యమ్మగుఁబో,
తే॥ ఇట్లు పండ్రెండుమాసంబు లినుభజించి యంతఁ దనయింటనుండిన యర్థమందు
సరిగ నాఱవభాగంబు సర్వపాపశుద్ధికై యీయవలయు భూసురున కధిప!
కం॥ తరువాత శక్తికొలఁదిగ ధరణీసురవరుల కన్న దానముగూడఁ
జరుపునది, యివ్విధము భాస్కరసప్తమిఁజేయఁ దొలఁగు సకలాఘములుఁ"
వ॥ అనియిట్లు మార్కండేయుండు రోహితాశ్వునకుం జెప్పినచొప్పునఁ జండశర్మ పుష్పునకుఁ జెప్పుటయు నతండును దద్వ్రతం బాచరించి నిజగృహంబునఁగల స్వర్ణరజతంబులను నిలరంబునను నాఱవపాలు సమర్పించె, నావిత్తభాజనంబు నాగరబ్రాహ్మణులు తిలకించి ౯ ౩౬

-: సూర్యవ్రతమునఁ జండశర్మాదులు బాహ్యనాగరు లగుట. -

ఆ॥ ద్రవ్యలోభమునను దక్కటిభూమిదేవులఁ దిరస్కరించి పుష్పునితఁడు
తానె పెద్దయగుచుఁ బూని ప్రాయశ్చిత్తశుద్ధుఁజేసెఁ జూడుఁ డిద్ధమతులు!
ఉ॥ ఆఱవపాలు తద్ధనమునందు గ్రహించినవాఁడుగాన నీ
వీటిడి బాహ్యభూతుఁడిక, వీనిగృహంబునకేగి యన్నముఁ
నీరముఁ బుచ్చుకొన్న యవినీతులుఁ జుట్టరికంబుఁజేయు న
వ్వారను నేఁటినుండి కులబాహ్యులుగా గణనీయు లెంతయుఁ"
వ॥ అని సమయంబుచేసి స్వనికేతనంబుల కేగుటయుఁ జండశర్మ పుష్పునుద్దేశించి ౯ ౩౯

కం॥ "ఈయుర్వీసురులందఱుఁ బ్రాయశ్చిత్తమునకిష్టపడుటనె నీకే
జేయించినాఁడ, నైనను న్యాయమె ననుఁ బతితుఁజేసినారలు వీరల్, ౯౪౦
ఆ॥ కాన మందు నిప్పుకలలోనఁ బడి నేను వేగఁ బ్రాణములను విడుచువాఁడ,
స్వజనులందఱిని విసర్జించి బ్రదుకుట కెంతమాత్ర మింక నిష్టపడను" ౯౪౧
వ॥ అని వాక్రుచ్చుటయుఁ బుష్పుండిట్లనియె, ౯౪౨
ఉ॥ ఇందులకై విచారపడ కీవు ద్విజోత్తమ! భూమిదేవతా
బృందము ద్రవ్యలోభమున నెగ్గొనరించినవారు నీకు, వా
రందఱు నెంతవిత్తమును యాచనచేతురొ యంతయిచ్చి నీ
జెందినయట్టి నింద్యతను శీఘ్రమపాపెద, నీర్ష్యయాపెదన్" ౯౪౩
వ॥ అనియిట్లు వాక్రుచ్చి సత్వరంబుగా బ్రహ్మస్థానంబునకుఁబోయి ౯౪౪
కం॥ ధనలోభంబునమీరలు ననుఁగూరిచి చండశర్మనామకునిపై నిం
దనుమోపితి, రటుగావునఁ గొనుఁడీ ధనమిత్తు మీరుకోరినయంతన్" ౯౪౫
వ॥ అనుటయు నాగరబ్రాహ్మణు లెల్లరుం గనులెఱ్ఱఁజేసి ౯౪౬
కం॥ "ఛీ ఛీ పాపాత్మ! నీ వాచాదోషమున జిహ్వ వ్రయ్యలగును బో,
మ్మీచండశర్మ సవిధిగఁ బాచితమొనరింపకునికి బాహ్యుండయ్యెన్, ౯౪౭
కం॥ ఒక్కఁడె ప్రాయశ్చిత్తము నిక్కము నొనరించి యితఁడు నింద్యుండయ్యెన్,
బెక్కురుబ్రాహ్మణులకుఁగా నొక్కనికిం బాచితంబు నొనరుపవశమే, ౯౪౮
ఆ॥ ఈయకార్యమునకు నెల్లపురాణముల్ స్మృతులు ధిక్కృతమ్ము లితనిచేత,
విత్తమునకు నితని వెలిచేయ దానికి మొగమువాయలేదు మూర్ఖ! పొమ్మ.
కం॥ ప్రాయశ్చిత్తము నలుగురుధీయుతులను గలిసికొని విధింపఁగవలెనం
చాయా స్మృతులు వచింపఁగఁ జేయించెనితం డొకండె శ్రేష్ఠుఁడననుచున్,
ఆ॥ కాన యుష్మదీయకల్మషమంతయు వచ్చి యితనియొడలు చొచ్చెనిపుడు,
దానఁజేసి మేము పూని బహిష్కారమును విధించినాము చనుమిఁకీవు, ౯౫౧
వ॥ అనివచించి స్వనికేతనంబులకుఁ జనుటయుఁ బుష్పుఁ డింటికేగి
కం॥ "ఎందాఁక సాహసింపదొ యందాఁకం బ్రజకు సిద్ధి యలవడ, దటుగా
నం దద్ద సాహసించెద నెందుఁ గృతఘ్నతకు స్థానమేర్పడకుండన్" ౯౫౩
వ॥ అనినిశ్చయించి సప్తమీభానువాసరంబునాఁ బుష్పాదిత్యునకు నూటయొని
మిది ప్రదక్షిణంబులొనరించి నిజాంగంబులు శస్త్రంబున ఖండించి వీతిహోత్రంబున
వ్రేల్చి కాయశేషంబుచేఁ బూర్ణాహుతిం బొనరింపఁబోవుటయుఁ బూష ప్రత్యక్షమై

ఆ॥ "వృష్ణ! సాహసమును బొనరింపకోయి నీయెడఁ బ్రసన్నుఁడైతి నిపుడు నేను,
మరల నీకు నేమికలయునో చెప్పుకో, మ్మిచ్చిపోవువాఁడ నీహితమును" ౭౫౫
వ॥ అనివాక్రుచ్చుటయుఁ బుష్పుండిట్లనియె, ౭౫౬
తే॥ "క్ష్మాసురశ్రేష్ఠుఁడైనట్టి చండశర్మ నాగరబ్రాహ్మణులచేత నానిమిత్త
మై బహిష్కృతుఁడయ్యె, నాయనను వారితో సమానునిజేయు మోత్రోయజాస్త
తే॥ శాస్త్రముంజూచియేనాకు శ్రద్ధతోడఁ బాచితంబొనరించె నాబ్రాహ్మణుండు,
అట్టులైనను వెలిపెట్టి రకట యతని నందఱుంగూడి యసహిష్ణులగుచువారు"
వ॥ అనవుడు సూర్యభగవానుండు ౭౫౭
తే॥ "నాగరబ్రాహ్మణుం డొక్కఁడే గరిష్ఠుఁ, డతనినుడి కన్యథాచేయ నలవిగాదు,
అందఱును నేకమై పల్కినట్టిమాట యన్యథాయాచరింపంగ నగునె వశము, ౭౬౦
ఆ॥ అగునుగాక, యీతఁ డవని బ్రాహ్మండన ఖ్యాతినంది కరము పూతుఁడగును,
నితనిసుతులుగూడ నెంతయు విఖ్యాతి రాజమాన్యులగుచు రాజిలుదురు,
ఆ॥ ఇతనిచుట్టములును హితులును నిట్టిరే యై చరించువార లనియెల్ల,
మత్ప్రసాదమునను ద్వాత్రింత్యవయనము స్రవణంబగును ధరామరేంద్ర!" ౭౬౧
వ॥ అనిపలికి యంతర్ధానంబుఁజెందుటయుఁ బుష్పుఁ డక్షతాంగుండై చండశర్మ
యింటికరిగి విపణ్ణవదనంబుననుండు నతని విలోకించి ౭౬౩

—: నాగరేశ్వరోత్పత్తి: —

ఆ॥ "నీనిమిత్తముగను నేఁ దనుత్యాగంబుజరుపుటకునుగూడ సమ్మతించి
సరసిజాప్తు సుప్రసన్నుని గావించుకొన్నవాఁడ, మెప్పుగన్నవాఁడ, ౭౬౪
శా॥ నీపాతిత్యము తత్కృపాబలముచే నేడేఁ తొలంగుంజుమీ,
నీపుత్రులొమ్మదలైన నీకులజులుల్ నిన్బోలి యీనాగర
క్ష్మాపీయూషభుగాళికంటె ఘనులై సంతుష్టినుం, డ్రందుచే
నా పుణ్యంపు సరస్వతీనదితటంబందుండు లేలెమ్మికన్ ౭౬౫
ఉ॥ ఉండుట కొక్కయాశ్రమము యోగ్యముగన్ రచియించి యందు నీ
యండను నేన యుండఁగల, నగ్గలపున్ ధనముండె నాకు, నీ
దండవసించునందఱిని దప్పక పోషణసేతుఁ గాన నీ
కుండిన మానసజ్వరము నో ద్విజవర్య! త్యజింపుమీ యికన్" ౭౬౬
వ॥ అనిన విని చండశర్మ పుత్రపౌత్రబంధుసమన్వితంబుగా నగరంబుఁజుట్టివచ్చి
నమస్కరించి కనులవెంట నీళ్ళుగార్చుచుఁ బుష్పుంగూడి యుత్తరాభిముఖంబుగం

బోయి సరస్వతీ దక్షిణతీరంబున బంధువులుం దానును నివసించి, రాయనకు నగరమున నుండునప్పు డిరువదియేడులింగంబుల నీక్షించినంగాని భుజింపనని దీక్షయుండెడిది, దాని స్మరించి రేయింబవళ్ళును హృదయంబు దహియింపఁబడ సరస్వతీనదిని స్నానమొనర్చి నమోంతంబుగాఁ బ్రతిలింగంబు పేరుం జెప్పుచు వేయువేల షడక్షరమంత్రంబు జపించుచుఁ బ్రత్యహంబును బంచాంగులశతకర్దమంబున నిరువదియేడులింగంబు లొనరించి పుష్ప ధూపానులేపనంబులం బూజించి దుస్థితమైనను సుస్థితమైనను శివలింగము కదలింపఁగూడ దని వానిమీఁదనే మఱువాఁడు సప్తవింశతిలింగంబులు సంస్థాపింపఁ గొంతకాలంబునకు గర్దమపర్వతంబగుటయు నతనిభక్తికి శివుండు సంతుష్టుండై భూమిం బగుల్చుకొని లింగ రూపంబున దర్శనం బిచ్చి ౯౬౭

ఆ॥ "చండశర్మ! నీదుసద్భక్తికిని మెచ్చుకొనినవాఁడఁ బ్రీతి నెనసినాఁడఁ,
గాన నేఁటినుండి కడుశ్రద్ధ నీలింగములకు విధియుతముగఁ బూజ జరుపు, ౯౬౮
తే॥ సప్తవింశతిలింగముల్ శ్రద్ధతోడఁ బూజసేయంగఁ గల్గెడి పూర్ణఫలము
గలుగునీ, కన్యులైనను గలుపనిట్లు కలుగుఁ దత్ఫల, మిఁక నేమిగలదు చెప్పు"

— • పుష్పుండు నాగరాదిత్యుఁ బ్రతిష్ఠించుట • —

వ॥ అని యదర్శనంబుఁ జెందుటయుఁ జండశర్మ తల్లింగంబున కాలయంబుగట్టించి నగరస్థలింగంబుల ప్రతికృతియగుట నాగరేశ్వరాఖ్య నర్పించి పెద్దకాలంబునకు విమానారూఢుండై శివలోకంబుఁ జేరెఁ, బుష్పుండును దత్తీరంబునం దాదిత్యుఁ బ్రతిష్ఠించి పూజించి యాదేవుండు దర్శనమిచ్చి వరంబు వేఁడుమనుటయు ౯౭౦

తే॥ అల చమత్కారపురమునం దలరునట్టి నీదు పండ్రెండుమూర్తులు నిర్జరులకుఁ
బూజ్యములు, వానిఁ బూజించి పొందుఫలము పొందవలె నీ భవన్మూర్తిపూజనమునందు
తే॥ ఆలయంబునుగట్టించి యందు నగరసంస్థితములకుఁ బ్రతికృతిసలిపియుంటి,
దీన నీమూర్తి నాగరాదిత్యసంజ్ఞ ఖ్యాతినందుచుఁ గాక లోకమున దేవ!" ౯౭౨

వ॥ అనిప్రార్థించుటయు నాదేవుండు వల్లెయని యంతర్హితుండయ్యె, నంతఁ బెద్దయుంబ్రొద్దునకుఁ బుష్పుండును విమానమధిరోహించి సూర్యలోకంబునకరిగె" నని వచించుటయు

క॥ విద్వత్కవితాదినిఖిల సద్విద్యావద్ద్విజవ్రజసముదాయ మహా
హృద్వాంఛాసంపూరణగద్వాలాద్యవనిపాలకప్రతిమవిభూ! ౯౭౪

గద్య॥ ఇది శ్రీ...జానపాటి పట్టాభిరామాభిధానసమాంధ్రీకృతంబగు
స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండంబున షష్ఠాశ్వాసము.

---



# నాగరఖండము.

## సప్తమాశ్వాసము.

క౦॥ శ్రీమల్లక్ష్మీగంగానామసుతాపాణిపీడనమహోత్సవద
త్తామూల్యసదుపధాచయ ! సామాత్యనికాయ ! శ్రీపరాంకుశరాయా ! ౧

ఆ॥ అవధరింపు, మవలియాఖ్యానమును జెప్పెదననుచు శౌనకాది మునివరేణ్యు
లడుగుటయును రోమహర్షణి పరమేశు హృదయమున స్మరించి యిట్టులనియె, ౨

—: చండశర్మభార్య శాకంభరిం బ్రతిష్ఠించుట :—

వ॥ చండశర్మభార్య, శాకంభరి సరస్వతీతటంబున దుర్గం బ్రతిష్ఠించి రేయుం
బవళ్ళు భక్తిచేఁ గొలుచుటయు నాయమ ప్రసన్నయై ౩

తే॥ " బిడ్డ ! నీచేయు తపమునఁ బ్రీతురాలనైనదానను, మంగళమగును నీకు,
నేమికోరెదో కోరుమీ వీక్షణమున నడ్డుచెప్పక సమకూర్చి యరుగుదాన " ౪

వ॥ అనవుడు శాకంభరి యిట్లనియె, ౫

తే॥ " హాస్యమునఁ బ్రీతిఁజెందెదేని హాటకేశమధ్యమస్థ చతుష్షష్టిమాతృగణము
లను బలులనిచ్చి భజియింప నొనరుసుకృత మీ త్వదర్చనకృజ్జన మెనయుఁగాక "

వ॥ అనివేడుటయు నాదేవి ౬

ఆ॥ " ఆశ్వయుజశుక్లపక్షమం దరుగుదెంచు నలమహానవమీదిన మధికభక్తి
నను సమర్చించువాఁడు నీమనసులోని ఫలము సకలంబుఁ బొందు నప్పటికి నపుడ "

వ॥ అనిచెప్పి యంతర్ధానంబుఁజెందె శాకంభరియను పేరఁ బ్రఖ్యాతయయ్యె,
నది మొదలుకొని సరస్వతీతీరంబునఁ బుత్రపౌత్రదౌహిత్రులతో వృద్ధిఁజెంది బహిష్కృ
తనాగర బ్రాహ్మణులు విద్యాధనంబులఁ జమత్కారపురబ్రాహ్మణులకుఁ దీసిపోక
మహోత్కృష్టులై వర్తించిరి, కొంతకాలంబునకు విశ్వామిత్రుండు శపింప సరస్వతి
రుధిరవాహినియై రక్షోభూతప్రేతపిశాచంబులచే సేవింపఁబడుటయుఁ దద్భక్ష్య
మాణులై బహిష్కృతనాగర బ్రాహ్మణులు నర్మదాతటస్థ మార్కండేయాశ్రమంబు
నకుఁబోయి వసించి " రని యిట్లుచెప్పుటయు ఋషులు ౭

— : గంగాజలంబుల శ్యామకర్ణంబులగు గుఱ్ఱములు పుట్టుట : —

కం॥ "ధీమచ్ఛ్రేష్ఠుండగు విశ్వామిత్రుం డేల నదికి శాపంబిడెఁదా ?
నేమి యపరాధ మొనరిచె నామునికి మహానది ? దయ ననఘా ! చెపుమా" ౧౦

వ॥ అని ప్రశ్నించుటయు సూతుం డిట్లనియె, ౧౧

కం॥ "కలిగెను విశ్వామిత్రున కలఘువసిష్ఠునకుఁ బూర్వ మత్యంతంబౌ
కలహము బ్రాహ్మణ్యముకై యిలామరవరేణ్యులార ! యేమందు నికన్,

వ॥ విశ్వామిత్రుండు క్షత్రియుండయ్యు బ్రహ్మఁదొట్టి బ్రాహ్మణులందఱ చేతను బ్రహ్మర్షిగాఁ జేకొనంబడియెఁ గాని వసిష్ఠునిచేతమాత్రము చేకొనం బడఁ, డందుచే నుభయులకును వైరంబుఘటిల్లె" నని యిట్లు వాక్రువ్వ వెండియు శౌనకాదులు.

కం॥ "క్షత్రియుఁడయ్యును విశ్వామిత్రుఁడు బ్రాహ్మణులలోన మేటి యటమ్యెన్,
ధాత్రభిమతుని వసిష్ఠుఁడుమాత్రము విప్రుఁడని యేలమన్నింపఁడు తాన్" ౧౪

వ॥ అనియడుగుటయు వెండియు సూతుం డిట్లనియె, ౧౫

ఉ॥ "ఉండెను మున్ ఋచీకుఁడను నొక్క మహాముని, ధాత్రి నంతయున్
నిండఁగ స్వీయకీర్తి ప్రతిష్ఠితుఁడై యతఁ డెంతయుం దపం
బుండుచుఁ దీర్ఘసేవ కనియోజఁ బ్రయాణము సేసి యేగె నో
క్కండ యొకప్డు భోజకటకంబను గాధిమహీశు వీటికిన్, ౧౬

వ॥ ఏగి యటనుండు కౌశికీనదిం గ్రుంకి తత్తీరంబునం దపించుచు సర్వావయవ శోభనయై యరుదెంచిన రాచకన్నియం బొడగాంచి మరుబారి కగ్గంబై ౧౭

ఆ॥ "ఎవరికూఁతురీపె ? యెందునిమిత్తమై యేగుదెంచియుండె నీస్థలమున ?
కెచటికేగుచున్న ? దింతయుఁ జెప్పుఁడీ వినఁగ వేడుకయ్యె జనములార !"

వ॥ అనియడిగిన జనులిట్లనిరి. ౧౮

కం॥ "ఏతత్త్రిలోక సుందరి ఖ్యాతుండగు గాధితనయ, కడుగుణవంతుం
డై తగు పెనిమిటిఁ బడయుటకై తా నేతెంచె గౌరి నారాధింపన్, ౨౦

ఉ॥ ఈనదియొడ్డునం జెలఁగు నెంతయు నున్నతమౌ దేవతా
మానితయైన హైమవతిమందిర, మచ్చటికేగి యీమె త
ద్ధ్యానముఖోపచారములఁ దద్దయు సల్పి శ్రవస్సుఖంబుగా
గానముఁబాడి మాపటికిఁ గ్రమ్మఱ నేగుచునుండు నింటికిన్" ౨౧

వ॥ అనినవిని యతండు గాధిగృహంబున కరుగుటయు నాపార్థివుఁడు సమ్ముఖంబుగం బోయి కృతాంజలిపుటుండై

తే॥ "నిస్పృహుండవైన నీవును నేఁ డదేలొ రాకఘటియించినది మునిరాజ! యిటకు
నుడువు మదియంతయును నాకుఁ దడయ కిపుడ, శ్రీమదిష్టంబు నెఱవేర్ప సిద్ధముంటి?

వ॥ అనినొడువుటయు ఋచీకుండిట్లనియె, ౨౪

కం॥ "వరవర్ణినియగు నీసుత సరగున నర్పించి పెండ్లిసల్పు మహీశా!
గిరిజగుడికడల నాబిడ దరిసించి స్మరార్తిఁ బడితిఁ దాళఁగఁజాలన్" ౨౫

వ॥ అనినవిని గాధి యయ్యది యసవర్ణవివాహమనియు నతఁడు దరిద్రుండు వృద్ధుండు ననియు నర్పింపకున్న నలుగుననియు నాలోచించి ౨౬

తే॥ "కన్యకాదానమున మాకుఁ గలదు శుల్క, మద్ది యొసఁగ దవేని మహాత్మ! నీకు
నాదు పుత్రిక నర్పించి న్యాయ్యమైనపద్ధతి వివాహమొనరించి పంపవాఁడ" ౨౭

వ॥ అని వ్యాజంబుఁ బన్నుటయు ఋచీకుం డిట్లనియె, ౨౮

కం॥ "చెప్పుము కన్యాశుల్కం బెప్పగిదిని దీసికొనుట కేర్పఱచితివో,
గొప్పదెయగుఁ గాకది, నేఁ దప్పక యీ సిద్ధముంటి ధాత్రీనాథా!" ౨౯

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయుఁ బార్థివుండు ౩౦

చం॥ "ఒకచెవి నల్లనై మిగిలియుండిన మై యఖిలంబుఁ దెల్లనై
ప్రకటితవాయువేగమునఁ బాఱెడిగుఱ్ఱము లేడునూరు లో
డక యెవఁడిచ్చు వానికి నిడంగలవాఁడను నాదుబిడ్డ, దీ
నికినిఁక భిన్నమార్గమున నేను బ్రవర్తిలఁజాల సంయమీ!" ౩౧

వ॥ అని వక్కాణించుటయు నమ్ముని వల్లెయని కన్యాశుల్కంబునకుం జని గంగాతీరంబునం బ్రవేశించి "అశ్వావోఢ" యను సూక్తంబును జపింప సర్వశ్వేతంబులును శ్యామైకశ్రవణంబులును నగు నేడునూఱుల గుఱ్ఱంబు లేడునూఱుల పాదులతోడం గూడి గంగాజలంబునుండి బయలువెడలె, నాఁటఁగోలె నయ్యది యశ్వతీర్థంబని విఖ్యాత, మంత ఋచీకుండు హయోత్తమంబుల భోజకటకంబునకుఁ దోలించుకొనిపోయి గాధి కొప్పఁజెప్పుటయు నాతఁ డవ్వానిఁ దీసికొని కూఁతునిచ్చి వివాహంబు గావించె, నట్లు పాణిపీడనంబు పరిసమాప్తిగా మునివర్యుఁ డావెతోఁ గాపురంబుచేయుచు సంతోష సమయంబున వరంబుగోరుకొనుమన నాకె పోయి తల్లికిఁ జెప్ప నాయమ యిట్లనియె,

కం॥ "తనయరో! నీపతి నీ కత్యనుకూలుండగుచు వాంఛితార్థం బిడుచో
ననఘంబగు బ్రాహ్మణ్యము నెనసిన యొకయాత్మజాతు నిమ్మను మిలమిన్, ౩౩

కం॥ పుత్రకులు లేకయుంటిని బుత్రీ! నే, నరిబువలనఁ బోయి త్వదీశున్
క్షత్రంబుగలిగి వర్తిలుపుత్రుని నాకును నొసంగఁ బురికొల్పఁగదే" ౩౪

వ॥ అనినవిని యాయువతి ఋచీకుని సమీపించి జనని చెప్పినదంతయుం జెప్పినవిని యతండు పుత్రేష్టియందు బ్రహ్మతేజస్సహితంబుగా నొకటియు క్షత్రతేజస్సహితంబుగా నొకటియు రెండు చరువులు సిద్ధపఱచి బ్రాహ్మ్యచరువు భార్యకిచ్చి ౩౫

క౦॥ "దీనిం బ్రాశించి కరీడ్యానా! యశ్వత్థపాదపాలింగనముఁ
బూనికఁ గావింపుము, సత్పూనునిగనె, దతఁడు బ్రాహ్మ్యశోభితుఁడగుఁ దాఁ,

క౦॥ రెండవచరువు త్వదంబ, దఖండన్యగ్రోధతరువుఁ గౌఁగిటనిడ నా
ఖండేందుఫాలకుం బుత్రుం గుదయించెడిని క్షాత్రరూపముతోడఁ, ౩౬

వ॥ అనిచెప్పిపంపుటయు నత్తరుణు లిరువురును సంతసంబునం బొంగిరి, పదపడి తల్లి బిడ్డంగూర్చి ౩౭

శా॥ "సామాన్యంపు స్వకార్యమందును జనుల్ శ్రద్ధాళులైయుండి శా
మేమాత్రంబో విశేషముంచుదురు పుత్రీ! కాన నమ్మాని వెం
డ్లామకా నీకిడియున్నయట్టి చరువుఁ మంత్రప్రభావాన్వితం
బై మీఱం బొనరింపకుండఁ, డిది సత్యంబయ్యెడిం, గావునఁ ౩౮

క౦॥ నాచరువు నీవుగొనిమును నీచరువును నాకొసంగు నీరేజముఖీ!
నాచెట్టును నీవేకొని నీచెట్టును నాకొసంగు నేస్తముతోడఁ, ౪౦

ఆ॥ దాన సామ్రాజ్యధౌరేయుఁడైనయట్టిసుతుఁడు నాకుజనించెడి శూరుఁడగుచు
భూమిసురమాత్రుఁడైనబోఁ బుత్రి! నీకు భూరిసంతోషమిఁజాలుఁ బుత్రుఁడరయ"

వ॥ అని చెట్లయెడలను జరువులయెడలను వ్యత్యయంబుగావించె నంత నయ్యింతు లిరువురును ఋతుస్నాతలై భర్తృసంయోగంబున గర్భంబులు ధరియించిరి, గర్భిణియైన యా త్రిలోకసుందరి చేష్టితంబుం దిలకించి ఋచీకుండు ౪౨

క౦॥ "ఛీ పాపిని! నీచేసిన యీపని యేమిటిది? నీకు నిచ్చినచరువుఁ
నీ ప్రసువునకిడి యాపెది సాపడితి యథేచ్ఛనీవు శ్రమ విఫలముగాఁ ౪౩

సీ॥ ఆపెకుంజెప్పిన యల వటవృక్షముం జేరి నీకౌఁగిటఁజేర్చినావు,
నారచీరల మూలఁ బాఱవైచి యమూల్యచీనాంబరములఁ గై సేసినావు,
కస్తూరిమొదలైన గంధవద్ద్రవ్యంబు లొడలినిండంబూయఁగడఁగినావు,
అవనీసురార్హమా నాచారములవీడి రాచకేవివహింపఁ జూచినావు,
వరుస జపముం దపంబును వదలినావు, అరుణుపొడుపున స్నానంబె మఱచినావు,
ఈదృశంబగు నీచేష్టలెల్ల నేను దెలిసి చీయనునందాఁకఁ దెచ్చినావు, ౪౪

సీ॥ శమదమంబులులెస్స సాధించి నీతల్లి పృథివిఁ దాపసినాఁగఁ బేరువొందె,
జపహోమములఁ జాల సల్పి యొప్పుఁ ద్వదంబ యుఘువినిర్ముక్తయం చనఁగఁబడియె,

గోప్పతీర్థములందుఁ గ్రుంకి నీజనయిత్రి పరిశుద్ధురాలునాఁబడియె జగతి,
స్వాధ్యాయపాఠముల్ శ్రవణించి నీయమ్మ ధీయుతియని పేరుదెచ్చుకొనియె,
క్షత్రియాంగన యిటు బ్రహ్మచర్యంబూన బ్రాహ్మణివి రాచకీవికిం బాలుపడితి,
కాన క్షత్రియుఁడే నీకుఁగలుగుఁబోమ్ము బ్రాహ్మణునిగాంచనావెయే పాత్రురాలు,
తే॥ వేఁక టొధరించు స్త్రీలు వేవిళ్ళననుసరించిరే తారు సంతతిఁ గాంచుచుందు,
రెట్టిభావంబు లయ్యెడ నేరుపడునొ యట్టిపుత్రుండుగలుగుఁ దదంగవలకు,
వ॥ అని వాక్రుచ్చుటయు నాయమ చేతులుజోడించి దీనవదనంబున నిట్లనియె,
మ॥ "భవదు క్తంబు యథార్థమయ్యెడిఁ బ్రభూ! బాహ్యంపుఁజిహ్నంబులె
య్యవియుం జూడక చెప్పుచుంటివి యతీతానాగతోదంతముల్,
భువిరాడ్బాలున కీవు తండ్రివగు టెప్డుం గూడ, దట్లాటచే
ప్రవరుండైన ద్విజుండె నాకు సుతుఁడై ప్రాలం బ్రసాదింపుమా" ౪౮
వ॥ అని యిట్లు నొడువుటయు బుచీకుండు ౪౯
తే॥ బ్రహ్మతేజోయుతంబౌచుఁబరగ నీకు క్షత్రతేజోన్వితముగ నీజననికిని జ
రుద్వయంబు బొడగూర్ప మాఱుపునొనర్చితింత దీనికి వ్యత్యస్త మెట్లొనర్తు, ౫౦
తే॥ అబల! శాస్త్రవ్యతిక్రమ మాచరింప నధముఁడని నన్ను నిందింతు రవనిజనులు,
ఏమిచేసితొ చేసితి, వింక దీని కన్యథాయొనరింపఁగా దరుగు మవల
వ॥ అని పలుకుటయుఁ దత్పత్ని మఱియు నిట్లనియె,
తే॥ అట్టులగుచోఁ ద్వదాహృతమైనయట్టి క్షాత్రతేజంబు మత్పౌత్ర గాత్రమువఁ బ్ర
విష్టమగుఁగాక, నీకన్న వేత్తయైన బ్రాహ్మణుండె కుమారుఁడై పరఁగవలయు ౫౩
వ॥ అనవుడు బుచీకుండు ౫౪
ఆ॥ "అట్లె నీదుపుత్రుఁ డవనీసురశ్రేష్ఠుఁడగును సంతసిమ్ము చిగురుఁబోఁడి!
పౌత్రుఁ డధికమైన క్షాత్రంపుఁదేజుతో యుద్ధదుర్ధరత్వ మొందఁగలఁడు" ౫౫
వ॥ అని పలుకుటయు నాయమ యంతయును దల్లికి నివేదించి పదియవమాసం
బున బ్రాహ్మ్యలక్ష్మీసమేతుండగు కుమారుంగనియె, నాయన జమదగ్నియను విఖ్యాతుం
డయ్యె, దత్పుత్రుండు రాముండన మహాయశుండై యిరువదియొక్కమాఱులు ధాత్రి
నిఃక్షత్రియంబొనరించె, గాధిభార్యయు దశమ

## —♦ విశ్వామిత్రుఁడు రాజ్యమును వదలిపెట్టుట ♦—

మాసంబున బ్రాహ్మ్యలక్ష్మీసమావృతుండగు పుత్రుంగాంచె, నతండు విశ్వామిత్రుండన
దినదినప్రవర్ధమానుండై యౌవనంబువహించియుఁ బిత్రుపైతామహంబగు స్వరాజ్యంబు
విసర్జింపక నిత్యంబును వేదాధ్యయనసంపన్నుండై బ్రాహ్మణోచితమార్గంబున నుండు

చున్నను గాధి స్వరాజ్యంబున నియోజించి సకళత్రంబుగా వనంబునకుం జనియె, విశ్వామిత్రుండు రాజ్యస్థుండై కొంతకాలంబునకు మృగయావ్యసనంబునం దగిలి యడవి కరిగి

సీ॥ దుష్టులనన్నింటిఁ దునుమాడి తునుమాడి యడవిదున్నలఁబట్టి యవనిఁగూల్చి
ఖడ్గమృగంబుల ఖండించి ఖండించి పృథువరాహంబులం బిలుకుమార్చి
మదపుఁవేఁదంగుల క్రమ్మించి క్రమ్మించి క్రూరసర్పంబులం గూల్చివైచి
పులులమొత్తంబులం బోకార్చి పోకార్చి బలుసివంగుల నేలఁ బండఁబెట్టి
సింహములమీఁదఁబడి బిట్టుసంహరించి శరభములఁద్రుంచి మధ్యాహ్నసమయమునకు
క్షుత్పిపాసలకుం జిక్కి సొక్కి మిగుల నల వసిష్ఠాశ్రమంబున కరుగుటయును, ౫౭
వ॥ అమ్మునిని యెదురేగి యర్ఘ్యమిచ్చి యాగమనకారణమడుగ, ౫౮
ఆ॥ "వేఁటలాడియలసి గాటంపుదప్పిచే మంచినీళ్ల కరుగుదెంచినాఁడఁ,
జల్లనీరుఁ ద్రావి శ్రమఁబాసినాఁడ, నిం కాజ్ఞయిడిన నింటి కరుగువాఁడ" ౫౯
వ॥ అని నొడువుటయు వసిష్ఠుండిట్లనియె, ౬౦
తే॥ "మట్టమధ్యాహ్నమైనది, చట్టు లగల వెలుఁగుచున్నాఁడు వినువీథి వేఁడివేల్పు,
కాన భుజియించి యపరాహ్నమైనవెనుకఁ బయనమొనరింతు నిలువు నృపాల! నీవు"
వ॥ నావుడు విశ్వామిత్రుండు ౬౧
కం॥ "చతురంగసైన్యములతో యుతముగ నిట కరుగుదెంచియుంటిని, నది ద్వా
ర్స్థిత, మట్టుగాన నవిలంబితముగ నా కాజ్ఞయిమ్ము మెల్లఁగఁ జనెదన్, ౬౩
కం॥ తనసేవకు లాఁకలిగొని కనుగొనుచుండంగ వారిఁ గాదని యొకఁడే
తినువాఁడు గుణవిహీనుఁడు, ఘన నరకములోనఁగూలుఁ గడ కతఁ డరయన్"
వ॥ అని పలుకుటయు వెండియు వసిష్ఠుండిట్లనియె,
ఉ॥ "ద్వారమునందు నీభటులు తారు బుభుక్షితులై వసించుచో
వారలనందఱం బిలువు, వైళమ తృప్తులఁజేసి పుత్తు, మ
ద్భూరితపఃప్రభావమునఁబొందిన నందినియన్ సుధేను వేఁ
గోరిన యేపదార్థమును గొంకక యిచ్చుచునుండు నిచ్చలున్" ౬౬
వ॥ అనినవిని సైన్యంబును రప్పించి స్నాతుండై కూరుచుండుటయు నందిని వసి
ష్ఠుచేఁ బిలువంబడి యేమియాజ్ఞయనిన నమ్ముని ౬౭
మ॥ "సబలుండై చనుదెంచినాఁడు మన విశ్వామిత్రరాజర్షి, యా
పటువుల్ భృత్యులు సంతసింపఁ దొరగా భక్ష్యంబులున్ భోజ్యముల్
సబహూకారముగా నొసంగి తదిభాశ్వగ్రాససంసృష్టిఁజే
యు బలీయంచు భవన్మహత్త్వమును దా నుర్వీశుఁ డగ్గించెడిన్ ౬౮

వ॥ అనిచెప్పుటయు నయ్యది వల్లెయని తత్క్షణంబ పదివేలమందికి సరిపడు పదా ర్థంబును సృష్టించె, నంతఁ దద్భృత్యులు వడ్డించిరి, క్షణ కాలంబులో నిట్లు సపరివా రంబుగా సంతృప్తినొంది విశ్వామిత్రుఁ డాశ్చర్యపడుచు మంత్రులంజూచి ౧౯

మ॥ “ అహాహా ! యెంతవిచిత్రమియ్యది, కరం బాకంటికిం జిక్కియు
న్న హయేభోష్ట్రముఖాఖిలాస్మదురుసైన్యం బేను మీరందఱున్
బహుధా తృప్తిపడంగ మృష్టమగు నన్నంబుం బ్రసాదించి భూ
రిహితంబుం బొనరించె నిమ్మొదవు మంత్రిశ్రేష్ఠు ! లీక్షింపుఁడీ, ౨౦

కం॥ కావున నీయావును గొనిపోవుద మెట్లేని మనము కొంక, కరణ్యా
నీవాసి భృత్యహీనుఁడు నా విప్రుండిలేఁడు చేయునది యేముండున్ ” ౨౧

వ॥ అని వసిష్ఠుం బిలిచి ౨౨

ఉ॥ “ నందిని నాకొసంగు మునినాథ ! యరణ్యమునన్ వసించునీ
కెందులకిద్ది యొక్కనికి ? నిచ్చెద దీనికిఁగాను నీకు నీ
డెందము చందముం దెలుపు, శీఘ్రఁజెలంగు హయంబులో కరీ
ద్బృందము యగ్రహారములొ యేవొ త్వదిష్టములన్ వచింపుమా ” ౨౩

వ॥ అని యడుగుటయు నతఁడిట్లనియె, ౨౪

ఆ॥ “ హోమధేనువిది నృపా ! మాకుఁ గామదోహినియు, నందువలన నీయనేను,
బ్రాహ్మసురునకుఁ దలఁప సామాన్యమాగొవె యమ్మఁదగదు, దీని నమ్మనెట్లు,

ఆ॥ ఆవునమ్మయెవ్వఁ డర్థంబు గ్రహియించు వాఁడు పంచముండు వాస్తవముగ,
జననినమ్మినట్టి చండాలుఁడే యతం డని వచించె మనువు విను జనేశ ! ౨౫

ఆ॥ దానసామ భేదదండంబులకు నేను సాధ్యపడెడునట్టి జనుఁడఁగాను,
వేయునేల దీని నీయ ముమ్మాటికిఁ, జనుము తిన్నగాను స్వగృహమునకు ” ౨౬

వ॥ అనవుడు విశ్వామిత్రుండు ౨౭

ఆ॥ “ రసఁజెలంగునట్టి రత్నంబులన్నియు రాజకీయములుగ రహిఁవచింతు,
రిదియు రత్నభూత, యే దండమున నేని గొనుదుఁగాన సామమునఁనె యిమ్మ ”

వ॥ అని పలికి పట్టుకొనుండని భటుల కాజ్ఞాపింప వారు లగుడపాషాణంబులం గొట్టి కట్టివేయుటయుఁ దన్నందిని యఱచుచుం బోయి ౩౦

క॥ “ ఇచ్చితివో కో నను నేనికి నచ్చిరితా ! యతనిభటులు స్వాములువోలెన్
వచ్చి ప్రహరింపఁజొచ్చిరి, నొచ్చె మదీయాంగమెల్ల, నోరాడ దికన్ ” ౩౧

వ॥ అని యడిగిన వసిష్ఠుం డిట్లనియె, ౩౨

తే॥ "ప్రాణములు కంఠగతములౌ పట్లనేని యిచ్చుటకుఁగాఁ బ్రయత్నింపనేననిన్నుఁ
గాన నీదేహమును నీవు కాచుకొమ్మి పొమ్ము నందిని! మత్ప్రభావమ్ము వలన"

వ॥ అని చెప్పుటయు నయ్యావు నిష్ఠురంబుగా నఱవఁ దచ్ఛబ్దంబులనుండి సాయుధులై మ్లేచ్ఛశబరపుళిందులు లెక్కకు మిక్కిలియై యుదయించి విశ్వామిత్రబలంబుల వెనుకకుఁదఱిమి, రంత నమ్మహీపతి చతురంగసైన్యసహితంబుగా సమరంబుసలుపుటయు నామ్లేచ్ఛు లశ్వగజపదాతుల హతముచేసిరి, హతశేషు లవలకుఁ బాఱిరి, మ్లేచ్ఛులు మేదినీశ్వరుం జుట్టుకొనిరి, వసిష్ఠుఁ డది విలోకించి నందినిం బిలిచి ౪౭

కం॥ "తురకలచే నావృతుఁడగు నరపాలుని గావుమమ్మ నందినిరో! త
త్కారణం బ్రజ సత్పథమునఁ జరియించు, నమార్గమునను జను లేరన్నన్"

వ॥ అనుటయు మ్లేచ్ఛాదుల వారించుటకుఁగా వచ్చుదాని విశ్వామిత్రుండు కత్తిచే వ్రేయ మొదలిడియె, వసిష్ఠుఁ డతని బాహుస్తంభనంబొనరించె, నంత నతండు వసిష్ఠు నుద్దేశించి ౪౮

కం॥ "కఱకుం దురకలచేతను బోరిగొనఁబడునన్నుఁ గాచి భూసురవర! స
త్కారణను బాహుస్తంభన పరివర్జితుఁ జేయుమయ్య, ప్రస్తుతి సేతున్,

ఆ॥ మదపరాధమునను సదమదమయ్యె నాసైన్యమెల్లఁ, గానఁ జనుదు నింకఁ,
గానఁబడదు నాకుఁ గాసంతయేని ప్రయోజనంబు చూడ యుద్ధమునను,

ఆ॥ దుర్వినీతుకడకుఁ దోఁతెంచు సిరి విద్యచాల కాల ముండఁజాలదచట,
పతిమదమున గర్వినై యున్నయట్టి నే నాలమునను నిల్వఁజాలనట్లు" ౪౯

వ॥ అని ప్రార్థించుటయు నట్లు కావించి వసిష్ఠుండు నవ్వుచు నిట్లనియె, ౫౦

కం॥ "మన్నీఁడ! స్తంభదోషము చన్నది నీభుజమునందుఁ జనుమింటికిఁకన్,
దిన్నయిలఁ గ్రుద్దలింపకు, మెన్నడుఁ బగఁబెట్టుకొనకు మీఁక విప్రులతోన్"

వ॥ అని విడిచిపుచ్చుటయు విశ్వామిత్రుండు క్రీడాయుతుండై వీటికరిగి

ఆ॥ "క్షాత్రబల మిసీ! యసారంబు, తద్వీర్య మంతకన్నఁ గడు నిరర్థకంబు,
బ్రహ్మబలమె బలము పరికింప, నవ్వారి తేజమే యమోఘతేజ మరయ,

కం॥ ఏతద్బ్రహ్మబలంబును నేతీరుననైన నేను నెనయఁగవలయున్,
శాకలనాఁటి స్వరాజ్యము బ్రీతిం ద్యజియించి తపము పెంపఁగవలయున్"

వ॥ అని నిశ్చయించుకొని రాజ్యమందు విశ్వసహుండను తన కుమారు స్థాపించి తపోవనంబునకుఁ జనియె, ౫౧

—♦ విశ్వామిత్రుండు వసిష్ఠుని సంహరింప శక్తిని బుట్టించుట ♦—

కం॥ ఈవిధి రాజ్యత్యాగము గావించి సలజ్జుఁడైన గాధితనూజుం
డావల శ్రీమద్ధిమవద్గ్రావమునఁ దపంబుసలిపెఁ గడుఁదీవ్రముగన్, ౯౬

వ॥ వర్షాకాలంబున నిరాచ్ఛాదితస్థలంబునను గ్రీష్మకాలంబునఁ బంచాగ్ని మధ్యంబునను హేమంతంబున సలిలంబునను నుండి ఫలమూలకృతాహారుండై మున్నూఱేండ్లును శీర్ణపర్ణాశనుండై మున్నూఱేండ్లును జలాహారుండై మున్నూఱేండ్లును వాయుభక్షకుండై పదివేల యేండ్లును బరబ్రహ్మమును ధ్యానించుచుండుటయు నతని తపశ్శక్తిం దిలకించి త్రిదశాధిపుండు తన్నతండు తన స్థానంబునుండి పడఁద్రోయునని తత్సమీపంబునకుఁ బోయి కడు భయపడుచు సాహసవచనంబుల నిట్లనియె, ౯౭

కం॥ "విశ్వామిత్ర! త్వదాచరితేశ్వరపూజనమువలన నెంతయు నీపై
విశ్వాసమొదవె నాకు సమాశ్వాసితుఁడైతి, వడుగు మభిమతవరమున్" ౯౮

వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు విశ్వామిత్రుండు ౯౯

కం॥ "బ్రాహ్మణ్యమిమ్ము నీమది జహ్మముగా కధికతృప్తిఁ జెందినచోఁ, ద
ద్బ్రహ్మత్వముకొఱకే యీ బ్రహ్మధ్యానంబు సలుపఁబడియెడిఁ గానన్" ౧౦౦

వ॥ అని యడుగుడు వెండియు నింద్రుం డిట్లనియె, ౧౦౧

కం॥ "ద్విగుణములౌ నిరువదినాలుగు సంస్కారములుగూడ లోపములేకుం
డఁగఁ బుట్టవలయుఁ గానీ, యగునే బ్రాహ్మణుఁడు భిన్నమగు మార్గమునన్,

కం॥ క్షత్రియుఁ డీగాత్రమునను ధాత్రిని బ్రాహ్మణుఁడుగాఁడు, తథ్యము విశ్వా
మిత్ర! యిది, కావునం దగుమాత్రపువరమడుగు మిడుదు మాటాడ కిఁకన్"

వ॥ అనవుడు మరల విశ్వామిత్రుండు ౧౦౪

తే॥ "తక్కఁగలవానినెల్లను లెక్కచేయ కుండు టట్లుండ బ్రహ్మత్వ మొకటిదక్క
నీవు పాలించు స్వారాజ్యమేనియొల్ల, నింద్ర! యేటికిఁ జనుమింక నింటికీవు"

కం॥ పడసిన బ్రహ్మత్వము నే పడయఁగవలె వదలకుండఁ బట్టినపట్టున్,
బడయఁగ లేకుండినచో విడువఁగవలెఁ బ్రాణములను, వేయేలయిఁకన్ ౧౦౬

వ॥ అనిన విని దేవనాయకుండు సర్వదేవసమావృతుండై స్వర్గంబునకుఁ జనుటయు విశ్వామిత్రుండు మగుడ నొక వేయివత్సరంబులు తపంబు గావించి యంత ననిలభక్షకుండై యధికతపంబు మొదలువెట్ట దగ్ధకిల్బిషుండగు నతనికడకు బ్రహ్మ స్వయంబుగా దేవర్షిసహితుండై చనుదెంచి, ౧౦౭

కం॥ "విశ్వామిత్రమహీధరణీశ్వర! తుష్టుండనైతి నీ తపమునకున్
శాశ్వతసుఖమగు నీకు, మహైశ్వర్యంబేనియిత్తు, నడుగు వరంబున్" ౧౦౭
వ॥ అనుటయు విశ్వామిత్రుం డిట్లనియె, ౧౦౮
కం॥ "తుష్టుండవైతి వేని మదిష్టంబు బొడగూర్చెదేని యిడు బ్రాహ్మణ్యం,
బష్టైశ్వర్యములేం మదిష్టంబులుగావు దీని కితరము లెవియున్" ౧౧౦
వ॥ నావుడుం గ్రమ్మఱ బ్రహ్మదేవుండు ౧౧౧
తే॥ "క్షత్రియుండయి ధాత్రిలో జాతుఁడైనవానికి ద్విజత్వ మేరీతివచ్చునరయ,
శ్రుతికి స్మృతికి విరుద్ధ మీకృతి, యదేల యుట్టివరమును గోరెద వీ విశేశ!"
వ॥ అని వాక్రుచ్చుటయు వెండియు విశ్వామిత్రుం డిట్లనియె, ౧౧౩
ఆ॥ "చను మనుత్తమంపు సత్యలోకమునకుఁ దడయకింక నీవు తమ్మిచూలి!
బ్రాహ్మణత్వమేని పడయుదు, లేనిచోఁ గాయమేనివిడుతుఁ గడకు నేను" ౧౧౪
వ॥ అనవుడు దేవర్షి మధ్యగతుండగు ఋచీకుం డిట్లనియె, ౧౧౫
ఉ॥ "ఈతని పుట్టువున్ గుఱిచి యే నల బ్రాహ్మసుమంత్రరాజిచేఁ
బూతముగాఁగ నొక్క చరువున్ మును సిద్ధముచేసి దానిలో
నాతతమైన బ్రాహ్మణతయంతయు యోజనచేసినాఁడ, నా
హేతువుచేత బ్రాహ్మణుఁడె యీతఁడు క్షత్రియజాతిఁ బుట్టియున్" ౧౧౬
ఆ॥ రాజ్యమం దితండు రహిమీఱనుండియు బ్రాహ్మ్యమంత్రముల ప్రభావమునను
బ్రహ్మకర్మములనె ప్రచురించుచున్నాఁడు, బ్రాహ్మణుండటంచుఁ బలుకఁదగఁడె,
కం॥ కావున నో చతురానన! యీ విశ్వామిత్రు బ్రహ్మఋషియని పిలువం
గావలయు నీవు, మేమును నావిధమునఁ బిలుచునార మందఱ మింకన్, ౧౧౭
వ॥ అని యిట్లు వచించుటయు బ్రహ్మ పెద్దయుం బ్రొద్దు విచారించి ౧౧౮
కం॥ "నిను బ్రాహ్మణునొనరించితి ననఘా! మనుదీక్షితంబు నాలించియికన్
దనువుక్కళింపఁ దపింపకు, తనువే తొలిసాధనంబు ధర్మంబునకున్" ౧౨౦
వ॥ అని విశ్వామిత్రు నాశ్వాసించుటయు ఋచీకుం దొట్టి దేవర్షు లందఱును
బ్రహ్మర్షియని ప్రతిపాదించి, రంతఁ దన్మధ్యగతుండగు వసిష్ఠమహాముని ౧౨౧
తే॥ "తెలిసియుండియు క్షత్రియువలనఁ బుట్టి నట్టివానిని బ్రాహ్మణుఁడనను నేను,
అల ఋచీకునియందలి యాదరమున నట్లు వాక్రుచ్చుచున్నాఁడ ననఘ! నీవు"
వ॥ అని పితామహునిచేతను నారదాదులచేతను ననేకభంగులం జెప్పఁబడియు
నందఱుం బరిత్యజించి వెళ్లిపోయి హాటకేశ్వరక్షేత్రంబున బ్రహ్మశిలయుండు సరస్వతీ

తీరంబునం దాశ్రమం బేర్పఱచుకొని తపంబు సేయుచుండె, విశ్వామిత్రుండును నతని జంపుటకుంగాఁ దదాశ్రమంబునకుఁ గొంతదూరంబున నాశ్రమంబుగట్టుకొని ఛిద్రంబులు వెదకుచుఁ బెద్దయుం బ్రొద్దు వసించెఁ, గాని యట్టిఛిద్రంబు లెవ్వియు దొరక, నంత నాయనపై నాభిచారికహోమంబు ప్రారంభించుటయు నాగుండంబునుండి

సీ॥ బహువికారంపు రూపముతోడఁ బ్రతిజనుం గఱవఁబోయెడి కోఁతిస్కంధ మెక్కి
తగిలినమాత్రానఁ దఱుగుకొం చవలికిఁ బఱచు నాయుధములఁ బట్టి కేళ్ళఁ
గడునిష్ఠురంబైన కంఠస్వనంబుచేఁ బ్రిద్దలుగా మహీప్రజలచెవులు
విరియఁబోసిన నెత్తిపెంద్రుక లిటునటు ఘనపరాగము నూడ్చికొనుచురాఁగ
శ్రాద్ధదేవు జిహ్వాచాద్భవ నత్యంతభయద యొక్క శక్తి బయలువెడలి
తను సృజించినట్టి ఘనుని విశ్వామిత్రు నెదుర నిల్వఁబడుచు నిట్టులనియె. ౧౨౪

తే॥ “చెపుము మునివర! నే నేమిచేయవలయు, మూఁడులోకంబులంగూడ మోహరించి
సంహరింపఁగవలసిన సంహరింతు నాలసింపక యిపుడ త్వదాజ్ఞవలన” ౧౨౫

వ॥ అని యిట్లు పలుకుటయు విశ్వామిత్రుండిట్లనియె, ౧౨౬

కం॥ “నాపగవాఁడుం గుత్సితతాపసియును నగు వసిష్ఠు తలదఱుగుము పా
పోత్మపుత్రి! నినుసృజించుట యీపనికొరకచియె, యింక నేమడిగెదు నన్”

వ॥ అని చెప్పుటయు నయ్యది వసిష్ఠాశ్రమముగూర్చి పయనమయ్యె, నింతలోనన వసిష్ఠాశ్రమంబున ననేక దుర్నిమిత్తంబులువొడమె, గొప్ప యగ్నికణంబులు రాలె, నస్థిమిశ్రితంబై రుధిరంబు వర్షించె, నక్కలు దిక్కుదిక్కులంజేరి యాక్రందనముఁజేయ మొదలిడియె, నట్టిమహోత్పాతంబులం దిలకించి వసిష్ఠుండు ముందఱఁ గనుంగొనుటయు జ్వాలామాలాసముజ్వలంబగు కృత్తి కనంబడియె, నంత దివ్యచక్షుస్సునఁ జక్కగా విలోకించి తన్నుఁ జంపుటకుఁగా విశ్వామిత్రునిచే సృజింపఁబడిన కృత్యయియ్యదియని యెఱింగి నిలునిలుమనుటయు నది కదల మెదల నేరక పడియుండె, నట్లథర్వణమంత్రంబులచే స్తంభింపంబడి స్త్రీ రూపమును ధరించి ౧౨౮

తే॥ “సామము నాల్గువేదములఁ జాలగరిష్ఠము, తన్మహోమను
గ్రామముచేత వ్రేల్చి యల గాధిసుతుండు ననున్ సృజించె, ని
ష్ఠామన వప్రమాణమగు, నందున నైఁపుము మత్పరిహార మీ,
వో ముని! నీదుప్రాణముల నోముదు స్వల్పతరంపు స్పర్శచే” ౧౨౯

వ॥ అని ప్రార్థించుటయు వసిష్ఠుం డిట్లనియె, ౧౩౦

తే॥ అట్లయిన నాదుమర్మంబు నంటకుండ వచ్చితాఁకుము, మఱుమాట నుచ్చరింప,
మఱియు నాథర్వణమ్ములైన యమంత్రములును దద్దక్పతోడ నుపసంహృతంబులయ్యె,

వ॥ అనియిట్లుపలుకుచుండ విశ్వామిత్రప్రయుక్తయగు తద్ధారుణశక్తి యవ్వసిష్ఠు శరీరంబు స్పృశియించి క్రిందఁబడియె, నంత నలుండు సంతసించి దానింబిలిచి ౧౩౨

ఉ॥ "ఇప్పటినుండి పంచజనులెల్లరు మిక్కిలి భక్తితోడ నిన్
దప్పక కొల్చుచుండ్రు శుభదాయిని ! చైత్రసితాష్టమీతిథిన్
గొప్పగ నీదువిగ్రహము కోరి భజించుచునుండు భూజనం
బప్పటినుండికూడ నొకయబ్దముదాఁక నిరామయంబగున్ ౧౩౩

కం॥ అదికారణముగ నీవిఁకఁ గదలక యీస్థానమునన కలకాలంబున్
సదయంబుగ వర్తింపుము ముదమున నాగరులు సేయు పూజలుగొనుచున్" ౧౩౪

వ॥ అని వాక్రుచ్చుచుండ నాకృత్య నాఁటినుండి యచ్చటనే వసించి భూజనులను విశేషించి నాగరులను నర్చనంబు లంగీకరించి ఫలప్రదయగుచు ధారాభిధానంబున విఖ్యాతయైయుండె" ననుచును మునులిట్లనిరి, ౧౩౫

—* విశ్వామిత్రసృష్టకృత్యకు ధార యనుపేరు వచ్చుట *—

భుజంగప్రయాతము॥ "చమత్కారపూర్వస్థ ద్విజన్మాళి తా మీ
యమం గొల్వ నున్నట్టి యాహేతు వేమా ?
నమేయాకృతిం బొల్చు నాశక్తి మున్నే
క్రమం బట్లు ధారాఖ్యగా సంఘటించెన్ ?" ౧౩౬

వ॥ అని యిట్లు ప్రశ్నించుచుండ వెండియు సూతుండు ౧౩౭

తే॥ "ఆపురంబున ధారాఖ్యనలరు నొక్క-నాగరబ్రాహ్మణాంగన యోగులార !
సతి తపస్విని యైన యాచానరుసు నరుంధతికి స్నేహముదయించి రూఢమయ్యె"

వ॥ అరుంధతి వసిష్ఠసహితంబుగాఁ జమత్కారపురస్థ శంఖతీర్థంబున స్నానమొనర్ప నరుగుదెంచి వాయుభక్షణంబుతో నంగుష్ఠాగ్రంబుననిల్చి యుగ్రతపంబొనర్చుచు దివ్యవపుర్ధరయైయున్న యాబిడం బొడగాంచి ౧౩౯

కం॥ "ఎవరియనుంగుంగూతుర ? వెవరవునీ ? వెందుకోస మీక్షేత్రమునన్
మివులఁ దపంబొనరించుచు నివసించితివమ్మ యధికనిష్ఠాన్వితవై ?" ౧౪౦

వ॥ అని యడుగుచుండ ధారయిట్లనియె, ౧౪౧

తే॥ దేవశర్మాఖ్యనాగరద్విజవరేణ్యు నాత్మజను నేను, బాల్యంబునందె నాకు
వేరుపడియెను వైధవ్య, మిందువలన దేవతాసేవఁజేయంగఁ దిరుగుచుండి ౧౪౨

ఆ॥ శంఖతీర్థమహిమ శంఖేశుమహిమయు నాలకించి యిచటి కరుగుదెంచి
యామహానుభావు నారాధనములోన నున్నదాన, దీక్షగొన్నదాన," ౧౪౩

వ॥ అని యిట్లు నొడువుటయు నరుంధతి ౧౪౪

ఉ॥ "నీపయిఁ జూచుమాత్రమున నెమ్మిజనించెఁ గరంబువారు, ర
మ్మో ప్రియ! యస్మదాశ్రమమునొద్దకు, నీవును నేను రేపునున్
మాపు సరస్వతీతటమునన్ వసియింతము, శాస్త్రచింతనం
బే పనిగాఁగఁ బెట్టుకొని యీశ్వరుఁ గొల్చుచునుంద మెంతయున్" ౧౪౫

వ॥ అని వక్కాణించుటయు నా నాగరబ్రాహ్మణ వితంతువు జననీజనకులను బంధువులను వీడ్కొని యరుంధతితోఁ బయనమైచనియె, నట్లాపెకుం జెలియై పెద్దకాలంబుండి వసిష్ఠవధార్థమై విశ్వామిత్రవిసృష్టయగు తచ్ఛక్తి యటుపరా నాయమకుఁ గైలాసశిఖరోపమంబును నానారత్నవిచిత్రితంబును నగు దేవళంబు గట్టించి చైత్రశుక్లాష్టమీదినంబున నదీజలంబుల స్నానముచేయించి బలియొసంగి సంస్తుతించుటయు నా దేవి ౧౪౬

తే॥ "బిడ్డ! నీస్తోత్రమునకు సంప్రీతనైతి, నెంతయును భద్రమయ్యెడు నింకనీకుఁ,
గోరుకొను మేదొ వరమును, మాఱుమాట నుడువకుండఁ ద్వదిష్టంబు నిడుదు నేను" ౧౪౭

వ॥ అని వచించుటయు ధారయిట్లనియె, ౧౪౮

ఉ॥ "నాగరుఁ డీసితాష్టమిదినంబునవచ్చి ప్రదక్షిణత్రయిన్
బాగుగఁజేసి మంచివగు పండులుమూఁడు నివేద్యమిచ్చితా
సాగిలిమ్రొక్కి నీకుఁ గడు సంస్తవనంబొనరించెనేని నీ
వాగుఁ జేసి ప్రోవవలె రూఢిగ నోజనయిత్రి! యాతనిన్" ౧౪౯

సీ॥ గొడ్డురాలగు కాంత కోరి నిన్గొల్చుచోఁ బుత్రవతింజేయఁ బూనవలయు,
దౌర్భాగ్యవతి నిన్నుఁ దద్దసేవించుచో సౌభాగ్యవతిఁజేసి సాఁకవలయు,
సౌందర్యహీన నీసంస్తుతిజరుపుచోఁ జక్కనిచక్కఁగాఁ జలుపవలయు,
నామయగ్రస్త నీయడుగులఁ వ్రాలుచో నారోగ్యవతిఁజేసి యనుపవలయు,
ధారయనెడిపేర ధరణి విఖ్యాతనై నెమ్మి నాదుపేరు నిల్పవలయు,
నిది మదిష్టమంబ! యీవు నాచేతకు సంతసించి వర మొసంగుదేని," ౧౫౦

వ॥ అనవుడు దేవియిట్లనియె, ౧౫౧

ఆ॥ "నేను ధారనాఁగ నీవుకట్టించిన యాలయంబులోన నధివసించి
ఘనయశంబునీకు గడియించిపెట్టెద నిచ్చలుం దపస్విని! నిజముగ, ౧౫౨

తే॥ ఇచటి కేనాగరుండుతా నేగుదెంచి భక్తి మువ్వాఱు వలగొని ఫలము లొక్క
మూఁడు నాకు సమర్పించు వాఁడు రోగరహితుఁడైయుండు నొకవత్సరంబువఱకు

వ॥ అని వాక్రుచ్చి యంతర్ధానంబుఁజెందుటయు ధార యరుంధతీసహితంబుగా నందు నివాసంబుఁజేసె, నిప్పటికిని నాకాశంబున నరుంధతికి సమీపంబుగాఁ గానవచ్చెడు॥

—§ ధారాతీర్థోత్పత్తి §—

విశ్వామిత్రవిసృష్టయగు తచ్ఛక్తి పదతాడనంబున భూమి బ్రద్దలుకాఁ గంగ ప్రత్యక్షమైన విధంబున నచట శీతలజలధార బయలువెడలె, నందు స్నాతయైన వంధ్య పుత్రవంతురాలయ్యెడు, నన్యులు స్నానమొనర్చి దేవీదర్శనంబు గావించిన ధన ధాన్య పుత్ర రాజ్య సుఖంబులు గలిగెడి, ధారాదేవి నూటయెనిమిది గోత్రాల నాగర బ్రాహ్మణులకును గులదేవత యగు కతంబునఁ దద్ద్వారంబుననె యయాత్రం జేయవలయు, నట్లు కానినాఁడు తత్సురేశ్వరి తుష్టింబొందదు, స్వసృష్ట

—* వసిష్ఠవిశ్వామిత్రుల పోరాటము *—

యగుశక్తి యిట్లు తనకోర్కి దీర్పక వ్యర్థమగుటఁ గినిసి విశ్వామిత్రుండు బ్రహ్మాస్త్రం బభిమంత్రించి వసిష్ఠుమీఁదికి వదలె, దాని ననుసంధించు మాత్రంబుననె మహానినాదంబు బయలువెడలె, నంబరంబునుండి యగ్నికణంబులు రాలె, వసిష్ఠుఁడదియెఱింగి ముందుగ్రుచ్చిన బ్రహ్మాస్త్రంబు యోజించి విశ్వామిత్రు నేమియుం జేయక తదస్త్రంబు ప్రహరింపుమని పనుపుటయు నయ్యది చని దాని నణఁచివైచె విశ్వామిత్రుండు క్రమ్మఱ వజ్రాస్త్రంబువైవ నది వజ్రాస్త్రంబుచే వినాశితంబయ్యె, నస్త్రేయస్త్ర మాయస్త్రంబుచే హతంబగుచుండుటయు సముద్రంబు శోషించె, గిరిశృంగంబులు క్రిందఁబడెను, నెత్తురువాన వర్షించె, నకాలంబునఁ బొడము నా ప్రళయ చిహ్నంబుల నవలోకించి సురలెల్లరు నంబుజాసను నంతికంబున కరిగి విన్నవించుటయు నతండు పెద్దయుంబ్రొద్దు విచారించి ౧౫౪

కం॥ "విశ్వామిత్రవసిష్ఠులు విశ్వాసవిహీనులగుచు వివిధాస్త్రములన్
శశ్వద్యుద్ధముసలిపిరి విశ్వమునకు మనకు మిగుల వెఱపుజనింపన్" ౧౫౫

వ॥ అని యుధ్యమానులగు నయ్యుభయులపాలికిం జని ౧౫౬

కం॥ "చాలింపుఁడయ్య జగములు కూలకపూర్వంబె మానుఁడింజురు! లాలం,
బేల మహాస్త్రములన్నియు నోలిఁ బ్రయోగించుకొందు రొండొరు లిటులన్"

వ॥ అని వాక్రుచ్చుటయు వసిష్ఠుండిట్లనియె, ౧౫౮

ఆ॥ "ఆత్మరక్షపొంటె నస్త్ర మస్త్రమునఁ బ్రశాంతమగుచునుండె నంతెకాని
గాధిసూనుఁజంపఁగాదు నే నస్త్రప్రయోగమాచరించుటో మహాత్మ!" ౧౫౯

క॥ ఈయన నను దునుమాడనె వేయుచునుండెను మహాస్త్రవితతిని నాపై
న్యాయము గాదిది నీకని యీయుపదేశంబు లటనె యుపయోగ్యంబుల్ ౧౬౦

వ॥ అనవుడు బ్రహ్మదేవుండు విశ్వామిత్రుదిక్కు మొగంబై ౧౬౧

క॥ "విశ్వామిత్ర! వసిష్ఠుని విశ్వంబును నాదుమాటవిని కావుము, మా
నీశ్వర! దివ్యాస్త్రంబుల శశ్వన్మోక్షణము వలదు, చాలింపు మికన్" ౧౬౨

వ॥ నావుడు విశ్వామిత్రుండు ౧౬౩

ఆ॥ "ఎంతకాలమునకు నీతండు నను బ్రాహ్మణునిగఁ బేరుకొనఁడు ఘనుఁడనుచు,
నట్లుగాన మిగుల నాగ్రహముదయించె నితనిమీఁదఁ, జంప నిదియె కతము, ౧౬౪

క॥ కావున నను బ్రాహ్మణుఁగా వేవేవచియింపుమనుము, వెంటనె నేనున్
గావలెనని యీతనిపైఁ బోవిడిచిన యస్త్రవితతిఁ బోరి వారింతున్" ౧౬౫

వ॥ అనవుడు బ్రహ్మ వసిష్ఠునితో నిట్లనియె, ౧౬౬

క॥ "అనుమువసిష్ఠ! నీ వీతని బ్రాహ్మణుఁడని పదాజ్ఞదాటక యిపుడే,
అన నితఁడు బ్రాహ్మణుండగు, మనుదు చిరంజీవివగుచు మహిపై నీవున్"

వ॥ అనినవిని వసిష్ఠుండు ౧౬౭

క॥ "విను నేను క్షత్రవంశజు నన బ్రాహ్మణుఁడని సురేశ! యస్మద్వ్యథమున్
బొనరింపలేఁడు క్షత్రియుఁ, డనుమానమువలవ దేతదర్థము లోనన్ ౧౬౮

ఆ॥ బ్రహ్మతేజమెపుడు పరతేజమున వినాశంబునొందదిద్ది సత్యమనుచుఁ
దెలిసికొనుము మొదలు నలువ! యనంతర మర్హ మెదియొ యది సమాచరింపు" ౧౬౯

వ॥ అనుటయు నతండు విశ్వామిత్రువంకదిరిగి ౧౭౦

క॥ "విశ్వామిత్ర మహీదేవేశ్వర! దివ్యాస్త్రసమితి యిటులుంచి యిఁకీ
విశ్వంభరామరుని నని 'శాశ్వాగచ్ఛ' యను, మొట్టె యటు లనకున్నన్"

వ॥ అని పలుకుటయు నతండు ౧౭౩

ఆ॥ "అస్త్రములప్రసక్తి యటువెట్టి నేనింక ఛిద్ర మెదియొ వెదకి శీఘ్రముగను
నీదురాత్మఁబట్టి యెటులేని వధియింతుఁ, జనుము నీవు నీదుస్థానమునకు" ౧౭౪

—♦ విశ్వామిత్రుండు సరస్వతీనదిని శపించుట ♦—

వ॥ అని వాక్రుచ్చుటయు వల్లెయని చతురాననుండు స్వలోకంబునకుఁ జనియె, విశ్వామిత్రుండు మశకంబు గజవధంబునకుంబోలె వసిష్ఠవధకై రంధ్రాన్వేషణంబు సేయుచు నొకనాఁడు స్త్రీరూపిణియగు సరస్వతీనదింబిలిచి ౧౭౫

తే॥ "ఆవ్వసిష్ఠుఁడు తా భవదంబువులను ముస్గునపుడు మహావేగమున్వహించి
నాదుపాలికిఁగొనితెమ్మ నది! వధింతు, దొరక దంభాకఛిద్రంబు సరిగ నాకు"

వ॥ అని యిట్లు పలుకుటయుఁ దన్నది తద్వాక్య మంగీకరింపకున్న శపించునని
భయపడియు ౧౬౬

ఉ॥ ఏనొనరింపఁజాలను మునీశ! మహామహుఁడైన యాత్మభూ
సూనున కవ్వసిష్ఠునకుఁ జూచుచుఁజూచుచు ద్రోహ, మెన్న, నీ
కైన ననర్హ మియ్యది, స్వయంబుగ బ్రహ్మఋషీ! యటంచు నిన్
దానసె బ్రహ్మదేవుఁడె, ముదంబును జెందఁగరాదె దానితో, ౧౬౭

కం॥ నిను బ్రాహ్మణుఁగాఁ జేర్కొనఁడనికద నీకున్నక్రోధ మాయనమీఁదన్
జనకుం డనుతర్వాతను దనయుం డనకున్న నేమితఱుఁ గరయంగన్, ౧౬౮

ఆ॥ మనసుచేతనేని మహి బ్రాహ్మణుంజంపఁ దలఁచునట్టివాఁడు తప్తకృచ్ఛ్ర
మునను గాని శుద్ధినెనయఁడంచని యిట్లు మనువు నుడువఁడొక్క మౌనినాథ!

తే॥ బ్రాహ్మణుం బరిమార్చెదఁ బాపమనక యనుచు వాక్కున వచియించునట్టివాఁడు
సరవిఁ జాంద్రాయణంబును సలుపవలయు నని మహాదేవుఁ డిట్లు వాకొనినవాఁడు,

కం॥ కాన వసిష్ఠవిషయమై నీనుడివినయట్టిదాని నే నొనరింపన్
శీ నెంతమాత్రమైనను, నీనచ్చినవిధ మొనర్చు నీవిఁక నార్యా! ౧౭౨

వ॥ అనినవిని విశ్వామిత్రుండు కుపితుండై ౧౭౩

కం॥ "నావాక్య మాదరింపక యీవిధిఁ బ్రత్యుత్తరంబు నిచ్చితిగానన్
పావకజలమంతయు దుష్టైవలినీ! రుధిరమగును జను మిటుమీఁదన్" ౧౭౪

వ॥ అని శపియించి సప్తవారాభిమంత్రితంబగు జలంబు తజ్జలంబునం జల్లుటయుఁ
బావనంబును శంఖసన్నిభంబును నగు నాసారస్వతోదకంబు రక్తమయంబయ్యె, నంత
భూతప్రేతపిశాచంబులు చేరవచ్చి యయ్యది త్రావి యాడుచును బాడుచును నవ్వు
చును వసించె, దత్తీరంబునఁ దపముండు తాపసులును బహిర్భూతులగు చండశర్మ
ప్రభృతులును లేచి దూరమేగిరి, వసిష్ఠుఁ డర్బుదపర్వతంబునకుఁజనియె, విశ్వామిత్రుండు
హాటకేశ్వరంబున కరిగి యాశ్రమంబుగట్టుకొని సృష్టికగణదక్షుండై బ్రహ్మతో స్పర్ధఁ
జేయఁదగు దారుణతపంబు సేయంగడంగె" నని చెప్పుటయు ఋషులిట్లనిరి, ౧౭౫




## —* సరస్వతీ శాపవిమోచనము *—

కం॥ "సారస్వతనీరంబటు తా రుధిరంబగుచు నెంతతడవుండెను ? వే
ధీరుని కారుణ్యమున యథారూపంబయ్యె మరల ? దానిని జెప్పుమా" ౧౮౬

వ॥ అనియిట్లడుగుటయు సూతుండు ౧౮౭

ఆ॥ "పెద్దకాలమట్లు పృథులమౌ తన ప్రవాహంబు రక్తమగుచు రాక్షసాళి
చేతఁ ద్రావఁబడుడుఁ జింతించి యాసరస్వతి వసిష్ఠునాని సవిధమునకు ౧౮౮

వ॥ చేరంజని యిట్లనియె, ౧౮౯

మ॥ 'భవదర్థంబుగ నాకుఁ గౌశికుఁడు శాపంబిచ్చె, వాచంయమ
ప్రవరుం డొక్కరుఁడేని నాదుదరికిన్ రాఁజూడఁ, డట్లౌటచేఁ
బ్రవహద్రక్తగ నుండఁజాల, విమలాంభఃపూరఁగావించి మా
నివరా ! నీదుకృపార్ద్రదృష్టి సరవిన్ నింపంగదే నాపయిన్, ౧౯౦

కం॥ త్రైలోక్యంబు సృజింపఁగ నేలోపము లేకయుండ నెంతయుఁ బెంపన్
గీలెఱిఁగి త్రుంప శక్తత నీలో లేకుండలేదు నిజముగఁ దపసీ !' ౧౯౧

వ॥ అనియిట్లువచించుటయు నతండు వల్లెయని యర్బుదపర్వతంబునుండి క్రిందకి దిగి సరస్వత్యుత్పత్తిహేతువగు జువ్విమ్రాను సమీపించి సమాధిగతుండై వారుణమంత్రంబుల జపించుచు నీక్షణరంధ్రయుగళంబున నిలాతలంబు నీక్షించుటయు రెండు రంధ్రంబులుచేసికొని యూర్విసుండి యుదకంబు బయలువెడలె, నందు సరస్వత్యుద్భవ మూలమగు ప్లక్షవృక్షమూలమందలి రంధ్రంబునుండి వెడలిన వారివేగంబుచే రక్తమంతయుఁ దద్రంధ్రంపుటడుగునం జేరె, రెండవరంధ్రంబునుండి సభ్రమంబుగా వెడలిన జలంబు సాభ్రమతియను పేర నేలోకనదియయ్యె, నట్లు పిప్పలాదప్రతిష్ఠితంబగు

—* పిప్పలాదజననము *—

కంసారీశ్వరలింగంబు నందున్నయది, తద్దర్శనంబున నొకనాఁటి పాతకంబును నమస్కారంబున నాఱునెలల పాతకంబును బూజనంబున సంవత్సరకృతపాతకంబును నశించు" నని వాక్రుచ్చుటయు శౌనకాదులు ౧౯౨

ఆ॥ "పిప్పలాదుఁడెవరు ? పితనామమెయ్యది ? యాతఁ డేలనిలిపె నచట లింగ ?
మద్ది యెటుల ఖ్యాతమయ్యెఁ గంసారీశ్వరాఖ్య ? నానతీయుమార్య ! మాకు"

వ॥ అని యడుగుటయు వెండియు సూతుండిట్లనియె. ౧౯[illegible]

తే॥ ప్రశ్నభారంబు నామీఁదఁ బడియెనిపుడు, పదును గాక, సరస్వతీప్రాణనాథు
నంఘ్రిసరసిజములకు సాష్టాంగమెరఁగి చెప్పెదను భూమిసురులార ! తేరివినుఁడు,

వ॥ యాజ్ఞవల్క్యుని చెలియలు కంసారియనునది కుమారబ్రహ్మచారిణియై పావనంబగు నన్న యాశ్రమంబునఁ దపంబుండుచుండుటయును నొకనాఁడు యౌవనవంతుఁడగు నయ్యాజ్ఞవల్క్యువీర్యం బొక్కయప్సరస్త్రీదర్శనంబున స్ఖలించి పరిధానంబు పరిప్లుతంబుగావించె, నంత నతనిచే విడిచి యవల వైవఁబడిన యాకట్టుపుట్టమును బ్రభాతంబున ఋతుస్నాతయగు కంసారి యెఱుంగక మొలకుఁజుట్టుకొని జలకమాడుటయుఁ దద్వీర్యవిశిష్టంబగు సలిల మాపె భగమధ్యంబునం బ్రవేశించి గర్భహేతువయ్యె, నాగర్భంబు శుక్లపక్షచందిలి యుడురాజుంబోలె దినదిన ప్రవర్ధమానమగుటయు నాతపస్విని యగ్గలంబగు దుఃఖంబున లజ్జితయై గర్భమగుట కాశ్చర్యపడుచు వ్రతచర్యామిషంబున నెరికిం గనంబడక రహస్థలంబునం దాత్మగోపనంబు గావించుకొనియె, నట్లు పదియవమాసంబు ప్రాప్తంబగుటయు నర్ధరాత్రంబునం దర్కకార్క్యసదృశద్యుతియగు నర్భకుంగని కొలఁదిపాటి వలువంగప్పి మనుష్యసంచారంబులేని యరణ్యంబునకుం గొంపోయి కనులనిండ నీరుగ్రమ్మఁ గరుణంబుగా నేడ్చుచు నొక్క పెనురావిమొదట నాబొట్టెం బెట్టి ౧౯౫

శా॥ "అశ్వత్థద్రుమ ! విష్ణురూపమగుదీ, వస్వప్న వర్గంబునన్
శశ్వత్కీర్తి గడించి, తందువలనన్ సర్వత్ర పాపాత్మకన్
విశ్వాసోజ్ఝితనైన నాదుకొమరున్ వీక్షించి రక్షింపు, మీ
శశ్వర్ధంబుగ నిన్ను నేను మిగులం జేమోడ్చి ప్రార్థించెదన్" ౧౯౬

వ॥ అని యావృక్షరాజంబు క్రిందఁ గంటికిఁ గడవెఁడు నీరంబుగా నేడ్చు తత్తపస్విని నుద్దేశించి ౧౯౭

ఉ॥ "ఏడువకమ్మ పీనికయి, యీనిసు వ్రగజుండొ నుతధ్యుఁడన్
వాఁడు శపింప భూస్థలికివచ్చి జనించిన దేవమంత్రి, యౌ
చేడె! శతప్రకారములఁ జెల్వొనుగాంచు నథర్వవేదమున్
వీఁడు నవప్రకారముల వే యొనరించి ప్రసిద్ధిఁగాంచెడిన్, ౧౯౮

ఆ॥ పిప్పలద్రుమరసము పీతమౌ పీనిచేఁ గాన బ్రతికినంత కాల మితఁడు
పిప్పలాదుఁడన్న పేరును ధరియించి ఖ్యాతిగాంచఁగలఁడు భూతలమున; ౧౯౯

చం॥ పురుషుఁడులేక నాకు నెటు పుత్రుఁడుకల్గెనటంచుఁబాల న
బ్బురపడుచుంటి వీవుమది, బోధయొనర్చెదవిన్ము కారణం,
బెఱుఁగక యుష్మదగ్రజుని యెచ్చగువీర్యముచేత సిక్తమై
ధరమను స్నానవస్త్రమును దాలిచి స్నానముసేయ నీ వటన్ ౨౦౦

కం॥ జలములఁగలసి తదీయోజ్జ్వల వీర్యము తావకీనభగమునఁజేరెన్,
చెలి! ఋతుకాలము నీకది యలమటుపడెదేల, కర్గె నాత్మజుఁ డంతన్" ౨౦౧

వ॥ అని మేఘనిస్వనంబుతో నాకాశవాణి బయలు వెడలుటయు వజ్రపాతోప మంబగు తద్వాక్యంబువిని హాహాకారంబు సేయుచు నాతపస్విని ఛిన్నవృక్షయగు తీఁగె వడుపున భూతలంబున కొరగె, నట్లొకె యచటఁ బడియుండుడు యాజ్ఞవల్క్యుండు శూన్యంబగు స్వాశ్రమంబు వీక్షించి ౨౦౨

కం॥ "ఎక్కడికేగిన యదియో యక్కట! నాయనుఁగుఁజెలియ, లర్ధాని విశా
యెక్కడిదిఁక నాకాశ్రమ, మెక్కడిబంధుగుణ. సర్వ మిఁక శూన్యమయో"

వ॥ అనివిలపించుటయు నొకతాపసుండిట్లనియె, ౨౦౩

తే॥ "నీకనిష్ఠసహోదరి నిశ్చలత్వమూని పడియున్న యది రావిమ్రానియొద్ద,
నేను బ్రత్యక్షముగఁ జూచినాను, గాన వేగముగలేపి తోడ్కొని రాగదయ్య"

వ॥ అని యిట్లువక్కాణించుటయు ససంభ్రమంబుగం దదుక్తస్థలంబునకుఁ బరు గెత్తుకొని పోయి యాయాసపడు ననుజ నవలోకించి చిరకాలము శీతలజలంబుల సేచనం బొనరించి చెవులు మూయ నాయను కించుక తెలివివచ్చె నంతలోఁ గాత్యాయనియు మైత్రేయియుం జనుదెంచి ౨౦౫

ఆ॥ "సర్పదష్టవగుచు క్షమఁబడిపోయితో సన్నిపాతదోషసహితవైతొ,
గ్రహమె సోఁకినదియొ, గట్టిగాఁజెపుమమ్మ యేమివచ్చినదియొ యిపుడు వదినె!"

వ॥ అనియడుగుడు భార్యాసహితుండై పజ్జ నిలబడియున్న యన్నం గన్నదై యాకంసారి సిగ్గిలి పలుకనేరక ప్రాణంబులు విడిచెఁ, బదపడి ప్రాణరహితయగుట యెఱింగి బహుకాలంబు పనవిపనవి దహనంబు గావించి నీళ్ళువిడిచి సభార్యుండగు యాజ్ఞవల్క్యుండు స్వాశ్రమంబునకుఁ జనియె. రావిపండ్లరసంబున రక్తంబువెట్టి మెల్ల మెల్లఁ బిల్లండు పెరుఁగుచుండుటయు నొకకాలంబునకుఁ దీర్ఘయాత్రా తత్పరుండగు నారదుండు మార్గవశంబున నచటికేతెంచి పిప్పలాస్వాదనతత్పరతమై నిర్జనారణ్యమం దేకాకిగా ద్వాదశార్క సమద్యుతిం దురంగలించు నర్భాలుంగని యాశ్చర్యపడుచు

తే॥ "సింహశార్దూలయుత వనసీమలోన నొంటిమైనుంటి వెవఁడవీ వో కుమార!
తండ్రి యెచ్చటనున్నాఁడు? తల్లి యెచట? ఘోరవనమున మననేమి కారణంబు?"

వ॥ అని యడుగుటయుఁ బిప్పలాదుండు ౨౧౦

సీ॥ "అస్మదుద్భవమున కాదికారణమైన నాదుతండ్రి పవిత్రనాము మెవ్వొ
నవమాసములు మోసి ననుఁగాంచినటువంటి జననియిత్రి యెచటికిం జనియదియొ
పితృమాతృసంబంధి పృథుబంధుసముదాయ మొగి నెవ్వరెచ్చోట నున్నవారొ

యిచటికిం జనుదెంచి యిట్లు ప్రశ్నించుచు హితమతివైన నీ వెవ్వరగుదో
యెఱిఁగ నెంచెదను, నెట్టులో యిచ్చోట బ్రదుకుచుంటి రావిపండ్లు మెసవి"
యని వచించుటయును నాదేవముని విని జ్ఞానదృష్టి నతని కథయెఱింగి ౨౧౧

ఉ॥ "సాధు సుబోధమైనయది నాయన! నీదుచరిత్రమెల్ల, సు
శ్లోకుఁడు యాజ్ఞవల్క్యముని శుక్రమునుండి తదీయసోదరీ
ప్రాకటగర్భమందుఁబడి భ్రాత యయుతధ్యుని శాపసత్త్వ భూ
లోకమునన్ జనించిన త్రిలోచనతుల్య గురుండ వీవుమా, ౨౧౨

కం॥ సురకార్యార్థంబై యిక్కరణిని ధరఁబుట్టితీవు, కావున నీకు నీ
కరణీయంబు వచించెద, స్థిరమతివై కూరుచుండి తిన్నగ వినుమా, ౨౧౩

కం॥ శతశాఖలు గలయదియై శతకల్పములాగఁగనుండె సరిగ నధర్వం,
బతిగూఢార్థంబగు తచ్ఛ్రుతి సంకుచితం బొనర్పఁ జూడఁగవలయున్, ౨౧౪

కం॥ తొమ్మిదిశాఖలు నటి కల్పమ్ములు నైదును నమర్చి బహుసుఖముగ న
ర్థమ్మగు రీతిని సంస్కరణ మొనరింపంగదోయి నాయన! వేగన్, ౨౧౫

ఉ॥ నీయను యాజ్ఞవల్క్య ధరణీసురువీర్యముచేఁ బరిప్లుతం
బై యలరారు వల్వ తన యంగమునందు ధరించి స్నానమున్
జేయ నవోఢసువీర్యయుతసిరము యోనినిఁజేర, నందునన్
నాయన! యంతనీవు జననంబును గాంచితి, వేమిచెప్పుదున్, ౨౧౬

చం॥ అనవమతిన్ సెపలేక భవదంబ బలాత్కృతిఁ దత్క్షణంబునం
దవనికిఁ బాసిపోయినది, యయ్యయు మామయు యాజ్ఞవల్క్యుఁడే
యవుచుసు హాటకేశ్వరమునందు వసించుచునున్నవాఁడు, త
త్సవిధముఁజేరఁబొమ్ము, కడుసాధువతండు, సమాదరించు నిన్, ౨౧౭

కం॥ ఎనిమిదవయేడు నీకిపు, డనఘా! యుపనయనయోగ్యమగునీడిది, త
న్మౌని యాయుపనయనముఁజేయును, జను, మాలస్యమేలయొనరుచు దింకన్" ౨౧౮

వ॥ అని వాక్రుచ్చుటయుఁ బిప్పలాదుండు సిగ్గుచేఁ దలవంచుకొని కొంత
తడవుండి పదపడి దీనవదనుండై యిట్లనియె. ౨౧౯

ఆ॥ "ఇట్టి చెట్టపుట్టు వేఁబుట్టి మాతృవియోగజనితదుఃఖ మొందుటకును
బ్రాగ్భవమున నేమి పాపంబుఁజేసితి నుడువు, ప్రాణములను విడుచువాఁడ" ౨౨౦

వ॥ అని యడిగిన నారదుండు ౨౨౧

ఆ॥ "పూర్వజన్మమందుఁ బొనరించియుండ వీ వెట్టి యఘము, నింక నేమియునిన
జన్మమునకువచ్చి శనియుండఁ బుట్టితి, వీయవస్థ కదియె హేతువయ్యె" ౨౨౨

వ॥ అనినవిని కనులెత్తిచేసి పైకిఁజూచుటయుఁ దద్దృష్టిపాతంబునఁ దత్క్షణమ శనైశ్చరుండు స్వవిమానంబునుండి క్రిందఁబడి జనకునాదేశంబున నధోవక్త్రుండయి యుండె, నంత నారదుండు శనిం జూచి ౨౨౩

ఆ॥ "బాల్యభావమునను బడఁద్రోసె నితఁడు నిన్ గాంచ కతనఁ గోపగించు మిగుల, నేనుజెప్పినాఁడఁ గానఁ దదీతిగా నవనిఁబడక యంతరమునందె నిలువు" ౨౨౪

వ॥ అని స్తంభింపఁజేసి బాలుండగు పిప్పలాదు దిక్కు మొగంబై ౨౨౫

తే॥ కోపపడకయ్య యీతండు కుగ్రహంబు, తప్ప కష్టమునందున్న దైవతముల నేని బీడించు, జన్మమునందె వసింప నధికపీడాకరుఁడు; ద్వితీయమున నట్లె" ౨౨౬

ఉ॥ ఈతఁడు క్రోధదృష్టి నిను నీక్షణచేసిన భస్మమౌదు, సం
ప్రీతి సుతుండుగల్గెనని వేడివెలుంగరు దేరఁ బుట్టిన
ప్డే తన దృష్టులంబఱపి యెంతయుఁ జర్మసినద్ధమైన త
త్పాతపదంబుజద్వయము దగ్ధమొనర్చె, నికేమనన్ వలెన్" ౨౨౭

వ॥ అనినవిని యాబాలకుండు సుహాభయంబున నారదుం గూర్చి యిట్లనియె, ౨౨౮

ఆ॥ "ఎట్టుప్రసన్నుఁడగునో యీతండు నాయెడం దెలియఁబలుకుమయ్య దేవమౌని! ఇంతవాఁడటంచు నెఱుఁగక పడద్రోయఁబడినవాఁడు గగనపథమునుండి" ౨౨౯

వ॥ నావుడు నారదుం డిట్లనియె, ౨౩౦

సీ॥ "స్వకృతాచారమునన యీజగమంతటికిఁ గూడఁ గృతశుభాశుభములౌ క్షేత్రములును
క్షీరంబు మొదలైన సారవస్తువులచే మానవులం దన్పు ధేనువులును
మంచిచెడ్డల విచారించి భూప్రజలను సరిగ నేలఁగఁజూచు క్ష్మాపతులును
ధర్మ మధర్మంబు దగనెఱింగి ప్రజాళి బాగోగులరసెడి బ్రాహ్మణులును
బూజ్యమానులగుచుఁ బూజింత్రు, పటి యవమానితులగుదు నవమానపఱతు,
రందువలన వేగ నరిగి యగ్రింపుము, సుప్రసన్నుఁడగును సూర్యసుతుఁడు" ౨౩౧

వ॥ అని యిట్లు నుడువుటయు బాలకుం డతిభయంబునఁ గేలుమోడ్చి ౨౩౨

కం॥ "దండమునీకు శనైశ్చర! దండము యమసంజ్ఞ! నీకు, దండముసౌరీ!
దండమునీ కోపింగల! దండం బోబభ్రురూప! దండము కృష్ణా! ౨౩౩

ఆ॥ క్రోధసంస్థ! నీకుఁ గోటినమస్కృతుల్, రౌద్రదేహ! నీకు రహిఁ బ్రణామ,
మంతకా! గ్రహింపు మస్మన్నమస్కృతి, మందసంజ్ఞ! యిదె నమస్సునీకు" ౨౩౪

వ॥ అని వినుతించుటయు శని యిట్లనియె, ౨౩౫

కం॥ "ఆనందమయ్యె నర్భక! నీనుతివలనం గరంబు, నీహృదయమునన్
దేనిపయి వాంఛయున్నదొ దానిం బ్రార్థింపు మిచ్చెదను శీఘ్రముగన్" ౨౩౬

వ॥ అనవుడుఁ బిప్పలాదుండు ౨౩౭

ఆ॥ "ఈదినంబునుండి యీవు బాలకులకు నెనిమిదేండ్లవఱకు నెట్టిబాధ
గలుగకుండఁజేసి కాపాడవలెఁ బుమీ యస్మదీయసూక్తి యాదరించి, ౨౩౮

క॥ ఏతత్స్తోత్రము నెవ్వఁడు ప్రాతఃకాలమున లేచి పఠియింపఁగలం
డాతనిఁ బీడింపక సంప్రీతుం జేయంగవలయు మిత్రతనూజా! ౨౩౯

క॥ భవదీయవాసరంబునఁ దవిలియెవం డర్చ్యరీతిఁ దైలాభ్యంగం
బు విధించుకొనునో వానికి దివసాష్టక మెట్టివ్యథయుఁ దేవలదు శనీ! ౨౪౦

ఆ॥ ఇనుముచేత నీదుతనువు నేర్పరిపించి కర మధోముఖంబుగాను దాని
నూనెలోన నునిచి దాన స్నానమొనర్చి నిడుములుడిపి లాభమీయవలయు, ౨౪౧

ఆ॥ శని! త్వదీయసార్ధసప్తాబ్దరోగంబు రాఁ ద్వదీయవాసరమ్మునందు
సతిలలోహ మెవఁడు క్ష్మాదేవునకునిచ్చు వాని బాధపెట్టవలదు నీవు, ౨౪౨

క॥ భవదుద్దేశంబుగఁ దా నెవఁ డర్థిం గృష్ణధేను విడు బాపని, కో
రవిసుత! యుత్థ్యర్ధాష్టమ భవదుఃఖం బాతనికిని బాపఁగవలయుక్, ౨౪౩

ఆ॥ నల్లవలువగట్టి నల్లనిపూలచేఁ బూజ గుగ్గులంపుఁబొగ యమర్చి
నల్లనువ్వులనో ఘనంబగు జమ్మిపుల్లలనో వ్రేల్చువతనిఁ గలంచవలదు" ౨౪౪

వ॥ అని కోరుకొనుటయు శనైశ్చరుండు వల్లెయని నారదుని వీడ్కొని
స్వస్థానంబునకుఁ జనియె, నారదుండు కరుణాన్వితుండై బాలకుం దోడ్కొని చమత్కా
రపురంబునకరిగి యాజ్ఞవల్క్యున కొప్పఁజెప్పి దివ్యదృష్టిం బొడగాంచిన యతనియాఖ్యా
నం బఖిలంబును నివేదించి మఱియును ౨౪౫

శా॥ "ఈపిల్లండు త్వదీయవీర్యమునఁ దా నిర్ధాత్రి జన్మించుటక్
నీపుత్రుండు, స్వస్వప్రజాతుఁడగుటక్ నీమేనయల్లుండు, మి
మ్మేపాపంబును జెంద, దెన్మిదవయే డేతెంచె, నేలాలసిం
తో పుణ్యా! యుపనీతుఁజేయు మితనిక్ యోగ్యత్వముం గాంచెదిక్" ౨౪౬

వ॥ అనిబోధించి యంతర్ధానంబుఁజెందుటయు యాజ్ఞవల్క్యుండు తత్పాపంబు
దలంచుకొని చేయుంబవళ్ళును దన్నుఁదాఁ దిట్టుకొని విషాదపడుచు శాంతింబొంద
నేరక యాపిల్లనియందుఁగల యాయాచిహ్నంబులవలన నాత్మజుంగాఁ దెలిసికొని
పోషించుచు నుపనయనంబు గావించె, నంతఁ గొంతకాలంబునకు బ్రహ్మ యచటికి
స్వయముగా నేతెంచి ౨౪౭

—॰యాజ్ఞవల్క్యుఁడు హాటకేశ్వరమున శివలింగమును స్థాపించుట॰—

కం॥ “ ఈపిల్లవానిఁగూరిచి యోపాఱుఁడ ! నీవు చింతనొందం బనిలే,
దేపాపమెఱుఁగ వీవిటు, నైపోయెను దైవవశత నంతయు నిటులన్ ” ౨౪౮

వ॥ అని చెప్పుటయు యాజ్ఞవల్క్యుండిట్లనియె, ౨౪౯

తే॥ “ అట్టులైనను దేవ ! నా కాత్మశుద్ధిగలుగకున్నది, యేమంచుఁదెలిపికొందుఁ,
గాన నిష్కృతి యేదేనిగలిగియున్నఁ, జెప్పవిది చేసికొనియెద శీఘ్రమేను ” ౨౫౦

వ॥ అనియిట్లడుగుటయు బ్రహ్మ మఱియు నిట్లనియె, ౨౫౧

ఆ॥ నీకుఁ జిత్తశుద్ధి సిక్కంబుగా నెటుం గలుగకున్నయెడలఁ దెలియఁబఱతు,
నాలకించిదాని హారలింగముం బ్రతిష్ఠింపు, వేగ క్షయముఁజెందు నఘము, ౨౫౨

చం॥ ఎఱిఁగియొ లేకెఱుంగకయొ యెట్టులొ బ్రహ్మవధాంగనావధా
ద్యురుతర పాతకంబులనె యోజనొనర్చినగాక, యాతఁడే
హారునకు నై దురాల్మిలిపియైనను దేవళముఙ రచింప నా
దురితము లంతమొందు రవితోఁచిన గాఢతమంబుచాడ్పునన్, ౨౫౩

కం॥ కలికాలం బేతెంచుడుఁ గలుషములకుఁ జోరఁగరాక కడుఁ బావనమై
వెలయు నల హాటకేశస్థలిఁ గట్టఁగఁబడెడిగుడికిఁ జాలఫలంబౌ, ౨౫౪

చం॥ కలిసనుదెంచుసన్న భయకంపముచేతను నెంతదాఁకఁదా
ఫలగహితంబుగాక యిల భాసిలుచుండునొ యంతదాఁక నే
నలఘుతరాధ్వరక్రియల నం దొనరింపఁదలంచుచుంటి, నిం
దులకయి తేఁగనుంటిఁ జని తోడనె పుష్కరతీర్థమొద్విజా ! ౨౫౫

కం॥ కలికాలమువచ్చుటయును నలఘుతరంబై నయట్టి యా క్షేత్రముగా
కిలఁగల బలుతీర్థములును ఫలరహితములై నశించు బ్రాహ్మణవర్యా ! ” ౨౫౬

వ॥ అనియిట్లువాక్రుచ్చి చతుర్వదనుఁ డంతర్ధానంబుఁజెందుటయు యాజ్ఞవ
ల్క్యుఁడా క్షేత్రమహిమయెఱింగి శివలింగముం బ్రతిష్ఠించి ౨౫౭

కం॥ “అష్టమినాఁడుం జతుర్దశి నిష్టదమగు నాదులింగ మెవ్వఁడు తా సం
తుష్టిగ నభిషేకించునొ నష్టముగును వాఁడొనర్చినయఘము లెల్లన్, ౨౫౮

ఆ॥ జననిచెట్టఁబట్టు చండాలుఁడేని యీ యస్మదీయలింగ మధికభక్తి
స్నపనపూర్వకముగ సరిగఁ బూజించుచో శౌచితాఘుఁడగును క్షణములోన,

కం॥ ఒకదినమొనరించిన మామకలింగార్చనమువలన మాయును దాఁద
ప్పక యొకపక్షపుఁబాపము, పరికట్టికిరియమాణమిట్లు బాగుగ నాచేన్ ” ౨౬౦

వ॥ అని మేఘగంభీరనిస్వనంబున వాక్రుచ్చుటయు నాఁటగోలె నా హాటకేశ్వర
క్షేత్రంబున యాజ్ఞవల్క్యేశ్వరుండని యొకదేవుండు విఖ్యాతుండయ్యె, నదియంత

— పిప్పలాదుండు కంసారీశ్వరంబను లింగంబుఁ బ్రతిష్ఠించుట —

యుం బలికించి పిప్పలాదుండు తనతల్లి శుద్ధురాలగుటకుఁ గాఁ దద్వామంబున లింగం
బును స్థాపించి గర్తాతీర్థసముద్భూతుండును మధ్యగుండును సాహితాగ్నియు గోవర్ధ
నాభిధానుండును నగు నొక నాగరబ్రాహ్మణు రావించి ౨౬౧

క॥ "ఏతన్నగరస్థానము భాతిని దీక్షితుఁడవైతి బ్రాహ్మణ ! నీవున్,
ఖ్యాతాష్టషష్టిగోత్రప్రీతికి నాయకుఁడవగుచుఁ బెంపొందెదిలన్, ౨౬౨

క॥ వివిధక్రియలందును నోయవనీసుర! యరువదెనిమిదగు గోత్రికులున్
భవదుక్తిమీఁదవర్తిలు రవిశశితారకలు నింగి రాజిలుదాఁకన్, ౨౬౩

క॥ గోవర్ధనాభిధానా ! నీవే తల్లింగమునకు నిచ్చలుఁ బూజల్
గావింపుండని నాగరభూవిబుధులఁగూర్చి బిట్టు బోధింపవలెన్, ౨౬౪

ఆ॥ వృద్ధిఁబొందఁగలదు వివిధంబుల నీదు వంశంబు దీనివలనఁజేసి,
క్షయము గాంచు నట్లు సలుపకయున్నచో, లేదు సంశయంబు లేశమిందు, ౨౬౫

క॥ భవదన్వయసంజాతులు శివలింగంబునుభజించి చేసెడియాయా
వివిధకృతులు సిద్ధించినయవియగు దీక్షిత ! తదీయమగు ననుకంపన్ " ౨౬౬

వ॥ అనివక్కాణించి యతని యంగీకృతిం బడసి మఱియును ౨౬౭

క॥ "గోవర్ధనాఖ్య ! నాగరభూవిబుధులఁ దోడితెమ్ము, పో మ్మతిశీఘ్రం,
బావారి కభిమతంబుగ దేవునకుం బేరువెట్టి తృప్తుఁడనగుదున్, ౨౬౮

వ॥ అని తద్ద్వారంబున విచక్షణులును శ్రుతాధ్యయనసంపన్నులును యజ్ఞకర్మ
పరాయణులును నగు నాబ్రాహ్మణులఁ బిలిపించి నమస్కరించి ౨౬౯

క॥ "మాయమ్మ చచ్చిపోయిన, దాయమ కంసారినాఁగ నలరారెనుము,
న్నాయమ నుద్దేశించితిమో యీయెడ లింగప్రతిష్ఠ యోనొనరించితిన్, ౨౭౦

తే॥ మీవలనసిద్ధి ఖ్యాతమై మీఱఁగలదు, యాజ్ఞవల్క్యేశ్వరము నిది యష్టమీచ
తుర్దశుల నభిషేకసంతుష్టములయి శ్రేయమొందఁగూర్పఁగల, విది సిద్ధమరయ "

వ॥ అని పలుకుటయు నాబ్రాహ్మణులెల్లరు నాలింగంబునకుఁ గంసారీశ్వరుండని
పేరు పెట్టి, రేవఁడీపుణ్యోపాఖ్యాన మాదేవు నెదుటఁ బఠించు శ్రవణించు వాని మాన
సికపాపంబును బరదారకృత పాపంబును బిప్పలాదోక్తవిధంబున విలయంబుగాంచుఁ,
దదగ్రంబున నీలరుద్ర పాత్రిణరుద్ర భవరుద్రంబులఁ బఠించిన బ్రహ్మహత్యా పరచక్రా
నావృష్టి భయంబులు నశించు, నథర్వణవేదం బఖిలంబును బఠింప నతిక్షయంబు
వాటిల్లు, వానలు గురియు, రాజదౌష్ట్యంబుగా నారాజు ధార్మికుండును సర్వలోక
వినిశ్రుతుండును ప్రజాపాలనతత్పరుండును నగు, నుపసర్గభయంబు వచ్చినను బిప్పలా
దోక్తవిధంబున మొలమొల్లఁ దద్దోషంబును హరించు, వేయేల, యేవ్యసనము సంభవించి
నను నాదేవు నగ్రంబున నథర్వణవేద పారాయణంబొనరించుచోఁ ద్వరితంబుగ నశించు,

## —♦ పద్మావతీ చరిత్ర ♦—

తే॥ అట్లు మానుష్యమైనసిన యబ్ధితనయ నిల్పినటువంటి పంచపిండికయు నచటఁ
జెలఁగుఁ, దద్ద్వారి నీక్షణసేయుమాత్ర స్త్రీలు సౌభాగ్యమునుబొంది చెలఁగఁగలరు,

వ॥ సూర్యుండు వృషభరాశిగతుండై యుండ జ్యేష్ఠశుక్లచతుర్దశీతిథిం దత్పంచపిండికాగౌర్యపరిభాగంబున రేయుంబవళ్లును దోయంబుస్రవించు యంత్రంబుఁగట్టించు స్త్రీకిఁ బరమసౌభాగ్యంబు ప్రాప్తించు, గౌరీసంబంధములగు సమస్తవ్రతంబులును సమస్తదానంబులును గావించిన నెంతఫలంబుగల్గు నంతఫలం బీయంత్రమూలంబున సిద్ధించుఁ, గావున నాఁడువాండ్రు సౌభాగ్యంబుపొందఁ బ్రయత్నపూర్వకంబుగా జ్యేష్ఠమాసంబున జలయంత్రంబును గట్టించునది, ౨౭౩

సీ॥ తత్ప్రీతిదములైయెతవరు వ్రతంబుల నెన్ని కావించిన నేమిఫలము,
కాయకష్టము బిట్టుగలిగించునియమంబు లెన్ని గావించిన నేమిఫలము,
చిత్తమేకాగ్రంబుఁజేసి మంత్రజపంబు లెన్ని గావించిన నేమిఫలము,
ఆజ్యాహుతులతోడ నధికమౌ హోమంబు లెన్ని గావించిన నేమిఫలము,
సప్తజన్మములును సౌభాగ్యయుతయౌచు వంధ్యగాకయుండ వారిజాక్షి
జ్యేష్ఠసితచతుర్దశిం గాళిపై జలయంత్ర మునుపవలయు నంతెకాని" ౨౭౪

వ॥ అనవుడు శౌనకాదిమహర్షులు ౨౭౫

కం॥ "గౌరి చతుర్భుజయని భువి సూరిజనుల్చెప్పుచుంద్రు, చూచిన నదియే
తీరునఁ గనఁబడియెడి, నిఁక నేరీతిం బంచపిండ యీయమ యయ్యెన్?" ౨౭౬

వ॥ అని ప్రశ్నించుటయు సూతుండిట్లనియె, ౨౭౭ [గౌరి

తే॥ "ఎపుడు ప్రళయంబుగాఁగల దపుడు పంచపిండమయమగు మెయి దాల్చుచుండు
పరమశక్తి తదీశ్వరి పావులార! నిచ్చలును ముజ్జగంబుల నిలిచియుండు ౨౭౮

వ॥ ఈయమ పృథివ్యాపస్తేజోవాయ్వాకాశంబుల సృష్ట్యర్థమై రక్షించుఁ గావునఁ బంచపిండికయగుచుండెడుఁ, గేవలగౌరీపూజనంబున కన్నఁ బంచపిండికాగౌరీపూజనంబున వేయిరెట్లు ఫల మధికంబు, జ్యేష్ఠమాసంబున ధారాపాత్రం గట్టి పూజించుచో మఱియు విశేష, మీ విషయమై కాశీరాజభార్యావృత్తాంతగూప పురాతనేతిహాసంబు విష్ణువు ప్రశ్నించిన లక్ష్మి యిట్లనియె, ౨౭౯

క॥ "కాశీపుటభేదనమున కీశుఁడు జయసేనుఁడనఁగ నెసఁగెను మును, పా
ధీశాలికిఁ బదినూఱుల యోశీవిమవేణులుండి రర్ధాంగులహో! ౨౮౦

ఆ॥ మద్రదేశమేలు మహిపు విష్వక్సేను ననుఁగుఁగూఁతు రస్మదంశజాత
పరమసుందరాంగి పద్మావతీనామ్ని పతికిఁ గరము ప్రీతిపాత్రమయ్యె, ౨౮౧

కం॥ అనుదిన మా యంగన ప్రొద్దున నే వెస లేచి పూతతోయంబగు గం
గను డాయుచుఁ దత్తీరంబునఁ జెలఁగెడి పుట్టమట్టి ప్రోవొనరిచి తాఁ ౨౮౨

సీ॥ పంచపిండాత్మిక భగవతి రచియించి పంచమంత్రము లుచ్చరించుకొనుచుఁ
జీనాంబరముగట్టి శ్రీగంధముం బూసి పూలెవ్వెట్టి సాంబ్రాణి పొగలువేసి
నానాసుభక్ష్యము నైవేద్యమొనరించి సంగీతముంబాడి చక్కనాడి
దళవర్ణ లగు విప్రతామరసాక్షుల కాయూయిదానంబు లాచరించి
భూరివాదిత్ర నిస్వనంబులు సెలంగ పండియును నింటికే తెంచుచుండుటయును
దినమొకింతగఁ బెరిఁగి యాతీఁగఁబోఁడి కగ్గలంబయ్యె సౌభాగ్య మంబుజాక్ష!

కం॥ తమకంటె నధిక సౌభాగ్యముగాంచి తదబ్జనయన యలరారుటయుఁ
గ్రమముగ సపత్నులెల్లరు నమితంబగుదుఃఖమొంది యాత్మలలోనఁ ౨౮౪

మత్తకోకిల॥ పంచపిండభజించి యీదృశభాగ్యముఁ గడియించెఁదా
నంచుఁగొందఱు మంత్రసత్త్వము నయ్యెనిట్లని కొందఱుఁ
సంచితంబయినట్టిపుణ్యము చాలనుండుటచేత ని
ట్లొంచుఁగొందఱుఁ బల్కుచుఁ బహూపాయనంబులు చన్నపైఁ ౨౮౫

కం॥ భాగీరథీతటంబున నాగుణవతి పంచపిండ నర్చించు నెడఁ
దా గుమిగూడినదై యా స్త్రీగణ మటు దనియెఁ గతము తెలిసికొనంగఁ, ౨౮౬

చ॥ పనివిను వారినందఱను బాగుగఁజూచి తదబ్జనేత్ర తా
నొనరుచు పూజ నైత మటులుంచి కృతాంజలిపూర్వకంబుగా
వినయవిధేయత ల్సెలఁగ వే యెదురేగి "యిటేగుదెంచు నా
పని యదియేమి" యంచుఁ దగు ప్రశ్నమొనర్ప సపత్నులెల్లరుఁ ౨౮౭

కం॥ "నీసౌభాగ్యముచేతను మాసౌభాగ్యంబు దహ్యమానంబగుటం
జేసి విషణ్ణులమై నిన్నాసతి మేటుతోఁప కిటుల నాళీకముఖీ! ౨౮౮

ఆ॥ అనయమీవు మృణ్మయంబైన పంచపిండను భజించి దేని నెనసినావొ?
మంత్ర మెదొ జపించి మఱి యిట్టులైతొ? గోప్యంబు గాకయున్న నదివచింపు"

కం॥ అనుటయుఁ బద్మావతి యిట్లను, "యుష్మత్ప్రశ్నమైనయది గోప్యము, వా
కొనఁగూడ దేరికిని, నైనను మీరు వచింతుఁబినుఁడు నలినదళాక్షుల్ ౨౯౦

ఆ॥ గౌరిపూజ నేను గావించుచుండఁగ నేగుదెంచినార లీర లిటకు
నదియుఁగాక యీదు రక్కలుఁ జెల్లెండ్రు, నేలయీర్ష్య మీపయినను నాకు,

ఆ॥ నేను బ్రాగ్భవమున మానినీమణులార! కుసుమసంజ్ఞమైన గొప్పవీట
వీరసేనుఁడనెడిపేరఁ జెలంగెడి యవరజునకుఁ దనయ, నధికవినయ, ౨౯౨

కం॥ అట్టినను నొక్క వణిజునిపట్టి కిడెను నాదుతండ్రి, పంచాతురముల్
పెట్టెను వారణంబుగ నప్పట్టున మాతల్లి, నాదుభాగ్య మదేమో, ౨౯౩

ఉ॥ పెట్టుచు నాపె నన్గనిచి "బిడ్డరో! యియ్యవి గౌరిపూజలో
బిట్టుపయోజ్యముల్, మఱియు వీనిఁ బఠించి భజింపకుండ నె
ప్పట్టున నేనియుఁ జలిలపానము సేయకు, తన్మహత్త్వ నీ
పట్టినపట్టు నెగ్గు" నని బాగుగఁ దత్క్రమ మెల్లఁ జెప్పుడున్ ౨౯౪

ఉ॥ పెండిలిసేసి నాదుపిత పెన్మిటివెంబడిఁ బంపినాఁడు న,
న్నండజయానలార! యట నత్త కడుంగడు మూర్ఖురాలు, నా
వుండిననోము నోఁచుకొన నొప్పక యేవొ పనుల్విధించు చు
ద్దండతఁజూపఁగం దొడఁగెఁ దజ్జరఠాంగన యేమిచెప్పుదున్,

ఆ॥ ఆపెచూడకుండ ననుదినంబే నీళ్లకరిగి నప్పు డచటి బురదపట్టిఁ
బంచపిండికలను బాగుగాఁ గావించి పంచమంత్రములు సముంచితముగ ౨౯౫

తే॥ భక్తిఁ బూజించి మరల నాపంచపిండికలను జెఱువునఁబడవైచి నిలయమునకు
వచ్చుచుండెడిదాన నీవహిని రహిని,నట్టు లొకనాఁడు యబ్దంబు లరుగుటయును ౨౯౬

తే॥ మండువేసవిలోన నామగఁడు జేరమునకునై దూరదేశంబుఁజనుచు నన్ను
వెంటఁగొంపోయెఁ, జెనుకూపమునంటఁజూచి విడిసెను సస్వార్థముగ నొక్కవిపినమందు

కం॥ ఆనూయిచుట్టు నగ్గలమైన బిడారుంటఁజేసి యువతిల నొకచోఁ
బానీయాకృతిదోఁదం గానంబడెడి మరుభూమి కడకరిగితి నేన్, ౨౯౮

చం॥ అరిగి నిరాశనై మరలునంతకు నెత్తికిఁ బ్రొద్దువచ్చెఁ, ద
త్కరములు మేనఁబాఱి కడుఁగాఁచియు పెట్టెను, గాళ్లు బొబ్బలై
చుఱుచుఱుకన్నం బొడమ [illegible] చిపయిం బడిపోతి, లోష్టశం
బరతృణవర్జితంబయిన బావి నిపాతితుఁడై నృగుండు మున్ ౨౯౯

కం॥ ఇసుమున యజ్ఞంబొనరిచి వెస భక్తిగ్రాహ్యులైన వేలుపులను సం
తసమునఁదేల్చుట మన్మానసమున స్ఫురియించె నేమనంగల దింకన్, ౩౦౦

ఆ॥ అంత నేనుగూడ నైదుదోసిళ్ల సికతము నే మహేశిగాఁగఁజేసి
యైదుమంత్రముల నర్చించి ప్రాణము ల్విడిచితిని రయంబ పడఁతులార! ౩౦౧

ఆ॥ అవిశేషమున దశార్ణభూనాయకు ననుఁగుబిడ్డనగుచు జననమంది
విదితపూర్వజన్మవృత్తాంతనైతి, నింకేమిచెప్పవలయు నింతకన్న, ౩౦౨

కం॥ వయసున మీకంటెను జిననయియును సౌభాగ్యమునకు నైతిని బెద, ని
శ్చయమిది, యటుగావున పృణ్మయపిండము లైదొనర్చి మతిమతిభక్తిన్ ౩౦౩

శా॥ గౌరీభావన నిత్య మర్చనములం గావించుచుస్నానను, నా
కీర లూప్యాజ్యలుగానఁ జెప్పితిని మీ కీగోప్యవృత్తాంత, మో
నారీరత్నములార! నాదయిన యౌన్నత్యంబు సర్వంబు త
ద్గౌరీదేవి యనుగ్రహో త్థమచుఁడీ, తథ్యంబు వాక్రుచ్చితిన్ " ౩౦౪
క॥ అనియిటు వాక్రుచ్చుటయును వినయము పెనఁగొన నమస్సు విధియించి తదం
గన లా పెతోడ నంజలియొనరిచి వెస నిట్టులనిరి యౌవనమాలీ! ౩౦౫
క॥ " ఏమంత్రపంచకముచే నామాహేశ్వరి ప్రసన్నయయ్యెనో మాకీ
వామంత్రపంచకంబును బ్రేమను వచియింపుమమ్మ ప్రియమొనగూడన్ " ౩౦౬
క॥ నావుడు " యథేచ్ఛగం దద్దేవిని బ్రార్థింపుఁ " డనుచుఁ దన్నగ నాప
ద్మావతి మంత్రము లైదును వే వక్కాణించె " ననుచు వివరించుటయున్ ౩౦౭
క॥ " మును పద్మావతిచేత సమనుష్ఠితంబయి సపత్నులందఱికిని శ్రీ
తిని జెప్పఁబడిన మంత్రములను జెప్పుమునాకు, నాని లా వెట్టిదియో " ౩౦౮
వ॥ అని విష్ణుదేవుండు ప్రశ్నింప లక్ష్మీదేవి ౩౦౯
శ్లో॥ " నమః పృథివ్యై శాంతిశి నమ ఆపోమయే శుభే
తేజస్విని నమ స్తుభ్యం నమ స్తే వాయురూపిణి
ఆకాశరూపసంపన్నే పంచరూపే నమోనమః " ౩౧౦
వ॥ అనుమంత్రంబు లుచ్చరించి ౩౧౧
తే॥ వీనితోడఁ బద్మావతి తాను బూర్వ మీశ్వరీపూజయొనరించి యితరసతులు
పొందఁగారాని రాజ్యంబు పొంది హాటకేశమున రత్నమయగౌర నెలమి నిలిపె,
క॥ ఆగౌరిం గొలిచిన యెలనాగను బెనిమిటి ప్రియంబునం గాంచును దా,
నోగరుడవాహ! మఱియును వేగమ నశియించు దాని వృజినములెల్లన్, ౩౧౩

—• పద్మావతి పంచపిండికం గొల్చి దేవత్వంబు వడయుట •—

క॥ ఈవిధమునఁ బద్మావతి దేవీపూజనమువలనఁ దీఱని రాజ్య
శ్రీవడసియు సౌభాగ్యము యౌవనముం గలదియయియు ననపత్యతమై ౩౧౪
క॥ రేయుంబవలును దుఃఖము కాయము దహియింప నుండు కాలమునఁ దప
శ్శ్రీయుతుఁడగు దుర్వాసుం డాయింటికి నేగుదెంచె " హరహర! " యనుచున్
ఆ॥ ఏగుదెంచునతని నీక్షించి తద్భర్త యెదురునడచి యర్ఘ్యమిచ్చి వేగ
నాసనంబువైచి యందుఁ గూర్చున్నపై స్వాగతంబుజరిపి యధికభక్తి. ౩౧౫
ఆ॥ "నీదుకాళ్ళధూళి నిజశిరోజములచేఁ దుడిచినట్టినాడుఁ దులితుఁడైన
ధన్యతమవిభుండు ధరణీతలంబున మఱియొకండుగలఁడె మౌనినాథ! ౩౧౬

క॥ చెపు మస్మదీయగృహమున కిపు డీవరుదెంచు కార్య మెద్దియొ, యేత
ద్ద్విపుల సమస్తం బిమ్మునపుడైనను వెనుకదీయ కర్పింతు వెసన్" ౩౧౯
క॥ అనియిటు వాక్రుచ్చుటయును "జనవర! నీ యింటిలోనఁ జాతుర్మాస్యం
బును వృత్తికాగ్రహణమును బొనరుతు, శుశ్రూష చేయఁబూనఁగవలయున్"
ఉ॥ అని ముని యాజ్ఞయిచ్చుటయు "నట్లెయొనర్చెద" నంచు నాతఁడ
ప్పని తన భార్యతోన్ నడుమ భక్తిఁ దదంగన బిడ్డ తండ్రికిన్
బొనరుచున ట్లుపాసనము పొద్దును మాపును జేసె వానికిన్
దనయెడలం గృపారసము తద్దజనింపఁగ జీవితేశ్వరా! ౩౨౦
శా॥ చాతుర్మాస్య ముగించి యేగునెడఁ దచ్ఛాపాయుధుం డాయమన్
బ్రీతిన్ డగ్గఱఁ జేరఁజీరి "చెపుమీ బిడ్డా! త్వదిష్టంబు" నాఁ
జేతుల్మోడిచి యిట్లనున్, "విను మునిశ్రేష్ఠా! మహారాజ్ఞియన్
ఖ్యాతిం గాంచియుఁ బ్రాయమందు మనియున్ సంతానముం గాంచమిన్, ౩౨౧
క॥ రేయుంబవలు దహింపఁగఁ జేయంబడుచుంటిఁగానఁ జెప్పు మపత్య
శ్రీ యొనగూడు నుపాయం, బోయనఘా! వ్రతమొ నేమమో దానంబో" ౩౨౨
చ॥ అనవుడుఁ జాలసేపు తన యాత్మను యోజనచేసి యాతఁ డి
ట్లనియెను, "బూర్వజన్మమున నమ్మరో! నీ యవసానకాలమం
దునను బ్రతప్తవాలుకలతోడను గౌరి నొనర్చి కొల్చి, తం
దున నిటు దవ్యమానవయి దుఃఖమునందెదు రాజ్యమొందియున్, ౩౨౩
క॥ కేవల మనుసంయుక్తిని భావములందుండుఁగాని పాషాణమునన్
దా వసియింపదు, మఱియును బావన పృథ్వ్యాద్యములను భాసిల దేవుడున్, ౩౨౪
తే॥ భక్తిగలభావమున మంత్రబలమునుండి యరుగుదెంచిన యీశ్వరి నరుణకిరణ
తప్తవాలుకలంజేర్చి తద్దఁగొల్చి తందునను నీదు మెయిఁ దాప మధికమయ్యె, ౩౨౫
ఆ॥ కాన రత్నమయముగాఁజేసి పంచపిండాఖ్యగౌరి భక్తి హాటకేశ్వ
రమున నిల్పి యంత రవి వృషభగుఁడుగా వారియంత్ర మామెపైని గట్టు, ౩౨౬
క॥ రాత్రిందివములు ధారాపాత్రంబుననుండి జలము పైఁబడుకొలఁదిన్
గోత్రాధీశ్వరతనుభవగాత్రంబున శైత్య మొదవుఁ గమలదళాక్షీ! ౩౨౭
ఆ॥ అచటఁ జల్లఁబడుడు నట్లె నీదాహంబు శాంతిఁబొందఁగలదు సక్రమముగ,
దాహమాఱ గర్భధారణ మొనరించి ఖ్యాతుఁడైనపుత్రుఁ గాంచఁగలవు" ౩౨౮
క॥ అనియిటు వాక్రుచ్చుటయును విని పద్మావతి "మహాత్మ! వితథంబగు నీ
మనుజత్వముతో నాకిఁకఁ బనిలేదు, మదిన్ విరక్తి ప్రభవించెఁ గడున్, ౩౨౯

ఆ॥ సకలదేహధారి నికరంబు బ్రిదుకును నేటివఱదవంటి దెంచిచూడఁ,
గాన మామకీన మానుషభావంబు తొలఁగువ్రిత మెదేని తెలుపుమయ్య" ౩౩౦
కం॥ అనియడుగుడు దుర్వాసోమునివర్యుఁడు కొంతసేపు ముకుచివరను దృ
ష్టినినిల్పి ధ్యానమొనరిచి మనుజాధిపురాణితోడ మఱి యిట్లనియెన్, ౩౩౧
కం॥ "కలదొకపుణ్యవ్రితమో యలివేణీ ! గౌరికద్ది యతితుష్టికరం,
బిల దానింబొనరించిన యెలనాగలు దేవభావ మొనయుదురోజన్, ౩౩౨
తే॥ గోమయాఖ్యమహాదేవి గోమయమునఁ జేసి గోలోకమొందిరి స్త్రీలు కొంద,
ఱామహాదేవిఁగావింపు మబ్జవదన ! దేవతాభావముంబొంది తేజరిలెదు" ౩౩౩
కం॥ అనియిటు వక్కాణించుడుఁ గనుగొని మునివర్యు "నెట్టికాలంబున నీ
ఘనవ్రితము చేయఁగావలయును? విధియెది? చెప్పుమయ్య యోఋషి!" యనినన్,
కం॥ దుర్వాసుఁడు పద్మావతి గుర్వనుకంపామతిఁ గనుగొని యిట్లను, "నో
చార్వంగి ! దేనినొనరిచి నిర్వృతిగాంచెదరొ స్త్రీలు నీకదవినుతున్, ౩౩౪
తే॥ భాద్రబహుళతృతీయను భాస్కరోద్భవమునకుం బూర్వమే లేచి పండ్లుదోమి
శ్రద్ధమై గౌరినామము ల్చదువుకొనుచు సలుపవలె నుపవాసంబు జలజనయన !
కం॥ అంత నిశాగమమున నో కాంతా ! మృణ్మయములైన గౌరమ్మలునా
ల్గింతయు బాగుగ నొనరిచి యంతఃపరిశుద్ధితోడ నర్చింపవలెన్, ౩౩౬
శ్లో॥ "హిమాచలగృహే జాతా దేవి త్వం శంకరప్రియే
మేనాగర్భసముద్భూతా పూజాం గృహ్ణ నమోస్తు తే" ౩౩౭
కం॥ అనుమంత్ర ముచ్చరించుచుఁ దనయా ! తొలిజామునందుఁ దద్దేవికిఁ బూ
జనమొనరింపఁగవలయును, విను పూజాద్రవ్యములను వినిచెద నింకన్, ౩౩౯
కం॥ ధూపము కర్పూరంబున, దీపము ఘృతసిక్తరక్తదృఢసూత్రమునన్,
బాపురెయన నొనరిచి జాతీపుష్పాలంకృతిని విధింపఁగవలయున్, ౩౪౦
కం॥ కుడుములు నైవేద్యంబుగ నిడి యెఱ్ఱనివలువఁగట్టి యెంతయు పొందం
బొడగూడ మాదిఫలమున నుడురాజనిభాస్య ! యర్ఘ్య మొసఁగఁగవలయున్,
శ్లో॥ "శంకరస్యప్రియే దేవి హిమాచలసుతే శుభే
అర్ఘ్యమేనం మయాదత్తం ప్రతిగృహ్ణ నమోస్తు తే" ౩౪౨
మ॥ అనునీమంత్రమ యర్ఘ్యదానమున యోజ్యంబౌను గ్రాల్గంటి ! యే
ఘనవృక్షంబునఁ బూయుపూవులను దద్గౌరీమహాదేవి య

ర్పనముం జేతురో యామహీరుహాపుఁ గాష్ఠంబేచుమీ దంతధా
వనముం జేయఁగ నర్హ్యమాఁత్రతమునన్ వర్తించునవ్వారికిన్, 343
ఆ॥ అర్ఘ్యమునకు నుక్తమగు మాదిఫలము ప్రాశనముఁజేసి యవలి జాముసందు
నగరుధూపమునను నొగిఁగుణ కాని వేదనమునను గువలయమునను భక్తి, 344
శ్లో॥ "వామమర్ధం శరీరస్య యా హరస్యవ్యవస్థితా
సా మే పూజాం పరిగృహ్ణాతు తస్యై దేవ్యైనమో నమః" 345
క౦॥ అనునీమంత్రిముచేత న్ఘనముగఁ బూజించి యర్ధనారీశ్వరయం
చును జెప్పఁబోవు మంత్రింబునఁ గొబ్బరనర్ఘ్యమిచ్చి భుజియింపవలెన్,
శ్లో॥ "అర్ధనారీశ్వరౌ యౌచ సంస్థితౌ పరమేశ్వరౌ
అర్ఘ్యో మే గృహ్యతాం దేవౌ స్యాతం సర్వసుఖప్రదా" 346
క౦॥ తిగజామున శతపత్రిములఁ గడుం గైసేసి గుగ్గిలంపుఁ బొగ లైవ
కెగఁబ్రాఁక ధారికాత్మకమగు నైవేద్యంబుతోడ నధికశ్రద్ధన్ 347
శ్లో॥ "ఉమామహేశ్వరౌ దేవౌ యౌతౌ సృష్టిలయాత్మకౌ
తౌ గృహ్ణీతా మిమాం పూజాం మయాదత్తాం ప్రభక్తితః" 348
ఆ॥ అనెడిమంత్రమున నర్చించి యటుపైని జాజికాయతోడ సరిగనర్ఘ్య
మొసఁగి యదియె తాను మెసవంగవలయుఁజూ మదిరిరాజతనయ! మహితవినయ! 349
శ్లో॥ "ఉమామహేశ్వరౌ దేవౌ సర్వకామసుఖప్రదౌ
గృహ్ణీతా మర్ఘ్యమేతం మే దయాం కృత్వా మహత్తమాం" 350
క౦॥ అనునిది త్రిప్రహరార్ఘ్యపు మనువగుఁజూ రాజతనుజ! మఱి నాల్గవజా
మునఁ బంచపిండికాగారిని మార్కవపుష్పములఁ బరిష్కృతఁగాఁగన్ 351
క౦॥ కావించి గ్రంధిరజ మా దేవికిఁ బొగవేసి నేతఁదేలెడి పూరిన్
నైవేద్యం బొనరిచి నిజభావము పరిశుద్ధమగుచు భాసిలుచుండన్ 352
శ్లో॥ "పృథివ్యాదీని భూతాని యాని ప్రోక్తాని పంచచ
పంచరూపాణి దేవేశి పూజాం గృహ్ణా నమోస్తుతే" 353
క౦॥ అనుమంత్రమునఁ బూజనమొనరిచి యందుగుఫలంబు నొగి నర్ఘ్యముకై
వినియోగింపఁగవలయును, దనయా! యదియేఫలంబుఁ దాఁ దినవలయున్, 354
శ్లో॥ "పంచభూతమయీ దేవీ పంచధా యా వ్యవస్థితా
అర్ఘ్యమేనం మయాదత్తం సా గృహ్ణాతు సురేశ్వరీ" 355

క॥ అనునీమంత్రము తుదిజామునఁ జేసెడియర్ఘ్యదానమున వినియోజ్యం,
బనుకూలగీతవాద్యస్వనముల నాదైవతములసాన్నిధ్యమునన్ ౩౫౭

తే॥ ఈవిధంబున నారాతిరెల్ల భక్తి నిదురవోకుండఁగడపి యోనీరజాక్షి!
ప్రొద్దుపొడుపున నీరాడి భూమిసురుని సహకుటుంబముగం బిల్చి శక్తికొలఁది ౩౫౮

ఆ॥ వస్త్రభూషణముల శాస్త్రోక్తవిధినిచ్చి పూజసేయవలయుఁ బూవుఁబోఁడి!
మిగులభక్తి గౌరి మృష్టాన్నభక్ష్యనివేదనమునఁ దృప్తిపెట్టవలయు, ౩౫౯

ఆ॥ అంత దంతిపైనొ యశ్వంబుపైనొ గౌరీచతుష్టయంబు ప్రీతినుంచి
గీతవాద్యములును ఖ్యాతతూర్యధ్వనుల్ సెలఁగ నుత్సవంబు సేసికొనుచు ౩౬౦

శ్లో॥ " ఆహూతాసి మయాదేవి పూజితాసి మయాశుభే
మమసౌభాగ్యదానాయ యథేష్టంగమ్యతామితి " ౩౬౧

క॥ అనుమంత్రముపఠియించుచు ధునిలోనో తటాకముననో తోయజయుతవా
పినో వైచి మరలనింటికిఁ జనుదేరఁగవలయుఁ బూర్ణచంద్రనిభాస్యా! " ౩౬౨

క॥ అనిపాకొని దుర్వాసోముని యేగుటయును నభస్యమునకు ద్వితీయా
దినమున నాపద్మావతి పౌనరిచిత్రవ్రతము రెండుపూటలు చనుపై ౩౬౩

క॥ ప్రాతఃకాలంబునఁ దత్పూతనదీతీరమునకుఁ బోయి యచట సు
స్నాతయగుచుండ మును తనచేతం బూజింపఁబడిన శివవిగ్రహముల్ ౩౬౪

క॥ నాలుగు రత్నమయములై చాలఁగఁ గనఁబడియె, నపుడు సర్వేశ్వరి యా
బాలం గనుగొని " బిడ్డరో ! నా లలితార్చలనిటేల నారమునడుమన్ ౩౬౫

క॥ ఉంచెదు ? కైకొనిపోయి సముంచితమగు హాటకేశమందున రహిస్థా
పించుము సకలస్త్రీలకు మంచితటస్థించు వీనిమహిమమువలనన్, ౩౬౬

క॥ వరమడుగు మిడుదు " ననవుడుఁ " బరమేశి ! మనుష్యగర్భభవమిఁక నాకీ
ధర లేకయుండవలయును, బురుషోత్తము మగనిఁగాఁగఁ బొందఁగవలయున్ " ౩౬౭

చ॥ అనవుడు గౌరి వల్లెయని యస్దె యదర్శనమొందుడుం దదం
గన రతనంపుగౌరమల నాల్గిటి నిల్పెను హాటకేశ్వరం
బున, నదియేకతంబుగను బొందెను నిన్ బతిఁగాఁగ, నేనమా
వనరుహనాభ ! యాసతిని, ద్వత్పదపద్మములంటి చెప్పితిన్ " ౩౬౮

వ॥ అనినవిని చక్రధరుండు నవ్వి లక్ష్మింగౌఁగిలించుకొని సంతుష్టచిత్తుం
డయ్యెఁ, జతుర్భుజయగు గౌరి పంచపిండికయగుట కుండు కారణంబియ్యది, మఱియును

—• పుష్కరత్రియ వర్ణనము •—

ఆ॥ ఆప్రకారముగను హాటకేశ్వరమున మూఁడు పుష్కరములు గూడఁ గలవు,
సకలపాపములకు సంక్షయకరము లాతీర్థములు, మహాత్మ్య దీప్తములును, ౩౨౦

వ॥ అయ్యవి దృష్టంబులయియో స్పృష్టంబులయియో కీర్తితంబులయియో భాస్కరుం డంధకారంబునుంబోలెఁ బాతకంబుల విలయంబునొందించు, సకలతీర్థంబులును స్నానదానంబులఁ బవిత్రముచేయుఁ గాని పుష్కరతీర్థ దర్శన మాత్రంబుననే యఖిలకలుషంబులును నంతంబునొందు"నని యిట్లు చెప్పుటయు శౌనకాదిమునివర్యులు

సీ॥ "బ్రహ్మదేవుఁడు తానె ప్రథము మీతీర్థము లూఁడును సృజియించినాఁడటనియుఁ
బాల స్త్యదిశఁ జంద్రభాగానద్రివంతియు యమదిశఁ గరతోయ హద్దులనియు
నాసరస్వతిదాఁక నామడదూరముం దిన్నగా వ్యాపించి యున్నవనియుఁ
ద్రిజగంబులం గూడ దేవతలందొట్టి యందఱుం గొనియాడుచుందురనియు
వినుచునున్నారమే, మీవె వెనుక నవ్వి యాకసంబున వసియించునని వచించి,
తేపథంబున మఱి హాటకేశ్వరమున కేగుదెంచెనో వచియింపవే మహాత్మ!" ౩౨౨

వ॥ అని యడుగుటయు సూతుండిట్లనియె, ౩౨౩

క॥ "భవముక్తిమంతయును వాస్తవ మవనీదేవులార! తజ్జీవనరు
ద్భవునకుఁ బ్రణామమొనరిచి వివరింతు సకృత్స్నముగను, వినుఁడీ శ్రద్ధన్,

వ॥ అవ్యక్తజన్ముండగు బ్రహ్మ నిజలోకంబున వసించునెడ దేవర్షియగు నారదుండు త్రిలోకంబులుం దిరిగివచ్చి తదంఘ్రులను జోతవెట్టి సన్నిధిం గూర్చుండుటయు నమ్మునినుద్దేశించి యతండు ౩౨౪

—* బ్రహ్మ నారద సంవాదము *—

క॥ "ఎన్నాళ్ళకో కనఁబడితివి, యన్నా! యిపు డెచటినుండి యరుదెంచితి? వే
పున్నెపు భూములు తిరిగితో యున్నది యున్నటులఁ జెప్పు మోయికుమారా!"

వ॥ అని ప్రశ్నించుటయు నారదుం డిట్లనియె, ౩౨౬

క॥ "భూలోకముమండి విభూ! యాలస్యంబయ్యెనని రయంబున నే నీ
కాళ్ళుగ్గాలువఁగవచ్చితి, నా లౌల్యము సైఁపవలయు నాతో డింకన్" ౩౨౭

వ॥ అనవుడు వెండియు నంబుజాసనుండు ౩౨౮

క॥ "తల్లోకవ్యవహారము లల్లన నెఱిఁగింపుమయ్య, యచ్చటి ధరణీ
వల్లభు లెట్టిరో భూసురతల్లజు లెటువంటివారో తనయా! చెపుమా" ౩౩౦

వ॥ అని యడుగుటయుఁ గలహాశనుండు కమలజునిట్లనియె, ౩౩౧

తే॥ "కలిప్రవేశించె మనుజలోకమున దేవ! రాజులెల్లరు లోభపరాయణులయి
సత్పథంబును విడనాడి జనులఁబట్టి కరము పీడించుచున్నారు కరుణమాలి, ౩౩౨

కం॥ శౌర్యముగనఁబడ, దితరులభార్యల బలిమిని హరింపఁ బొల్పడి రకటా!
యార్యబ్రాహ్మణవిబుధాచార్యులఁ బూజించుటన్న సరిపడ దెడఁదన్, ౩౦౩

సీ॥ వివిధజాతులచేత వేదముల్సదివించి యర్థార్జనము సేయు నల్పమతులు
కడు నీచుఁడేని కాల్గడిగియిచ్చినదాని నాసక్తిఁ గ్రహియించు నర్థలోభు
లాచారమునువీడి యగుపడినదియెల్లఁ దృప్తిమై మెసవెడి తిండిపోతు
లాల నెద్దులఁ బెంచి వ్యవసాయవృత్తిచే గాదెలనింపు నిష్కారణచిత్తు
లాచమనమేని చేయని యలసులగుచు భూమిసురు లుండుచున్నారు భూతలమున,
వైశ్యజాతులు మొదటికే వసుధలేరు, పాడు కలి వచ్చుకతమునఁ బ్రకృతి మార్య!

తే॥ శూద్రులే ధర్మకాములు క్షోణినిపుడు, శూద్రులే సుతపస్వులుం జూడఁజూడ,
లోకయాత్రాక్రియలనెల్ల లోపములనుజూపి నవ్వెడివారును శూద్రజనులె, ౩౦౪

కం॥ ధనము వయోయుతమగు స్త్రీజనమును నెవ్వానియింట సాంద్రింబుగనుం
డునో వానితోనె సఖ్యము పొనరించుచునుండి రిపుడు భూస్థలి మనుజుల్,

తే॥ బ్రహ్మచారులు విధవలుం బారికాంత్రులాదిగాఁగలవారికే యధికకామ,
మకట! వైవేషభాషలే యగుఁ గాని నీతిబాహ్యంబు లవ్వారి చేతలెల్ల,

కం॥ పాపాక్రాంతంబయి యస్సీ! ప్రకృతము తీర్థవితతి చెలుపంబడె, వా
ణీపతి! యవి కలిభయమున వాపోవుచు దెసలకడలు వట్టఁగవలసెన్, ౩౦౫

సీ॥ స్వల్పనీరములైన జలదములుఱుచుగా వర్షింపవయ్యె నవ్వసుధలోన,
వృష్టిలోపముచేత వేసినసస్యము ల్పైరుఁగవయ్యెఁ గరంబు విరివిగాను,
సస్యముల్పైరుఁగమిఁ జాల నాహారంబు సురభులు పాలీయఁజాలవయ్యె,
నిచ్చినపాలలో నెంతయు జిగిలేక నీల్లగా నాజ్యంబు వెళ్ళదయ్యె,
నీ వొసంగినట్టి హెచ్చైనవరముచేఁ గలి ప్రవిష్టుఁడగుచుఁ గ్రాలుచుండ
మనుజలోకమెల్ల మలమల మాడిపోయెను బితా! యిటేలరొమనరిచితివో, ౩౦౬

మ॥ కలికాలంపుమహత్త్వమేమనుచు వక్కాణింతునీతోడ, యు
గ్మలు ఉచ్చాటనవిద్యనేర్చి మిగులన్ గయ్యాళులై భర్తలోఁ
గలహంబాడుచు వందగాండ్ర బటువుం గొంగిళ్ళలోఁజిక్కి వ
ర్తిలుచుం జేయఁగడంగి రుత్తబతము ల్దేవేశ! యాలించితే, ౩౦౭

సీ॥ ఏకుటుంబములోను శోకారవాఢ్యమై పెండ్లాముమగలదుం బెనఁగులాటె,
యేయగారములోను న్యాయావిశిష్టమై తండ్రికొమాళ్ళదుం దగవులాటె,
యేయింటిముందును నిర్బ్యాసమేతలై యత్తయుం గోడలు మొత్తుకొనుటె,
యేవాడయందును నిహిహీయనఁ బ్రజల్ చుట్టంబు లాండొరు లొట్టుకొనుటె,
యేబజారునఁ గనుగొన్న నింటివారు జీతగాండ్రును జోరికి సిద్ధమగుటె,
యేపురంబునఁజూచిన నేలికలును జోరులును బోరులానరింపఁ దారసిలుటె! ౩౦౮

తే॥ ఇంత కాలంబునుండి నే నిటకు రాక మెలఁగుటకు హేతు వేమనితలఁచినావొ,
కలహములఁగంచు మర్త్యలోకమునసుంటి, నెడఁద జిలవుట్టెఁ, గ్రమ్మఱ నడతు నటకె
కం॥ గులగులవెట్టెడిఁగడు నిచ్చలు నస్మ న్మూర్ధహృదయ చరణంబుల, నా
గులగుల సురనరహరులకుఁ గలహంబులుగలిగినపుడు క్రమముగ నణఁగుక్ " ౩౯౩

—• బ్రహ్మ లోకరచనార్థమై భూతలంబునకుఁ గమలమును వదలుట. •—

వ॥ అనియిట్లువాక్రుచ్చుటయుఁ బితామహుండు పుష్కరంబుపొంతఁ జింతా
వ్యాకులితేంద్రియుండై

ఉ॥ "భూమిని మామకీనమగు పుష్కరతీర్థము తప్ప కేత దు
ద్దామకలిప్రభావమునఁ దా లయమందును గాన దాని నే
దో మఱియొక్కచోటఁ గలియుండమిఁజూచి ప్రవేశపెట్టెదక్,
క్షేమముపొందె నచ్చటికిఁ జేరును దక్కటి యెల్లతీర్థముల్, ౩౯౪

కం॥ కలికాలం బంతయు నిర్మలజలములతోడ నచట మని యాతీర్థ
మ్ములు కలిసనుపైఁ దమతమనిలయమ్ములనుండు మరల నిరపాయముగక్ " ౩౯౬

వ॥ అని హృదయంబున నిశ్చయించుకొని ధ్యానించి కరగతంబగు కమలమును
విలోకించి ౩౯౭

కం॥ "కలిసొచ్చనట్టి ధాత్రీస్థలమునకుం బోయి పడుమ జలజమ ! వేగక్,
బలిఁ బుష్కరతీర్థముఁ దత్థ్సలమునకుం జేర్తు నీకు సహవాసముగక్ " ౩౯౮

వ॥ అనిచెప్పిపంపుటయు నయ్యది మహీతలంబెల్లఁ గ్రుమ్మఱి ౩౯౯

సీ॥ నిరశనవ్రత మెచ్చునియతిమైఁ బూనియు దినమున కొకపూటఁదినియు మఱియు
రెన్నాళ్ళకొకసారి యన్నంబు మెసవియు మూన్నాళ్ళకొకమాఱు భోక్తలయియుఁ
గృచ్ఛచాంద్రాయణకృచ్ఛంబులూనియుఁ బారాకసువ్రతభాక్కులయియు
మాసోపవాసముల్చేసియు నశ్మకుట్టకులయ్యుఁ బర్ణభక్షకతమనియుఁ
బంట్లుదినియు భయముపడక దంతోలూఖలులయియును ద్విజేంద్రు లలఘుతపము
నాచరించుచున్న యాహాటకేశ్వర క్షేత్రసవిధమునకుఁ జేరఁబోయి ౪౦౦

సీ॥ పావన భూదేవపాపఠ్యమానమై మేటిఋగ్రీతిధ్వను ల్మిన్నుముట్టఁ
దత్త్వవిచ్ఛందోహతంతన్యమానమై శాస్త్రార్థపాఠము ల్సందడింప
శ్రౌతానలత్రయజాజ్వల్యమానమై క్రతుభూమి సంప్రీతిగలుగఁజేయ
దేవాధ్వపర్యంతదేదీప్యమానమై బహుళయూపస్తంభపంక్తి యొండఁ
బావనంబని యొకచోటఁబడియు లేచి మఱియునొకచోటఁబడి వడి మగుడలేచి
యింకనొకచోటఁబడియు మునీంద్రులార ! పడినకడనెల్ల గుంటలై పరిఢవిల్ల, ౪౦౧

వ॥ ఆకుంటలమూఁడింటను స్ఫటికసన్నిభంబును స్వచ్ఛంబును నగు జలం బూఁటయు జలజాసనుండు స్వయంబుగం జనుదెంచి వేదవేదాంగపారగులగు వివిధ విప్రులచే వేష్టితంబును వ్రతచర్యాపరాయణులగు ననేకతపస్వులచే నాక్రాంతంబును నగు హాటకేశ్వరక్షేత్ర మంతటం గలయ నవలోకించి ౪౦౨

తే॥ "అహాహా! యీక్షేత్ర మెంతరమ్యము కనంగ, బ్రాహ్మణప్రియ మత్యంతపావనంబు
గాన విప్రజనాశ్రయంబైనయిచట యజ్ఞ మొకటి యథావిధి నాచరింతు, ౪౦౩

కం॥ ఆ పుష్కరముల మూఁడిటి నీపురికిందెచ్చి వాని నీగోతులలో
నాపూరితముల్సేసెదఁ బాపపుఁ గలిదోష మెల్లఁ బాసెడిరీతిన్" ౪౦౪

వ॥ అనినిశ్చయించుకొని ధరాతలంబునం గూరుచుండి తడవు ధ్యానించి జ్యేష్ఠ మధ్య కనిష్ఠపుష్కరంబుల మూఁడింటిని రావించి సంతసంబు వెలిపుచ్చుచు ౪౦౫

శా॥ "ఏతత్పుష్కరనామతీర్థములు మూఁడిచ్చోటికిన్ నేను సం
ప్రీతిం దైకొనివచ్చినాఁడఁ గలిదోషభీతిన్, జనుల్వచ్చి సు
స్నాతుల్గానిట శ్రద్ధతోడ నెపుడున్ నాశంబులేకుండ వి
ఖ్యాతంబైతగు సిద్ధిఁబొందుదురు మత్కారుణ్యమేపారఁగన్, ౪౦౬

తే॥ ఎవరు కార్తికపూర్ణిమ నిచట శ్రాద్ధమాచరింత్రో సమాహితులగుచువచ్చి
యల గయాశీర్షమందున నాచరించు శ్రాద్ధపుం బుణ్యమును వారు సంతరింత్రు,

కం॥ అందాద్యంబగుపుష్కరమందునఁ గార్తికిని గృతము యజ్ఞము నాచే,
నందొనరుచు స్నానాదులఁ బొందుదురు శతాధికంపుఁ బుణ్యము మనుజుల్, ౪౦౭

కం॥ వైశాఖపూర్ణిమాతిథి నే శాస్త్రోక్తప్రకార మిఁక రెండవదౌ
నీశుభపుష్కరమునఁ గలినాశమునకుఁ జేసెదను ఘనంబుగఁ గ్రతువుల్" ౪౦౮

—♦ బ్రహ్మ యజ్ఞార్థ ముపకరణంబులం గూర్చుట. ♦—

వ॥ అని వాయుదేవు దక్కఁ గనుంగొంచి ౪౧౦

సీ॥ "తిమిరహృద్ద్వాదశాదిత్యులతోడను శోభిల్లు నష్టవసువులతోడ
రౌద్రమూర్తులయిన రుద్రులతోడను విమలులైన మరుద్గణముతోడఁ
దార్క్ష్యత్రికాశ్యప గంధర్వులతోడను సుకృతులౌ లోకపాలకులతోడ
విద్వద్వరేణ్యులౌ విద్యాధరులతోడ సంసిద్ధులౌ సిద్ధచయముతోడ
ద్రుతముగా బిడౌజుఁ దోడ్కొనిరమ్ము బొమ్మనిల! యస్మదాజ్ఞ యవధరించి
యారభిష్యమాణ యజ్ఞకర్మంబున బాసటయి వసింపవలయుఁగాన" ౪౧౧

వ॥ అని యానతిచ్చుటయు నతండు హరిహయు నగారంబునకరిగి యంతయు నివేదింప నాయన సర్వగీర్వాణ గణంబులతోడం జనుదెంచి చతుర్ముఖునకు సాష్టాంగ మెరఁగి యేమియాజ్ఞ యన నతండిట్లనియె, ౪౧౨

కం॥ "నేను గలికాలభయమునఁ బూనికి సఫలంబుగాఁగఁ బుష్కరములయూఁ
డానీలంబులు సేసితి, మానుగ వైశాఖి మూఁడు మఖములొనరుక్, ౪౧౩
ఆ॥ తన్నిమిత్తముగ శతక్రతూ! సంభారములను సిద్ధపఱచవలయు నీవు,
పిలువఁబంపు వేదవేదాంగపారగులయి తపర్షులైన యవనిసురుల" ౪౧౪
వ॥ అని యిట్లు సెలవొసంగుటయు శతమఖుండు సవినయంబుగా నల్లెయని సత్వరంబ సంభారంబు లన్నిటిం దెప్పించి యర్హులగు నవనీసురులరావించె, నంత నంబుజాసనుండు యథాశాస్త్రంబుగను నర్హదక్షిణంబుగను యజ్ఞంబులాచరించె" నని యిట్లు వాక్రుచ్చుటయు ఋషులిట్లనిరి, ౪౧౫

~ యజ్ఞ ప్రారంభము ~

తే॥ "సూత! యాక్షేత్రమందున ధాతచేతఁ గ్రతువుకృతమయ్యెననియెది కీర్తితంబొ
యని మహాద్భుతమొదవించె, నధ్వరముల నాతఁడేకద యష్టవ్యుఁ డరసిచూడ,
కం॥ యష్టవ్యుఁడైన యేతత్స్రష్టయె యజమానుఁడగుచు జన్న మొనర్పక్
విష్టపముల నాయనకిఁక యష్టవ్యుఁ డెవండొ చెపుము యనఘా! మాకక్, ౪౧౭
సీ॥ ఎవరు ఋత్విజులైరి యీయనప్రత్యక్షమం దధ్వరక్రియ లాచరింప?
నాయగ్రజన్ముల కంబుజాసనుఁడు తా నెయ్యది దక్షిణయిచ్చినాఁడు?
యజ్ఞమం జేయింప నధ్వర్యుఁడెవ్వరు? హోతృత్వ మెవ్వరి కొసఁగఁబడియె?
నెవ్వఁ డాగ్నీధ్రుండు? నెవ్వాఁడు బ్రహ్మగా సంస్థితుండయ్యెఁ దత్సదమునందు?
నెవ్వ రుద్గాత? యాచార్యుఁ డెవ్వరచట? నబ్బురముగల్గఁజేయు నీ యజ్ఞగాథ
యంతయును సవిస్తరమ్ముగా నానతిమ్ము, వినఁ గుతూహలమయ్యెడి మనమునందు"
వ॥ అని యిట్లు ప్రశ్నించుటయు సూతుండు ౪౧౯
ఆ॥ "నేను మీకుఁగాను నిఖిలమా యజ్ఞీయవార్త దెలియఁబఱతు వరుస వినుఁడు,
ఎవరొ తత్సదస్యు లెవ్వరో ఋత్విక్కు లేరి దక్షిణార్థ మీయఁబడెనొ, ౪౨౦
వ॥ అవ్విధంబున యజ్ఞకాముండగు నతనిపాలికి నమరనాథుండును నష్టమూర్తి యు నఖిలామర్త్యగణసహితంబుగా నరుగుదెంచుటయు మర్త్యధర్మసమాశ్రితులగు వారి విలోకించి వారిజాసనుండు వినరాగోపేతంబుగం గృతాంజలిపుటుండై ౪౨౧
ఉ॥ "స్వాగతమయ్యెమీకు సురసత్తములార! యనుగ్రహింపుఁ, డీ
భాగగు నాసనంబులఁ బై నుపవిష్టులుకండు చక్కఁగా,
యాగములందు మంత్రముమహాత్తను గష్టముగానువచ్చు మీ
రాగతులైనవారలు స్వయంబుగ, ధన్యుఁడ నైతి నేనిఁకక్" ౪౨౨
వ॥ అని పలుకుటయు దేవత లిట్లనిరి, ౪౨౩

కం॥ "ఖరదీయాధ్వరపుంగ్రియ కెవ రేమియొనర్పవలెనో యి మ్మానతి, గీ
ర్ధవ! తద్యాథార్థ్యంబును సవిశేషముగావచింపు, శ్రవణింతు మొగిక" ౪౨౪

వ॥ అని యిట్లు వచించుటయు వెండియు బ్రహ్మదేవుండు ౪౨౫

ఆ॥ "విశ్వకర్మ! నీవు వేవేగఁజని యజ్ఞమంటపము రచింపు మంజులముగ,
యజ్ఞవేదికలును నట్లె పత్నీశాల యమరుపును మనోజ్ఞమై రచింప, ౪౨౬

సీ॥ ఎటునెద్దివిహితంబొ యటునద్దియుండంగఁ బృథుకుండమును దీరిపింపుమయ్య,
గ్రహములు చమసము ల్సహిత మేఖలకుండఁ బాత్రలన్నియు సిద్ధపఱుచుమయ్య,
కాష్ఠమయంబైన కడియముల్దగిలించి యూపము ల్సేయించి యుంచుమయ్య,
పాత్రలుంచుట కప్పా భంగిగం గుదిరించి పాయిలు త్రవ్వింపంగఁ బూనుమయ్య,
శయనములకయి పదివేలుఁ బయి శతాష్టకంబు నిటికెలఁగాల్పింపఁ గడఁగుమయ్య,
వరహిరణ్మయపురుషునొక్కరు రచించి తెచ్చియిమ్మయ్య నీవొయ్య దేవశిల్పి!

సీ॥ సురగురూ! పదియాఱుగురు ఋత్విజుల నీవ యార్జింపు, మన్యుల కది యశక్య,
మమరనాయక! శ్రాంతులైవచ్చు ద్విజుల కీ వంగమర్దనసేయు మధికభక్తి,
నరవాహనా! దక్షిణలనిచ్చుపని నీది తిలకించి యెపుడెద్ది దేయమగునొ,
హరి! నీవు బాగోగులరయుచుండుము సదా క్రియమాణమౌ ప్రతికృత్యమునను,
లోకపాలురార! మీరు సురత్న్యముల్ దెసలు భూతవితతి తిరుగకుండ,
నెవరి కెదిప్రియంబొ యెఱిఁగి యజ్ఞేశ్వరా! యొసఁగుచుండు ధనమొ వసనములనొ

క॥ వసురుద్రాదిత్యమరుద్విసరంబులతోడఁగూడి విశ్వేదేవుల్!
మెసవఁజనుదెంచుజనులకు విసువక వడ్డించి తృప్తివెట్టుఁడు మీరల్" ౪౨౯

వ॥ అని యాదేశించుచుండ ససంభ్రమంబుగా విశ్వకర్మసనుదెంచి ౪౩౦

ఆ॥ "సవనమంటపంబు సంసిద్ధమైనది యంచ తేజి నెక్కియాడురాత!
యన్యభవదుదీరితాఖిలపరికరమ్ములును సిద్ధమయ్యె లలితముగను" ౪౩౧

వ॥ అనిచెప్పుచుండ బృహస్పతి యరుగుదెంచి ౪౩౨

కం॥ "దేవా! పదియార్గురుభూదేవతలను దోడితెచ్చితిని, వారలదా
ప్రావీణ్యంపుఁబరీక్షం గావించి వరింపు యజ్ఞకర్మంబునకుక" ౪౩౩

వ॥ అనిపలుకుటయు బ్రహ్మ స్వయంబుగా వారిం బరీక్షించి ఋత్విక్త్వంబున
నియోగించి యర్హణంబుగావించె" నని వక్కాణించుటయు ఋషులిట్లనిరి. ౪౩౪

ఆ॥ "ఎవరికేమి కార్య మేర్పాటుచేసెనో యా సరోజయోని యధ్వరమున
వారివాని పేళ్ళు వరుసగాఁగీర్తింపు రౌమహర్షణీ! కరంబుప్రేమ" ౪౩౫

వ॥ అని ప్రశ్నించుటయు వెండియు సూతుండు ౪౩౬

సీ॥ "భృగునకు హౌత్రంబుఁ బ్రీతి గావిస్తుత్త్వము గాలవాహ్వయమునికి నొసఁగ,
మైత్రావరుణసంజ్ఞ మఱిఁ జ్యవనుంజేసె, సలిపెనచ్ఛావాకు లలి మరీచి,

నధ్వర్యుఁగావించె నల పులస్త్యమునీంద్రు, నత్రిఁ బ్రస్తోతగా నాచరించె,
నొనరించె నున్నేత నోజ సహోతను, రహి నుంచె నేష్టగా రైభ్యమునిని,
బ్రాహ్మణాచ్ఛంసి గర్గుండు, బ్రహ్మ నారదుఁడు,భరద్వాజుఁ డాగ్నీధ్రుఁ,డడఁగ నేల
మనపరాశరసూనుండె మానులార ! శాతయజ్ఞంబునం దాను హోతయయ్యె, ౪౩౬

కం॥ జడదారులార ! శాండిల్యుఁడు దాఁ బ్రతిహర్తయచట, నుద్గాతృత్వం
బిడె గోభిలాఖ్యముని, కాతఁడు సామమునందుఁ జాల దక్షుం డరయన్, ౪౩౮

ఆ॥ శాధుమాభిధానఘనుఁడు దాఁ బ్రస్తోత యబ్జభవుఁడు జరుపు నధ్వరమున,
నంగిర స్తపస్వి యచట సుబ్రహ్మణ్యుఁడైనవాఁడు పుణ్యమానులార ! ౪౩౯

వ॥ యజ్ఞసిద్ధిపొంటె నాబుత్త్విజులఁ జతుర్ముఖుండు సవినయంబుగా వస్త్రా
భరణశోభితులం గావించి గృహ్యోక్తవిధానంబునం బూజించి ౪౪౦

తే॥ "ధరణిసురులార ! వీఁడు మీశరణుఁజొచ్చుచున్న వాఁడు ప్రసాదింపుఁ డూర్జితముగ
యజ్ఞదీక్షం బ్రవేశింప నాజ్ఞయిచ్చి వెసఁ గృతార్థునిజేయుఁడీ వేడుకొందు" ౪౪౧

—♦ బ్రహ్మ నాగర బ్రాహ్మణులకు వరమిచ్చుట ♦—

వ॥ అనియిట్లు దీక్షారంభంబుఁ జేయనుండుటయు నాగరబ్రాహ్మణులెల్లరును
గర్తాతీర్థసముద్భవుండగు మధ్యగుం బిలిచి ౪౪౨

సీ॥ "ఓరి మధ్యగ ! నీవుపోయి ద్విజన్మృత్యుచ్ఛేది దుర్నిరీక్ష్యా
నా రాజీవభవున్ గురించి చెపు మీవ్యాహార, మహావ్యద్భవం
బారంభించు సుపూరితంబయినపై హర్షించి యీ క్షేత్రమున్
గౌరీనాథుఁడు మాదుపూర్వులకుంగా నిచ్చెఁ బూర్వంబునన్, ౪౪౩

తే॥ నూటయైదుగురబ్జజు ల్నేటికైరి యరయ నిది మాకుఁ గైవసమైనదాది,
ధిక్కరించియెఱుంగ రం దొక్కరేని నిను వినా మమ్ము నో క్రూర ! నీతిదూర !

తే॥ నాగరద్విజులకు వెలిగాఁగ నిచట యజ్ఞయాగములంజేయునతఁడు వధ్యుఁ,
డందువలనిఫలం బాతఁ డొందఁజాలఁ, డిటుల నీ క్షేత్రమిడునాఁడె యాశుఁడనియె,

తే॥ కాన నిటుజన్న మొనరింపఁబూనె దేని నాగరులఁబిల్చి కావింపు బాగుగాను,
లేనిచో యజ్ఞఫలమును లేశమేని పడయఁజాలవు ధర వారు బ్రదికియుండ" ౪౪౫

వ॥ అని వార్రుచ్చుటయు నమ్మధ్యగుండు యజ్ఞమంటపమ్మునకు దూరమ్మగా
బ్రాహ్మణపరివారితుండైయున్న బ్రహ్మపాలికింజని నాగరోక్తంబు వక్కాణింప
మానుషభావవిశిష్టుండైన యన్నలువ సాంత్వపూర్వకంబుగా నతని కిట్లనియె, ౪౪౬

తే॥ "మధ్యగా ! నీవునొడివినమాట నిజమె కాని యిటుచేయవలెనన్న కాంతఁగాక
పొరపడి వరించినాఁడను బూర్వ మఖిలబుత్త్విజులఁ గాన నేనింక నేమిసేతు,

క॥ కావున నీస్థానమునకు రావింపుము పోయి నాగరబ్రాహ్మణులన్,
నే వారిసెలవుగైకొని పోవుదు మఖమంటపమ్ముపొంతకు వేగన్" ౪౪౯

వ॥ అనవుడు మధ్యగుఁడు ౪౫౦

తే॥ "ఈవు దేవత్వమునువీడి యిపుడు మనుజభావముం బొందియున్నాఁడ వోవిధాత!
యట్టి సామాన్యుఁడైన నీయంతికమున కేగతిం దద్విజాగ్రణు లాగ్రిఁగలారు?

క॥ ఆవులు పశువులలోపల నేవిధమున శ్రైష్ఠ్యమును వహించెనో జగమం
దావిధమున నాగరులకు క్ష్మావిబుధసమూహమందు శ్రైష్ఠ్యముగలిగెన్, ౪౫౨

ఆ॥ అట్లుగాన నీవు యజ్ఞసంప్రాప్తికై చిత్తమందు వాంఛసేయుదేని
రాణవెలయు నాగరబ్రాహ్మణులయనుగ్రహము వడయుమెమ్మ కమలజన్మ!"

వ॥ అనినవిని ధాత భీతుండై ఋత్విక్సహితంబుగాఁ దత్కల్పితనాగర బ్రాహ్మణ
సన్నిధానంబున కరిగి సవినయంబుగా సాష్టాంగపడి కరములు జోడించి ౪౫౪

శా॥ "ఏతత్క్షేత్రమునందు మీకు వెలిగా నేకర్మముం జేసినన్
ఖ్యాతిం జెందక వ్యర్థపాటు మదికిన్ క్షాతంబె, కానీ సమా
నీతం బిందుఁ బ్రదిపుష్కరంబు, లవియే నిక్షేపములైనను సం
ప్రీతిం గైకొని స్వీయతీర్థములుగం బ్రేమింపుఁడీ నాగరుల్! ౪౫౫

శా॥ మీ యాధిక్యమెఱుంగ కర్త్విజులు సంప్రీతిన్ సురాచార్యుచే
నేయానీతులు, గాన నైచ్చి కృతువున్ వీరే సమాసీనులై
చేయింపన్ సెలవిండు, రండు, కలిసంసిద్ధించినప్డేనియున్
నా యీ తీర్థము త్వత్కృతాఘములఁ జెండాడన్ సమర్థంబగున్" ౪౫౬

వ॥ అని ప్రార్థించుటయును నాగరబ్రాహ్మణు లిట్లనిరి, ౪౫౭

క॥ "నాగరులకు బాహ్యముగా నీగతి మఖ మీవు సేసెదేని క్రమముగా
సాగింతురు పెరసురలును, బాగుగఁ గావింత్రు భూమిపాలురుగూడన్, ౪౫౮

తే॥ ఐన నగుఁగాక నేనిది యాచరింపకుండ నుండనటంచని మొండిసలిపి
మమ్ములం జిన్నపుచ్చక మానవేని తరలు మాయొద్దనుండి యేతత్క్షణంబ" ౪౫౯

వ॥ నావుడుఁ జతురాననుండిట్లనియె, ౪౬౦

ఆ॥ "ఏతదాదిగాఁగ నిచ్చోట నాగరబ్రాహ్మణాగ్రణులకు బాహ్యముగను
శ్రాద్ధమో మఖంబో సలుపుచో నది వృథాయగును గాని ప్రాప్య మటు పొలికి,

క॥ నాగరు లేతత్క్షేత్రము బాగుగ లేదనుచు నెటకో పనివిని శ్రద్ధన్
యోగాదులు కావించినఁ గాఁగల వయ్యవియు వ్యర్థ కార్యము లింకన్, ౪౬౨

తే॥ ఇట్లు మర్యాదచేసితి నేనుగానఁ గరుణయుంచి మదీయయజ్ఞమున కాజ్ఞ
యిండు భూదైవతములార! యిపుడపోయి సక్రమంబుగ దాని నుపక్రమింతు,

—• నారదుఁడు సావిత్రిం దోడ్కొని రా బ్రహ్మలోకంబున కేగుట •—

వ॥ అని వాగీశుండు వాక్రుచ్చి సంతుష్టులైన నాగరబ్రాహ్మణుల యాజ్ఞం గైకొని వృతులైన విప్రుల ద్వారంబున యజ్ఞంబొనర్ప యత్నించుటయు విశ్వకర్మవిచ్చేసి నాగరానుమతంబున మస్తకమండనంబు గావించె, బదపడి బ్రహ్మదేవుండు వాద్యమాన వాద్యంబులను గీయమాన గీతమ్ములను బఠ్యమాన వేదంబులను శ్రవణించుచు ససంతోషంబుగానుండి పులస్త్యుఁ డరణిం బట్టుకొని పత్ని పత్నియని బహువారంబులు పలుకుటయు దారం దోడితెమ్మని నారదునకు సంజ్ఞచేసె, నతఁడరిగి సమరప్రియుండగుట సావిత్రికిఁ జతుర్ముఖునితో భేదంబు గలిగించువాఁడై ౪౬౪

కం. "నను నాజనకుఁడు నీకడ కనిపినవాఁ డోసురేశి! యాయన నీతో
డను గూడి యజ్ఞమంటపమునకుం జనవలయునంట, మూర్తము పెట్టెన్, ౪౬౫

ఉ. ఒక్కతె వేగి యెట్టులట నుండెదవమ్మ యనాథవోలెనీ,
వక్కమలాశచీముఖసురాంగనలం బిలిపింపు, చుట్టునన్
గ్రిక్కిరియంగనుండి కడుఁ గీర్తనసేయఁగ వారలేగుదె
మ్మక్కడికిన్ విలాసముగ సధ్వరశాల యలంకరింపఁగన్" ౪౬౬

వ॥ అని చెప్పి తండ్రిపాలికింజని ౪౬౭

ఆ. "జనక! నేను నాదుజనయిత్రిపాలికిం బేరెమెత్తిపోయి పిలిచినాఁడఁ,
గాని కూరుచున్నకడనుండియేని యా కలభయాన తాను గదలదయ్యె" ౪౬౮

వ. అనినవిని యాత్మభువుండు పులస్త్యుదిక్కుమొగంబై ౪౬౯

ఉ. "పొమ్ము కుమారనీవు, మతిపోయిన మీయమఁ దోడితెమ్ము, సో
మమ్ముభరమ్ముచేననఁగు మత్సరముం దిలకిమ్ము, యజ్ఞకా
ర్యమ్మున వేళ దాఁటఁగల, దాచరణీయము మంటపప్రవే
శమ్ము, ముహూర్తమెంతయును సన్నిహితంబయియున్న దారయన్" ౪౭౦

వ. అనినవిని యమ్ముని యతిత్వరితగతిం జని యాటపాటలయం దనురక్తయైయున్న యమ్మం గని ౪౭౧

శా. "దేవీ! నీవు విచారశూన్యవయి యీతీరుంట యుక్తంబె? యా
దేవజ్యేష్ఠుఁడు సోమభారమున నార్తిం జెందుచున్నాఁడు, నీ
యావత్కార్యము లట్టె పెట్టి యరుదెమ్మచ్చోటికి, కయ్యజ్ఞశా
లావస్తవ్యముహూర్త మిప్పటికి స్వల్పంబౌచు శేషించెడిన్" ౪౭౨

వ॥ అని పలుకుటయు సావిత్రి యిట్లనియె, ౪౭౩

కం. "నాయన! మీనాయన నారాయణముఖసకలనిర్జరప్రవరయుతుం
డై యుండ నే నొకర్తను రా యోగ్యమె యసదవోలె రాణచెడంగన్, ౪౭౪

ఆ. కాన నొక ముహూర్తకాలంబు సుత! నిరీక్షించుచుండుమనుచుఁ జెప్పమరిగి
యింతలోన గౌరి యిందిర యింద్రాణి పెరసురాంగనలును నరుగుదెంతు, ౪౭౫

ఆ. వారితోడఁగూడి వచ్చెద నేను దద్యజ్ఞమంటపమున కర్హభంగి,
నపుడె గంధవాహ నాస్త్రీలఁ దోడితేఁ బనిచియున్న దాన ననఁగుఁదనయ!"

వ॥ అని యిట్లు వచించుటయు నతం డతిత్వరితగతింజని సోమభార్యార్ధితుండగు సురజ్యేష్ఠుంగని ౪౭౭

శా. "రా దేమందుఁబితా! మదంబ, గృహకార్యవ్యగ్రయైయున్న, దు
న్మాదంబెత్తెనొ యేమొ, దేవవనితామధ్యస్థయై వత్తునం
చేదో వాక్యము చెప్పిపుచ్చినది, యం దీక్షింప నాస్త్రీలలో
లే దొక్కర్తయు, నెప్డువచ్చెదరొ యాలేమ ల్దురూహ్యంబగున్, ౪౭౮

కం. ఇయ్యది యున్న పరిస్థితి, యయ్యా! తెలిసికొని దీని నాచరణీయం
బెయ్యదొ యోజింపుముమది, నయ్యెం గాలాత్యయంబు యజ్ఞంబునకున్"

వ॥ అనిన విని బ్రహ్మదేవుండు సమీపస్థుండగు శక్రుదిక్కు మొగంబై ౪౮౦

~ బ్రహ్మ యింకొని గన్యాన్వేషణమునకుఁ బంపుట ~

తే. "హరిహయా! విను సావిత్రి యరుగుదేర దెంతయును బుద్ధిశూన్యయై యిప్పుడిచటి
కట్టిభార్య బలాత్కృతిఁ బట్టితెచ్చి జన్నమొనరింప నేనింక సమ్మతింప, ౪౮౧

కం. కాలాప్రవేశసముచిత కాలాత్యయ మించుకేని కాకుండఁగనే
మేలైన యనుద్వాహితబాలికఁ గొనితె మ్మొకర్తఁ బనివిని మఘవా!" ౪౮౨

వ॥ అనినవిని శక్రుండు సమన్వేషించుచుం బోవువాఁడు ౪౮౩

సీ. గరిమ షోడశకళాపరిపూర్ణుఁడౌ నిశాకరుఁ బోల్పఁదగు నెమ్మొగంబుతోడ
నాకర్ణదీర్ఘంబులై చెల్వుమీఱుచుఁ గలువ రేకుల గేరు కనులతోడ
సాముద్రికాఖ్య సచ్ఛాస్త్రసమ్మతమైన కమనీయతమ లక్షణములతోడఁ
బ్రాయంపురాక బల్చాగుగానూచించు స్తనపురోగాంగసౌష్ఠవముతోడఁ
దక్రఘటమొండు లీలమైఁ దలధరించి యరుగుదెంచెడి గోపకన్యక నొకర్తఁ
గాంచి "యెవ్వర? వెవరు నీ కన్నతండ్రి? యయ్యెనా లేద పెండ్లి"యంచడుగు [టయును

తే. "మంగళమునీకు దేవ! నేమజ్జిగమ్మ బోనటకై యేగుదెంచిన గొల్లపిల్లఁ,
గావలసియున్నచో నీవుఁ గాని కొక్కముంతచొప్పునఁ బోసెద, మూల్యమిమ్మ"

—• ఇంద్రుఁడు గోపకన్యకం బరిశుద్ధఁజేయుట •—

వ॥ అనినవిని యింద్రుండు దాని గోపికఁగాఁ దలంచి రమ్మురమ్మని రయమ్మునఁ దచ్చిరమ్మునఁగల తక్రఘటమ్ము భూస్థలమ్మునకు డొల్లనేసి యేడుచుచున్నను విడువక గోవక్త్రింబునఁ బ్రవేశపెట్టి గుహ్యామార్గంబున గుంజివైచి జ్యేష్ఠకుండస్థ శుద్ధజలంబుల జలకమాడించి పరిశుద్ధంగావించి చలువవలువగట్టించి సంతసించుచు సకలదేవతాసహితంబుగం జదురుదీర్చికూరుచున్న చతురాస్యసవిధమునకుఁ బట్టుకొని పోయి ౪౮౬

ఉ. "సర్వసులక్షణాఢ్యయయి చక్కనిచుక్కనఁ దేజరిల్లు నీ
పార్వికశర్వరీణ్ముఖి వివాహముగానిది, తక్రమమ్ముకొం
చుర్విఁ జరింప గొల్లదని యొయ్యన గోముఖమందుఁ ద్రోసి బి
ట్టార్వ గుదప్రదేశమున నాగతఁజేసితి వెండి శుద్ధగాన్" ౪౮౭

వ॥ అని చెప్పుటయు వాసుదేవుం డిట్లనియె ౪౮౮

ఆ. గోవులయును భూమిదేవులయును గులం బొకడే ద్విప్రకార మొందె జగతి
మంత్రసమితి యొకట మఱియొక్కచో హవిర్వితతి యుండి బిట్టు వెలయుచుండు.

కం. గోగర్భంబుననుండి సమాగతయగు నీపె బ్రాహ్మణాన్వయభవయే
యాఁగానఁ బెండ్లియాడుము యాగారంభార్హకాల మరుదేరకమున్" ౪౯౦

వ. రుద్రుండిట్లనియె, ౪౯౧

ఆ. "విను గవీముఖప్రవిష్టయై పశ్చిమద్వారమునను మగుడబయలువెడలు
కతన నీదుపత్ని గాయత్రియను పేరఁ బూజనీయయగును భూతలమున" ౪౯౨

వ. అనవుడు బ్రహ్మ బ్రాహ్మణులదిక్కు మొగంబై ౪౯౩

తే "గోపకన్యకయయ్యె నీగోల తాను బ్రాహ్మణశ్రేష్ఠయగు టెట్లొ బాగుగా వి
మర్శనముఁజేసి చెపుఁడయ్య మఱియుమీరు బ్రాహ్మణోత్తములార! మీభావమేమొ

వ. నావుడు బ్రాహ్మణులిట్లనిరి, ౪౯౫

ఆ. "గోపభావమెడలి యీపెతా బ్రాహ్మణశ్రేష్ఠయయ్యె, మేముఁజెప్పినార
మట్లుగాన నింక నాలసింపక నీవు పెండ్లియాడుమయ్య ప్రీతిధాత" ౪౯౬

వ. అని యిట్లందఱు నంగీకరించుటయు బ్రహ్మ యాయమ పాణిగ్రహణంబు గావించెఁ, బరమపవిత్రయై యమ్మహాదేవి సోమమ్ము దలఁదాల్చె, నిట్లుచతురాననుండు గాయత్రిని భార్యఁగాఁబడసి పరమసంతోషంబునఁ బయనంబై యజ్ఞమంటపంబుఁ బ్రవేశించె, గాయత్రియు గోపభావంబువదలి యాఁదల నరణిం బెట్టుకొని వాద్యంబులు వాయింపఁబడ గంధర్వగానంబులు గావింపఁబడ వేదఘోషంబులు వియత్పథంబుముట్ట

సర్వదేవద్విజోపేతుఁడగు చతుర్ముఖునితోడ నడచె, నంత విశ్వకర్మ యేతెంచి విధాతకుఁ గేశనిర్వపణంబును గాయత్రికి నఖనికృంతనంబును గావించెఁ, బులస్త్యుఁ డౌదుంబరదండంబును శృంగసహితకృష్ణాజినంబును జేతికిచ్చె, మౌంజీమయంబగు మేఖలచేఁ గటిం గైసేసి మౌనధారిణియగు గాయత్రితో నజుండు యజ్ఞశాలం బ్రవేశించి పరిశిష్టంబు జరుపుచుండఁ బ్రవర్గ్యసమయంబున దిగంబరుండొకఁడు కపాలపాణియై నిషేధింపఁ బడుచును సదస్సునం జొచ్చి గంతులువేయుఁ గడంగుటయు సదస్యులు ౪౯౭

ఉ. "ఎచ్చటినుండివచ్చితిర యీ వికృతాకృతితోడ మూఢ! నీ
చొచ్చుట కీ మఖీయమగు క్షోణి యనర్హము, వెళ్ళిపొమ్మవే,
వచ్చునుగోప మబ్జభవవాసవముఖ్యసురాళికిన్ ద్విజుల్
కచ్చెకుఁ గాలుద్రవ్వి నినుఁ గట్టెలతోడను గొట్టి నెట్టెదర్" ౪౯౮

వ. అని యదలించుటయు వాఁడిట్లనియె, ౪౯౯

ఉ. "అయ్యెడు బ్రహ్మయజ్ఞమని యత్యధికంబగు దూరమందునన్
నెయ్యురు చెప్ప రోయుచును నేనరుదెంచితి నన్నచింతనిం,
దయ్యయొ! తిట్టఁబూనితిరి, యంధదరిద్రవినీచు లెంతయున్
నెయ్యయు నన్నముం దిని గణించినయజ్ఞమె యజ్ఞమయ్యెడిన్, ౫౦౦

కం. అన్నసమృద్ధము కానిది జన్నమె కాదరయ, మఱియు సంతుష్టియమునకున్
దెన్నది, యిద్దానికిఁగా నున్నది శాస్త్రప్రమాణ, మొగివినుఁ డీరల్! ౫౦౧

శ్లో. అన్నహీనో దహేద్రాష్ట్రం, మంత్రహీనస్తు ఋత్విజః,
యాజ్ఞికం దక్షిణాహీనో, నాస్తి యజ్ఞసమో రిపుః"

వ॥ అని యిట్లునొడువుటయు బ్రాహ్మణులు ౫౦౩

ఉ. "అన్నముఁగూర్చి నీవిటుల సాగతుఁడౌటయె నిక్కమైనచో
నున్నదిపొమ్మ సత్ర, మట నొక్కమొగిన్ భుజియించుచున్న వా
రన్నముఁ దాపసుల్ కృపణు లంధులు దీనులు, విత్తవస్త్రసం
పన్నతఁగోరినన్ ధనదుపాల లభించును దానశాలలన్, ౫౦౪

తే. అంతియే కాని యేలోప మరయ లేని బ్రహ్మయజ్ఞంబు దూషించి పాతకంబు
మూటగట్టుకొనంబోకు మూర్ఖ! నీవు, పొగడఁదగినది యిది, భూరిపుణ్యదంబు"

—ః దిగంబరుఁడు యజ్ఞమంటపమునఁ గపాలంబు వైచుట ః—

వ॥ అనినవిని యతండు కపాలంబు నేలంబడవైచి దీపంబువోలె నంతర్ధానముగు ౫౦౬

టయు

కం. సదమున వైవంబడి యిల్లైదురుగ నుండం గపాల మిఁక నెప్పగిదిన్
గుదురును యజ్ఞక్రియ, లియ్యది యవలఁద్రోయ నెవరు నగుపడ రకటా!" ౫౦౭

వ॥ అని సదస్యు లాకపురుషుని బహుభంగులం బ్రేరేచుటయు వాఁడు దండం
బున దాని నవలఁద్రోయుటయే తడవుగా నట్టిదే మఱియొక్క తలపుఱ్ఱె యచటఁ గనంబ
డియె, నదియును దీసివేయఁబడుడు నింకొకటి సిద్ధమయ్యె, నిట్లు నూఱులు వేలు లక్షలు
కోట్లు వచ్చి యజ్ఞవాటమంతయు వ్యాపింప యజ్ఞకర్మ ప్రదూషకంబులగు తత్కపాల
సంఘంబులం గనుంగొని యందఱును హాహాకారంబొనరించి, రంతఁ బితామహుండు
కృతాంజలిపుటుండై ౫౦౮

—• బ్రహ్మచేఁ బ్రార్థితుండై శివుఁడు కపాలంబులఁ బోఁద్రోలుట •—

కం. "దేవా! యజ్ఞం బీవిధిఁ గావు టనర్హంబుమిగులఁ, గాఁబట్టి కపా
లావిర్భావం బణఁచుము యీవుండం గర్మలోప మేర్పడఁ దగమిన్" ౫౦౯

వ. అని మహేశ్వరుఁ బ్రార్థించిన నతండిట్లనియె, ౫౧౦

ఆ. "అది మదిష్టమైన యాహారపాత్రంబు, వైరమేల దానిపైని ద్విజుల,
కదియుఁగాక యొక్క యాహుతియేనియు వేయఁజూడ రకటు! వీరు నాను, ౫౧౧

తే. కాన నిర్విఘ్నముగ నీదు క్రతుసమాప్తి యభిలషించెదవేని నీ వాత్మలోన
నుఱుకపాలంబులో హవ్యముంచుఁడంచు భూసురాధములకు వేగఁ బోయిచెపుము,

చం. మఱియును నాలకింపు మొకమాటవచించెద, నెల్లవేల్పులన్
గుఱిచి యెటు ల్హవిస్సు శుచికుండమునందున వ్రేల్తు రట్లు నన్
గుఱిచియు మంత్రపూతమగు నూత్నహవిస్సును వ్రేల్వనౌఁ, ద్వద
ధ్వర మటులైనఁ బూర్తియగుఁ, దప్పినఁ గాదు, నిజంబుచెప్పితిన్" ౫౧౩

వ॥ అని యిట్లువచించుటయుఁ బితామహుండు ౫౧౪

శా. "నీరూపంబులు భిన్నరూపములుగ న్లెక్కింపరాకుండఁ బో
ల్పారున్ లోకములోన, నన్నియును సంభావ్యంబు, లం దీమఖా
కారంబొక్కటె, యట్లుగాన రహి నీకర్మంబు నిర్విఘ్నమై
మీఱంగావలెఁ గాని చేడ్పడుటలో మేలుండ దూహింపుమా, ౫౧౫

కం. శ్రుతికివిరుద్ధంబుగ నీక్రతువుం గావించుటన్నఁ గడుఁగష్టము, నీ
కుతుకముదీర్పక వేఱొకగతి నేగను నుత్సహింపఁ గ్రతువిధ్వంసీ! ౫౧౬

తే. నేఁటినుండి యజ్ఞముల భూమినిర్జరులకు నలపురోడాశరూపమౌ హవ్యమెల్ల
మృత్కపాలంబులను బ్రోక్ష్య, ముత్కటంపుశాసనంబిది, దాఁటంగఁజనదు దీని, ౫౧౭

కం. నిన్నుద్దేశించియును మహోన్నత! శతరుద్రియమున హోతవ్యము, మేల్
జన్మమ్ములనెల్ల జగత్సన్నుత! తన్మంత్రవరము జాప్యము శ్రద్ధన్, ౧౧౮
కం. సమ్మతిఁగపాలముల ద్వారమ్మున నీరూపమిచటఁ బ్రకటించితిగా
న మ్మహనీయ! కపాలేశమ్మన నీలింగమొకటి సంస్థాపింతున్, ౧౧౯
తే. ఈకపాలేశలింగంబు నెవఁడు మొట్టమొదటఁ బూజించి యజ్ఞంబు మొదలువెట్టు
వాఁడు నిర్విఘ్నముగఁ దుదవఱకు దాని నిర్వహింపంగఁగలిగెడి నిశ్చయముగ" ౧౨౦
వ॥ అనివాక్రుచ్చుటయు నసంఖ్యాకంబులగు నాకపాలంబులన్నియు హరునిచే నంతర్ధానంబు గావింపఁబడియె, నంతఁ జతుర్వదనుండు సంతసించి తత్క్షణమ తత్క్షేత్రంబునఁ గపాలేశ్వరలింగంబును స్థాపించి ౧౨౧
తే. "నా త్రిపుష్కరములఁ గృతస్నానుఁడగుచు నీకపాలేశలింగంబు నెవఁడు భక్తిఁ
బూజనముసేయు వాఁ డతిపూజ్యుఁడగుచు నపునరావృత్తమగులోక మందఁగలఁడు,
కం. కార్తికశుక్లచతుర్దశి నార్తత నీలింగసవిధమందునఁ గృతసం
కీర్తనత జాగరము నిర్వర్తించిన జన్మసిద్ధపాపము తొలఁగున్" ౧౨౩
వ॥ అనివక్కాణించుటయుఁ ద్రిపురాంతకుండు సంతృప్తుండై యజ్ఞమంటపస్థ వేదీమధ్యంబునం గూరుచుండె, బ్రాహ్మణులు విస్మయోత్ఫుల్లనయనులై యమ్మహేశ్వరునకు నమస్కరించి మగుడ యజ్ఞకర్మ మారంభించిరి, యీప్రకారంబునఁ దచ్చతుర్ముఖుండు యజించుచుండుటయు నాసమాచారంబువిని ౧౨౪
సీ. బ్రహ్మదేవుఁడుతాను బత్నీసమేతుఁడై యెటు యజ్ఞదీక్ష వహించినాఁడో
పైతామహంబౌచుఁ బరఁగు నాజన్మ మేతెన్నున వర్తించుచున్న యదియొ
స్వీకృతార్త్విజ్యులై చెలఁగెడి తత్రత్య కాశ్యపీసురు లెంతగట్టివారొ
హాటకేశ్వరసంజ్ఞ నలరారుచున్న యాక్షేత్రంపువిధ మద్ది కీదృశంబొ
చూచివత్తమటంచు నచ్చోటి కాద్యవాసరర్క్ష సమేతవైవస్వతతిథి
మట్టమధ్యాహ్నమునఁ దప్యమానులగుచు దాక్షిణాత్యులుకొంద ఱుద్ధతిని వచ్చి
వ॥ ఒక జలాశయంబున దిగి స్నాతులగుటయు ౧౨౬
సీ. వక్రనాసంబుల వంకలన్నియుఁదీఱె, బొనపొట్టలు బిట్టు పలుచఁబాఱె,
శంకుకర్ణంబులు చక్కనై కనుపట్టె, నఖులందలిగోఁత యడుగువట్టెఁ,
జేటచెవు ల్చాలఁ జిన్నవైరహింమించెఁ, బెదవులదైర్ఘ్యంబు ప్రిదులఁగాంచె,
స్థౌల్యంబువిడనాడి తలలు సొంపునహెచ్చె, నొడళులందలినల్పు సడలఁ జొచ్చె,
నిడుపురుతికెలు సమములై నివ్వటిల్లె, వ్రణకిణంబులఁ జరణము ల్వదలఁబడియె,
గోళ్ల వెడలును బొడువును సళ్లసాగె, బట్టపండ్లును గుందపుష్పంబులయ్యె. ౧౨౭

వ॥ అట్లు మన్మథాకారులై యమ్మునులు స్వాంగంబులం గలయవిలోకించుకొని యది యొక్క తీర్థంబుగా నెఱింగి ౫౨౮

కం. "ఇం దవగాహన మొనరిచినందున నే రూపవంతులైతిమిమన మి, ట్లిందునఁజేసి జగంబుల నందెడునిది రూపతీర్థమున విఖ్యాతిన్, ౫౨౯

కం. ఎవరిట శ్రద్ధాయుతులై యవగాహన మాచరింత్రో యవ్వారలు తా రవుదురు రూపోపేతులు భవభవమున గతసమస్తపాతకులగుచున్, ౫౩౦

కం. జలముల నేనియు నేతత్స్థలమునఁ బితరుల నెవండు సంతృప్తులుగన్, సలుపు గయాశ్రాద్ధాధికఫలమును నవ్వాఁడు రూఢిఁ బడయంగలుగున్, ౫౩౧

కం. ఎవరిచట రత్న దానము లవనీదేవులకు భక్తి నర్పింతురో వా రవనీశ్వరులగుదురు ప్రతిభవమునను దీర్ఘమహిమఁ బ్రభుత నెలంగన్, ౫౩౨

కం. ఉండుద మేతత్తీర్థముదండనె మన మింక, నెంతదండిదియైనన్ గొండొకతీర్థముకడ కిటునుండి చనన్ వలవ దెంతయును రూఢముగన్" ౫౩౩

— • ప్రథమ దివస యజ్ఞవృత్తాంతము • —

వ॥ అని యొండొరు లనుకొని యొక్కొకరు యజ్ఞోపవీతమాత్రంబుగాఁ దత్తీర్థంబును విభజించుకొనిరి, యిప్పటికిని జగద్గురువు ప్రథమ మాతీర్థోదకంబును నిత్యమ్మును స్పృశించు, నిష్కాముఁడయ్యు నందు నీరమాడిన మర్త్యుండు సిద్ధిలక్షణంబగు పరమ శ్రేయంబు పడయంగలుగు, నివ్విధం బమ్మునులందఱు నా సరస్సుం బంచుకొని సాయంసంధ్యాదికంబును నచటన నిర్వర్తించి నిశాముఖంబున దీక్షితుండై యజుఁడు మౌనమూని కూరుచున్న యజ్ఞమంటపమునకుఁ బోయి యాయనకు జోతవెట్టి పగటి యజ్ఞక్రియాకరణంబునఁ బరిశ్రాంతులై యింద్రాదిసురలు కాళ్ళుగుద్దుచుం బరిచరింపఁ గూర్చుండియున్న ఋత్విజులకడకరిగి వారికందఱకిని నమస్కరించి తదగ్రంబునం గూరుచుండి క్రతుగాథలం గాలంబుపుచ్చుచు సోమపానవిషయంబున నుద్గాతకును నధ్వర్యునకును బరస్పరము పొడమిన వ్యత్యాసంబున ౫౩౪

సీ. వా స్తవార్థంబును వా ప్రచ్చి రొకకొందఱొకపక్షమునఁ జేరకుండఁదాము, తుందుడుకొప్పంగ నిందనేసిరికొందఱుపపక్షమున నేది యేర్పరింప, కర్గలంబగువాద మాచరించిరికొందఱదియెల్ల మీమాంస ననుసరింప, మాధ్యస్థ్యమూని సమ్మతవెట్టి రొకకొందఱనుకూలపరిశిష్ట మాశ్రయించి, తగవులాడిరికొందఱంతయునుగినుకఁ గడుఁ బురోడాశచయనాదికములఁగూర్చి, యిట్టి వాదోపవాదంబు లినుమడింపఁ బుచ్చి రారాత్రి యంతయు భూమిసురులు,

### —• రెండవదినమున యజ్ఞశాలలో నొకబ్రహ్మచారి పామును వేయుట. •—

వ॥ రెండవదినంబగు ద్వాదశీతిథి నఖిలదేవతలకును నాశ్చర్యజనకంబగు నొక కథ ప్రవర్తిల్లె, ద్విజోత్తములారా! దానిఁ దెలియంగ నెఱింగించెద సావధానులరై యాలకింపుఁడు, వేదపారగులగు విప్రవరులు యజ్ఞకర్మ మారంభించుటయు బ్రహ్మచారియొకం డొక నీరుకట్టెయం బట్టుకొని వచ్చి సదంబునం బ్రవేశించి ప్రహసించుచు భయంకరం బగు నప్పామును బ్రాహ్మణాంతికంబునం బడవైచె, నంత నయ్యురగం బిటు నటు తొరతొరం దిరిగి సవనకర్మప్రసక్తులగు బ్రాహ్మణులనడుమఁబడి ప్రేమం బ్రవర్తించుచు హోతశరీరమంతయుం జుట్టుకొనుటయు నతండు ప్రాయశ్చిత్త భయంబునఁ బదంబు గదలింపక చయనన్యస్తలోచనుండై నోరెత్తి పలుకకుండెఁ గాని విషజంతుప్రశంసచే విప్రుల హాహాకారంబుమాత్రము విశేషించె, మైత్రావరుణకర్మస్థుఁడగు హోతకొడుకు సర్పవేష్టితుఁడగు జనకుం దిలకించి యప్పని వటుకృతంబౌట తెలిసికొని భయాతిశయం బునం బ్రభవించు కోపావేశంబున

కం॥ "పాపాత్మ! సదమునందున హా! పామును వైచినాఁడ, వటు గావున నా
శాపంబును గ్రహియించుచు నా పామవ యగుము పొమ్ము వ్యర్థుఁడ! యింకన్" ౫౩౮

వ॥ అనిశపించుటయు వటువిట్లనియె,

కం. "జలసర్పమిద్ది, సభలో విలాసముగ దీని నేను వేసితి, నీయ
య్యలలితదేహమునం గ్రాదలిగి యిటు ల్పాపమీయ నర్హమె నీకున్" ౫౩౯

వ॥ అనివాక్రుచ్చి సర్పాకారంబుధరియించి దుఃఖించుచుటయు బ్రాహ్మణు లతని చుట్టుం జుట్టుకొని, రతఁడు వైచిన పన్నగము హోతృశరీరమువిడిచి యన్యత్రచనియె, నంత నవ్వటువు బాష్పపూరితనేత్రుండై భృగువుపాలికింజని ప్రణమిల్లి గద్గదస్వరంబున

కం॥ "వనజాసను మనుమండను సనాతనుని సుతుఁడ నేను, జ్యవనాఖ్యుఁడ నీ
తనయుఁడు శపించె నిర్దోషిని, శాపవిమోచనంబు సేయు మహాత్మా!" ౫౪౧

వ॥ అనివేడుకొనుటయు భృగువు కరుణించి చ్యవనుం దిలకించి ౫౪౨

శా. "తాతా! విప్రవటుకన్ శపించితివి, యుక్తంబౌనె నీకున్, విషో
పేతంబైనభుజంగమంబె ననుఁదాఁబీడింపఁగంజాల, దే
రీతిన్ నిర్విషమౌ జలాహి యిఁక ధర్షించుఁన్, ననుంగూర్చియే
యాతం డియ్యది వైవఁ, డందునను శాపాంతంబు గావింపుమా" ౫౪౩

వ॥ అనిపలుకుటయు నతండిట్లనియె,

తే॥ "అబ్ధి మర్యాదవీడుచో నర్యముండు శీతలత్వంబునొందుచో శీతభానుఁ
డధికతోష్ణత్వుఁడైనచో నస్మదుక్తి యనృతమగుఁగాని యందాఁక నట్లుకాదు, ౫౪౫

## —♦ బ్రహ్మచారి శాపవిమోచనము ♦—

వ॥ ఇట్లు భృగుసుతుండు పలుకుటవిని పితామహుండు తాన సర్వరూపధరుఁ
డగు మనుమఁడున్నచోటికి వచ్చి ౨౪౬

చం॥ “ చిలువతనంబువచ్చుటకుఁ జింతిల కస్మదుదీరితంబు ని
శ్చలముగవిన్ముం, తొమ్మిదవసర్పకులంబు సృజించుకోర్కి ని
ట్టులమయియుండెనా, కది దృఢంబుగ నీవలనం బ్రపూర్ణమా,
బలమగు కట్టుబాటున విభాసిలుఁ దత్కుల మివ్వసుంధరన్, ౨౪౭

తే॥ మంత్ర కాండ్రకు నోషధీమహితులకును బాధగలిగింపకుండ నీఫణికులంబు
భక్తిఁ బూజింపఁబడుచుండుఁ బ్రజలచేత నఖిలసర్వాంసహాచక్రమందుఁ దనయ !

కం॥ ఏతత్క్షేత్రస్థముఁ బరిపూతంబును నైనయట్టి పుష్కరమున సం
స్థాతవ్య, మచట నియమాన్వితంబుగఁ దపమొనర్చు నినుఁబిలిచి రహిన్ ౨౪౯

ఆ॥ తనదుబిడ్డనొసఁగి యొనరించుఁబెండ్లి కర్కోటకాభిధానకుండలీంద్రుఁ,
డంత నవమమైన యహికులంబు సృజింపఁబడి చెలంగుఁ గట్టుబాటుగలిగి, ౨౫౦

ఉ॥ శ్రావణకృష్ణపంచమిని చక్కఁగఁ బూజితమయ్యెడుం జుమీ
క్ష్మావలయంబునందు నవమంబగు సర్పకులంబు, త్వత్సరః
పావనవారి నేఁటిసుత పంచమహాఘవినాశకారియై
కేవలనాగతీర్థమనఁ గీర్తివహించు జగత్త్రయంబునన్, ౨౫౧

కం॥ ఎవరిశ్రావణపంచమి నవగాహనమాచరింతు రాతీర్థమునన్
భవనాశనములభయ మయ్యవనీప్రజ కుండ దొక్కయబ్దముదాఁకన్, ౨౫౨

కం॥ విషముతలకెక్కినట్టిఁడు ఋషిసేవితమైనదీన స్నాతుఁడుగా ని
ర్విషుఁడై సుఖముంబడయును, వృషగాదిది యాలకింపుమీ తనుజాతా ! ౨౫౩

ఆ॥ పుత్రకాముఁడైనపూఁబోఁడి పంచమీభాస్కరోదయమున భక్తితోడ
ఫలకరాధ్యయగుచు జలకంబులాడుచో గొడ్డురాలుగూడ బిడ్డగనుము ” ౨౫౪

వ॥ అని వక్కాణించుచుండ వాసుకి తక్షక పుండరీక కృశోదర కంబ శాశ్వ
తర శేష కాళియులు యజ్ఞంబున కాహూతులై యరుదెంచి యజున కభివాదమాచరించి

తే॥ “ నాగరాజుల మోశతానంద ! మేము, వచ్చితిమి జన్నమున సాయపడను, గాన
సెలవొసంగుము కర్తవ్య, మెలమిమైని సిద్ధమున్నార మద్దానిఁ జేయుటకును ” ౨౫౬

వ॥ అనుటయు బ్రహ్మయిట్లనియె, ౨౫౭

ఆ॥ “ నాగరాజులార ! నామాటమీఁద నీనాగరాజుతోడ వేగమీరు
నాగతీర్థమునను నయమొప్పనుండుఁడీ, యిదియె మీసహాయ మిపుడు నాకు, ౨౫౮

## నాగతీర్థమాహాత్మ్యము

సీ॥ కోటికి మానిసిలల ల్కాటికె కానఁగ మెక్కి సంచరించెడి దైత్యసముదయంబొ
యొంటిపైఁ గనఁబడ్డ యుర్వీప్రజం గొట్టి యేదంగఁ జూచు పిశాచగణమొ
సుఖితులై మను గృహస్థులఁ బట్టి పీడింపఁ బూనుచుండెడి ప్రేతభూతతతియొ
యూరుభుజాబలముచే సరకు సేయక యేరి నతిశయించెడి మానవాధముండొ
ద్రోహ్యముసువహించి తామీమఖంబున విఘ్న మాచరింప వెడలు నెడల
రక్ష సేయఁడయ్య చక్షుశ్శ్రవోనాథు! లిదియె మీకుఁ గృత్య మిటుఁ దలంప, ౫౮౯

క॥ భాద్రపదబహుళపంచమిఁ గద్రూసుతులార! పూజఁ గైకొనుచీరల్
భద్రముగ మనుఁడు చనుఁడనుపద్రవమగు నాగతీర్థపాథస్సులకున్" ౫౯౦

వ॥ అనియిట్లు నొడువుటయు వల్లెయని సర్పరాజులు సనాతనసుతయూతంబుగం జని యాసరస్సు నాశ్రయించియుండె, రది మొదలుకొని స్నాతులగు జనులకు సకలకామదంబగు తీర్థంబు నాగతీర్థంబు నా నుతంబయ్యె, ౫౯౧

సీ॥ భద్రముల్గలిగించి చెనయఁ జూడవు ప్రేతభూతపిశాచము లీప్సితదముగ,
క్షయకుష్ఠవిస్ఫోటకశ్లేష్మపిత్తాది జాడ్యము లూర్మ చూడఁ జాల వెపుడుఁ,
గదలింపఁగాలేవు కాసంతయేనియుఁ జింతాభరంబులు స్వాంతములను
ధిక్కరింపఁగఁ జాల దొక్కింతయేనియు బలవంతమయ్యు సపత్నగణము,
నాగతీర్థమున సనాతనసుతముఖ్య నాగరాజపూజనం బొనర్చి
శిష్టభూసురులకు మృష్టాన్నమిడునట్టి జనములకును సప్తజన్మములను, ౫౯౨

సీ॥ ఆనాగతీర్థమం దవగాహనము సేయుఁ ప్రజ యన్వయమె సర్పభయముఁ బొందు,
దాతీర్థమాహాత్మ్య మాసక్తి శ్రవణింప నహిపీడ ఘటియింప దబ్బ మెల్లఁ,
దత్తీర్థమహిమంబు తా నె పూనిపఠింప ఫణిదష్టుఁ డైకూడ బ్రదుకు జనము,
భక్తి నేతత్కథాభాగంబు లిఖియించి యుంచుచో నహిపీట నుండదురగ,
మట్లు గాన శౌనకాదిమునీశ్వరుల్! నాగతీర్థ మెంతయో గరిష్ఠ
మనియెఱుంగుఁడయ్య యంతరంగంబులం, దింతకన్నఁ జెప్ప నేమిగలదు, ౫౯౩

వ॥ మూఁడవదినంబగు త్రయోదశీతిథిం బ్రాతస్సవనంబు గైకొని ఋత్విజు లెల్లరుం దమతమ కార్యంబుల నప్రమత్తులై యుండుటయు ౫౯౪

ఉ॥ పట్టుఁడు పట్టుఁ డందఱును బల్వురము ల్మహి దేవసంఘముల్!
పెట్టుఁడు పెట్టుఁ డన్నమును ప్రీతి భుజించి నయంత తృప్తిగన్
బొట్టలనిండ నెల్లరును బోయి తినుండు తినుండటన్న వి
న్మల్లెడిశబ్ద మొక్కటియె ముఖ్యముగా వినవయ్యె నయ్యెడన్, ౫౯౫

## ―• బ్రహ్మయజ్ఞంబున కొకయతిథి వచ్చుట. •―

వ॥ హేమరత్నంబుల నెవఁడెయ్యదియాశించిన వానికది నాలుగురెట్లుగా లభించెఁ, బర్వతోపమంబులై పక్వాన్నరాసులును నదీసంకాశంబులై ఘృతక్షీరంబులును దానార్థముంపఁబడిన ధనసముదయంబులును గలిగి యాబ్రహ్మయజ్ఞము సర్వకామ సమృద్ధమును సర్వగుణసముదితంబును నై కనుపట్టుటయు భూతభవిష్యద్వర్తమానవేది యగు నొక్కయతిథి యక్కడికరుదెంచి బ్రహ్మకు నమస్కరించి తదంతికంబునం గూరుచుండి తన యాబాల్యవృత్తాంతమంతయుం జెప్పఁజెప్పఁ గర్మాంతరప్రసక్తులగు ఋత్విగ్బ్రాహ్మణులు విస్మృతంబులగు నిజవృత్తంబులు జ్ఞప్తికివచ్చుటంజేసి యత్యంత గర్హ్యంబగు నాత్మీయవృత్తంబు నభిమానశూన్యతం బ్రకటించినందుల కయ్యతిథి యాత్మజ్ఞానంబున కచ్చెరుపడి యగ్గించుచుఁ గౌతుకావిష్టచిత్తంబులం దదభిముఖులై

క॥ "లోకోత్తర విజ్ఞానము, నీ కేగతిఁబట్టువడెనో నిజమును మాకున్
వాకొని నీ గురువెవ్వరో యో కాశ్యపాద్యదితేయ! యొగిఁ జెప్పఁగదే, ౫౬౭

ఉత్సాహము॥ ఏమిజ్ఞాన మేమిజ్ఞాన మిచట నీకడన్ వలెన్
భూమి నెచటఁ గనము వినము భూసురేంద్ర! మేమహో!
తామరసభవుండు దీనిఁ దానుబోధఁజేసెనా?
యామురారియా? హరుండ? యానతిమ్ము సర్వమున్" ౫౬౮

వ॥ అని యడుగుటయు నతండిట్లనియె, ౫౬౯

సీ॥ పింగళయను పేరునం గరంబుఁజెలంగు నానర్తదేశపు నంగనయును
బొలమిఁదేఁగలయాస బొత్తిగావిడనాడి కడుసుఖంపడిన పెన్నడపులుఁగును
నిదినాదునిలయమం చెట మమత్వములేక వీథులైనకడనుండు విషధరమును
మ్రానికొక్కొకయింత మకరందరసమును సంగ్రహించెడి మత్తషట్పదమును
ఘటకుఁడై నట్టి యొక యిషుకారకుఁడును మామకీనయయ్యైన కుమారికయును
నై రిగురువులు నాకు, నీ యాఱుగురి విచేష్టితంబులుగన జ్ఞానసిద్ధియయ్యె"

వ॥ అని యిట్లుపలికిన వెండియు బ్రాహ్మణు లిట్లనిరి, ౫౭౦

సీ॥ "పింగళమొదలైన వీరార్గురునునీకు వరుస నేవిధమున గురువులైరి?
వారిసన్నిధి నెట్టివర్తనములఁజూచి జ్ఞానంబు సాధింపఁగలిగితీవు?
ఏదేశమందుండు నేప్రదేశంబున నీ వుద్భవంబంది వృద్ధిఁగాంచి?
తెయ్యది నీపేరనెసఁగెడివర్ణంబు? యేగోత్రమునఁ బుట్టువెనసితీవు?
ఆనుపూర్వ్యమునను నంతయుమాకు సవిస్తరముగఁజెప్పు ద్విజవరేణ్య!
త్వత్కథామృతంబు గ్రోలంగ మా శ్రోత్రయుగళు లెదురుచూచుచున్న విభుడు"

—• పింగళోపాఖ్యానము •—

వ॥ అనియిట్లు ప్రశ్నించుటయు నయ్యతిథి ౫౭౩

క౦॥ "ఈపురమునసుండి శునశ్శేపుఁడు మొదలైన విప్రసింహులు నలువుర్
కాఁపురమువీడిచని రేయాపదకో యగ్గమగుచు, నవ్వారలలోన్ ౫౭౪

సీ॥ బ్రాహ్మణాఖిలం బ్రాధాన్యమువహించి యొప్పు నాగరులలో నుద్భవించి
ఛందోగుఁడను పేర శ్రేష్ఠవిఖ్యాతిగనిన్నట్టి ఋషి గోత్రమునకుఁజేరి
యత్యంతనిష్ఠ షడంగసంయుతముగా నాల్గువేదములు సాంతముగఁ జదివి
శమదమాదిక సర్వసద్గుణసంయుక్తిఁ బశ్చిమవయసునం బరఁగియున్న
బౌద్ధుఁడనువానికిని నేను బ్రథమసుతుఁడఁ, బ్రాణములకంటె నతనికిఁ బరమహితుఁడ,
నాకు యౌవనమే తెంచు నాఁటి కట్టిపిత మృతుండయ్యె, నేనంచుఁ బేరుకొందు,
తే॥ ఇంతలోపల నానత్తమేలునట్టి సుతపుఁడనురాజు మామకసుగుణములను
గాంచి తనయంతిపురమునఁ గంచుకినిగ నుంచుకొనియెను నమ్మికంబొదవ మదికి,

క౦॥ ఆయనకుఁగలరు నూర్గురు ప్రేయసు, లవ్వారిలోనఁ బింగళయనఁగన్
ధీయుత యొక్కర్తుక,యానాయిక చేష్టితమె కతము నా జ్ఞానమునన్, ౫౭౭

సీ॥ అత్తరుపన్నీర మాదిగాఁగలయట్టి తత్తత్సుగంధవద్ద్రవ్యములను
శ్రీవాసవృకధూపసిల్హా కాలాగురువంశకాదిక ధూపవస్తువులను
మల్లికా కేతకీమాలతీ చాంపేయపారిజాతాదిక ప్రసవములను
విలువగల్గినయట్టి వెండిబంగరుజరీ చెఱఁగులంజెలువారు చేలములను
నలఘుపరిమళముల కలపంబులను దమ పడుకటింట్ల సిద్ధపఱచుకొని య
నంగబాధ కగ్గమైయుండఁజొచ్చి రారాణు లహరహంబు రాత్రివేళ, ౫౭౮

క౦॥ "ఈరాత్రిరినుఁబిలుచును భూరమణుఁడు పడుక" కనుచుఁ బొంగనొక తెన్
జేరంగఁబిలుచు" ననియొక సారసదళనేత్ర బిట్టు జగడములాడున్, ౫౭౯

క౦॥ ఈవిధముననొండురు లాదేవేరులు వాదులాడి తిట్టుకొనంగన్
శ్రీమవల్లభుఁ డందొకరితఁ దావలచి యలంకరించుఁ దచ్ఛయనంబున్, ౫౮౦

క౦॥ అంతం దన్నిశఁ దక్కటి కాంతలు నిట్టూర్పువిడిచి కన్నులు బాష్ప
క్రాంతములు గాఁగ నిద్దుర సుంతయులే కతనుబాధఁ జొక్కెడివారల్, ౫౮౧

క౦॥ "ఆశ మహాదుఃఖంబు, నిరాశమహాసుఖ" మటంచు నాపింగళదా
నాశాపాశముఁగోసి నిరాశను సుఖనిద్రఁజెందు యామినులందున్, ౫౮౨

చ౦॥ ధవునిక వుంగిటన్ మనుచు దర్పక లీలలనోలలాడు నా
సవతులతోడ నించుకయు స్పర్థయొనర్పక మన్మథార్తిచే

నవశతనొంది చింతిలక యంబరమాల్య విభూషణాదులన్
దవిలిధరించి తల్పకయుఁ దత్పతి హాయిగ నిద్దురించుఁదాన్, ౧౮౩
క॥ నేనును బ్రతివాసరమున నీనారీచేష్టితంబు లీక్షించియొగిన్
లూనాశాపాశౌఘుఁడనై నిద్దురవోవుచుంటి హాయిగనిశలన్, ౧౮౪
ఆ॥ ఎవరు రాత్రివేళ నెంతయునిదురింత్రో వారిజాతరాగ్ని వర్ధిలెడిని,
దిన్నయన్న మెల్లఁ గ్రన్నజీర్ణించి యగునుబుష్టికరము మిగులనంత, ౧౮౫
ఆ॥ అస్మదీయతేజ మభివృద్ధినొందుట కిదియొకతము భూసురేంద్రులార!
పింగళాభిధాన పేర్మినీవిధమున నొయ్యనయ్యె మొదటియొజ్జనాకు, ౧౮౬
క॥ ఆశావశులైపగ లయ్యాశాపూర్తికి యతించునట్టిరు రాత్రుల్
లేశంబును బడుకొన రయ్యాశ తీరమినివగచు చాత్మలలోనన్, ౧౮౭
తే॥ ప్రజ్వరిల్లదు జఠరాగ్ని బాగుగాను, దాన నాహారవాంఛయే తగ్గిపోవు,
నంతఁ దేజోభివృద్ధిగా, దట్లుగాన నాశలనువీడియుండుట యర్హ్వాభంగి, ౧౮౮
ఆ॥ అఖిలజనులకోర్కి కవధిగనంబడ దించుకంతయేని యెంచిచూడ,
ఘృతమువిస్సునుండి కృష్ణవర్త్మమువోలె నిచ్చతీరుకొలఁది నింకఁబెరుఁగు, ౧౮౯
క॥ దుప్పి యెదిగినకొలందిని దప్పక కొమ్మెదుగుమాడ్కి ధరణీప్రజకున్
జప్పునఁ దమతోపాటుగ నెప్పుడును మనోరథంబు లెదుగుచునుండున్, ౧౯౦
ఆ॥ ఈతెలంగలేంగి యెంతయు సుఖముగా రేయి నిదురవోవురీతిగాను
బవలె యున్నపనుల బాగుగాసవరించుకొనుట యర్హ్వాభంగి కోవిదునకు, ౧౯౧
క॥ పింగళ నాకున్ గురువగుసంగతియంతయును మీరు శ్రవణించితి, రిం
కం గురరంపుగురుత్వమ్ముంగూడ వచింతువినుఁడు భూసురవర్యుల్! ౧౯౨

—• అతిథి పెన్నడపులుఁగువలన గుణగ్రహణము సేయుట •—

ఉ॥ తాతయుఁ దండ్రియున్ వెనుకఁ దాము గడించియొసంగిపోనసం
ఖ్యాతధనంబు ధాన్యమును నస్మదగారము నిండియుండె, నా
జ్ఞాతులఁదొట్టి బంధుజనసంఘము బెల్లపుబుట్టమీఁది క
త్యాతురతం బిపీలికలయట్టు లెగంబడి రాధనంబుపైన్, ౧౯౩
సీ॥ "అవిపెట్టు మివిపెట్టు" మని నాదుముంగిటం గూరుచుండిరవచ్చి కొంతమంది,
భేదముల్గల్పించి వాదముల్పచరించి రంతుచేసిరి హెచ్చి కొంతమంది,
"యటుచేతు మిటుచేతు" మని బెట్టుభయపెట్టి కొనిపోవఁజూచిరి కొంతమంది,
కట్టియల్చేపట్టి నెట్టుకొం చిలుసొచ్చి కొట్టంగడంగిరి కొంతమంది,

ఇట్టు లెవ్వారెవరి కే ధనధాన్యంబు లిడనో వారువారు నేగుదెంచి
బాధపెట్ట వారిపార్శ్వంబునుండి సౌఖ్యం బొకింతయేని గాంచనైతి, ౫౯౪
కం॥ రేయుం బవలును నేనటు లాయిడుములగడచుపాంటె యత్నించిరయుఁ జిం
తాయుతుఁడనై తిఁగాని యుపాయంబు లభింపదయ్యె బ్రాహ్మణులారా! ౫౯౫
మ॥ అటు చింతించుచునుండనుండ నొకనాఁ డాకాశమార్గంబునన్
జటులతోఁ బ్రతిగృహీతమాంసమయి యత్నంబొప్పఁ బర్వెత్తు చు
ద్భటపక్షివ్రజ మాపొలంగుటిచి యుద్ధంబాచరింపంగ మి
క్కుటమౌసంకటమొందు పెన్నడపులుంగుం గంటి నే నొక్కచోన్, ౫౯౬
ఉ॥ ఈవిధ మాపత్త్రి మదమేది తదామిషముం ద్యజించుచున్
బ్రోవయి పోరొనర్చు పెరపుల్గులు తత్పలలంబువడ్డ యా
త్రేవకు వెళ్ళిపోయె, నది కృత్స్నముగం దిలకించి నేను నా
కై వసమైనయర్థమును గ్రిక్కన వీడఁదలంచి యంతటన్ ౫౯౭
క॥ కొడుకుల మనుమలఁ జుట్టల వడివడిఁబిలిపించి ధనము వశమొనరిచి ము
వ్విడుతలు కృతశపథుఁడనై యెడలే కవ్వారితోడ నీవిధమంటిన్, ౫౯౮
క॥ "లేదింతకన్న మిక్కిలి నాగృహంబున ధనంబు, నమ్మవ దుక్తిన్
వాదములాడకయందఱు నీధనముం బంచుకొని గ్రహింపుఁడుమీరల్" ౫౯౯
కం॥ అనియిటునొడువుచు వారలు పనివిని రర్థంబుగొంచు బాధింపకనన్
మనుచుంటి హాయిగానిటు, కనుకం గురరంబు నాకు ఘనగురువయ్యెన్, ౬౦౦
క॥ మోహమునఁ గతమర్థము, మోహము దుర్గతికిఁగతము, మోక్షమునం బి
ట్టీహఁగలట్టిఁ డనర్థావాహనకర మర్థ మర్థి వదలఁగవలయున్, ౬౦౧
కం॥ జలములఁ జేఁపలచే భూస్థలమందునఁ బులులచేతఁ దారాస్పృతిఁ బ
క్షులచేతఁ బలలముంబలె బలిమిని నెల్లెడల నర్థి భక్షింపఁబడున్, ౬౦౨
కం॥ జననాథపరిభృతులచే ధనికుఁడు నిర్ఘోషుఁడయ్యుఁ దాఁ బీడితుఁడౌ,
ధనహీనుఁడు దోషంబుల నొనరిచియు నుపద్రవంబు నొందఁడు జగతిన్,
కం॥ పడఁబోవుచు నడుగడుగున నడచెద రితరావలంబనమునన ధనికుల్,
తడఁబడుదురు నుడివెడిచోఁ బుడమిని గల్గుద్రావినట్టి పురుషుఁడువోలెన్, ౬౦౪
తే॥ కొంచెమో గొప్ప సద్భృత్యకోటి యెడలఁ బ్రియముపడినను ధనికుండు పయికిఁదాను
లోన ద్వేషంబె, ముఖ్యాని యాననంబు క్రౌర్యయుక్తంబయి సదా కానఁబడును,
సీ॥ ఎన్నిరోబన్నంబు లెనయుచుండఁగ నూర కార్జింపఁగాఁబడ దర్థమవని,
యార్జితంబైన యయ్యర్థసంచయమును వెతలులేకుండ రక్షితము గాదు,

దొరలో దొంగలో దాని హరియింపఁగలుగుచో నేద్వోఁగావలసెడి నెంతయేని,
వ్యయముగావింపంగవలసినయెడ నేని యీయమ్మలికముఁ జెందకుంట కష్ట,
మట్లు గాన నట్టి యతిదుఃఖభాజనం బర్థ మేల కాల్పనా తలంప?
నర్థకాంక్షి కాటికైననుజనుఁ బ్రీతి, నర్థహీనుఁ గొమరుఁడైన విడుచు, ౬౦౭

తే॥ కొడుకునకుఁ దండ్రి తండ్రికిం గొడుకుఁ గూర్చు టర్థసంబంధముండనియంతవఱకె,
యర్థసంబంధ మెపుడు తా నంకురించు నపుడె యొండొరులకు వైరమంకురించు,

తే॥ ఇదికతంబుగ నాకున్న యెల్లధనము విడిచిపెట్టినవాఁడ నో విప్రులార!
దాన సుఖముండుచున్నాఁడఁ దద్ద నేను గురరపక్షుప్యుపదేశంపుగరిమకలన, ౬౦౮

— * సర్పము వలని గుణగ్రహణము * —

తే॥ వినుఁడు మునులార! నాకు ద్వితీయగురువయినభంగి చెప్పెద సరవిమీకుఁ,
దద్విచేష్టిత మీక్షించి తడయ కేను గృహమువదలిన తెఱఁ గెఱిఁగించువాఁడ, ౬౦౯

కం॥ గృహమున దుఃఖంబులకున్ గృహమ యగుంగాని సౌఖ్యకృత్తెపుడుంగా,
దహి యితరజంతుకృతమగు గృహమున మనికాదె సుఖము నెనసెడి నిచ్చల్, ౬౧౦

చం॥ ఒక గృహమందుఁ గొంతవడి యుండి సుఖంబుగ వెండి యట్టి వే
ఱొకగృహముఙ్ గుఱించి చనుచుండును, నంతియకాని యిద్ది మా
మకగృహమంచు నెందును మమత్వము వెట్టదు పన్నగంబు, దా
నికి స్వగృహంబు లేదు నిజనిర్మితమెద్దియుఁ గాకయుండుటన్, ౬౧౧

కం॥ పరిపరివిధముల శ్రమముల కిరవయి కట్టింత్రు మేడ లెంతయు మనుజుల్,
మరణించునెడల నేనియు నరుగవు కద వారివెంట నవి సత్యముగన్, ౬౧౨

ఆ॥ గృహముతోడ గృహిణి గృహిణితోఁ గొడుకును గొడుకుతోడఁ గూఁతుఁబడసి యీరాజ
తన్నిమిత్తముగను దత్తదకృత్యముల్ సలుపు చాత్మ నెఱుఁగఁజాలఁ డేవఁడు, ౬౧౩

సీ॥ ఒకరివెంబడి నొక్క రొగి నేరుపడియెడి కొడుకులం గూఁతుండ్రఁ గూర్చియైన
తత్పుత్రపుత్రికాత్యుత్పత్తిహేతువై కొమరారు పెండ్లాలఁ గూర్చియైన
నగ్గలంబగు లిబ్బి వ్యయపెట్టికట్టిన గొప్పవౌ లోగిండ్లఁ గూర్చియైన
వ్రీహిముద్గయవాది వివిధధాన్యముఁబండు పేరైన భూములం గూర్చియైన
సక్తమగుచు క్షీణరక్తంబులో వనగజములట్లు లోభకర్దమాబ్ధి
మునిఁగి కష్టపడెడు మనయంబు జంతువు లవిదితాత్మతత్త్వమైనకతన, ౬౧౪

కం॥ ఒక్కఁడు పాపములొనరుచుఁ, బెక్కండ్రు ఫలంబుఁగుడిచి ప్రియపడుదురు, వా
రక్కాలమునకు బాధ్యులుగా, రక్కట! తద్దోషలిప్తుఁడగుఁ గర్తయతాన్, ౬౧౫

తే॥ ఈకతంబునఁ జేసి ఋషీంద్రులార ! యమృతమార్గార్గళంబగు నాత్మగృహము
నుజ్జగించి చరించుచునున్న వాఁడెఁ జిరముఁ దిలకించి సర్వవిచేష్టితంబు, ౭౧౬

## — యతిధర్మ నిరూపణము —

ఆ॥ పల్లెనొక్కనాఁడుఁ బట్టణమున మూఁడునాళులుండి యవలనడచువాఁడె
యతియనంగఁబడెడి, నన్యుండు రోగవిడంబకుండు తా నిజంబుగాను, ౭౧౭
ఆ॥ పాయులలోనినిప్పు బొత్తిగాఁ జల్లారి పొగ యొకింతఁ గూడ నెగయనపుడు
మహిసురాలయముల మాధుకరంబెత్తువారె కాని యతులు కారు పెరలు, ౭౧౮
ఉ॥ ఈదిన మన్న మెట్లొయని యెప్పుడుఁ జింతిలకుండ దండియై
భూదివిజుండుపిల్చునెడఁ బోయి గ్రహింపఁగవచ్చు భిక్షయున్,
గాదన రెవ్వరడ్డియును, గాని విరాగితనుండుటొప్పు, నిం
కేదొవిధింజరించునతఁ డెప్పటికిన్ యతి కానె కాఁడిలన్, ౭౧౯

సీ॥ తమిఁ బట్టపవలె మెత్తనిసెజ్జఁ బన్నుండి బుసకొట్టుచున్ నిద్రపోవుటయును
స్వాశ్రమార్హముగాని వ్యర్థమౌనన్న మెక్కడో యొక్కెడం జేరి కుడుచుటయును
స్త్రీకథల్వినుటకై చెవియిచ్చి యవ్వారిపై మోహదృక్కులం బఱపుటయును
మల్లెపూవన్నియ మఱపింపఁగలయట్టి కడుతెల్లవల్వలం గట్టుటయును
స్వర్ణమయములైన వక్కనిభూషలం దమయొడళ్ళయందుఁ దాల్చుటయును
బతనహేతువులుగఁ బరికీర్త్యమానముల్గాన విడువవలయు వీని యతులు, ౭౨౦
చం॥ సమముగఁ జూచుకొంచుమది శత్రుని మిత్రునికూడ నయ్యదే
క్రమమున మట్టిపెల్లలటు జాళులఁబోలెఁ బసిండిఁ గాంచుచున్
గొమరులమీఁద నేనియును గూర్మివహింప కుపేక్షమై గత
భ్రముఁడగువాఁడె కాని యతి బ్రాహ్మణులార ! తదన్యుఁ డెట్లగున్, ౭౨౧
ఆ॥ సరిగఁ జూచుకొనుచు సన్మాన మవమాన మెలమి యొమ్మలికము నెనయకుండ
స్వపరదేశములను జరియింపఁగలవాఁడెయతి, తదన్యుఁ డర్థరతిగణింప, ౭౨౨
కం॥ ఏగృహమున భిక్షాదులు బాగుగఁ గావింపఁబడునొ బహుమానముగా
నాగృహమునకుం గ్రమ్మఱ నేగనివాఁడె యతికాని యితరుఁడగునే, ౭౨౩
ఆ॥ పడగదారితీరు పలుమఱుం దిలకించి నేర్చినాఁడ నిట్టినీతి నేను
సలిపినాఁడ సర్వసంగపరిత్యాగమిదియె మోక్షమునకుఁ గుదురటంచు, ౭౨౪
ఆ॥ ఈప్రకారముగ నహిశ్రేష్ఠమయ్యె సద్గురువునారుఁ బుణ్యచరితులార !
తత్ప్రభావమునఁ బడంపడి యీతేజ మేర్పడినయది శరీరమందు, ౭౨౫

## —♦ భ్రమరాదులవలని గుణగ్రహణము ♦—

ఆ॥ అల వసంతసమయమందున వృక్షముల్ పుష్పఫలసుగంధపూరితంబు
లై రహింప నొక్కయళి చెట్టుచివర మున్నె రుపఱచియున్న యిరవునందు, ౬౨౬

ఉ॥ ప్రాఁకుచు నొక్కయింత మకరందము గైకొని తెచ్చిపెట్టఁగా
నేకముగాఁగ నాచునది యెన్నొ దినంబుల కొక్కరాశియై
లోకు లనేకు లెంతయును లోలతఁ గ్రోల సమర్థమౌట యా
లోకనచేసి శాస్త్రములలోపలనుండిన సారమంతయున్, ౬౨౭

కం॥ ఒకచోఁ జేరిచి నేనును బ్రకటించితి గ్రంథములుగ, భ్రమరకృతమునన్
సుకముం బడసినచాడ్పున సకలజను ల్వానిఁ జదివి సమ్మదమందన్, ౬౨౮

కం॥ ఈకరణిం దుమ్మెదయును బ్రాకటగురువయ్యె నాకుఁ బదపడి మెయి న
స్తోకమగు తేజమేర్పడె నే కారణ మింతకంటె నిటలే దరయన్, ౬౨౯

సీ॥ బ్రహ్మమయం బీప్రపంచ మంచెఱిఁగెడి యుత్తమ వేదాంతవేత్తలకును
సంకల్పశూన్యత సర్వవ్రతంబులం గావించుచుండు నిష్కాములకును
గనకంపుముద్దల గడ్డిపోఁచఁగఁ జూచి ప్రాభవం బెనయు నిర్లోభులకును
బ్రాప్తంబుతోడన పరితుష్టినొందుచు నాత్మనీక్షించు నిరాశులకును
భూరి తేజ మొదవుఁ బూర్వోక్తగుణములం దొకటనేని లోపమున్నయట్టి
మోహలోభయుతులు మూఢచేతస్కులు తం బాపులుగను దలఁపఁబడుదు రవని, ౬౩౦

కం॥ కని వేదాంతములన్నియుఁ బొనరించి విమర్శనంబు భూజనుల హితం
బునకై వ్రాసినవాఁడను ఘనమతి సమరూపమైన గ్రంథంబుల నేన్, ౬౩౧

ఆ॥ అవనిదేవులార! యాత్మవలోకనమభ్యసించుకొఱకునై యనేక
యోగవిదుల జ్ఞానయుతుల సంసేవించి యడుగ శక్తి కొలఁది నుడువఁబడియె, ౬౩౨

కం॥ ప్రియశిష్యునకుం బలె నానయవిదు లాత్మావలోకనక్రమ మెల్లన్
స్వయమ సమాధిద్వారమున యథావిధి బోధసేసి నన్నుఁబనిచి రోగిన్, ౬౩౩

ఆ॥ సప్రమాణముగను జతురశీత్యాసనములను గూరుచుంట తెలిపి వార
లాచరింపఁజేసి రధ్యాత్మపఠనముల్ కానుపించి రెన్నొ కారణములు, ౬౩౪

తే॥ అట్టులైనను నాకల యాత్మయందు నిలువదయ్యెను లక్ష్యంబు తొలఁగకుండ
నట్టిగురు వెందులభియించునాయటంచు నక్కడక్కడ నరయుచో నొక్కవాఁడు

చం॥ ఎదురుగవచ్చె సైన్యయుతమేలిక మా పురవీథియందు వా
కొదిగి యొకింటివాకిటి మహోన్నతవేదికమీఁది కెక్క నే
నదివఱ కొక్కనేరుపరి యానతపర్వములైన యెన్నియో
ప్రదరము లొద్దవైచుకొని బాగొనరించుచునుండె నక్కడన్, ౬౩౫

ఉ॥ అయ్యెకిమీఁదు దవ్వరుగు నావల భృత్యుఁడు వచ్చి "యెంతసే
పయ్యెడినయ్య రాజుచని" యంచిటు చక్కఁగ నిల్చి వాణముల్
చయ్యనఁజేయు నప్పురుషు సంభ్రమ మొప్పఁగఁ బ్రశ్న సేయఁగా
నయ్యపుకారుఁ డిట్లనియె నాతనిఁగూరిచి క్రిందఁజూచుచున్, ౬౩౭

కం॥ "నారాచకర్మసక్తుఁడ, నే రాజును జూచియెఱుంగ నీద్వారిఁ జనన్
భారంబగు పనియుండిన వేళొక్కని నడుగు మతఁడు వివరించును దాన్" ౬౩౮

కం॥ అని యీ ప్రకారముగ నా జనపతి సేవకునితోడ శరకారుఁడు దా
వినుచుండఁగ వాక్రుచ్చుటయును నాతనిరీతి కెంతయును నబ్రముగాన్ ౬౩౯

కం॥ "ఒకచిత్తముగలుగుటచేఁ బ్రకటితమయ్యెడిని నాకు బ్రహ్మజ్ఞానా
త్మికమైనయట్టియోగం బిఁక నొకవిధమున ఘటింప దిది రూఢముగన్ ౬౪౦

కం॥ కావునఁ జిత్తనిరోధము గావించెద బ్రహ్మసిద్ధిగలుగుటకై" యం
చీవిధమున భావించి మనోవీథిం దాల్చితి ఘను జగదూప్రభున్, ౬౪౧

సీ॥ పాకారిముఖదేవ పరిపాల్యమానమై తేజరిల్లెడి దశదిశలయందుఁ
గన నెంతసేపటికిని దర్శనంబీక తనరారు తద్దిగంతములయందు
నీరూపమయ్యును నీలవస్తుభ్రాంతి గలిగించు నంతరిక్షంబునందు
గిరిసరిత్పురసర స్సరిదబ్ధికాననా పరివృతంబైన యీ ధరణియందు
నందు నిందననేమిటికి కఖిలమందు నాపరాత్పరుఁ దప్ప నన్యమును దేని
నేనుజూచుటలేదు, నా కింత తేజ మీరుపడుటకు నయ్యదే కారణంబు, ౬౪౨

కం॥ ఈచాడ్పున నయ్యెను నా కాచార్యుఁడు కాండకారుఁ డస్మత్పూతదా
నేచందమ గురువయ్యెనో వాచంయములార! వినుఁడు వక్కాణింతున్, ౬౪౩

తే॥ సర్వసంగపరిత్యాగపూర్వకముగ నెప్పు డిలు వెడలితినో నే నప్పు డస్మ
దూఢయును బసిబాలకు నొకరుని నెడబిడ్డను గొంచు నావెంటఁ బ్రీతి వెడలి

సీ॥ "స్వాధ్యాయపఠన భిక్షాచర్యముల నెప్డు శ్రమములొందెడు బ్రహ్మచారియేని
పుత్రకళత్రాది పోషణాతురతమై నస్వస్థుఁడైన గృహస్థుఁడేని
కందమూలఫలాశిగం గృశించుచు సదా వనటఁగూరెడి వనవాసియేని
దినమొక్కయూరికిం దిరిగి మాధుకరంబు యాచించుచుండు సన్యాసియేని
సంయతాత్ముఁడగుచు సరిగ వర్తించుచో ముక్తినొందు నిక్కముగను గాన
నాదుమాటవినుము నాథ! యీగార్హస్థ్య మద్ధరింపఁగలుగు నోజ నిన్ను, ౬౪౫

ఉ॥ కాదని నం త్యజించి యెటకో కాలము పుచ్చఁ దలంచెదేని నే
నేదొవిధిం త్యజింతుఁ దను, నీ పసిబిడ్డఁడు బిడ్డ గూడ నా
మాదిరి మేను వాయుదురు, మంచియొ చెడ్డొ మదీరితంబు నీ
కాదరణీయ, మిందులకు నడ్డుపచింపకుమీ కృపామతిన్, ౬౪౬

తే॥ స్వయముగా గుర్తెఱింగియుఁ జనుటతగునె యన్యతీర్థంబునకు నాథ ! హాటకేశ్వ
రంబు తీర్థంబులం దుత్తమంబటంచు క్షితిసురు లాపసులు చాలఁ జెప్పవిందు. ౬౪౭

శ్లో॥ "పునంతి సర్వతీర్థాని స్నానదానాదిసంశయం
హాటకేశ్వరజం క్షేత్రం స్మరణాదపి పావయేత్" ౬౪౮

ఆ॥ అని యథార్థవాదియైన విశ్వామిత్రు వానసంబునుండి యాలకించి
యేను దప్పకుండ నీశ్లోకమును సదా పఠన సేయుచుందు భక్తితోడ" ౬౪౯

కం॥ అనిచెప్ప సెట్టి కేలకు "వనిత ! గృహస్థుండనుగానో వానప్రస్థుం
డనుగానో మనుదు" నని యాఘునమగు తీర్థంబుదరిని గాఁపురముంటిన్, ౬౫౦

కం॥ కరయుగళంబున గాజులు హరువగు చరణాబ్జయుగళి నందెలు కడియాల్
మెఱయఁగ నాడుచుఁ బాడుచుఁ దిరిగెడి నాముద్దుబిడ్డ దినదినమునకున్, ౬౫౧

తే॥ కందమూలాశనంబునఁ గార్శ్య మొందఁగడఁగుటయు జాఱెగాజులు క్రమముగాను
నది కనుంగొనుకాలంది నోయార్యులార ! కాఱె నాకును బొమ్మవు ల్కనులవెంట

కం॥ జాఱియుజాఱియు నవ్వి కుమారిక హస్తముల మూఁడుమాత్రమునిలువన్
సారెకుఁ దత్సంఘర్షణఁ జారుతరంబైన యొక్కశబ్దం బొదవెన్, ౬౫౩

ఆ॥ పెద్దకాలమునకుఁ బిదప నందును రెండు గళితమగుచు నెట్టి ఘర్షణమును
లేక యొక డెమిగిలి వాకంటఁబడుడు వర్యాశ్రమంబుగూడ నవలఁద్రోసి ౬౫౪

ఆ॥ "పెక్కుమందికూడి యొక్కెడనున్నచోఁ గలహ మిరువురైన ఘర్షణంబు
నొక్కఁడైన సౌఖ్య మొనఁగూడు బాలికావలయమటుల నిద్ది, వాస్తవంబు" ౬౫౫

కం॥ అని మనమున ననుకొని నేఁ దనయను దనుజాల్ను గృహిణిఁ ద్యజియించి వెసన్
జనితిఁ గడుదూర మెటుపోయినదియు నాయర్ధదేహి యెఱుఁగకయుండన్, ౬౫౬

ఆ॥ ఎచటఁ బ్రొద్దుగ్రుంక నచటఁబరుండుచు నెదిలభింపవేళ నదిభుజించు
చిలఁజరించుచుంటి నిబ్బంగి సంసారబంధ మెడలి ప్రజలె బంధువులుగ, ౬౫౭

కం॥ అంత మెలమెల్లగను నాకెంతయు జ్ఞానంబుగలిగె, నిప్పు డతీతా
గంతవ్యవర్తమానోదంతంబంతయు నెఱుంగ దక్షుఁడనైతిన్, ౬౫౮

ఉ॥ ఈవిధ మస్మదీయసుత కేను సుశిష్యుఁడనైనవాఁడ భూ
దేవతలార ! యుష్మదుపదేష్టలతీ రెదియున్న ప్రశ్నకున్
వావిరి యుత్తరంబిది, యవాస్తవమొానుడి యొంతమాత్రమున్
నేవచియింప మీయెదుట నిశ్చయమిద్దియటంచు నెఱుంగుఁడీ, ౬౫౯

తే॥ ఇట్లు లోకోత్తరజ్ఞాన మేరుపడియె పట్ప్రికారంబులుగ నగ్రజన్ములార !
దానినడిపితి మీయెడందలకు నమ్మకంబుగలుగఁగ నిఁక నేమిగలదు చెప్ప" ౬౬౦

వ॥ అనియిట్లువాక్రుచ్చుటయు భూసురులందఱును ౬౬౧

కం॥ "వానప్రస్థాశ్రమమును సూనుని సుత సతిని విడిచి శుద్ధజ్ఞానం
బూని యెటకరిగితివి? నీవో నయవిద! యెంత కాలముంటివి యచటన్?" ౬౬౨

వ॥ అనిప్రశ్నించుటయు నతిథియిట్లనియె. ౬౬౩

సీ॥ కనుగొంటి వేనువెంటఁ గదలిపోయి యఘచ్ఛేదీరుతీరగు పుణ్యతీర్థములను
గైకొంటి దోయింట ఘనదేవతాలయస్థలములఁ దీర్థప్రసాదములను
దపమొంటి ముక్కంటిదయగోరి యాపగాపరిసరభూములం బరమనిష్ఠఁ
బన్నుంటి నేనొంటిఁ బర్వతగుహాలయం దాత్మస్వరూపంబు నరసికొనుచు
నట్టు లుండియుండి యజుఁడుదా జన్మంబు సలుపుచుంట స్వయము తెలిసికొంటిఁ
దెలియఁబడుడుఁ దద్దివృత్తు వారాణసివద్దనుండి యిపుడు వచ్చుచుంటి" ౬౬౪

వ॥ అనియిట్లు ప్రత్యుత్తరంబు చెప్పుచుండుటయు ౬౬౫

## — అతిథికడకు విష్ణ్వింద్రాదిదేవతలు వచ్చుట —

సీ॥ అధ్వరక్రియ నుంతయవకాశమొదవుడు నెలమిఁ బులస్త్యాదిఋత్విజులను
గార్ష్ణ్యాజినంబునం గైశేయఁబడి సోమయాజియై యందున్న యజ్ఞుఁడును
నాఖండలుం దమ యగ్రిమం దిడుకొని గుమిగూడి తమి సర్వసుమనసులును
నలుగురితోఁ పాటు నారాయణాయనునది సార్థకముగాఁగ హరిహరులును
నచటికరుగుదెంచి "యతిథి! నీజ్ఞానంబునకుఁ బ్రమోదమందినార మేము
అడుగువరము దుర్లభార్థంబెనుగుకగాక యిడుదు" మనుడు నాతఁడిట్టులనియె,

శా॥ "సంతోషించితిరేని నాయెడల వాంఛాపూర్తి గావింతురేన్,
జింతింపం బనియేమి, యీ తనువునన్ దేవత్వముంబొంది మి
మ్మెంతో కూర్చుచు యజ్ఞభాగములఁగొం చే మీకుఁ బైస్థానమం
దంతశ్శుద్ధిగనుండ నిండు వర మోయజ్ఞాత్మముఖ్యామరుల్!" ౬౬౬

వ॥ అని యిట్లు కోరుకొనుటయు నిలింపులు ౬౬౭

ఆ॥ "నిశ్చయముగనీవు నిర్జరవరుఁడవై దేవలోకమందుఁ దేజరిల్లు
మంతెకాని యధ్వరాంశంబు గోరకు మదియొసంగఁ గొంతయడ్డుగలదు, ౬౬౮

ఆ॥ నరున కధ్వరాంశ మరయక యిచ్చుచో నగును నపరిమాణతాప్తి ఖ్యాతికిఁ,
గాన దాని నీయఁగాఁజాల మీవును నరుఁడవగుచు ధరణిఁ బరఁగుకతన," ౬౭౦

వ॥ అనవుడు నతిథి మఱియు నిట్లనియె, ౬౭౧

కం॥ "క్రతుభాగవివర్జితమగు క్రతుభుక్త్వముతోడ నాకుఁ గార్యములే, ద
క్కృతమున మోక్షముఁగూరిచి యతించి సాధించువాఁడ నద్దాని వెసన్" ౬౭౨
వ॥ అనినవిని యంబుజాసనుం డఖిలాదిత్యుల కంజలిఘటించి ౬౭౩
మ॥ "వినుఁడీ నాదుహితోక్తి యెల్లసుర! లీవిప్రుండు నాయజ్ఞమున్
గన దూరంబుననుండివచ్చె మఱియున్ జ్ఞానాఢ్యుఁడున్ నాగరుం
డును సత్పాత్ర మభీష్ట మిత్తు మనుచుం దోడ్తోల్త నన్నార మం
దునఁ దద్వాంఛితపూర్తి సేఁత మనకుం దోడ్తోఁ బ్రశంస్యంబగున్" ౬౭౪
వ॥ నావుడు మహేశ్వరుం డిట్లనియె. ౬౭౫

—♦ అతిథిపూజా మహత్త్వము ♦—

ఆ॥ "యజ్ఞభాగభోక్తయైనయప్పటికంటె నెక్కుడైనతృప్తి యితఁడువొంద
నొకటి చెప్పఁదలఁచియున్నాఁడ దేవతల్! వినుఁడు సావధానమనసులగుచు,
ఉ॥ ఈక్రియమాణయజ్ఞమున కీశుఁడు విష్ణువు, యజ్ఞపూరుష
ప్రాకటకీర్తి యాతనికిఁ బర్వుట కిద్దియె హేతు, వట్టిసు
శ్లోకునికన్న నియ్యతిథి శుద్ధమనస్కుఁడు గీర్తనీయుఁ డీ
లోకములోనఁ జైత్యకము లోనగు కర్మములందు ముందిఁకన్, ౬౭౭
తే॥ తనదునామముకీర్తించు వెనుక యజ్ఞపురుషునామముకీర్తించి భూసురునకు
నన్న మొసఁగిన యజ్ఞాంశమబ్బునపుడుపడయుతమి కెక్కుడౌతమి పడయు నతిథి,
చ॥ అతిథికిఁబెట్టకుండఁ గృతమయ్యెడి శ్రాద్ధముఖాఖిలంబులున్
వితయయిపోవు భస్మమునవేల్చు హవిస్సులవోలె భక్తిమై
నతనికి వైశ్వదేవవిధియాటుయు వెంటనె విష్ణునామసం
యుతముగఁ బూజసేసియిడు నొక్కకణంబును నక్షయంబగున్, ౬౭౯
వ॥ అనిన విని బ్రహ్మవిష్ణుపురస్సరులగు బర్హిర్ముఖు లందఱుం దథాస్తని, రవి
మొదలుకొని యతిథిపూజ యేర్పడియెఁగాన యత్నపూర్వకంబుగా నతిథిపూజ యనవ
రతం బాచరించుచుండునది, యజ్ఞపురుషు గౌరవించి యతిథి నవలఁద్రోయు టనర్హం,
బతిథిపూజకన్న గృహస్థులకు వేఱొక ధర్మం బుండ, దెవనియింటినుండి యతిథి
భగ్నాశుఁడై మరలు వానికిఁ దన పాపమొసంగి పుణ్యంబు గొనిపోయెడి. ౬౮౦
సీ॥ అతికష్టములువచ్చి నప్పుడేని యబద్ధమాడకుండునుగాక యధికదీక్ష
నిష్ఫలకై నేతమ నీర్వ్యసికడుగు సదాచారవంతుండె యగునుగాక
తలక్రిందుగాఁబడి తపముసేయునుగాక రొడలు శుష్కింపఁజేయుచుఁ గరంబు

పఠియించుఁగాక దేవపనిగఁ దాఁ గూర్చుండి యొగిని సాంగోపాంగముగను శ్రుతులు
విద్వద్వనీసురులఁ బిల్చి వేనవేలు బహుహుతు ల్సేయుఁగాక యెప్పటికినపుడె
యొాలిసత్కార్యముల్సేయుచుండుఁగాక యతిథిఁ బూజింపకున్న నయ్యవి వృథాయె.

వ॥ దూరంబునుండివచ్చి యతిథు లెవనియింట సుఖింతురో వాఁడె గృహస్థుండు గాని యన్యులు గృహరక్షకుల, పూర్వజన్మంబునఁ బుణ్యముచేయని పురుషులకు శ్రాద్ధదాన పిత్రియోగ్యులు ఘటింపనేర, రతిథిని సంతోషపెట్టిన నఖిలామరులును సంతోషపడుదు, రతఁడు విముఖుఁడైన నందఱును విముఖులగుదురు కావునఁ బుణ్యాసమృద్ధిఁగోరువాఁ బ్రాణపరిదానముచేనైనను నతిథి నానందపెట్టునది. శ్రాద్ధీయుఁడు వైశ్వదేవీయుఁడు సూర్యోఢుఁడు నని యతిథి త్రివిధంబుల వర్తిల్లెడి. భోజనార్థాగతులగు తక్కటివారందఱును సామాన్యులనంబడియెదరు. శ్రాద్ధసంకల్పానంతర మరుదెంచువాఁడు శ్రాద్ధీయుఁడు. దూరపథంబునుండి శ్రాంతుండై వైశ్వదేవాంతమున వచ్చినట్టిఁడు వైశ్వదేవీయుఁడు, తత్పూర్వ మరుదెంచువాఁ డతిథియనంబడుఁడు.

సీ॥ ఆపత్తులనువచ్చి యక్కఱల్దీర్చుచుఁ జాలఁగూర్చెడి ప్రాణసఖుఁడు గాని
యింటిలోఁదినుచు నయ్యింటివాసా ల్లెక్కపెట్టంగఁజాలు సుప్రియుఁడు గాని
పొట్టఁబొడ్చిన నొక్కపాడియక్షరముగూడ నుండని శుద్ధమూర్ఖుండు గాని
సభలలో మెప్పొంది సత్కృతుండగుచు నుద్దండుఁడైమను పండితుండు గాని
వైశ్వదేవవేళ వచ్చినవాఁడెపో యతిథి స్వర్గమిచ్చు నతఁడె గృహికి
గోత్రసూత్రమెఱుఁగఁగోరక జందెముం గనియె కుడువఁబెట్టఁజనును నతిథి, ౬౭౩

వ॥ శ్రాద్ధవైశ్వదేవములయం దతిథి యరుదేరకున్న నతనిపేర నగ్నియం దాజ్యాహుతి వ్రేల్చునది, యయ్యతిథి కన్నదానమాదరింప శక్తుఁడగువాఁ డతఁడు తృప్తిపడునట్లల్పాహారమైన నర్పించి యనుపునది. భోజనానంతరమో రాత్రివేళనో వచ్చినయతిథి సూర్యోఢుండని చెప్పంబడు. నతనికి యథాశక్తి నన్నమో ధనమో ధాన్యమో యర్పించునది. ౬౭౪

సీ॥ చామలు నివరి దూసరి గంటె గునుగులు మొదలైన తృణధాన్యములకు నేని
ఛదసంచయముల నాచ్ఛాదింపఁబడి వినిర్మలత నొప్పారు భూస్థలులకేని
హ్రాదినీకమలాకరాంధువాపీముఖానీతంబులగు మంచినీళ్ళకేని
సత్యేతరంబులై స్వాంతంబురంజింపఁ గడుసమర్థములైన నుడులకేని
లోప మెవరియింటిలోపల నుండదు వానివానిచేతనేని యతిథి
నాదరించిపంపనగుఁజుడీ గార్హస్థ్యమూనియున్న సుజను లుర్వియందు, ౬౭౫

సీ॥ స్వాగతంబిచ్చిన సంప్రీతిపడుఁ గడుం జిత్రభానుఁడు తాను జిత్తమందు
నాసనంబొసఁగిన నానందముం బొందుఁ దచ్ఛతానందుండు తాఁగరంబు

పావనతమమైన పానీయములతోడ నర్ఘ్యమర్పించిన హరుండు తనియు
భక్తిమైఁ బూజించి పక్వాన్నములతోడ నన్నదానము సేయ హరియు మరియుఁ
బాద్యమీయంగఁబడ బృహస్పతి మొదలగు క్రతుభుజు లీప్రీతులయ్యెద, రతిథి సర్వ
దేవతామయుఁడటు గాన దినదినమును నర్చనీయుండతండుర్వి నధికభక్తి, ౬౭౬

ఆ॥ అర్చనీయుఁడైన యతిథి రాకున్నచో నతని పేరుచెప్పి యన్నమేని
యిడువఁబెట్టవలయు విడువక గృహమేధియైన యగ్రజన్ముఁ డర్హభంగి" ౬౭౭

వ॥ అని యిట్లు చెప్పి సూతుండు వెండియు నిట్లను. "విప్రోత్తములారా! యట్లు
మహేశ్వరాదులు పలుకుటయు నతిథి ౬౭౮

ఆ॥ "హాటకేశ్వరాఖ్యనలరు నీక్షేత్రమం దొకటఁ దపము సలిపియుంటెఁ బూర్వ,
మసురిపించియుంటి నటనొక్క తీర్థంబు స్నానదానములను సలుపుకొఱకు, ౬౭౯

కం॥ మంగళవారముతోడను సంగతమగు చవితినాఁడు సకలామరులున్
బొంగుచుఁ దత్తీర్థంపుఁ గురంగట వసియింపవలయు రాత్రిందివముల్, ౬౮౦

ఆ॥ ఆదినంబునందె యాతీర్థమందున స్నాతులైనయట్టి జనములకును
సర్వతీర్థఫలము సమకూరవలయును ద్వత్ప్రసాదమునను దక్షిణమున" ౬౮౧

—• ప్రస్థాత విశ్వావసున్ను శపించుట •—

వ॥ అని ప్రార్థించుటయుఁ దత్సురోత్తము లెల్లరుం దథాస్తని రంత నాలవదినం
బున ఋత్విజులు యజ్ఞకర్మమారంభించి సోమపాన పశుహింసాదికంబు నిర్వర్తించు
టయుఁ బ్రస్థాత యేకాంతంబుగా సదోమధ్యంబునం బ్రవేశించి తత్పశుగుదమాంస
హోమతత్పరత్వంబున వ్యగ్రుండైయుండ మాంసభక్షణలాలసుండగు నొక్కయువకుండు
సనుదెంచి యద్దాని భక్షించె. భక్షమాణుండగు నతని విలోకించి ప్రస్థాత ౬౮౨

కం॥ "ఛీఛీ! హోమము సేయను నీచా! పశుగుదముని చట నేఁ బెట్టుకొనన్
నీ చాపల్యముచూపుచు మూచూచితి దూష్యమయ్యెఁ బోయది యింకన్, ౬౮౩

శా॥ స్వచ్ఛంబైనపదార్థసంచయమెకా సప్తార్చి హోతవ్య, మీ
యుచ్ఛిష్టంబును బెట్టి యెట్టులిఁక నే హోమంబు గావింతురా?
తచ్ఛిష్టేతరులైన రాక్షసుల వేతద్దుష్క్రియ ల్గాన నో
తుచ్ఛా! నీవును రాక్షసుండవగుచున్ దుఃఖింపుమా మ్మింతటన్" ౬౮౪

వ॥ అని శపించుటయు ౬౮౫

సీ॥ ఈక్షణంబులు రెండు నెఱ్ఱనై కనుపట్టె నెత్తివెండ్రుక లెల్ల నిట్టనిలిచెఁ
బాచిపట్టికరంబు పండ్లు నల్లగనయ్యెఁ గర్ణము లొమ్ముడులకరణిఁదోఁచెఁ
గడు భీషణంపు టాకారంబు వాటిల్లె దిగజాఱెఁ గ్రిందికి మిగులఁ బెదవి
కోలమొగం బొడ్లకున్ భీతిపుట్టించె మాంసంబు మేదస్సు మంటఁగలపె

నరము లెముకలుఁ జర్మముం గడకుమిగిలెఁ దలఁపునకుఁదెచ్చెఁ జాముండ దర్పిష్ఠజనుల
కిట్లు రాక్షసభావంబు నెనసెనతఁడు తత్క్షణంబునఁ దచ్ఛాపసత్తరయమెు, ౧౯౬

సీ॥ అఖిలప్రపంచంబు నవలీలసృజియించి తనరారునటువంటి ధాతృపౌత్రు
సకలవాచంయమసంస్తూయమానుఁడౌ నల పులస్త్యమునీంద్రు ననుఁగుఁగొడుకు
వేదవేదాంగాది వివిధవిద్యలుఁగూడ శ్రద్ధమైఁజదివిన సన్మనీషి
క్షమను విశ్వావసుసమభిధానంబుచేఁ బిలువంగఁబడియెడి యలఘుచరితు
మంత్రపూతమైనమాంసంబుదినుటకై యేగుదెంచి భూసురేంద్రుచేత
శప్తుఁడైన యానిశాచరాకారుని జూచి యచటనున్న క్షోణిసురులు, ౧౯౭

సీ॥ కొందఱుచనిభీతి గోరాజవాహను కాళ్ళపైఁబడి రీశ! కావుమనుచుఁ
గొందఱుపోయి యాయిందీవరాక్షుని శరణుఁబొందిరి రక్ష హరి! యటంచుఁ
గొందఱేగి రయంబ బృందారకజ్యేష్ఠు ప్రాపుఁజొచ్చిరి దేవ! పాహియనుచుఁ
గొందఱు గాయత్రికూరుచుండిన యజ్ఞశాలడాఁగిరి యంబ! యేలుమనుచుఁ
గొందఱు జపించి రెంతయు గుండెపగిలి శుద్ధమనమున రక్షోఘ్నసూక్తములను
నంద ఱన్నివిధంబులఁ దొందరపడి వందురి యతఁడు తనదైనచందమునకు, ౧౯౮

వ॥ కనులనిండ గిరగిర నీళ్ళుదిరుగ బ్రహ్మపాలికిం బరువెత్తి ౧౯౯

కం॥ "మనుమఁడ నీకుఁ బులస్త్యుని తనయుఁడఁ బ్రఖ్యాతశాపదగ్ధుఁడనై యీ
దనుజాకారముదాల్చితిని జిహ్వాలౌల్యమునను దిని పశుగుదమున్, ౨౦౦

కం॥ ఎఱుఁగక హోమార్థముగం బరికల్పితమైనదాని భక్షించితి నో
పరమేష్ఠి! తిరిగి నరత న్గరుణించుచు రాక్షసత్వనాశకుఁడగుమా" ౨౦౧

వ॥ అనినవిని పితామహుండు ప్రస్థాతతో సామపూర్వకంబుగా నిట్లనియె. ౨౦౨

ఆ॥ బాలకుండు నాదుపౌత్రుండు వీఁడు గురెఱుఁగఁ డేదియుఁగాన నెంతయును స
హించి రాక్షసత్వ మెడలంగఁజేయుము మహీసురేంద్ర! నాదుమాటవినుము" ౨౦౩

వ॥ అనినవిని యమ్మని ౨౦౪

ఆ॥ "పశుగుదం బశుద్ధపఱిచి ప్రాయశ్చిత్తమునుజనింపఁజేసె ననఘ! యితఁడు
గాన యజ్ఞవిఘ్నకరుని శపించితి నెపుడు రాక్షసత్వ మపనయింప" ౨౦౫

వ॥ నావుడు బ్రహ్మదేవుండు ౨౦౬

కం॥ ఏతత్క్రతుసిద్ధికిఁగా నాతతగోభూప్రదానపావనము లెల్లన్
జేతును బ్రాయశ్చిత్తం బీతని దైతేయభావ మెడలింపు దయన్" ౨౦౭

వ॥ అనుటయు మరల నతండిట్లనియె. ౨౦౮

కం॥ అనలము శీతలమగుచో వనజారికి వెచ్చఁదనము వచ్చెడిచో నే
ననుమాట యన్యథాయౌ ననిమిషపరిపూజితామలాంఘ్రిసరోజా! ౨౦౯

## —• రాక్షసులు భుజించు శ్రాద్ధములు •—

వ॥ అనియిట్లు ప్రస్తాత పలుకుటయు రాక్షసరూపుఁడగు విశ్వావసుం గని బ్రహ్మ యిట్లనియె. ౨౧౦

కం॥ "నీ వీరూపముతోడన యీవత్సా! నేను సెలవునొసఁగెడిదాఁకన్
భావనము చమత్కారపురీ వరుణదిశ వ్వసింపు. ప్రియముగ నంతన్. ౨౧౧

ఆ॥ లంకనుండివచ్చి లక్షోపలక్షల యసురు లచటఁ దపము నాచరించు
చున్నవారు కోరి యున్నతపద. మటు రాజవగుము నాగర ప్రియముగ. ౨౧౨

కం॥ భూతప్రేతపిశాచము లాతత కూశ్మాండములును నతిదుర్మార్గో
పేతులగు దనుజులును గల క్షేత్రంబునందు నింకను దనయా! ౨౧౩

ఆ॥ అచటికరుగునట్టి యవనీప్రజల వారు నిగ్రహింతు రదియె నిమిషమునను
నెదుట నాగరుఁడు సమీక్షింపఁబడినచో భయముఁజెంది దవ్వు పాఱుచుంద్రు.

తే॥ అట్లుగావున నచ్చటి యఖిలదానవులకు నేలికవగు పొమ్ము పుత్ర! నీవు.
ఇపుడె రాక్షసరాజ్యంబు నేను నీకు నిచ్చినాఁడను పేర్మిమై నేలుమనుచు" ౨౧౪

వ॥ అనియిట్లు చెప్పుటయు రాక్షసుండిట్లనియె. ౨౧౫

ఆ॥ "అసురవరులమీఁద నాధిపత్యంబును బొందు నాకు నేది భోజ్యమచట?
భృత్యతతికి నేమి పెట్టంగవలయును? కరుణయుంచి చెప్పఁగదె సురేశ! ౨౧౬

కం॥ ఏరాజు భృత్యజనులను గూరిమిఁ బోషింపకుండు ఘోరతరంబౌ
రౌరవనరకమునంబడు నారాజని విన్నవాఁడ నార్యులవలనన్" ౨౧౭

వ॥ అనియిట్లు వక్కాణించుటయుఁ జతురాననుండు ౨౧౯

కం॥ "తిలదర్భహిరణ్యములం గలితముగానట్టి శ్రాద్ధకర్మము తీర్థం
బులఁ బెట్టఁబడినదైనను బలిమిని నీకొసఁగినాఁడ బాలక! కొనుమా. ౨౨౦

సీ॥ కంపలవెంబడిగల యశుద్ధముదిని బలిసియుండిన యూరఁబందిగాని
పశుచర్మకృతములౌ పాదరక్షలుదెచ్చి కొఱుకు చిల్లిలుదూఱు కుక్కగాని
బూడిదలంబడి పొరలుచుఁ గడుఁ గఠోరంబుగాఁ గూయు గార్ధభముగాని
స్రవదార్తవార్ద్రవస్త్రచ్ఛన్న మృదుతనూవల్లియై యున్న పుష్పవతిగాని
చూచుచుండఁగఁబెట్టెడి క్షోణిసురుల శ్రాద్ధములఁ బొంది నీవు సమృద్ధముగను
గుడుచుచుండుమి యవ్వార లిడుపదార్థములను భృత్యయుతంబుగం బుత్ర! యెపుడు.

తే॥ ద్వాదశాంగుళములుగూడ దాఁటిపోయి మూలరహితంబులైనట్టి మూఱెఁడేసి
దర్భలంజేర్చి విధిరహితముగ నెట్లొ పెట్టుశ్రాద్ధంబులన్నియు బిడ్డ! నీవి. ౨౨౨

ఆ॥ తిలలో యవలో తైలకలితంబులో నపూపములో లేక పెట్టఁబడెడి శ్రాద్ధ
ములను బొంది నీవు లలి భుజియింపుమీ యిచ్చినాఁడ వాని నెల్ల నీకు. ౨౨౩

ఆ॥ తలకుఁబోసికొనియు తానంబుసేయకో ధవళమైనవలువ దాలుపకయు
పెట్టఁబడినయట్టి పితృకర్మ మంతయు నీకుఁ గైవసంబు పో కుమార! ౭౨౪
సీ॥ వ్యభిచార మొనరించు నంగన పెనిమిటి యొడలెల్లఁ దెల్లని పొడగలాఁడు
పుప్పిగోళులతోడఁ బొక్కుడియాతండు గుహ్యామయంబునం గుములునతఁడు
తస్కరత్వమునకుం దలపడినట్టిండు బలుకడ్డి కప్పిచ్చి బ్రతుకునట్టిఁ
డంగలోపంబున నంగలార్చెడివాఁడు బహుళాంగముల దుఃఖపడెడివాఁడు
కోఁతివన్నెపండ్లయాతండు నగ్నుఁడౌం గాఁపురానితోడఁ గాఁపురంబు
సేయువాఁడు వచ్చి యేయాబ్దికంబునం గుడుతు రద్దియెల్లఁగొడుక! నీది. ౭౨౫
తే॥ ఏముఖంబున దక్షిణ యీయఁబడదొ, యెద్ది సాక్షాత్కృతము గు, నెచట బ్రహ్మ
చర్య మాచరితము గాదు చక్కఁగాను వానివానిఫలంబు నీకౌను బిడ్డ! ౭౨౬
ఆ॥ శ్రాద్ధ వైశ్వదేవ సప్తతంతువులయం దతిథి యరుగుదెంచి యాదరింపఁ
బడకయున్నయెడలఁ దడయక యవియెల్ల నీయధీనమగును నిశ్చయముగ. ౭౨౭
ఆ॥ శ్రాద్ధమాచరింప సంకల్పమొనరించి కర్తగాని భోక్తగాని యువదు
మౌనమూనకుండ మాటాడెఁ గడఁగుచో నదియును నీకు భోజ్యమగును వత్స! ౭౨౮
ఆ॥ భిన్నపాత్రములనొ మన్ననం గావింపఁ బడినపాత్రములనొ పాకభోజ
నాదికంబొనర్చు నాశ్రాద్ధముంగూడ నిచ్చినాఁడ రాక్షసేంద్ర! నీకు. ౭౨౯
సీ॥ యచ్ఛాద్ధకృద్భోక్త లాదినంబున బ్రహ్మచర్యంబునడపరు చపలులగుచు
యచ్ఛాద్ధకర్మమం దెంతయు వికృతముల్ పుట్టునో యందు నుజ్జగయు నుప్పు
యచ్ఛాద్ధమందలి యర్చనమంతయు జాజిపూవులచేత జరుపఁబడును
యచ్ఛాద్ధమందున నాయసపాత్రల భోజనంబిడుదురు భూసురులకు
గ్రహణసంక్రమణేతర కాలములను హవనభోజనములు రాత్రియగును దేన
నెద్ది మంత్రక్రియాహీన, మెది త్రిపాత్రరహిత మాశ్రాద్ధములుగూడ రక్కసులవి"

—♦ యజ్ఞవాటికి నారదుండరుదెంచుట. ♦—

వ॥ అనిపలుకుటయు నవ్విశ్వావసువు రాక్షసస్థానంబునకుఁ జనియె. నంత నైదవ దినంబున ఋత్విజులందఱు నవగాహనమాచరించి శుభ్రవస్త్రంబులం దాల్చి శుమ్మతై సదోమధ్యంబునం బ్రవేశించి పులస్త్యబోధనుండి హోమంబు సేయుచును బ్రేషములుచ్చరించుచును నుండుటయు యజ్ఞాంశలాలసులగు నఖిలామరులును నధికానందంబున నరుదేర నుద్గాత సామగానసూచ్యమాన శంకువులఁ జలుపెడగు వేదంబున నుపక్రమించి సప్తావర్తంబులొనరించె. నట్లు సురలు సోమపానంబు సేయ నుద్గాతసామగానం బుపక్రమించుడు శంకుకర్ణజంబగు చిత్రంబును జూడఁగోరి సామగాన ప్రియుడును సంఖ్యావతి

యు ఛందోగుఁడగు దేవశర్మసమభిధాను సంతానమును నగు నౌదుంబరియను కన్యక
యరుదెంచి యుద్గాత నుద్దేశించి ౨౩౧

—— ఔదుంబర్యుద్గాతృసంవాదము ——

ఆ॥ "సామసూచ్యమాన శంకుప్రవర్తన మెట్టులెట్టులగునో యట్టుపోయి
దక్షిణాగ్ని వ్రేల్వ; దాన నీపాపంబు వాయు. లేకయున్న వ్యర్థమిద్ది" ౨౩౨

వ॥ అని సాభిప్రాయంబుగా ననిన విని యా యుద్గాత తదుక్తార్థంబు నాలోచించి
యాశ్చర్యపడుచు నక్కన్నియతో నిట్లనియె. ౨౩౩

కం॥ "ఎచ్చోటినుండి నీవిపు డిచ్చోటికి వచ్చితమ్మ యిభయానరో! యే
సచ్చరితు ననుఁగుబిడ్డవు? పొచ్చెములేకుండఁ జెప్పి పొగడఁగఁబడుమీ" ౨౩౪

వ॥ అనియిట్లడుగుటయు నౌదుంబరి ౨౩౫

తే॥ "ఒక్క గంధర్వ తనయనై యుండి నేను శాపవశమున నిటు దేవశర్మయనెడి
బ్రాహ్మణునకు నుద్భవించితి సంయమీంద్ర! విహిత పూర్వభవజ్ఞాన సహితనగుచు"

వ॥ అనవుడు నుద్గాత మఱియు నిట్లనియె. ౨౩౬

కం॥ "ఏగంధర్వునికొమరిత? వే గుణవంతుఁడు శపించె నిటువంటి నినున్?
బాగాయె. మానుషత్వత్యాగం బెపుడౌను నీకుఁ దనయా! చెప్పుమా" ౨౩౭

వ॥ నావుడు మరల నౌదుంబరి ౨౩౮

కం॥ "నారదుఁడు పర్వతుండను పేరుల గంధర్వవరులు విదితులెకద! య
వ్వారలలోపలఁ బర్వతు గారాబపుబిడ్డ నేను గార్గ్యప్రవరా! ౨౪౦

ఉ॥ నారదుఁ డొక్కనాఁడు తన నాతొప్రవీణియ తానభంగమౌ
తీరున మీఁటు వానివగు తీరు లెఱుంగనిదానవయ్యు నే
నూరక నవ్వుడుం గనలునొంది యతండు "మనుష్యధర్మమున్
గూరి హసించినందులకు గోల! మనుష్యవుగమ్ము పొమ్మనెన్. ౨౪౧

ఉ॥ "మానుషభావమొందినను బ్రాహ్మణవంశమునన్ జనించి సు
స్థానమునందుఁ దత్తనువు త్యాగము సేయునటుల్ విధింపు"మం
చేనను నాదుతండ్రియును నెంతయు వేఁడఁగ నాదుమూర్ఖ్యమున్
దాను క్షమించి యిట్లనియెఁ దన్ముని శాపవిమోచకంబుగన్. ౨౪౨

తే॥ "శ్రీచమత్కారపురమున క్షితిసురేంద్రుఁడుం గులీనుఁడు వేదవేదాంగవిదుఁడు
నై చెలంగెడి దేవశర్మాఖ్యు గృహిణి సత్యభామాఖ్య కడుపున జననమంది ౨౪౩

ఆ॥ ఎపుడు బ్రహ్మదేవుఁ డీక్షేత్రమందున యజ్ఞమాచరించు నపుడు పోయి
యూరకుండ కచటి యుద్గాత శంకువిపర్యయంబు గాంచి భయముదక్కి ౨౪౪

ఉ॥ "స్థానముగానిస్థానమున శంకువునుంచితి" వంచు దేవతా
మానివిశిష్టమా సమితిమధ్యమునం దను. శాపమోచనం
బా నపుడే" యటంచుఁ గలహాశనుఁ డిట్లువచించె మామకం
బైన యమర్త్యమూర్తిఁ బితయున్న విమానముఁ జూడు మియ్యెడన్. " ౨౪౫

వ॥ అని వక్కాణించుటయుఁ మరల నుద్గాతయిట్లనియె. ౨౪౬

ఉ॥ " తుష్టుఁడనైతి నీవలనఁ దోయజనేత్ర ! మదీయదర్శనం
బిష్టద. మట్లుగాన వరమిచ్చెదఁ గోరుము. భూతలస్థులౌ
దుష్టులె నాదుదృష్టిఁబడి తోషితులయ్యెద. రీవు దేవతా
విష్టపజాత. వెంతయును వేడుక సేయఁగనౌను నీకిఁకన్" ౨౪౭

వ॥ అనవుడు నౌదుంబరి ౨౪౮

శా॥ " ఆనందంబునుబొంది నాకు వరమీయం గల్గుచో విప్ర ! యిం
కా నేజన్నమునందు నేనియు మదీయార్చన్ సదోమధ్యమ
స్థానంబందున నిల్పి దానియెదుటన్ శంకు ప్రచారంబు నెం
తేనిం జేయఁగనౌను స్వర్గగతనౌ నేఁబ్రీతయౌ చాడ్పునన్" ౨౪౯

వ॥ అనినవిని యుద్గాత క్రమ్మఱనిట్లనియె. ౨౫౦

—♦ ఔదుంబరి కుద్గాతవరమిచ్చుట. ♦—

తే॥ " ఇదిమొదలుగాఁగ యజ్ఞంబు నెవఁడుచేసినను సదోమధ్యమందు నిన్నునిచిప్రీతి
గంధపుష్ప ద్యలంకృతంగా నొనర్చి నెఱపు శంకుప్రచారము లీ్నదునెదుట. ౨౫౧

తే॥ అఖిలదేవసమాగమమందె యిట్లు ప్రీతినంటెని నౌదుంబరీ ! మదుక్తి
యన్యథాగాదు. మంగళమగునునీకు. నగ్గలంబగుసంతోష మందుమింక. ౨౫౨

కం॥ సదమున నిను స్థాపింపక యెటిగావించినను వ్యర్థమే యయ్యెడి బూ
డిదలోఁ బ్రేల్వఁగఁబడునయ్యదివలె నౌదుంబరీ ! మఖావిఘ్నకరీ ! ౨౫౩

సీ॥ కందళీ జంబీర ఖర్జూర దాడిమ సహకార పనసాది సత్ఫలములుఁ
కనకసూత్రస్యూత కౌశేయరాంకవా ద్యత్యర్ఘ్య సూక్ష్మదివ్యాంబరములుఁ
గ్రైవేయకాంగద కంకణకుండల ముకుటాదికలధౌత భూషణములుఁ
బారిజాతాశోక వకుళాది పరిమళమిళిత నానావిధ కుసుమములుఁ
ధూపదీపాదికంబులు నేపడంతి నెటి సదోమధ్యగతయైన నీకొసంగి
కొలుచు నొక్కొక్కదానికిఁ గోటిగుణితఫలముగలిగెడిఁ దప్ప కప్పడఁతి కనఘ!

కం॥ ఫలసహితములగు దెసలును నలివేణీ ! యెక్క కపుడె యంబరయానం
బిలఁ గొంత నరీక్షింపుము. సలిపెద నీపూజ యెదిరియు సద్ధేతువునన్ " ౨౫౫

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయు దేవతలిట్లనిరి. ౨౫౬

తే॥ “యుక్తమైనవాక్య ముక్తము నీచేత భూసురాగ్రగణ్య! భూరిపుణ్య!
యస్మదీయమైన వ్యాహారమునఁగూడ సత్యమగును నిది యసంశయముగ” ౨౫౭

## —• ఔదుంబరీ శాపవిమోచనము. •—

వ॥ అనియిట్లు దేవతలు తథాస్తనుచున్నను సుద్గాతయుండుముండు మనుచున్నను
నాయమ విమానగృహీతయై వియత్పథంబున విలసిల్లుటయు ‘దేవశర్మబిడ్డ దేవియయ్యె’
నని నాగరస్త్రీలందఱు నాగుణవతిని జూచుటకు వేగంబుగం జనుదెంచి ఫలములర్పించి
కొందఱును వలువలొసంగికొందఱును భక్తిచే బహుభంగులం బూజించిరి. దేవశర్మయు
నాశ్చర్యపడుచుఁ బ్రహృష్టాంతరంగంబునఁ బత్నీసహితంబుగం జనుదెంచి ప్రణా
మమ్మాచరించుటయు ౨౫౮

కం॥ “జనకా! జననీజనకులు తనయులకు నమస్కరింపఁదగునయ్యా? నేఁ
జనుచుంటిఁ ద్రిదివమునకు కిప్పనివలనను మరల నాకుఁ బతనముగలుగుకా. ౨౫౯

ఆ॥ ఉండుఁ డిటనె యమ్మయును నీవు నేఁడెల్ల, ననిమిషోత్తములను యాచ్నఁజేసి
యీయొడళ్ళతోనె యేఁ దోడుకొనిపోదు స్వర్గమునకుమిమ్ము జనక! నమ్ము” ౨౬౦

వ॥ అని యౌదుంబరి యాశ్వాసించుటయు హర్షించి యనేకజనులాచరించు నాత్మ
జాతార్చనంబు నవలోకించుచును నఖిలజనులకంటెఁ దమ్ము ధన్యులుగాఁ దలంచుచును
దలిదండ్రు లిరువురుం దత్స్థలంబున వ్యవస్థితులైరి. బంధుజనులందఱు నా బాలం బ్రశం
సించుచుం జనుదెంచి. రప్పుడు భృగువు సదస్సునుండి చతురాననుసవిధంబునకుం జని
సాంజలిబంధుండై ౨౬౧

తే॥ “క్రతుసదస్సున నుద్గాత కన్యఁదెచ్చి నెత్తిపైఁబెట్టుకొను టేటి నీతియయ్య!
యీ శతంబునఁ దనమార్గమెల్ల నతఁడు వేదబాహ్యంబుగాను గావించినాఁడు. ౨౬౨

కం॥ తన్నాగరకన్యకకుం గ్రన్నన దేవత్వమిడియెఁ గ్రతుభుజులకడకా.
దిన్న నిఁక సోమపానం బన్నారియు మేముఁ గలసి యటఁ జేయఁగనా” ౨౬౩

వ॥ అని చెప్పుటయు విధి యాయుద్గాతం బిలిచి ౨౬౪

ఆ॥ “ఎవ్వరీకుమారి? యేమిటి కీసదోమధ్యమునకువచ్చి మాటలాడె?
నేలగొప్పఁజేసి తీబాలికను నీవు? వాస్తవంబు నుడువవలయు నిపుడు” ౨౬౫

వ॥ అనవుడు నుద్గాతయిట్లనియె. ౨౬౬

కం॥ “శాపభ్రష్టత ధరణీప్రాపితగంధర్వి యీపె బ్రాహ్మణకులమం
దే పుట్టెను. నీమఖమున శాపాంతము చెప్పఁబడియె సమరాశనుచే. ౨౬౭

కం॥ కోపమున శాపమిచ్చియు శాపాంతము నాతఁడే ప్రసాదించెను. నే
నాపయి వరమునొసంగితినా పెరు శంకప్రచార మగ్రంబునఁ గాక” ౨౬౮

వ॥ అనియిట్లు బ్రహ్మకు సదుత్తరంబుఁ జెప్పుచుండ ౨౬౯

—• బ్రహ్మయజ్ఞంబునకు మాతృగణంబులువచ్చుట •—

సీ॥ గంధర్వులందఱుం గడుభక్తిమై వేని నర్చించుచుండుదు రన్వహంబు
సిద్ధులు స్వాభీష్టసిద్ధిఁగోరి సతంబు వేనిని బూజింత్రు వివిధగతుల
సాధ్యసమూహంబు శ్రద్ధ వేనిభజించి సాధింతు రాత్మీయసంపదలను
మరుదోఘములు వేని మతిమతిసేవించి మహనీయతముఁలొందు మనుదు రెపుడు
నట్టిమాతృగణము లౌదుంబరీస్థితి వెండికొండనుండి విన్నవగుచు
హాటకేశ్వరమున కరుదెంచి యాడుచుం బాడుచును హసింపఁబరఁగుటయును

వ॥ తత్కోలాహలంబువిని బ్రహ్మవిష్ణ్వింద్రాది సర్వగీర్వాణులును విశాదు పడి 'యిదియేమి' యని యజ్ఞమంటపమునుండి లేచిరి. పదపడి మాతృగణంబులన్నియుఁ బద్మజునకుఁ బ్రణమిల్లి ౨౨౧

తే॥ "వాయుదేవుండు మముఁబిల్వ వచ్చినార మనఘ! నీచేయుమఖమున. కధ్వరంబు లను హావిర్భాగములు లేవుకనుక మాకు రాకమసలితి మిన్నాళ్ళదాఁక నిటకు ౨౨౨

క౦॥ ఔదుంబరీప్రభావం బీదినమునఁ జెవులఁబడుడు నేతెంచితి మి
ష్టోదేవ! యావెఁగని యభివాదనపూర్వముగఁ గొలిచివచ్చితి మిటకున్. ౨౨౩

క౦॥ పర్వతుఁడను పేరిటి గంధర్వుఁడు మహనీయుఁ. డతని తనుభవయగు నీ
గీర్వాణసుప్రతిష్ఠిత సర్వాభీష్టంబు లొసఁగు సతులకు నింకన్. ౨౨౪

క౦॥ స్థానంబుచూపు మాకు శతానంద! యటన్ వసింతు మందఱమును మే
మానందమునను, నఱువదిపై నెనిమిది మాగణములు. పరికింపు మొగిన్" ౨౨౫

వ॥ అనినవిని యంబుజాసనుండు యజ్ఞమంటపం బష్టషష్టిమాతృగణంబులచేతను ద్రయస్త్రింశత్కోటిదేవతలచేతను సంకీర్ణమగుటయెఱింగి శ్రుతాధ్యయనసంపన్నుఁడును నపరబృహస్పతియు నాగరజాతుండును నగు మధ్యగుంబిలిచి మానంబువీడి ౨౨౬

ఆ॥ "ఈవుపోయి యఱువదెనిమిదిగోత్రాల నాగరులను గూర్చి నయముతోడ
నీగణంబు లఱువదెనిమిదింటికి నొక్కరొకరు సొంతస్థలము నొసఁగుఁడనియు ౨౨౭

తే॥ దాన నీమాతృగణముల కానుప్రీతి గాన నీసాయమును నాకుఁ గరుణయుంచి
చేయవలెమీరలనియును జెప్పుమయ్య మధ్యగా! వేగిరముగ నామాటగాను" ౨౨౮

వ॥ అనివాక్రుచ్చుటయు నతం డతిత్వరితంబుగా నరిగి యా నాగరులందఱి నాహ్వానించి యత్యంతవినయోపేతంబుగా నభివాదనమాచరించి యంతయు వక్కాణించె. నంత నాగరు లదివిని యగ్గలంబగు హర్షంబున నొక్కొక్కగణమున కొక్కొక్క రుచితస్థానం బొసఁగిరి. పదపడి మాతృకలు పరమేష్ఠికిం బ్రణమిల్లి గాయత్రికిం గైమోడ్చి బ్రాహ్మణప్రదర్శితప్రదేశంబులం బ్రవేశించి తదాచరిత నానా విధబలిపూజాదుల కానందపడి యాడుచుం బాడుచు నవ్వుచు ౨౨౯

కం॥ "వనము పతియొక్క స్థలమున. కనయంబు వసింతు మిందె. యన్యత్ర యిటుల్
కనఁబడరు భర్తభూసురు. లెనగా దెద్దియును హాటకేశ్వరమునకున్" ౨౭౦

—♦ సావిత్రి మాతృగణంబుల శపించుట. ♦

వ॥ అని పలుకుచుండు సమయంబునకు సావిత్రివచ్చి యజ్ఞశాలం బ్రవేశింపఁ బోవుటయుం బ్రాహ్మణులు నమస్కరించి ౨౭౧

తే॥ "బ్రహ్మ గాయత్రియను పేరి పడతిమిన్నఁ బరిణయంబయి సవనంబు జరుపుచుండె.
నట్లుగావున సావిత్రి! యరుగకమ్మ యీ సదోమధ్యమున కీవు వ్యర్థముగను" ౨౭౨

వ॥ అని నివారించుటయు నాయమ యత్యాశ్చర్యంబున దుఃఖసమోపేతయు బాష్పవ్యాకులలోచనయు నై యాడుచుం బాడుచు నుత్సాహముం బ్రకటించు మాతృకలం జూచి గద్గదస్వరంబున నిట్లనియె. ౨౭౩

చ॥ "సవతికి యుక్తగౌరవము సల్పి నమస్కృతిగూడఁజేయ కి
ట్లవమతి నాకుఁ జేసితిరి. యందున మీరిఁక నెన్ని నాళ్ళకే
నవలకు నేగ కింద మనుఁ డాలయ ముండదు మీ కొకప్పుడున్.
బ్రవిమలభక్తి నాగరకబ్రాహ్మణపూజయు నుండ దెన్నఁడున్. ౨౭౪

కం॥ చలికాలంబునఁ జలిచే బలుగ్రీష్మమునందు రశ్మిపటలముచేతన్
జలదాగమమున జలముల నిలఁ గ్లేశమునొందుచుండుఁ డీరలు మిగులన్" ౨౭౫

వ॥ అనియిట్లు శపించి నాగరస్త్రీరత్నంబులు తనచుట్టుం జుట్టుకొని యోదార్చుచుండ నందయుండుటయు సూర్యభగవానుఁ డస్తంగతుఁడయ్యె. యజ్ఞమంటపంబున యాజ్ఞికబ్రాహ్మణుల శాస్త్రార్థ చర్చారూపంబగు మహాధ్వని బయలువెడలె. నంత శపింపఁబడిన మాతృక లందఱును ౨౭౬

కం॥ "ఈవిడ శాపము తప్పదు కావున నౌదుంబరీ సకాశంబునకున్
బోవుద మాయమ ధృతిమెయి నీ వచ్చిన కుందుఁబాపి యెలమి బొసర్చున్" ౨౭౭

వ॥ అని యాయమ యంతికంబున కరిగి ౨౭౮

కం॥ "మేమందఱమును దేవిగో! యీమఖమున కరుగుదెంచు హేతువునం గ
న్యామణివై పాలిచెడి నీ ప్రేమ హవిర్భాగములు లభించెను బెలుచన్. ౨౭౯

తే॥ నాగరస్త్రీజనంబుల నడుమఁ జేరి పరమదౌర్భాగ్యయుతయయి గరిమ వీడి
యుండె సావిత్రియిట్లనుచు నొక్క యింతయేనియును మాకుఁ దెలియదిఁ కేమిగలదు.

ఆ॥ అదికతంబుగాఁగ నాడుచుం బాడుచు నున్నవారమేము తిన్న నిచటఁ.
గుడుము చేతికిడినఁ గడుఁ బండుగను మేము యజ్ఞభాగమబ్జ హర్ష పడమె. ౨౮౧

కం॥ అందులకై శపియించెను నందఱ గాంధర్వసత్తమా! యాపె మమున్
సుందరు లెవరుం జెందని కుందుం బొందంగవలసెఁ గొనకే మింకన్. ౨౮౨

తే॥ వ్యోమయానంబు మొదలగు నున్నతస్థితులను నెపుడును భంగంబుగలుగకుండ
నాచరింపంగవలయుఁ గల్యాణి! నీవు, త్రిజగముల నీదుమహిమంబు స్థిరతగాంచ"
వ॥ అనవుడు నౌదుంబరియిట్లనియె. ౭౯౪
క॥ "సకలసురాసురులకు మఱియొకవిధమునఁ జేయరాకయుండెడి పావి
త్రికృతమునకు మాఱొడ్డుట సుకరమె? యైనను యతింతు శుభమొనఁగూడన్.
తే॥ ఆఱువదెనిమిదిగోత్రాలయందుమీరు బ్రహ్మచేత నియోజింపఁబడినవార.
లట నిశావేళలందున హాస్యముఖరసంజ్ఞలం బూజగైకొని సంతసిలుఁడు. ౭౯౬
ఉ॥ ఈరిసమూది నాగరులయిండ్ల శుభక్రియలందు మీకుఁ బూ
జాదిక మాచరింపఁబడు. నట్టులె కోటులు వీటివాకిటన్
మోదముతోడ హాస్యరసముం గురిపించుచుఁ గొల్చుచుందు. రీ
చైదములందు వేల్పులకు జన్నములంబలె మీకుఁ దృప్తియౌ. ౭౯౭
క॥ ఎవ రీ యస్మదుదీరితమవు పూజన మాచరింప, రవ్వారలకున్
దేవులు లుదయించుఁగావున నవనార్థం బుండుఁదమ్మ యన్నగరమునన్. ౭౯౮
క॥ శాపవ్యాజంబున మీ కీపగిదిని వరముదొరకె నిఁక నేటికి మీ
రాపచ్ఛంకవహించెద. రీపురిఁ గాఁపురము సేయుఁడీ తమి దేవుల్!" ౭౯౯

## — ఔదుంబరి పూర్వజన్మవృత్తాంతము —

వ॥ అనియిట్లు చెప్పుచుండ దేవశర్మ పర్వతాఖ్యగంధర్వుండై పత్నీసహితంబుగా నటకువచ్చె. నౌదుంబరి కుపితుఁడైన నారదమహామునిచే శపింపఁబడినపుడు ౮౦౦
మ॥ "మలమూత్రాదిక సర్వదోషయుతమౌ మానుష్యగర్భంబునం
దిల నేఁ బుట్టఁగఁజాలఁగాన జనకా! యీ వంబతోఁగూడ భూ
స్థలికిన్ రమ్ము. నరత్వమొంది వరుసం ద్వత్పత్నిగర్భంబునం
దెలమి న్నన్ను సృజింపు. మట్లయిన నా కేమందు లేకుండెడిన్" ౮౦౧
వ॥ అని పర్వతుం బ్రార్థించి యట్లు మనుష్యుఁడై పుట్టి వానప్రస్థాశ్రమంబున దేవశర్మాఖ్య వర్తిలు నతనిభార్యయం దవతరించినది. యీవిధంబున నయ్యాధ్వరంపు దైవరాత్రి యౌదుంబర్యుత్సవంబుతో నతిక్రాంతమగుటయు నాయమ జనకుఁడగు పర్వతుం గాంచి ౮౦౨
క॥ రేపకడ నిచట నవభృథ. మోపిత! తీర్థంబులెల్ల నుండెడి నట. శ్ర
ద్ధోపేతత స్నాతులమై యాపయి ముప్పురముఁ జనుద మమరయుతమునన్. ౮౦౩
ఉ॥ నావు వరంబయైనయది నారదశాపము చూడ. దేవతా
నీకసుదుర్లభంబుగను నిర్మితమై తగు యాగభాగమే
నాకు లభించె జక్కఁగను. నాయన! యింకను బార్ణమాసియఁ
దీకమలాక్షులెల్లరును నెంతయు నన్ను భజింపఁగాంచితిన్. ౮౦౪

—• బ్రహ్మ, అవభృథస్నానమునకుం బోవుట •—

వ॥ అనివక్కాణించె. నిట్లు హాటకేశ్వరక్షేత్రంబున సర్వకామసమృద్ధిమంతమై యాయజ్ఞంబు పంచరాత్రంబులు జరుగుచుండఁ దత్సమాప్తియందు ౨౦౫

సీ॥ విధిచోదితములైన విపులదక్షిణలచే ఋత్విక్కులైనట్టి ఋషివరులను
విద్యాత్తమం దగువిధమైన సత్కృతిం దక్కటి భూదేవతల్లజులను
నాచ్ఛాదనప్రదానాదికంబులచేత నంధపంగ్వాదులౌ నగతికులను
బహ్వన్నమున దీనభావంబువహియించి పేరాఁకటంగుందు భిక్షుకులను
జాలఁదనిపి యంతఁ జాతుశ్చరణసంపదన్వితులును మఱియు నాగమజ్ఞు
లై రహించు నాగరావనీసురుల రావించి దోసిలొగ్గి వినయమునను ౨౦౬

క౦॥ "కలికాలమువచ్చుటయును నిలఁగల తీర్థములు గుడులు నెంతయు మ్లేచ్ఛా
దులచేత స్పృశింపఁగఁబడి విలయంబునుబొందు. లేదు విచికిత్స యిటుల్. ౨౦౭

ఉ॥ కావున నేను భీతిపడి ఖస్థిత మామకపుష్కరంబు ముక్
దావకభూమిఁ జేరిచితి. దానికి హాటకరాణ్మహాత్తచేఁ
గావలులైన మ్లేచ్ఛు లధికంబుగ మఱి కలికాలమందు నే
నేవిధమైనహానియును నేర్పడకుండెడి నిశ్చయంబుగన్. ౨౦౮

తే॥ తత్కృతంబుగ నవమిట మత్కృతంబు. కనుకఁ ద్వద్భూమినిష్క్రియంబునను మీకు
నేమివలయునో వాక్రువ్వఁ డిచ్చిపోదు నధ్వరంబుఫలంబు నా కబ్బునటుల" ౨౦౯

వ॥ అనివక్కాణించుటయు నాగరబ్రాహ్మణులిట్లనిరి. ౨౧౦

తే॥ "యజ్ఞదక్షిణయీయంగ నభిమతించి యడుగుడ నెదేని చెప్పెద మవధరింపు.
మానివాసంబునను సదా మనుచునీవు పరమపావనముం జేయవలసియుండు. ౨౧౧

క౦॥ నీవిచ్చట స్థాపించినపావనపుష్కరముసత్త బాగుగఁ జెపు మో
దేవ! యుపగాహనాదిక యావత్క్రియ లేమొనర్తు మట శ్రద్ధమెయిన్" ౨౧౨

వ॥ కావున బ్రహ్మదేవుండు ౨౧౩

క౦॥ "పుష్కరమార్గగతైతత్పుష్కరతీర్థంబు నేను బూర్వమున మహా
దుష్కృతసందోహంబులు శుష్కింపఁ సృజించియుంటి సుచరితులారా! ౨౧౪

తే॥ పుడమి నైమిశ మంబరంబునను బుష్కరము కురుక్షేత్ర మల జగత్త్రయిని మిన్న
లగుచు నున్నవియని మీర లాలకింపరే పురాణంబులను సంయమీంద్రులార!. ౨౧౫

తే॥ అట్లుగావున నామాట ననుసరించి కార్తికశుక్లపక్షైకాదశీది
నమునఁ బుష్కర మవనికిన్వచ్చి యైదహంబులుండును యాపృచ్ఛితార్థముగను. ౨౧౬

తే॥ అయిదునాళులలోపల నందువచ్చి స్నానమొనరించియో లేక శ్రాద్ధములను
బెట్టియో యక్షయంబైన యట్టిఫలముఁ బొందుదురు శ్రద్ధగల్గినభూమిసురులు. ౨౧౭

క౦॥ నే సత్యలోకమందు నివాసము చాలించి యైదువాసరములు నీ
భాసురతీర్థమునందుండను జేసెద సంశ్రయము. వినుఁడు క్షితిసురవర్యుల్!" ౨౧౮

వ॥ అనిపలుకుటయు మరల బ్రాహ్మణులిట్లనిరి. ౨౧౯

ఉ॥ "తావకమైనవిగ్రహము స్థాపనసేసెదమిందు. సర్వదా
నీవట నుండుచున్ మఱియు నీదగుతీర్థముగూడ నిచ్చలున్
దా విలసిల్లఁజేయు మజ! దాన నశించు జనాఘసంచయం.
బీవిధుయజ్ఞదక్షిణ యిదే ఘనమైనది గైకొంచ మాకిటన్. ౨౨౦

కం॥ ఈవిధమునఁ గావించిన నీవొనరిచినట్టియజ్ఞ మిఁక సఫలంబౌఁ,
దావకమైనప్రతిజ్ఞయు వావిరి నెఱవేఱు సత్యవచనంబగుచున్"

వ॥ అనవుడు వెండియు బ్రహ్మదేవుండు ౨౨౧

తే॥ "మంత్రమునఁ బిల్వఁగాఁబడి మహితమైన పుష్కరము వ్యోమముననుండి పుడమినున్న
హాటకేశ్వరమునకుఁ దా నరుగుదెంచు భూమిసురులార! ఓయా జగత్పూజ్యులార!

ఆ॥ అస్మదగ్రమునఁ బయస్సులై శ్రద్ధతోఁ బైలమంత్రమాదిఁ బఠనసేసి
యవల జపముసేయ నఘమర్షణము పాల్గొయజ్ఞములు జపించినంతయగును. ౨౨౩

తే॥ సత్యలోకంబునుండినే సరవివచ్చి జప్యమానంబులగు మంత్రచయము లెల్ల
శ్రవణమొనరించుచుండుదు ష్మనిలింపవర్యులార! జగన్మాన్యచర్యులార!" ౨౨౪

వ॥ అని వక్కాణించుటయుఁ దన్నాగరులందఱుం బున్యదానపూర్వకంబుగా యాగసమాప్తి కనుజ్ఞ యిచ్చి. రింతలోపల సద్వర్యశ్రేష్ఠుఁడగు పులస్త్యుండు నాగరపరివారితుండగు బ్రహ్మపాలికిం జని ౨౨౫

శా॥ "ప్రాయశ్చిత్తముపుట్టకుండ సరిగం బర్యాప్తమా దక్షిణన్
నీయజ్ఞంబు సమాప్తమైనయదిపో నీరేజసంభూత! యీ
చాయన్ జన్నమొనర్ప నేరికిని దుస్సాధ్యంబు. నీచేత నేఁ
జేయింపందగు కర్మశేష మిఁకఁ గొంచెంబుండె పాలింపుమా. ౨౨౬

తే॥ వారుణేష్టియు జపమును వరుస నవభృథమ్ము గావింపవలె లెమ్ము తాత! దాని
నాచరింపంగఁదగినట్టి యంబువుల, సకాశమున కేగుదము విప్రగణముతోడ. ౨౨౭

తే॥ బ్రహ్మమొదలైన ఋత్విక్ప్రవరులు నల్గు రేను హోతలునల్గురు నేగుదేర
యజ్ఞపాత్రలఁగైకొని యరిగి హోమమాచరింపుము వరుణతృప్త్యర్థ మగ్ని. ౨౨౮

ఆ॥ వీతిహోత్రమందు వ్రేల్చినవిధముగా నెల్లఋత్విజులును నేగుదేర
నరిగి యవభృథంబు నాచరింపఁగనా జలములం దరిష్టశాంతికొఱకు. ౨౨౯

తే॥ మంత్రవత్తుగజరిగెడి మహితమైన యవభృథంబున నీతోడ నరుగుదెంచి
స్నానమొనరించు నితరజనంబుగూడఁ బాపములనుండి విడువంగఁబడును నేఁడ.

చం॥ చర మచరంబుగా మసెడి సర్వజగంబుల నుండు తీర్థముల్
సరగున వారుణేష్టియగు స్థానముఁ జేరఁగవచ్చుఁ గాన భూ

సురులును క్షత్రియుల్ విశులు శూద్రులు దీక్షితుతోడఁగూడఁదా
మరిగి ప్రయత్నపూర్వముగ నం దవగాహన మాచరింపనా. ౭3౧

ఆ॥ అట్లుగాన సాగరావనీదేవులతోడి భాషణంబు వీడుమింక.
వారుగూడ లేచి వత్తురు నీతోడ నవభృథోత్సవమున నాడుపొంటె" ౭3౨

వ॥ అనినవిని వనజాసనుండు కృతకృత్యుండగుటకు సంతసిల్లి గాయత్రీసహితం బుగం బయనమై జ్యేష్ఠకుండతీరంబునకుఁ జనియె. సురలును భూసురులును బులస్త్యుం డునుం బొంగుచుఁ బుత్రదారసమన్వితంబుగం బోరోగిరముతిండిపోతుతంత్రి వెంటఁ బుణ్యజలావగాహనంబుపొంటెం బోయి. రట్లవభృథస్నానార్థ మరుదెంచి యంబరంబునకు హస్తంబులెత్తెడి యఖిలజనులతోడం గూడి యా పుష్కరతటం బత్యంతసంబాధితం బయ్యె. బ్రహ్మగాని బ్రాహ్మణులోనర్చు వారుజోష్టిగాని యొక్కింతయుం గనంబడక యుండఁ దత్కర్మసమాప్తియందుఁ జతురాననుండు సర్వజనహితముగోరి సన్నిధిని సవిన యంబుగా నిలిచియున్న శతక్రతుం గనుంగొని ౭33

క॥ "ఏతత్సుమర్మమ్మున స్నాతులుగా వచ్చి దవ్వునక్ వర్తిలు నీ
భూతలవాసులు దీక్షాన్వితుఁడనగు నన్నెఱుంగ నేరరు గానక్ ౭3౪

తే॥ వెల్లయేనుఁగుపై నెక్కి వెదురుగడకుఁ జివరఁ దగిలింపు మృదువై నజింకచర్మ
మవభృథస్నానవేళ నమ్మ్యేణచర్మ ముదకములలోనఁ బడ వేయు మోసు లేశ! ౭3౫

ఉ॥ స్నానముసేయువేళయని సర్వజనంబు నెఱింగి యయ్యెడక్
స్నానముఁజేసి పొందుదురు శాస్త్రసమీరితమైన శ్రేయ. మెం
తేనియు దూరసంస్థుఁడును వృద్ధుఁడు బాలుఁడుగూడ నచ్చటక్
దానముసేసి ప్రీతిమెయిఁ దత్ఫలమొందును వృత్రశాత్రవా!" ౭3౬

వ॥ అనివారుచ్చుటయు నతండు వల్లెయని వడివడింజని స్త్రైరావతం బధిరోహించి పొడవైన వెదురుగడచివరఁ గృష్ణాజినంబు దగిలించి జలమధ్యగుండై తత్కర్మపరిసమాప్తి యందుఁ బితామహుండు స్నాతుకాముఁడగుచుండ స్వయంబుగా నద్దాని జలంబులం బడవైచె. నింతలో దేవగంధర్వగుహ్యాకులందఱును విశేషించి మనుష్యులును సమా హితులై యందు స్నానమొనర్చి. రంతఁ గ్రతుభుజులతోడం ,గృతస్నాతుండై సవిన యంబుగా నొద్దనిలుచున్న శక్రుంజూచి బ్రహ్మ మఱియునిట్లనియె. ౭3౭

## —♦ బ్రహ్మ యింద్రాదులకు వరములిచ్చుట. ♦—

ఆ॥ "నీవు నడుముగట్టి నిలుచుండి శ్రద్ధ నీక్రతువునందుఁ జాలఁ గష్టపడితి.
కన్నెమిన్నయైన గాయత్రిఁ దోడ్తెచ్చి నాకుఁ బెండ్లిచేసినావుగూడ. ౨౩౮

కం॥ కావున యూమ్మదభీష్టంబావర మర్థింపు మిత్తు. నగు భద్రము నీ.
కీ వడుగునది సుదుర్లభమై వర్తిలుఁగాక. తప్ప నాడినమాటల్" ౨౩౯

వ॥ అనియిట్లు పలుకుటయు నింద్రుండు ౨౪౦

ఉ॥ "ప్రీతుడవైతివేని కడు పెద్దవరంబు నొసంగ నెంచితే
నేతదహంబునందుఁ బ్రతియేటను నేనుఁగుమీఁద నెక్కి వి
ద్యోతితమస్కరాగ్రమునఁ దోఁచు మృగాజిన మీనుతీర్థమం
దాతతభక్తిఁ జిమ్మ నృపుఁ డయ్యెఁడుగాక గతాఘుఁ డబ్జజా! ౨౪౧

ఆ॥ సకలశత్రువుల కజయ్యుఁడై యా రాజు వ్యసనములకు నెపుడు వశుఁడుగాక
యుండవలయు నెంతయును సుఖంబుగ దేవ! యిదియె మాకుఁ గీన మీప్సితంబు

తే॥ అన్యు లెవరేని యీతీర్థమందు వచ్చి తన్మృగాజినయుతముగం దానమాడ
వర్షకృతమైనపాపంబు వారలకును లేకపోవుటగాక నిలింపవంద్య!" ౨౪౩

వ॥ అని ప్రార్థించుటయు బ్రహ్మదేవుండు వెండియు నిట్లనియె. ౨౪౪

ఆ॥ "ఈత్వదుక్తమెల్ల నీప్రకారంబుగా నగును. నేనునుం దథాస్తటంచుఁ
బలికినాఁడ. దీనఁబడకుము సందేహ మెంతమాత్ర మింద్ర! యీవు మతిని. ౨౪౫

శా॥ ఈయానర్తము నేలునట్టియొడయం డీనాడుకుండంబుదా
డాయన్ వచ్చి తటస్థుడైన నను వేడ్కం గొల్చి యేనుంగుపై
హాయిం జక్కఁగఁ గూరుచుండి జలమధ్యంబందునన్ జింకతోల్
వేయంగల్గ జయంబునొంది మిగులన్ విఖ్యాతుఁడౌ ధారుణిన్. ౨౪౬

కం॥ ఇకార్యంబున కారయ నక్కార్తిక బహుళపక్షమందలి ప్రతిప
త్తిక్కడు ప్రశస్త. మందునుజక్కఁగఁ గుతపంబె చూచి చలుపఁగవలయున్. ౨౪౭

కం॥ ఆమఱుదినమున జనములు నేమంబునవచ్చి యిచట నీరాడినచో
నామయముఁబాసి యొకసకుఁ డామొనరిచినట్టికోలఁ దఱుముదు రవలన్" ౨౪౮

వ॥ అని యిట్లుచెప్పుచుండుటయు ౨౪౯

సీ॥ దైవతంబులకును ధన్వంతరికిఁగూడ నచికిత్స్యమైయున్న యట్టిదియును
నల్లగా జీడిగిన్జవిధంబునం దోఁచు పుట్టంబు మెయినిండఁ గట్టినదియుఁ
ద్రోసినంతనపోయి తొంబదిచోటులం బడునట్లు కృశియించి మిడుకునదియు
నడవలే కడుగులో నడుగువెట్టుచు నొక్క దండంబు నూఁతగాఁ దాల్చినదియు
నైన యక్ష్మాఖ్యరోగ మం దరుగుదెంచి తుమ్ముచును శ్లేష్మముం దనతోడనుంచి
తద్విరించి సమీపించి తనువు వంచియొంతయు నమస్కరించి తా నిట్టులనియె. ౨౫౦

క॥ "నీవిటు యజ్ఞమొనర్చుట దేవా! దూరమున నాకుఁ దెలియంబడుచుఁ దా
వావిరి నిప్పటికేటులో యేవచ్చినవాఁడ నిటుకు. నేమందు నీకన్. ౨౫౧

ఉ॥ ఇందుఁడు దక్షపుత్రికల నిర్వదియేడ్గురఁ బెండ్లియాడి ము
న్నం దొకరోహిణీసతిని యక్కునఁజేర్చి రమింప నల్గి యా
చందురునిన్ గ్రసింపుమని చయ్యన నన్ను సృజించె దక్షుఁ. డీ
చందమతండు చెప్పుకొన శంకరుఁ డక్కటికంబుఁ జూపుచున్ ౨౫౨

తే॥ ఒక్కపక్షమె చంద్రమునోడలునీకుఁ గబళమయ్యెడుఁ బొమ్మనెఁ. గడమపక్ష
మునను దినుటకు నెదియును గనఁబడమిని బిట్టు కృశియించుచున్నాఁడ నిట్టు నేను. ౨౫౩

క॥ జన్నము ముగిసినపిదపం జిన్నగ బ్రాహ్మణుని దనిపి తృప్తోస్మియటం
చన్నుడి తన్ముఖంబున విన్నఁగదా యమ్ముఖంబు విశగావుండున్. ౨౫౪

ఆ॥ ఏమఖంబుచివర నెంతేని తర్పితుండై ద్విజుండు తృప్తయని యనండో
యామఖంబు పుడమి వ్యర్థంబె యయ్యెడి నెన్నికోట్లధనము లీయఁబడిన. ౨౫౫

తే॥ అన్ని విధముల బాగుగానైనయట్టి యీయమ్మదధ్వరమునను మృష్టాదనంబు
పెట్టి తృప్తోస్మియని యనిపింపుమయ్య యాగమొత్తంబు నెంతయు నాదరించి"
వ॥ అనియిట్లు దీనవదనంబున యాచించుచుటయు నంబుజాసనుండు ౨౫౬

చం॥ "ఇదిమొదలాహితాగ్నులగు నెల్లమహీసురులున్ ధరాస్థలిన్
ముదమున వైశ్వదేవవిధి ముఖ్ బలులిచ్చి యమర్త్యకోటికిన్
దనుపరి నీకు నిచ్చెదరు. దాన నగుం బరితృప్తి. గాన నా
సదయుల తత్కులోద్భవుల చక్కికి నేగకు మెంతమాత్రమున్" ౨౫౭

—• యక్ష్మ తీర్థోత్పత్తి. •—

వ॥ అని వాక్రుచ్చుటయు మరల యక్ష్మమిట్లనియె. ౨౫౮

ఆ॥ "భారతీకళత్ర! భవదీయమైనట్టి తీర్థమందుఁజేరి తిన్న నేను
దపముఁ జేసికొనుచుఁ దనుయాత్రఁగడపెద. నాజ్ఞయిమ్ము వేగ నందుకొఱకు"
వ॥ అనవుడు బ్రహ్మదేవుండు వెండియు

ఆ॥ అట్టులైన నాంతయాశ్రమం బన్యత్ర యమరిపించుకొనుము యక్ష్మగదమ!
యడుగు మీద్విజాళి నభిమతస్థలమింత జన్నమునకు నేను మున్నవోలె" ౨౬౦

వ॥ అనినవిని చమత్కారపురధరణీసురులం బ్రార్థించి వారివలనఁ గొంతనేల యార్జించి యం దాశ్రమంబు నేర్పఱచుకొనియె. నచట భానువాసరప్రయుక్త ప్రతిపద్దివసంబున స్నాతుఁడైన యక్ష్మసేవితుం డద్దానిచే విడువంబడియెడు. నిప్పటికిని నందది కనుపట్టు. సకలాహితాగ్నులకును విశేషించి నాగరులకును దానియెడల నమ్మకంబు గలదు. కలికాలంబువచ్చినను వారికిని వారియుండ్లనుండు చతుష్పాత్తులకును దత్తయ

లోగంబు సంప్రాప్తింపదు. ప్రాప్తించినను దర్భాద్యంబునకుఁ దక్కుండదజలస్నానంబె నివారకంబుగాని మందులతోడను మంత్రంబులతోడను వైద్యులతోడను బనిలే"దని యిట్లువక్కాణించుటయు శౌనకాదులిట్లనిరి. ౧౬౩

—♦ సావిత్రి యజ్ఞమంటపమునకు రా నపశకునంబులగుట. ♦—

సీ॥ "శాంతచేనారదమౌని కుటిలవాక్యములుచెప్పి సావిత్రి రాకుండఁజలిపెననియు
నల పులస్త్యుఁడుపోయి పిలుచునప్పటికి కావె పనిచేసికొను చింత మనియెననియు
నలిగి యంతట బ్రహ్మ యాభీరకన్యక నాక్షణమున నె పెండ్లాడెననియు
సురలు భూసురులు నా సుదతిఁ బెద్దగఁజేసి గాయత్రియని పిల్వఁగడఁగిరనియు
నన్నియును నైనతరువాత యజ్ఞశాలకరుగుసావిత్రి భూదేవు లాఁగిరనియుఁ
జెప్పితివి.యందు సవతియున్నప్పుడటకు నెంచులకుఁబోయెసావిత్రి యెఱుఁగఁజెపుము"

వ॥ అనియిట్లుప్రశ్నించుటయు సూతుండు ౧౬౪

కం॥ "సావిత్రి తనకుఁ బెనిమిటి కైవసమైయుండెననుచుఁ గడునమ్మి సుహృ
ద్భావమున స్వస్థమానసయై విబుధాంగనలనెల్ల నాహ్వానించెన్. ౧౬౬

సీ॥ మంగళదేవతామహిళయు సర్వమంగళయును బిడౌజు సుగ్మలియు క్షమయు
స్వాహాభిధానయు స్వధయు నరుంధతీసతియును మేధయున్ జలజముఖియుఁ
బుష్టినామకయును బుద్ధియుం గీర్తియు ధృతినామధేయయు పతిరతయును
నూర్వశీ రంభా తిలోత్తమా ద్యప్సరోనారీజనంబుల వారములును
హర్షమునను సుహాసునహాస్తలగుచు వచ్చుటయు లేచి సావిత్రి వారితోడఁ
బ్రీతి గంధర్వకిన్నరగీతవాద్యసహితముగను బ్రయాణమా సమయమందు ౧౬౭

వ॥ దక్షిణాక్షిచలించియు ఖగమృగగణంబులు కలకలంబొనరించుచు నపసవ్యంబుగా నడచియు దక్షిణాంగంబు లదిరియు సావిత్రికి మనఃక్షోభంబుగావించె. నది యెఱుంగక ఖిలామరాంగనలును నాయమపార్శ్వంబునం బాడుచుం బాడుచు హసించుచు యథోత్సాహంబుగ యజ్ఞంబున కేనుముందుపోవలె నేనుముందుపోవలెననియన్యోన్యస్పర్థమై నడవందొడంగె. రావాద్యధ్వనులు విని తనతల్లి వచ్చునదిగాఁ దలంచినారదుండటకేగి దీనవదనంబునఁ గనులనుండి నీళ్ళుగాఱ గద్గరస్వరంబుతో నిట్లనియె. ౧౬౮

—♦ సావిత్రికి నారదుఁడు గాయత్రీవివాహవృత్తాంతము చెప్పుట ♦—

ఉ॥ "నేనరుదెంచిపిల్చితిని నిన్ మొదట. లంతఁ బులస్త్యుఁడున్ సమా
హ్వానముసేసె నెంతయును. నక్కట! దీక్షవహించి కంకణం
బూనెడివేళ కేని యటనుండుటకుం జనుదేరవైతి. వో
మానిని! స్త్రీస్వభావమున మంచియుఁ జెడ్డ యెఱుంగవైతి కా! ౧౬౯

కం॥ దీక్షారంభముదాఁకను వీక్షించి త్వేదాగమంబు విను వెత్తుటచే
   నాక్షణమ కన్యకాలకు బుభుక్షుం బంపించె నాత్మభువు జనయిత్రీ! ౨౭౦

ఆ॥ అతఁడుపోయి యొక్క యాభీరకన్యక దివ్యరూప బలిమిఁ దోడితెచ్చి
   గోముఖమునఁద్రోసి గుహ్యామార్గంబునఁ దీసె శుద్ధయగుచుఁ దేజరిల్ల. ౨౭౧

శా॥ దానిం బెండిలియాడుమంచు నెలమిన్ దైత్యారి వాక్రుచ్చె. నీ
   శానుం డాపెకుఁ బేరుపెట్టె సరిపోల్చన్ నీకు గాయత్రియం.
   చానై లింపగణంబు బ్రాహ్మణులు నయ్యాభీరవంశోద్భవ
   స్త్రీనిన్ బ్రాహ్మణిగాను జేర్కొనిరి. యేస్కృత్యుక్తి యట్లుండెనో. ౨౭౨

శా॥ పత్నీధర్మముచేత సంశ నతఁ డాపద్మాక్షి యోజించె నీ
   యత్నంబంతయు వ్యర్థమింక మఱియున్ యజ్ఞోపయోగంబుగన్
   బత్నీశాలకుఁజేర్చి దర్భరశనాబద్ధంబుగంజేసె నా
   నూత్నాభీరకుమారి మంజులకటిన్. నూలెల వాక్రుచ్చుటల్. ౨౭౩

ఉ॥ నిందితమైనయప్పనిని నేను గనుంగొనలే కమర్షమున్
   జెందుచు వెళ్ళివచ్చితి నిసీయని యధ్వరశాలనుండి. యీ
   చందముగు రైటెంగి యెదిశక్యమొ యయ్యదిచేయు. మగ్వాప
   ద్యం దిగనాడు యజ్ఞభువి కమ్మరో! యేగదో యేగఁ గాఁగదో" ౨౭౪

   వ॥ అనినవిని సావిత్రీదేవి ౨౭౫

సీ॥ మొదలంటఁదెగినట్టి మృదువల్లిచాడ్పున మంచునఁదడియు పద్మలతభంగి
   వల్లభచ్యుత చక్రవాకివిధంబున జలవర్జితంబైన సరసిమాడ్కి
   సంక్షయంబునుజెందు చంద్రలేఖాకృతి మృగమునుబాసిన మృగివడువున
   నాతభూమిపతియైన తత సేనమాదిరి విగతభర్తృకయైన వెలఁదికరణి
   నెండిపోయిన మల్లెపూదండపగిది దూడచచ్చిన యాఁబెయ్యజాడ మిగుల
   వాడఁబాఱిన మొగముతో వైమనస్య మొనసి కదలక నిలుచుండె నేమిగల ౨౭౬

   వ॥ అట్టియాయమ నవలోకించి యమరాంగనలు నారదునితో నిట్లనిరి. ౨౭౭

కం॥ "చీచీ! కలహప్రియ! నీవాచాలత రాగయుతకు వైరాగ్యంబున్
   మూచూపె. దీనఁ గలిగెడి నాచతురాస్యునకు నీపె కంతర మింకన్" ౨౭౮

   వ॥ అంత హైమవతి సావిత్రిదిక్కుమొగంబై ౨౭౯

చం॥ "ఇతఁడు కలిప్రియుండు జగదీశ్వరి! సత్యమసత్య మాడెడిన్.
   బ్రతిదిన మీమకర్మమునఁ బ్రాణములన్ ధరియించుచున్నవాఁ.
   "డతివరో! నీవు నావలన నాత్మహితంబును గోరెదేని సం
   తతమును నారదర్షి నుడి నమ్మకు" మంచు వచించె శూలి మున్. ౨౮౦

ఆ॥ అదియెయాది యీమహానుభావునిమాట యించుకంతయేని యేనునమ్మ.
   నట్లుగాన నీదుప్రాణేశుఁడుం డెడియెడకె చనుద. మేల యాగుదెమ్మ. ౨౮౧

క౦॥ స్వయముగ నచటికిఁజని తత్క్రియమాణముగాంచి యహ్హకృత్యంబును నా
రయవలయుఁగాని కలహప్రియయౌ నుడివిని యిటు నెయుంటు బేలతనంబా" ౨౨౨

—• సావిత్రి బ్రహ్మసాలికిఁబోయి దూషించుట. •—

వ॥ అనిన విని సావిత్రి. ౨౨౩

సీ॥ మాటిమాటికి గీయమానమౌ గానంబు కర్ణశూలంబౌచు గాసివెట్ట
మర్దలానకముఖ్యమధురగానములెల్ల బంధ్యవాద్యంబుల భాతిఁదోఁప
దత్రత్య సకలసందర్శనం బాత్మకుఁ బ్రేతదర్శనమట్లు భీతిగొలుప
స్వాంగసంగతమైన శృంగారమంతయు నంగారసదృశమై యగుపడంగ
హర్షరహితయయ్యు నమనస్కతంగూరి ప్రతిపదమునఁ దొట్రుపడుచుఁ గరము
కనులనుండి నీళ్ళు కాల్వలై పాఱంగ నేడ్చుకొనుచుఁ బోయి యెట్లొ తుదను

వ॥ కారాగారంబునంబోలెఁ గ్రతుమండపంబునం బ్రవేశించి దృగ్గోచరంబగు
తద్విధమంతయుం దిలకింపఁజాలక దీనవదనయై నిల్వఁబడుటయు నాయమంగాంచి.

సీ॥ వంచినతల యెత్త వలఁతి గా కతిలజ్జ విధి మొగంబును నేలవేసికొనియె.
నట్లధోవదనుఁడై యటునిటుం గదలక స్థాణుండు పేరు సార్థకముఁజేసె.
నేమియుం దెలియని ధీమంతుకైవడిఁ గిమ్మని యనఁడయ్యెఁ దమ్మికంటి.
బొటమన వ్రేలునం బుడమి గుంటపడంగ రాయఁగఁజొచ్చె స్వారాట్టు పెట్టు.
గోళ్ళు గిల్లుకొనుచుఁ గూర్చుండి రటఁగల తక్కనమరులెల్లఁ దద్దభీతిఁ.
జదువుచున్నయట్టి సస్వరవేదంబు వాఁగియుఁగ మొద్దులైరి ద్విజులు. ౨౨౬

వ॥ అంత సావిత్రి సపత్నీసహితుఁడగు స్వపతింగని కనులెఱ్ఱఁజేసి ౨౨౭

తే॥ "ముదకఁడా! నీకు మిక్కిలిముగ్ధయైన గొల్లదానివివాహంబు గూడునొక్కొ?
దాని యిరుపక్షముల స్త్రీల ధవులుగూడ మాఱుమనువులఁబడసినవారు చూడ.

తే॥ పసరములువోలె యత్కులప్రభవపురుషు లక్కచెల్లెండ్రఁ దల్లులం దక్కఁ దక్క
స్త్రీలనందఱ సేవింత్రిసీయనంగఁ దత్కులోద్భవఁ బెండ్లాడఁదగునె నీవు?

మ॥ తృణముల్ మేయును నీరుద్రావెడిని తుత్తృష్ణోపశాంత్యర్థ మం
గణముల్ మూత్రపురీషముల్విడిచి నానాభ్రష్టముంజేయు ను
ల్బణభారోద్వహనంబొనర్చు శ్రమముం బాటింపకుండం బనుల్.
కణమాత్రంబును నుండియుండ దరయన్ జ్ఞానంబు తజ్జాతికిన్. ౨౩౦

ఉ॥ అట్టులె దీనిజాతియును నంబలిచల్లలఁ బొట్టనింపు లే
పుట్టుటకుంగలట్టి పృథుభోగముగా మదినెంచి మూత్రియున్
విట్టు నెకెట్టొ భూమిపయి వీడెదుఁగాని యెఱుంగ దెద్దియున్.
గట్టిడి వెఱ్ఱిగొల్లలకు జ్ఞాన మదెచ్చటినుండి వచ్చెడిన్. ౨౩౧

క౦॥ కడజాతివాండ్రుసహితం బోడఁబడి యొనరింపలేని యొడుదుడుకుపనుల్
జడియక చేతురు గొల్లలు బడుగా? యటుగాన నేమిపనిసేసి తిసీ! ౨౩౨

తే॥ క్రొత్త పెండ్లముతోడనే కూరుచుండి జన్న మొనరింపవలెనన్న జగతి ఖ్యాత
యైన బ్రాహ్మణకన్యఁ బెండ్లాడరాదె మోసగాఁడవుపో వృథాముండ! నీవు. ౨౩౩

—♦ సావిత్రి బ్రహ్మను శపించుట. ♦—

ఉ॥ శౌచవిహీన మున్న పలుశయ్యలఁజేరి క్షతాత్మయోనియై
రోఁచెలిమించియున్న యఘరూపిణి యీయమ గొల్లపిల్ల. యా
నీచను జెట్టఁబట్టుటను నీకిఁకఁ బుట్టును గొల్లపిల్లయే.
యోచతురాస్య! యంత్యజయు నుద్భవిలుఙ్ క్షతయోని యోర్తటఙ్. ౯౪

కం॥ పితృమాతృశ్వశురుల సంతతులను నుడికింపఁగలరు తత్కన్యలు. గ
ర్హితమగు నీకృత్యంబున క్షితిపయి నీ కింకఁ బూజసేయరు మనుజుల్. ౯౫

కం॥ నామాటను యాథార్థ్యం బేమాత్రంబైన నుండెనేని నినుం బూ
జామానితుఁజేసినజను లీమహిని దరిద్రులగుదు రెంతయు వేధా! ౯౬

కం॥ ఈరోఁతచేఁతయొనరిచి యేరీతిని సిగ్గుపడక యిఁకనొక పెదగన్
బేరోలగముం దీర్చెద. హారా! యొంతటికి నైన వతిసాహసివే. ౯౭

తే॥ పుత్రులయుఁ బౌత్రులయు నీదు మిత్రములగు తక్కుసురలయు భూసురతల్లజులయు
దలలు నేలనుబడియె నీసలిపినట్టి సంకరపుఁజైదమునఁజేసి సత్యముగను. ౯౮

కం॥ ఉండదు నీదోషం బిటు ఖండితముగ. లజ్జ లేదు కాముకులకు. నె
ట్లుండును కృత్య మకృత్యము రెండును గుర్తెఱుఁగనట్టి స్త్రీలోలలకున్. ౯౯

ఆ॥ మిత్రు శత్రువునిగ శత్రుని మిత్రుఁగం గృత్యముం గరంబకృత్యముగ న
కృత్యమైనదానిఁ గృత్యంబు గానెంతు రకట! కాముకులు జడాత్ములగుచు. ౧౦౦

ఆ॥ జూదగానియెడల సూనృతముంబోలెఁ గన్నగానియెడలఁ గరుణభంగి
మేదినీశునెడల మిత్రత్వముంబలెఁ గామియెడల సిగ్గు గగనకుసుమము. ౧౦౧

కం॥ లవణసముద్రము మధురంబవుఁగా కవుఁగాక చంద్రుఁ డత్యుష్ణతనుం
డవుఁగాక యగ్ని చల్లని. దవునే కాముకుఁడు లజ్జితాత్ముఁడు జగతిన్. ౧౦౨

ఆ॥ సవతిపోరు నాకు సంఘటించుటకుఁగా వగవ నాత్మయందు మిగుల నేను.
బురుషవరులు వేలపూఁబోండ్లఁ బెండ్లాడుదురు స్వతంత్రులగుట దోషమేమి. ౧౦౩

మ॥ వలపుం బట్టఁగలేకయున్నఁ జని సద్వంశంబునంబుట్టు బు
ద్ధల నీవున్ నిజజాతికన్యకల మీఁదం బక్కలన్ వేసినా.
మ్మల వేశ్యాంగనకట్టు పెక్కురుమగం డ్రిద్దానికిం జూడ. దు
ష్కులజం బాదృశఁ బెండ్లియాడి. అదిరయో శోకంబు నా కెంతయున్. ౧౦౪

ఆ॥ కాన సిగ్గువిడిచి కామలుబ్ధుండవై మనెదు నీదు పేరు మామకీన
మైన శ్రవణయుగళమందువఁ బడవట్టి స్థలముగూర్చి యేగుదాన నేను. ౧౦౫

చ॥ వనుఁబిలిపించియిచ్చుటికి జాసరివారగు వేల్పుటాంఁడ్రయున్
ఘనులయినట్టి వేల్పులయు క్ష్మాసురవర్యులయున్ సమక్షమం
దునఁ గడు బోసగించితివి తుందుడుకొప్పఁగ. నట్లుగాన నే
జనుఁడును నీకుఁ బూజనము సల్పకయుండునుగా కిఁకన్ విధీ! ౯౦౬
ఆ॥ ఈయహంబునుండి యే బ్రాహ్మణక్షత్ర వైశ్యశూద్రజనము వచ్చినీకు
మంత్రపూజసేయు మహిని దారిద్ర్యసమన్వితంబగుం దదన్వయంబు. ౯౦౭
క॥ ఈగొల్లపిల్ల చీయన నేఁగూర్చుండెడిస్థలమున నే కూర్చుంటన్
దాఁ గనదు సంతు. దివిజస్త్రీగణముంబోలె స్త్రీలు సేవింప రిలన్. ౯౦౮
సీ॥ అగ్గలంబగుదుఃఖ మందెడు నిద్దాని సేవించినటువంటి సింహమధ్య.
గొడ్డుదై యవమతింగుడిచెడు నిద్దానిఁబూజించినటువంటి పూవుఁబోఁడి.
మహితదౌర్భాగ్యయై మనియెడు నిద్దానివర్ణించినటువంటి యంబుజాస్య.
యత్యంతపాపిష్ఠ యయ్యెడు నిద్దానిగౌరవించినయట్టి కలభయాన.
పంచభర్తృకయగు దీనిపగిది దీనిఁగొలుచుచెలి నష్టచరిత్రయై చెలువుదొలఁగి
కర మపఖ్యాతిగాంచెడు ధరణిలోన నాదుశాపంబుదగిలి యీనాఁటినుండి. ౯౦౯
సీ॥ సత్యశౌచములకుం జాలదూరంబుగా వర్తించు నిద్దానివంశమెల్ల.
శిష్టసాంగత్యంబు స్పష్టంబుగానుండ దవనిపై నిద్దానియన్వయమున.
కిల్లువాకిలిలేక యెల్లకాలంబును వనములమను దీనివంగసంబు.
ఆవులఁదెగసమ్మి యాత్మలం బోషింతు రిద్దానిజను లెద్దుమొద్దులగుచుఁ.
బాపభూయిష్ఠులగుదు రీపంచభర్తృజాతిజనులందఱును. నట్టి నీతి నేమ
మూరునుం జేరు లేని యవ్వారలెల్లఁ జుట్టములువో నిశాచర! కట్టకడకు" ౯౧౦
వ॥ అని బ్రహ్మను బతివ్రతయైన గాయత్రిని శపించి ౯౧౧

—• సావిత్రి ఇంద్రాదుల శపించుట. •—

శా॥ "ఓహో వాసవ! పంచభర్తృయగు నీయోషాధమం దార్చి బ
ల్సాహాయ్యంబునుజేసితివు విధికిన్. శత్రుల్మనుం గల్చి నీ
బాహుద్వంద్వము నుక్కుసంకెలలచే బంధించి కొంపోయి ని
ద్రాహారంబులులేకయుండునటు కారాగారమం దుంత్రుపో. ౯౧౨
ఆ॥ వాసుదేవ! నీవువచ్చి నామగనికిం బంచభర్తృతోడఁ బాణిపీడ
నమున కనుమతించినా. వట్లుగావున భృత్యుఁడగుముపోయి పెరల కింక. ౯౧౩
చ॥ సవిధమునన్ వసించియును శంకర! యిప్పుని కూడదంచుఁ జె
ప్పవయితి. మూఢ! యిప్పగిది భావ్యమె యూరకయుంట. కావునన్

శ్రీవణ మొనర్పు నాదునుడీ. నాకు వియోగము జీవమానుఁడౌ
భవునిదే కాని నీకు మృతదారవియోగము సంభవించెడిన్. ౯౧౪
ఆ॥ ఏ మఖంబులోన నీ పంచభర్తృక సోమిదమ్మయగుచు నేమమూని
నా మఖము హవిస్సు నత్యంతచపలత నడి గ్రహించుచుంటి వహ్ని! నీవు. ౯౧౫
తే॥ కాన దుష్టసమాచార! కమ్మ సర్వభక్షకుండవు. స్వధతోడ స్వాహతోడఁ
కూడి దుఃఖంబె సర్వదా కుడుతుగాని మునుపటట్టుల సౌఖ్యంబు నెనయవింక.
శా॥ ఈ భూదేవులు పంచభర్తృకను దా మెంతే ఘనంజేసి దు
ర్లోభావిష్టత బ్రాహ్మణీసతిఁ జేర్కొంచుం గదుర్ ప్రేల్చినా.
రాభీరాదిజఘన్యజోపపతులన్ స్వాధ్యాయవిక్రీత ల
గ్నాభావంబుగలాగు నయ్యెదరు వీ రాదోషభూయిష్ఠతన్. ౯౧౬
కం॥ ఓహో విత్తపతీ! ధనసాహాయ్యము నేసితీవు సవవిప్లవమం
దీ హేతువున నభోగ్యంబా హీనా! పొమ్ము యుష్మద్ధనము నీకున్. ౯౧౭
మత్తకోకిల॥ ఆవిధంబునఁ బంచభర్తృక మైన యీ మఖమందు నే
దేవత ల్గురీతిఁ దోడ్పడి తృప్తిచెందిరొ యట్టి దు
ర్భావు లింతటినుండి తా మసపత్న్యులై కృశియించుకొం
చేవడిన్ దనుజాళిచేత జయింపఁగాఁబడుచుం డ్రిలన్. ౯౧౯
మ॥ మణి నాభీరి సపత్నియంచుఁ జెడునామంబు ల్తమింపాల్చి యో
లెఱిగ శ్రీని కెలంకులందు శివదూతీపూర్వ లున్నారొ యా
పరమద్వేష్యలు వేలువేలఁ బరదృక్పాతంబునన్ లేక యొ
క్కరికిం బోవఁగరాని గట్లకడలన్ వర్తింత్రభోగంబుగన్" ౯౨౦

—శ్రీ సావిత్రి యెంటికాలఁ గొండ యెక్కుట. శ్రీ—

వ॥ అని యింద్రాదులంగూర్చి పలికి కోపోపహతచేతస్కయగు సావిత్రి నూరెల వర్తిల్లు నఖిలదేవపత్నుల విడనాడి లక్ష్మీప్రభృతులచే నివారింపఁబడుచున్నదయ్యు నీ కాముకు నామంబుగూడ వినంబడనియెడకుఁ బోయెదనని యుదఙ్ముఖంబుగం బయనమై యొడను కాలు తటంబున నాపి కుడికాలఁ బర్వతం బధిరోహించె. నిప్పటికిని దద్వామ పాదంబు పాపహారంబును బుణ్యప్రదంబును నగుచుఁ బర్వతరోధస్సునం బరిదృశ్యమానము. పాపసమాచారుండయ్యు నెవఁ డద్దానిఁ బూజించు వాఁడు పాతకనిర్ముక్తుఁడై పరమపదంబుఁ బడయు. నెవ్వఁ డెయ్యది యర్థించి యయ్యది యర్చించు దుర్లభార్థ మైనను వాఁ డవశ్య మద్దానిఁ జెందఁగలఁ. డివ్విధంబునం బతిచేఁ బరాభూతయై సావిత్రీ దేవి పర్వతాశ్రయయయ్యె. నెఱఁడాయుమ నిచ్చవచ్చిన దినంబునఁగాని విశేషించి పార్వ

మాస్యంగాని పూజించు వాఁడు మనోభీష్టంబుల నన్నింటిని బ్రాపించు. భక్తిచేఁ దద
గ్రంబునం దేపెచే నాజ్యంబువోసి రక్తతంతుదీపంబు వెలిఁగింపఁబడు నెన్ని తంతువు
లెన్ని ముహూర్తములు వెలుంగునో యన్ని జన్మసహస్రములు ౯౨౧

సీ॥ సౌభాగ్యసహితయై క్షమఁజెలంగును గాని వికృతస్వరూపయై వెలయదాపె.
పుత్రపౌత్రులతోడఁ బొలుపారెడుం గాని గొడ్డురాలై మదిం గుందదాపె.
యర్థసమృద్ధితో హావణించెడుం గాని దారిద్ర్యమున విధిం దూఱదాపె.
సచ్ఛీలయగుచుఁ దా సంచరించును గాని స్వైరిణియైమనం గోరదాపె.
యింక విధవయయ్యె నేస్త్రీ తదగ్రమం దాటయాడు నాక యపుడు తనదు
తనువుఁబోలె నద్యతనపురాకృతదుష్కృతములఁ గరము పీడితములఁజేయు. ౯౨౨

వ॥ పాటఁబాటినబోటి యాపాట యెన్ని జంతువులు విను నన్ని వేలయేండ్లు స్వ
ర్గసుఖం బనుభవించు. ఫలదానంబొనర్చినచెలువ ఫలసంఖ్యాప్రమాణంబులగు యుగం
బులు త్రిదివంబున వసించు. సావిత్రీదక్షిణపార్శ్వంబున బ్రాహ్మణులకును విశేషించి
ముత్తైదువులకును మృష్టాన్నంబువెట్టిన సిక్థప్రమాణయుగంబులు త్రిదశాలయవాసంబు
చేకురెడి. నొక్క రసంబుతోడను నొక్కయన్నంబుతోడను శ్రద్ధాసమన్వితంబుగా
శ్రాద్ధంబువెట్టిన గయాశ్రాద్ధఫలంబుగలుగు. నాదేవి కుడిప్రక్కఁ గూరుచుండి నిజ
భార్యానీతంబులగు నీరంబులచే సాయంసంధ్యవార్చిన బ్రాహ్మణుఁడు పండ్రెండు
వత్సరంబులు సంధ్యోపాసనచేసిన ఫలంబు పడయఁగలిగెడి. సావిత్రియెదుట నుపవి
ష్టుఁడై జపియించిన మూడువేలయుగంబులు నూటపదునొకొండు పుట్టువులం బొనర్చిన
పాతకంబు నశియించుఁ గావునఁ బ్రయత్నపూర్వకంబుగం జమత్కారపురమునకరిగి
యాదేవి నర్చించునది. విశేషించి నుతియించునది. యీసావిత్ర్యుపాఖ్యానము చదివినను
వినినను సర్వాంహోనివారణంబును సుఖప్రాప్తియు నయ్యెడి. మీరడిగిన సావిత్రీ
మాహాత్మ్య మంతయుం జెప్పితి. నింక నేమినుడువుదు"నని యనుటయు ఋషులిట్లనిరి.

మ॥ "అటు సావిత్రి సకోపయై చనినపై నాధాత గాయత్రి త
క్కటి యాదిత్యులు నేమిచేసిరి ? యుపేక్షం బూనిరా ? లేక యా
ర్భటి నేమేని పొనర్చిరా ? మఱియు శాపగ్రస్తులౌ వేల్పు ల
చ్చటు నెట్లుండినవార ? లార్య ! కరుణన్ సర్వంబు వాక్రువ్వవే" ౯౨౪

వ॥ అనియడుగుటయు సూతుండు ౯౨౫

—• గాయత్రి సావిత్రిశాపమును మరల్చుట. •—

కం॥ "సావిత్రి యీవిధంబున దేవత లందఱిని బ్రువ్వఁదిట్టిచనుటయున్
భావనయా గాయత్రీదేవి సరవిలేచి యంత ధృతి నిట్లనియెన్. ౯౨౬

కం॥ "సావిత్రియన్న మాటను నేవిధమున నోయొనర్ప నెవ్వరివశమా.
దేవాసురలోకటకుఁగా. కావాక్యము కార్యకారి యయియే తీరున్. ౨౭

సీ॥ భూరిపాతివ్రత్యమునకంతటికిఁగూడ ననపాయకరమైన యాశ్రయంబు
గలశపాథోనిధికన్యక మొదలైన తద్దేవతాంగనాతతికిఁ బెద్ద
స్వారాట్పురోగమ సర్వగీర్వాణులకన్వహం బత్యంత మర్చనీయ
స్తవనీయతమములౌ సద్గుణంబుల కెల్ల నబలాజనంబునం దగ్రగణ్య
యమ్మహాభాగ సావిత్రి. యాత్మధవుని దిట్టు టేలన నయ్యది స్త్రీస్వభావ.
మలఘువజ్రప్రహారంబునై నఁగాని నైఁచు నాడుది. నైఁపదు సవతికథను. ౨౮

ఉ॥ నాకొఱకై శపింపఁబడినారు సురల్ ద్విజవర్య. లట్టినున్
శ్లోకుల ముప్పదిర్వకయు చూచియుఁ జూడనియట్టులుంట యొం
తో కఠినంపుఁజేఁత యది. యోవిబుధాగ్రణులార! కావునన్
మీకిపుడేను శక్యమగు మేలొనరించెద సంతసింపుఁడీ. ౨౯

ఆ॥ వసుమతీసురాది వర్ణచతుష్టయప్రజ కపూజ్యుఁడనియె బ్రహ్మ నామె
ధర్మకర్మమెదియు ధరణి బ్రహ్మస్థానమునను బ్రహ్మలేక కనదు సిద్ధి. ౩౦

తే॥ కృష్ణునర్చనమున నేసుకృతముగలుగు లింగపూజను నెద్దిపొసంగు ఫలము
సార్వకాలికబ్రహ్మదర్శనమువలన నబ్బు దానికిఁగోటిరెట్లధికఫలము. ౩౧

తే॥ పర్వకాలంబులం జేయఁబడినయట్టి బ్రహ్మదర్శన మత్యంతఫలదమగును.
డెందమందున సందేహమొందవలసినంతపని గానఁబడ దేతదర్థమందు. ౩౨

కం॥ నీవును విష్వక్సేనా! యావిడయనినట్లు నరుఁడవైన నగుదుగా.
కావడిఁగూడఁ బరార్థమె సేవించెద వొరుల సొంతసేఁతయుఁగాకే. ౩౩

ఆ॥ రెండురూపములుగ వ్రేపల్లె పావనంబొనరుపంగ వృద్ధినొంది దచట.
నొకటి కృష్ణనామ మొండర్జునాఖ్యమై ద్వివిధరూపములును దేజరిల్లు. ౩౪

తే॥ ఆ భవద్రూపమేదైన యర్జునునకు సలిపి సారథ్యమును బార్థసారథియని
పిలువఁబడియెడినీమీఁదఁ బ్రేమగలిగివత్తిలును మామకీనాస్వవాయమెల్ల. ౩౫

శా॥ దానంజేసి శుమ స్తస్తోకదివిషత్సందోహసంశ్లాఘ్యులై
కానల్ మన్కిఁగ నుండునాఁడును మదిం గష్టంబు భావింప కెం
తేనిం బాడియుఁ బంటయుం గలిగి హాయిన్ భూమి వర్తింతు ర
స్మ్యన్వత్కీని మదీయువంశజులు విష్ణూ! నీదు సంగంబునన్. ౩౬

కం॥ ఓహోహో శత్రా! నిను సాహావమున గెల్చి వైరు లాదటఁ గారా
గేహంబునఁ ద్రోసెదరని సాహసమున నల్గి యనియె సావిత్రి వెసన్. ౩౭

ఆ॥ అపుడు బ్రహ్మ తానె యరుదెంచి వడినిన్ను బంధముక్తఁ జేయు భయముపడకు.
మంతఁ బోరఁ జొచ్చి యుపజయంబును బొందు. వింతనిశ్చయం బిఁ కేమిభయము. ౫౩౮

కం॥ అన్నింటిఁ దిండి కాఁడుగ నిన్నును సావిత్రి గాలి నెచ్చెలి! తిట్టెన్.
నిన్ను స్పృశించినయంతన యన్నియుఁ బావనములగును నడలకుమింకన్. ౫౩౯

ఆ॥ స్వాహతోడ సురల స్వధతోడఁ బితరులం దనుపుకొనుచు నీవు ధాత్రిలోనఁ
బూజవడయఁ గలవుపో హవ్యవాహన! మామకీనవాక్యమహిమవలన. ౫౪౦

ఉ॥ రుద్ర! ప్రియావియోగమున రూపఱదంచు శపించె నామె ని.
న్నద్రికుమారి గౌరియను నాయమ వెన్కటిభార్య కొక్కఁడౌ
భద్రగుణాఢ్య యింకనొక పంకజలోచన భార్యయై భవ
చ్ఛిద్రములెల్లఁ బోవణఁచు. చింతిల కింతయు సంతసింపుమా" ౫౪౧

వ॥ అని శాపగ్రస్తుల కందఱికిని దన్నివృత్తిపూర్వకంబుగా వరంబులిచ్చి మరల
మౌనమవలంబించి కూరుచుండుటయు సర్వదేవర్షులును ౫౪౨

## —• దేవతలు గాయత్రిని స్తుతించుట. •—

కం॥ ఏతద్దేవిని గొలుతురు భూతలమున మనుజులింకఁ. బూర్వము ధాతన్
బ్రీతుం జేసి పిదప నీమాతం బూజింప మోక్షమార్గము దొరకున్. ౫౪౩

కం॥ ఏవనిత మగనిఁ గలసినయావల గాయత్రి కాళ్ళ కభివందనమున్
గావించునో యావనితకుఁ గావలసినయంత సంతు గలుగును జగతిన్. ౫౪౪

తే॥ వంధ్య దుర్భగ యమ్యు సేవనరుహాక్షి శ్రద్ధ గాయత్రి సేవించు సర్వకామ
సౌఖ్యయుతయును ధనధాన్యసహితయు నయి ధరణిఁ జెలఁగెడి నాయమ తప్పకుండ"

వ॥ అని ప్రశంసించి"రనిసూతుండు వక్కాణించుటయును ౫౪౬

కం॥ గోదానాదికతోషిత భూదివిజజనసమూహా! పోషితదీనా
నాథాదికసందోహా! యాదవరగ్రామనిర్మితాత్మసుగేహా! ౫౪౭

గద్య॥ ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్షసంప్రాప్తకవితాసాహిత్యనిధాన
హారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబికా గర్భశుక్తి
ముక్తాయమాన విద్వత్సభావిష్కృతావధానవిధాన
జానపాటి పట్టాభిరామాభిధాన సమాంధ్రీ
కృతంబగు శ్రీస్కాందమహాపురాణాంత
ర్గత నాగరఖండంబునందు
సప్తమాశ్వాసము





# నాగరఖండము.

## అష్టమాశ్వాసము.

కం॥ శ్రీరామభీమహానుమద్ధీరత్రయపితృపదీయ ! ధిక్కృతబలవ
ద్వైరిసముదాయ ! విద్వత్పారంభసహాయ ! శ్రీ పరాంకుశరాయా ! ౧
కం॥ అవధారు. సూతుఁగనుగొని సవినయముగ శౌనకాదిసంయమివర్యుల్
నవనవముగ మది నుద్భవమవు సంశయ మెడల నిట్టులని రొక్క మొగిన్. ౨
కం॥ "పంచాస్యుఁ డాక్షేత్రము నెంచి మహీదైవతముల కిచ్చిన వెనుకన్
బంచోత్తరశతసంఖ్యావిరించులు చని రిప్పటికి సరిగవని యునవే ! ౩
తే॥ అట్టు లాక్షేత్రమును నాగరావనీసురుల కొసంగిన దీశంకరుండో లేక
యితరుఁడోయని సందేహ మెరుపడియె. దానిఁ దీర్పంగదయ్య సూతా ! వినీత ! ౪
తే॥ అమ్మహేశ్వరు నాయువ్య మద్ది యెంతో యాలకింపంగ వేడుకయయ్యె మాకు.
నతనియాయువు హరియాయు వజునియాయు వోజ వివరింపఁగదవయ్య యుచితకయ్య"
వ॥ అనియిట్లుప్రశ్నించుటయు సూతుండు ౬

### నిమేషాది కల్పాంతపర్యంత కాలప్రమాణము

తే॥ "ఏనుమీకువచింతు మునీంద్రులార ! యవహితులరయియుండలు నాలకింపుఁ.
డజునియాయువు హరియాయు వవ్విధమున శివునియాయువుఁ గీర్తన సేయువాఁడ. ౭

వ॥ నిమిషములోని నాలవభాగము త్రుటియనంబడు. రెండుత్రుటులు లవమును రెండులవములు కలయుఁ బదియేనుకలలు కాష్ఠయు ముప్పది కాష్ఠలు కలయు ముప్పది కలలు క్షణమును బన్రెండుక్షణములు ముహూర్తమును ముప్పదిముహూర్తము లహోరాత్రమును ముప్పదియహోరాత్రములు మాసమును రెండుమాసములు ఋతువును మూఁడుఋతువు లయనమును రెండయనములు సంవత్సరమును మానవుల కయ్యెడు. నా సంవత్సరములోని యుత్తరాయణము పవలును దక్షిణాయనము రాత్రియు నై దేవతల కొక్కయహోరాత్రమగుఁ. బదియేడులక్షల యిరువదియెనిమిదివేల మనుష్యవత్సరముల కొందటిదగు కృతయుగంబును బన్రెండులక్షల పదిరాఱువేల వత్సరంబుల రెండవది

యగు త్రేతాయుగంబును నెనిమిదిలక్షల యిరువదినాలుగువేల వత్సరంబుల మూఁడవది
యగు ద్వాపరయుగంబును నాలుగులక్షల ముప్పదిరెండువేలవత్సరంబుల నాలవదియగు
కలియుగంబును నిర్దిష్టంబు. ఈయుగచతుష్టయము వేయిమాఱులుతిరిగివచ్చిన బ్రహ్మ
కొక్కదినంబగు. నట్టిదినంబుల ముప్పదింట నొకమాసంబును నట్టిమాసంబుల పండ్రెం
డింట నొకవత్సరంబును గా బ్రహ్మ యట్టిసంవత్సరములు నూఱుగువఱకు జీవించు.
బ్రహ్మసంవత్సరము విష్ణువున కొక్కదివసమయ్యెడి. నాయనయు నిజమానంబున నూఱేండ్లు
జీవించు. విష్ణుసంవత్సరము శివున కొక్కదినంబగు. నాశివుండును బూర్వోక్తక్రమం
బున వర్షశతంబుజీవించు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులకును గంధర్వోరగ రక్షఃప్రముఖ
సర్వదేహులకును నొక్కొక్క యహోరాత్రమున కిరువదియొక్కవేయి యాఱునూఱు
ల యుశ్వాసనిశ్వాసములు నడుచుచుండు. నా యుశ్వాసనిశ్వాసము లొక్కపలమును
నఱువదిపలము లొక్కనాడియు నఱువదినాడు లొక్కయహోరాత్రమును నయ్యెడి.
సదాశివుని యుశ్వాసనిశ్వాసములకు లెక్కలే. దందువలన నతం డక్షయుండనంబడియెడి.
నెవరు బ్రహ్మజ్ఞాన సహితులై సదాశివుని బొందుదురో వారు నక్షయులయ్యెదరు.
సత్యముచెప్పుచుంటి" నని నుడువుటయు శౌనకాదు లిట్లనిరి. ౮

కం॥ "నూఱేండ్లునిండుటయు నజనారాయణఫాలలోచన ప్రముఖులకే
యారీతి నాశ మొదవిన నేరీతిని ముక్తిగలుగు నితరుల కింకన్ ? ౯

ఆ॥ అల్పజీవులైన యట్టి మనుష్యులే ముక్తు లగుదురనుచు బుధులు సెప్ప
వారిమాటలెల్ల వమ్మయిపోవంగ నిట్లుచెప్పుచుంటి వేల యార్య ! " ౧౦

వ॥ అని యిట్లడుగుటయు వెండియునూతుండు ౧౧

తే॥ "ఆదియంతములేక సంఖ్యావిహీనమగుచునుండెడి కాలమం దజహరీశు
లాత్మశతవర్షసంపూర్తియగుడు నాశమొంది రెందఱో యణువులచందమునను. ౧౨

వ॥ బ్రహ్మజ్ఞానంబుపడసిరేని దేవతలకేకాదు మనుష్యులకును ముక్తిగలుగుటకు
సంశయములేదు. నల్లులు దోమలు మున్నగు పురువులు మనుష్యులచేత గణింపఁబడక
యెట్లు పుట్టి గిట్టుచుండునో యట్లు మనుష్యులును నింద్రాదిదేవతలచే గణింపఁబడక
పురువులువోలెఁ జూడఁబడుచుందురు. దేవతలకు మనుష్యు లెట్లు కీటస్థానమందుండిరో
యవ్యక్త జన్ముఁడగు బ్రహ్మకు దేవతలు నట్లని యెఱుంగునది. బ్రహ్మయు విష్ణువున
కట్లుండెడు. బ్రహ్మవిష్ణువున కెట్లు కీటసదృశమో యట్లవ్విష్ణువును శివశక్తులచేఁ దలం
పఁబడు. నెట్లు విష్ణువా శివశక్తులకుఁ గ్రిమితుల్యుఁడో సదాశివునకు వారును నట్లయ్యె
దరు. యజ్ఞాది సత్కర్మానుష్ఠానంబునఁ బూతచేతస్కులై బ్రహ్మజ్ఞానంబు గడించినఁ
బరాత్పరుఁడగు సదాశివుని జేరెదరు. సంపూర్ణదక్షిణలైనను గేవలాగ్నిష్టోమాది యజ్ఞం
బుల వలన స్వర్గాది లోకంబులకుఁబోయి పృథగ్విధంబగు భోగంబు లనుభవించి తత్పు

ణ్యక్షయానంతరము తిరిగి మహీతలంబునకు వచ్చెదరు. బ్రహ్మజ్ఞానద్వారంబునఁ బరాత్పరుఁగలసిన వారికిఁ బునర్జన్మము సంభవింపదు కావునఁ బ్రయత్నపూర్వకంబుగా బ్రహ్మజ్ఞానము సంపాదించునది. యభ్యాసపరున కొకజన్మమందే జ్ఞానపరిపూర్తి కాక కొఱతపడినను ద్వితీయజన్మంబున ద్విగుణమై తృతీయజన్మంబునఁ ద్రిగుణమై యట్లు ప్రతిజన్మంబున నేకోత్తరాభివృద్ధియగుటయు మెల్లమెల్లన బహుజన్మంబులకేని బ్రహ్మంబునఁగలయు" నని వాక్రుచ్చుటయు మరల శౌనకాదు లిట్లనిరి. ౧౩

క॥ "నరులకు బ్రహ్మజ్ఞానము ధర నెవ్విధమునను గలుగుఁ? దత్సంగతి నీ
వెఱుఁగుదువేని వచింపుము కరుణాదృక్కులను మమ్ముఁ గాంచి మహాత్మా!" ౧౪

వ॥ అనియిట్లు ప్రార్థించుటయు నక్కథకుండు ౧౫

క॥ మానవులకు వెస బ్రహ్మజ్ఞాన మిటుల్గలుగుననుచుఁ జక్క వచింపం
గా నాకు శక్తియెక్కడిది? దేనెఱుఁగక మీకుదాని నెట్లువచింతున్? ౧౬

వ॥ అయినను మత్పిత్రుపదిష్టంబగు బ్రహ్మజ్ఞానకారణంబు వచించెద వినుండు. హాటకేశ్వరక్షేత్రంబున బ్రాహ్మణక్షత్రియకన్యలచే నిర్మింపంబడి బ్రహ్మజ్ఞానప్రదంబులగు రెండుతీర్థంబులుగలవు. తత్తీర్థద్వయంబునం దష్టమీచతుర్దశీదినంబుల నొక్కయేడాది నీరమాడి గర్తమధ్యంబున సుగుప్తంబులై కుమారిచేఁ బూజింపఁబడుచు సుప్రసిద్ధంబులైయున్న పాదుకలఁ బూజించువానికి వత్సరాంతంబున బ్రహ్మజ్ఞానంబుగలుగు. స్వదర్శనఫలంబుగలుగుటకై యాపాదు లందు శక్తిచే నుంపఁబడియుండె. ముక్తికాములగు లోకుల కవి బ్రహ్మజ్ఞానసుఖావహంబులు నాతండ్రి యచటికేగి జ్ఞానవంతుఁడయ్యెఁ. దదాదేశంబున నే నచటికరిగి యొకసంవత్సరంబుండి పాదుకోళ్ళ నర్చింప జ్ఞానంబుగలిగినది. తత్ప్రసాదంబున లోకులవలన నేనువినిన యత్కించిత్పురాణశ్రేష్ఠము నిలిచియున్నయది. భూతభవిష్యద్వర్తమానములఁ దెలిసికొనుచున్నవాఁడ. సూతత్వకారణంబున వేదపఠనంబొకటివిడిచి భర్తృయజ్ఞమునిచాడ్పునఁ దదర్థమంతయుఁ దెలిసికొనుచుంటిఁ గావున ముక్తిగావలెనన్న నచటికరుగుఁడు. స్వర్గప్రదంబులైనను బునరావృత్తికారకంబులగు నీసత్రంబులవలన నేమిగానున్నది? సంవత్సరాంతంబున బ్రహ్మజ్ఞానంబుగలుగుఁ గాన నందుఁజని మనుష్యులకు సిద్ధిదంబులగు పాదుకలం గొల్వుఁ"డని యనుటయు మఱియు మహర్షులిట్లనిరి. ౧౭

ఉత్సాహము॥ బాగుబాగ హోమహాత్మ! ప్రాకటోపదేష్టవై
లాగితివి భవాబ్ధినుండి లలిని దరికి మమ్ములన్.
సాఁగుచున్నయట్టిదీర్ఘసత్రముల్ ముగించి వే
వేగ మేముగూడ నటకు వెళ్ళఁగలము ప్రీతిమై. ౧౮

## —• బ్రహ్మక్షత్రియకన్యల వృత్తాంతము. •—

ఆ॥ హాటకేశ్వరమున నవనీసురావనీనాథపుత్రికలు ఘనంబులైన
తీర్థములను రెండు దిట్టలై నిర్మించిరని వచించియుంటి వనఘ! నీవు. ౧౯

ఉ॥ కారణమేదొ పెద్దగను గానఁగరావలెఁగాదె కన్యలై
ధీరులకే యశక్యమగు తీర్థములన్ రచియింపఁ. గాన న
వ్వారికథన్ సమగ్రముగ వర్ణనఁజేసి తదీయపాదుకా
భూరిమహత్త్వమంతయు సుబోధముసేయుము రోమహర్షణీ!" ౨౦

వ॥ అనవుడు వెండియుసూతుండిట్లనియె. ౨౧

తే॥ "తొల్లి ఛాందోగ్యుఁడను పేర దొడ్డబ్రాహ్మణుండొకండుండె నాగరతండమందుఁ.
దనదుగోత్రంబునంబుట్టు ధరణిదేవులెల్ల ఛాందోగ్యులను ఖ్యాతి నెనయుచుండ. ౨౨

వ॥ కృత్స్నసామవేదవిదుండై గృహస్థాశ్రమమందుండు నాఘూసురున కపర
వయస్సున ౨౩

సీ॥ గుణములన్నింటికిం గుదురైనమణిపేటి యఖిలలక్షణముల కాలవాల
మరవిందసుందరాత్యంత విశాలాక్షి లలితనితంబాంతలంబకేశ
పార్వికశర్వరీట్ప్రతిమాన రుచిరాస్య యమృతనిష్యంది బింబాధరోష్ఠి
విశ్వంభరోపమ విపులకటీభాగ యఖిలాంగసంగత హ్రీస్వలోమ
పంచసూక్ష్మ త్రిగంభీర బహుళశోభ సప్తరక్తయు నగు కన్య జననమంది
శుక్లపక్షీయ శశిలేఖచొప్పునను జనులకు నానందకరయౌచు లలిఁ జెలంగె. ౨౪

వ॥ అపరవయస్సువచ్చెనని యనపత్యతం గుందుచు మండపాంతంబున బ్రాహ్మ
ణులఁ బూజింప వారు ప్రసాదించినది కావున ఛాందోగ్యుఁ డాబిడ్డకు బ్రాహ్మణి
యని నామకరణంబుగావించె. నాశిశువుదయించిన దినంబుననే యానర్తదేశాధినాథు
నకును నట్టిదే యొకబిడ్డపుట్టె స్వీయకాయపరిభాపటలంబుచే సూతికాగృహంబునంతయు
రత్నఘంబునంబోలె సుప్రభంబొనర్చుటయు జనకుఁ డాయమను రత్నవతియని పిలు
వందొడంగె. నంత నయ్యిరువురు కన్నియలు నగ్గలంబగు స్నేహంబుఁజేసి యొకకంచ
మునఁ దించు నొక్కప్రక్కఁ బరుండుచు నొకరిఁజూడకున్న నొకరు బ్రదుకలేనంతటి
స్థితికి వచ్చిరి. పదపడి యెనిమిదవయేట వివాహంబు సేయుటకుఁ దండ్రి వరాన్వేష
ణాదికంబున నుపక్రమించుటయు బ్రాహ్మణి తచ్చేష్టితంబెఱింగి సఖితోడి వియోగం
బునకు భీతిల్లి కన్నీళ్ళు గార్చుచుఁ గడుదీనవదనంబున గద్గదస్వరంబుతో రత్నవతిం
గూర్చి యిట్లనియె. ౨౫

క౦॥ "చెలియ! వివాహము సేయఁగఁ దలపెట్టినవాఁడు నాదుతండ్రి యపుడె. ని-
చ్చలు నీకు నాకుఁ దొల్లిటివలెఁ గలసియు మెలసియునికి వర్తింప దిఁక౯" ౨౬

వ॥ అని యిట్లు వక్కాణించుటయు వజ్రపాతోపమంబగు తద్వాక్యంబు శ్రవణించి సఖియైన రత్నవతి వ్యాకులితేంద్రియయై బ్రాహ్మణిం గౌఁగిలించుకొని రోదనంబు సేసెఁ. దదాక్రందనంబు విని యాపిల్లతల్లి మృగావతి సంభ్రమంబునం జనుదెంచి ౨౭

తే॥ "ఏలయేడ్చెదు బిడ్డ! నిన్నెవరుగొట్టి? రెవరివలనను నీకేమి యేరుపడియెఁ?
జెప్పుమవ్వారి పేరులు శీఘ్రముగను. బట్టితెప్పించి కొట్టింతు. భయమదేల" ౨౮

వ॥ నావుడు రత్నవతి యిట్లనియె. ౨౯

మ॥ "వినుమీ బ్రాహ్మణి నాకుఁ బ్రాణసఖి. యావేదండరాడ్యానకున్
జనకుండియ్యెడఁ బెండ్లిసేయుటకుఁగా సంకల్పముంజేసె. నొ
య్యన నత్తింటికిఁ గూడఁబంపునఁటఁ. డాయజ్ఞానసం బాసి యొ
క్కనిమేషంబును నుండఁజాల జననీ! కాఁబట్టి దుఃఖించెదన్" 30

వ॥ అనవుడుమరలమృగావతి 3౧

చం॥ "ఇటులగుచోఁ గుమారి! నినునిచ్చెడిరాజు పురోధకుండఁడే
వటువగు నొక్కపుత్రకుఁడు. వానికి నీసఖి నీయఁడేతు. న
చ్చటను యథాక్రమంబుగను సఖ్యమువీడక నీవు నావె యు
క్కటసుఖమొందఁగాఁగలరు. కావున నేటికి రోదనంబిఁకన్" 3౨

వ॥ అనిచెప్పి యారాజ్ఞి ఛాందోగ్యుఁ బిల్వఁబంచి సవినయంబుగా నిట్లనియె. 33

శా॥ "ఏతన్మత్సుత త్వత్సుతన్ విడిచి తా నేకక్షణంబేని సం
ప్రీతిన్ వర్తిల. దట్లు నీసుతయు నాబిడ్డన్ విడంబాల. దీ
రీతిన్ భేదములేక యొండొరులు వర్తింపంగ నవ్వారలన్
దాతా! యెల్లెడఁబాపఁగావలెనొ చిత్తంబందు యూజింపవే. 3౪

ఉ॥ కావున నస్మదుక్తవిధిఁ గార్య. మదేమన మత్కుమారి నే
త్వాకరసూతికిచ్చి యుపయామ మొనర్తుమొ తత్పురోహితుం
డావసుధాధరాత్మజున కర్పణసేయుము నీదుబిడ్డ. న
ప్పీ వనజాక్షులిర్వురికి నెట్టివియోగము నుండకుండెడిన్" 3౫

వ॥ అనియిట్లువాక్రుచ్చుటయు ఛాందోగ్యుండు 3౬

కం॥ "నాగరునివదలినాగరుఁ డేగుణవంతునకు నేని యీఁదగదు సుతన్.
బాగగుననియిచ్చినచో నాగరుఁడే కాఁడువాఁడు. నరకముఁ బడున్. 3౭

ఆ॥ కాన మామకీనకన్యక సర్వథా యీయనేను నాగరేతరునకు.
నీవిధమున నిశ్చయించుకొనినవాఁడఁ. దలఁపవలవ దన్యథా సురాజ్ఞి!" 3౮

వ॥ అనివక్కాణించుటయు బ్రాహ్మణియిట్లనియె. 3౯

చం॥ "పతినిఁ గ్రహింప నేను. సుతపంబు నొనర్చెద. బ్రహ్మచర్యమే
వ్రతమిఁక నాకు. నిష్టుఁడగు వానికి నిత్తురు గాక మత్సఖిన్.
గృతమగు నానివాస మటు. నీవు బలాత్కృతిమై ననున్ వివా
హిత నొనరించెదేని త్యజియించెదఁ బ్రాణము లేను నాయనా! ౪౦

కం॥ నిప్పుకలలోన దూఁకియొ యప్పులఁ బడియో విషాన్వితాన్నము దినియో
తప్పక ప్రాణము విడిచెద. నప్పా! విని శక్యమైన యది చేయు మిఁకన్" ౪౧

వ॥ అనియిట్లు ప్రతినపట్టుటయు నావెనిశ్చయం బెఱింగి యాబ్రాహ్మణుండు స్త్రీహత్యాపాపభయంబున వందుగుచు మందిరంబునకరిగె. నాకె సంత్యక్తపితృసౌహార్దయు సంప్రాప్తయౌవనయు నై సంతతంబును సఖియైన రత్నవతితోడం గూడి సంతసించుచుండె. నంత యౌవనోపేతయు ననుపమానరూపయు నగు నాత్మజాత నవలోకించి యానర్తదేశాధిపతి ౪౨

—: బృహద్బలుఁడు చమత్కారపురమునకు వచ్చుట :—

తే॥ "కార్యకారణలోభియై కరమనర్హుఁడైన వానికిఁ దనకూఁతురైన కన్య
నెవఁడొసంగునో వాఁడు రౌరవసమాఖ్యఘోరనరకంబునందునఁ గూలఁగలఁడు"

వ॥ అని కన్యాప్రదాన విషయమై పెద్దయుం బ్రొద్దు చింతించియుఁ దగినవరుం గానక సకలదేశస్థితులగు చిత్రకారుల రావించి ౪౪

చం॥ "అరుగుఁడు సర్వదేశముల కచ్చటి రాచకొమాళ్ళ రూపముల్
సరిగ లిఖించి చిత్రపటసంచయముం గొని తెండు. వానిఁ దా
నరుసగఁ జూచి యిష్టుఁడగు వానిఁ వరించును మత్కుమారి. యీ
కరణినొనర్ప నుండదిఁక గట్టిగ నాయెడ దోసమింతయున్" ౪౫

వ॥ అనినవిని చిత్రకారులందఱుం బయనమై ధరణీతలంబునంగల సకలక్ష్మానాథుల గృహంబులకు నరిగి రూపౌదార్య గుణోపేతులును యౌవనవంతులు నగు రాజకుమారుల రూపంబులు లిఖించికొని యానర్తాధిపతి యాదేశంబునం గ్రమంబుగా రత్నవతికిఁ గనంబఱచుటయు వారిలో దశార్ణాధిపతియగు బృహద్బలుం డాకెచే వరింపఁబడియె. నంత నానర్తపతి సంతసించి బ్రాహ్మణులఁ గొందఱఁ దద్దశార్ణదేశంబునకుఁ బ్రయాణంబు సేసి వారిం గూర్చి యిట్లనియె. ౪౬

చం॥ "అరిగి దశార్ణదేశమున కచ్చట నేలిక యా బృహద్బలున్
గుఱిచి మదీయపుత్రికను గూరిమి నిచ్చెదఁ, న త్రిలోకసుం
దరిని వివాహమాడఁ ద్వరితంబుగ రమ్మని నేను జెప్పిన
ట్లెఱుఁగఁగఁ జెప్పి తోడుకొని యిందరు దేరుఁడు భూసురోత్తముల్!" ౪౭

వ॥ అని యిట్లు చెప్పి పుచ్చుటయు వారు బృహద్బలుఁ జేరనరిగి యానర్తనాథు వాక్యంబులన్నియు వాకుచ్చిరి. బృహద్బలుండు సంతసించి చతురంగసైన్యసహితంబుగం బయనమై యటకుఁ జనియెఁ. దత్కాలంబున వేదవేదాంగపారగుఁడగు విశ్వావసు

—: పరావసువుజలభ్రాంతినిమద్యముద్రావుట :—

వను నాగరబ్రాహ్మణున కపరవయస్సున జన్మించి యతనికిఁ బ్రాణసముండై యున్న పరావసువనువాఁడు వేదాధ్యయనతత్పరుండై యౌవనంబువచ్చుటయు హాస్యశీలురగు సంగడీండ్రంగూడి తిరుగుచు మాఘమాసంబుననొక నాఁటిరేయి యుపాధ్యాయ గృహంబునుండి వేశ్యాగృహంబునకుఁ బోయి దానిశయ్యఁ బన్నుండి దర్పకాహవ పరిశ్రాంతి నేర్పడిన దగదీర్చుకొనుటకుఁగాఁ దన్మంచాధః ప్రదేశస్థమగు సురాభాండంబు నిజాచమనయోగ్యంబగు జలకలశభ్రాంతి నందుకొని నిద్రాలస్యసమోపేతుఁడగుట నిశాశేషంబునం దామద్యంబు నోటఁబోసికొని యొక్క గుక్కెడుమ్రింగి యెఱింగి యక్కలశంబు నేలఁబడవైచి బిట్టు చింతించి ౪౮

కం॥ “కట్టా! నిద్దురమత్తున నెట్టివికారంపుఁజేఁత నేనొనరిచితిఁ.
ముట్టుకొనఁదగనిమద్యము పట్టుకొని స్వయంబ త్రావఁ బాల్పడినాఁడ. ౪౯

కం॥ ఏమియొనరింపవలెనిఁక. నేముఖమునఁ దగుదునసుచు నిలఁ దిరుగవలెఁ.
నే మును ప్రాయశ్చిత్త మదేమైన నొనర్చికొనుట హితమగు నింకఁ” ౫౦

వ॥ అని నిశ్చయించుకొని ప్రొద్దుపొడుపున శంఖతీర్థంబునం గ్రుంకి సశిఖంబుగా క్షౌరంబుచేయించుకొని బ్రహ్మఘోషపరాయణుండై శిష్యసహితంబుగా బ్రహ్మాసనమందున్న యుపాధ్యాయు డాయఁబోయి యంత్యజుండువోలె దూరంబున నిలుచుండుటయు సహాధ్యాయు లతని గేలిసేయుచు మాటిమాటికిం గొనవ్రేళ్ళ బోడితలం గొట్టఁగడంగిరి. తత్ప్రహారంబులకుఁ దాళలేక కనులనిండ నీళ్ళుదెచ్చుకొని దీనవదనుండై యున్న యాతని విలోకించి యుపాధ్యాయుండు ౫౧

కం॥ “ఏమోయితండ్రి! నీ మొగ మీమాదిరినున్న? దెవ్వ రేమనినారలో?
సామీప్యమునకువచ్చి యథామతిఁగూర్చుండు మేల దవ్వరిగ దిటుల్” ౫౨

వ॥ అనియోదార్చుటయుఁ బరావసువిట్లనియె. ౫౩

ఉ॥ “బోగముకొంపకేగి జలపూర్ణఘటభ్రమ మద్యభాండముఁ
జేఁగొనిత్రాఁగి నీదు పదసేవ కయోగ్యుఁడనైనవాఁడ నే
నోగురువర్య! కాన నెదియుక్తమొ నిష్కృతి చెప్పు. మద్ది వే
వేగమ చేసికొందుఁ బృథివీసుమనఃపరిమత్తువందునఁ” ౫౪

వ॥ అనియిట్లు వాక్రుచ్చుచుండుటయుఁ దత్సవయస్కులగు బ్రహ్మచారు లతని వేశ్యాలంపటతం బరిహసించుచు ౫౫

ఆ॥ “రాజుకూఁతురైన రత్నవతింజేరి యా పెచనులు రెండు నమరఁబట్టి
పెదవిఁగొఱికుదేని పెద్దప్రాయశ్చిత్తమగును. దుష్కృతంబు నంతమొందు” ౫౬

వ॥ అనివక్కాణించుటయుఁ బరావసువిట్లనియె. ౫౭

ఉ॥ “కాదువయస్యులార! యిది కాలము గేలియొనర్పమీకున
న్నే దురవస్థలోఁబడి యేడుచుచుంటిని. శాల్యమైత్రి ను

ర్పాదితమైన మీకరుణ శుద్ధయు నాపయి నుండెనేని యు
ర్వీదివిజాళిఁ గూడుకొని వేగమ చెప్పుఁడు తగ్గనిష్కృతిన్" ౫౯

వ॥ అనియిట్లు వక్కాణించుటయుఁ దాముసు జింతించుచుఁ దత్సవయస్కులు విశ్వావసువు పాలి కరిగి యాసమాచారంబు వారలచ్చి. రతండును గర్ణకఠోరంబగు నవ్వార్త విని దుఃఖించి భార్యకుఁజెప్పి తత్సహితంబుగం జిత్తనమువలనఁ బ్రతిపదంబునం బడఁబోవుచుఁ గొడుకుకడ కరిగి బాష్పగద్గదవాక్యంబుల హాపుత్రా! యేమిపనిచేసితి విరాయని పెద్దపేరెలుంగున నార్చుటయు నతం డఖిలంబును నివేదించి యాత్మపరిశుద్ధికై ప్రాయశ్చిత్తము చేసికొందుననియె. నంత విశ్వావసువు వేదవిదులగు విప్రులం దదర్థమై రావించెఁ. బదంపడి పరావసు వాబ్రాహ్మణుల యెదుట నిల్వఁబడి దోసిలొగ్గి

తే॥ మత్కమండలువను భ్రాంతి మద్యరసము ధవసతీభాండమందుండఁ దాగినాఁడఁ.
దెలియ కీరాత్రిసలిపిన కలుషమిద్ది. తగిననిష్కృతిసెప్పుఁడు శుద్ధత ఘటింప" ౬౦

వ॥ అని వచించుటయు వారు ధర్మశాస్త్రములఁ దిలకించి ౬౧

సీ॥ ఎవరు నా కెనగారు భువిలోననని మదిం బర్వుచుండిన మహాగర్వమునను
నెదొపరిసక్తిని నుదయించి క్రింబుగాఁ గొండంతయైయుండు క్రోధమునను
దోషితోఁ దనకుఁ బ్రాదుర్భూతమైయున్న చిరకాలికంపు మున్స్నేహమునను
ఖండితంబుగఁజెప్పఁగా నడ్డుగలిగించు ప్రభవసిద్ధ భయస్వభావమునను
హెచ్చుతగ్గుచేసి యెట్లా ప్రాయశ్చిత్తమును వచించువాని నెనయఁగలమ.
మట్లుగానఁ దగినయది చెప్పుము మేము. చేతనైనఁ బోయి చేసికొనుము" ౬౨

వ॥ అనినుడువుటయుఁ బరావసు విట్లనియె. ౬౩

మ॥ "భవదుక్తంబు నొనర్పకుండిన మిముం బ్రశ్నింపఁగా నేటికి?
వైపరీత్యించిరి మద్యపాయినగు న? న్నిక్లాటఁ బ్రాణాంతకం
బవుఁగా కయ్యది. మీరు యుక్తమగు ప్రాయశ్చిత్తమే చెప్పుఁడీ
యవనీదేవులు! లేకయున్న యెడ మీ కత్యంతపాపంబగున్" ౬౪

వ॥ అనవుడు బ్రాహ్మణులు ౬౫

కం॥ తెలిసి కలుద్రావ నంతటి సలసలక్రాగెడి పయిండి స్వాద్యము. మఱియున్
దెలియక త్రావినఁ దప్తజ్వలనాభాజ్యంబు ద్రావఁజను నంతయ తాన్. ౬౬

కం॥ ఓయగ్రజన్మ మాచేఁ బ్రాయశ్చిత్తంబు నీకుఁ బరికీర్తిత. మీ
చాయం జేయుంగలిగినఁ బోయి వెసం జేసికొనుము. పొందెదుశుద్ధిన్" ౬౭

వ॥ నావుడు మరలఁ బరావసువిట్లనియె. ౬౮

తే॥ "ఒక్కగండూషముం గ్రోలియుంటి మద్య. మార్యులార! త్వదాదేశ మవధరించి.
యగ్నితుల్యంబు గావించి యంత నెయ్యి గ్రోలెద శరీరసంశుద్ధిఁగోరి యిపుడె" ౬౯

—* పరావసువు ప్రాయశ్చిత్తమునకుఁ దలిదండ్రులు లాక్రోశించుట *—

వ॥ అనియిట్లు పలుకుటయు వజ్రపాతోపమంగు భూసురులయుఁ బుత్రునియు వాక్యంబువిని విశ్వావసువు కన్నీళ్లువిడుచుచు గద్గదస్వరంబున ౨౦

క౦॥ ఉన్నధనమెల్లనిమ్మనియున్నం దనయుండు శుద్ధుఁడగుటకు నిత్తుకా.
మన్నింపకిదియెపాచిత మన్నను మీ శాక్కగవ్వయైనను నీయక. ౨౧

తే॥ శ్రాద్ధములఁ బిల్వకున్నను సరియె. పంక్తిదూరుఁజేసిన మాబాగె. యూరువిడిచి
పోమ్మనంబోయెదను సహపుత్రకముగఁ. గొడుక! యిక్కార్యమునుమానుకొనుమునీవు"

వ॥ అని ప్రాయశ్చిత్తమునకు విఘ్నకరంబుగాఁబల్కు జనకువాక్యంబువిని కుమారుఁ డిట్లనియె. ౨3

క౦॥ "విడువిడు తండ్రీ! యిఁక నాయెడలంగల స్నేహబంధ. మేఁజేయుపనిక్
బడఁగొట్టకు. పాచిత మియ్యెడఁ గావించుకొన నిశ్చయించినవాఁడక్ " ౨౪

వ॥ అనియిట్లువచించుటయుఁ దన్మాత ౨౫

మ॥ " అనఁగుంబుత్ర! పవిత్రతాస్తికయి ప్రాయశ్చిత్తముం జేసెదేక్
జని నీతండ్రియు నేను దూఁకెదము తజ్జాజ్వల్యమానాగ్నిలోఁ.
గనుగోఁజాలము క్రాఁగుచున్నఘృతముం గంఠస్థముంజేసి వెం
టనె ప్రాణంబులువాయు నిన్నుఁగొడుకా! నాతోడునూ చెప్పితిక్ " ౨౬

వ॥ అనినుడువుటయుఁ దండ్రి కొడుకు నుద్దేశించి మఱియు నిట్లనియె. ౨౭

క౦॥ "కొడుకా! నీయవ యీనుడి కడుబాగుగనున్న దెన్నఁగరముహితంబాఁ.
దడయక నేనును దీనికి నొడఁబడియున్నాఁడ. నేమియున్నది యింకక్." ౨౮

వ॥ అని యీప్రకారంబునఁ దన్మాతాపితరు లాక్రోశించుచుండుటయుఁ దద్వృత్తాంతంబువిని బ్రాహ్మణులందఱుం జనుదెంచి పుత్రశోకసంతప్తుఁడై పత్నీసహితంబుగా మరణంబునకుఁ గృతనిశ్చయుఁడైయున్న విశ్వావసువును నానావిధవాక్యంబుల నోదార్చి పుత్రునకును బోధించిరికాని ప్రాయశ్చిత్తమును నివారించుటకు శక్తులుకారైరి. తండ్రికొడుకు లిరువురును ప్రాణత్యాగమునకు వెనుదీయమిని సర్వజ్ఞుండును సర్వసందేహవారకుండును నగుభర్తృయజ్ఞుఁ డుండు వాస్తుపదంబున కరిగి పరావసువు సురాపానంబు సేసి ప్రాయశ్చిత్తమును వేడుటయుఁ బరిహాసమునకుఁ దన్మిత్రు లెద్దియో చెప్పుటయు ధర్మశాస్త్రంబులుచూచి బ్రాహ్మణులు తప్తఘృతప్రాశనవిధించుటయు విశ్వావసువు సపత్నీకంబుగా నగ్నిం బ్రవేశింపనుండుటయుఁ దన్మిత్రులు దుఃఖించుచుండుటయు మున్నగు సకలసమాచారంబును నివేదించి వినయవినమితోత్తమాంగులై మఱియు నిట్లనిరి.

క౦॥ " భూతభవిష్యత్ప్రకృతము లోతాపసవర! యొకింతయును నీమదికిక్
జ్ఞాతములుకాని వుండవు. ఖ్యాతంబిది. మాకుఁదెలియ నంతయు సరిగక్. ౩౦

తే॥ ఈనగరమంతయును నేఁడు మానిచంద్ర! వినుము విశ్వావసుద్వారమునను సంశ
యంబునం బడియున్నది. యందుకొఱకె వచ్చినారము మేము నీవద్ద కిపుడు. ౮౧
క॥ మతియొకప్రాయశ్చిత్తము సురద్రావిన యిమ్మహీసురుని శుద్ధికిఁ గా
కరుణను వాక్రువ్వవె. యీవెలుఁగని దించుకయునుండ దెన్నఁగ శ్రుతులన్" ౮౨

—* రత్నవతి స్తనంబులనుండి పాలుగారుట *—

అని యిట్లువక్కాణించుటయు భర్తృయజ్ఞుండు పక్కాణనవ్వి ౮౩
తే॥ "ఈద్విజన్ముఁడు సంశుద్ధినెనయుపాంటె నున్న దొక్కసుఖోపాయ మన్నలార!
యున్నదయ్యును లేనిదె యెన్న నద్ది. యివ్విధంబునఁదోచె నాహృదయమునకు"౮౪
వ॥ అనిపలుకుటయు బ్రాహ్మణు లిట్లనిరి. ౮౫
క॥ "పూర్వాపరవైరుధ్యముపర్వి కనంబడెడిఁ జూడ భవదుక్తమునన్.
సర్వజ్ఞ! యుండెనెటులది? మార్వలుకకనున్నె యెటుల మతి లేకుండెన్" ౮౬
వ॥ అనియిట్లువచించుటయును మరల భర్తృయజ్ఞుండు ౮౭
క॥ "సచ్ఛిద్రంబగుజపమును సచ్ఛిద్రంబగుతపంబు సచ్ఛిద్రమఖం
బచ్ఛిద్రంబగు బ్రాహ్మణు నిచ్ఛామాత్రంబుచేత. నేమందునికన్. ౮౮
శా॥ అచ్ఛిద్రంబని బ్రాహ్మణాస్యమున నందా నాగరాస్యంబునన్
స్వచ్ఛంబౌనుడి నిర్గమింప నది యట్లౌఁగాని కా దన్యథా.
సచ్ఛీలంబగుబ్రహ్మశాల మనుచున్ క్ష్మాదేవతావంశజుం
డిచ్ఛన్ ధర్మనిబంధ మారయక యున్ హేలోక్తియున్ సత్యమా. ౮౯
మత్తకోకిల॥ ఈపరావసుపున్ గుఱించి తదిష్టమిత్రులు ప్రాయపున్
బాప లెంతయు నవ్వులాటకుఁ బట్టిరత్నవతీకుచం
బా పెవా తెఱనొక్క శుద్ధుఁడవౌదువంచని. రద్దియే
యాపరాశరుసన్మతం. బదె యాను నిష్కృతి శుద్ధికిన్ " ౯౦
వ॥ అనివాక్రుచ్చుటయు బ్రాహ్మణులిట్లనిరి. ౯౧
ఉ॥ "రాజదివిన్న నీర్ష్యమెయి రమ్మని పట్టి వధించుచున్నఁ. నీ
రాజన చూచినం గర మయుక్తము. గానఁ బరావసుండు ని
ర్వ్యాజపుఁ బాచితంబునని ప్రాణములన్ వేసఁ గోలుపోవుఁగా.
రాజును మేము నిండ్ల కయరానియని యేగెద. మేమిచేయనౌ." ౯౨
వ॥ అనవుడు వెండియు భర్తృయజ్ఞుండు ౯౩
సీ॥ ఆరాజచంద్రముం డఖిలధర్మంబుల నొసరించి ధన్యుఁడైయున్నవాఁడు
అమ్మహీవల్లభుం డఖిలశాస్త్రములందుఁ గోవిదుండై మతింగొన్నవాఁడు

ఆజనసాయకుం డతివిస్తృతంబైన నీతిమార్గంబున నిల్చువాఁడు.
ఆబ్రహ్మవిదుఁడు దేవబ్రాహ్మణులయెడ భక్తి విశ్వాసము ల్వరఁగువాఁడు.
గాన నేనును మీరును గలసి యానృపాలునింటికిఁబోదము బయలుదేరుఁ
డయ్యవాగరులార! యీయార్యుఁడైన మధ్యగునిద్వారమున దీని మనవి సేయు. ౯౪

సీ॥ ఆదిఁ బరావసు వవ్వేశ్యయింటిలోఁ దాహంబుగొని సురఁ ద్రావుటయును
గుయ్యిడు చతఁడంత గురుసన్నిధికివచ్చి యర్హప్రాయశ్చిత్త మడుగుటయును
నతని మిత్రులు రత్నవతి చను ల్గ్రహించి యధరంబుగ్రోలుటం జాడుటయును
యుక్తమియ్యదియంచు నొగిని బరాశరస్మృతి దానిఁ గడు రూఢి సేయుటయును
నొకటి తరువాత నొక్కటి యొయ్యనొయ్య మధ్యగునిద్వారమునఁబోయి మనవి సేత.
మద్దివినియూతఁ డాగ్రహ మందెనేని సరిగ దారికిఁ దెచ్చెడి భరము నాది" ౯౫

వ॥ అని వక్కాణించుటయుఁ బరమసంతోష భరితస్వాంతులై భర్తృయజ్ఞు
మేలు మేలని పొగడి ౯౬

సీ॥ స్వర్గచ్యుతుండైన సత్యసంధుఁ చేత బ్రాహ్మణార్థం బుంచఁబడియె నెవఁడు
శ్రీచమత్కారపురీజన కార్యము ల్సిద్ధించు నెవ్వాని చేత నెపుడు
నెవఁడు గర్తాతీర్థభవుఁడయి పఠియించె వేదవేదాంగము ల్విపుల మేధ
భర్తృయజ్ఞుని యాజ్ఞ బహుయజ్ఞములుచేసి యెవఁ డాహితాగ్నియై యెనసె యశము
నట్టి హరిభద్రుశేరి మధ్యగుని మధ్యమందుఁ జేరిచికొని భర్తృయజ్ఞసహిత
ముగఁ బరావసుఁ దమ్మత ముదకఁడైన తత్పితం గొంచు వాగరు ల్త్రుణంబ ౯౭

వ॥ రాజద్వారంబు సొచ్చుటయు ద్వారపాలకుండు పోయి రాజునకు నివేదించె. నయ్యానర్తదేశాధిపతి పురోహిత పురస్సరంబుగం దలవాకిటనుండు తన్నాగరుల కభిముఖంబుగా నడచి ప్రథమము భర్తృయజ్ఞునకును నావల హరిభద్రునకును ముద్గహస్తులగు నలువురకును నితర భూసురులకును నర్ఘ్య మధుపర్క విష్టర గోప్రదానంబు లొనరించి పదపడి దత్తాశీర్వాదంబులం గైకొని వారి నందఱను సభామండపమునకుఁ గొంపోయి యథాక్రమంబుగా బంగరుగద్దియలం గూర్చుండఁబెట్టి తదనంతరంబునఁ దాను ధరాతలంబున నుపవిష్టుండై దోసిలిఁబట్టి ౯౮

కం॥ "సహభర్తృయజ్ఞులై మద్గృహమునకుఁ నాగరాళి యేతెంచెను నేఁ
డహహా! ధన్యుండను. ననుగృహీతుఁడనువైనవాఁడఁ గృతకృత్యుండన్ ౯౯

ఉ॥ కావున నేనుజేయఁదగు కార్య మదేదొ యనుజ్ఞయిండు భూ
దేవతలార! చేసెద. నదేయము నేనియు నిచ్చెదం బెదన్
బోవఁగరానిచోటికిని బోయెద మాటలువేయు నేల మీ
కావలెనన్న సర్వవిధ కార్యములన్ నెరవేర్తుఁ జెప్పుడా"॥ ౧౦౦

వ॥ అనినవిని హారిభద్రుండు సత్వరంబుగా లేచి యాదియం దాద్యులను బదపడి బహ్వృచులను ననంతర మధ్వర్యులను సక్రమంబుగా ఛాందోగ్యులను దత్తదర్థంబు బ్రశ్నించి తదనుజ్ఞవడసి ౧౦౧

ఆ॥ ప్రాణరుద్రములను బఠియింపుఁడాద్యులు! జీవసూక్తములను జెపుఁడు బహ్వృ
చులును! దొల్లిమీరు లలిఁ బృథివ్యాదిసవనము చేసియుంటవలన నిపుడు. ౧౦౨

తే॥ "చదువుఁడధ్వర్యులార! మీ రదితియోటెంగి వేఱువేఱుగ ఛాందోగ్యులార! మీరు
చదువుఁడీ తేనెలొలుకంగ సామములను సిద్ధికొఱకయి యందఱుం జేయుఁడిటుల."

వ॥ భర్తృయజ్ఞు తానుసారంబుగా నిట్లాద్విజోత్తములకుఁ జెప్పుటయు నవియన్నియు వారు పఠించిరి. తత్పాఠావసానంబున మధ్యగుండు ౧౦౪

సీ॥ ఎటు పరావసుచే నెఱుఁగక మద్యంబు పానంబు సేయఁగాఁ బడినయదియొ
యేమని యవ్వాని హితసమూహముచేతఁ బ్రథమంబు వాక్రువ్వఁబడినయదియొ
యెటు స్మృతివిదులచే నిటు ఘృతపానంబు పాడితంబుగఁ జెప్పఁబడినయదియొ
యెటు భర్తృయజ్ఞుచే నెల్లమహీసురు లదపడి తోడితేఁబడినవారొ
యంతయును భూమిపాలున కమరఁ జెప్ప నద్దివిని యాతఁడత్యంతహర్షమునను
నంజలిఘటించి మెయిపంచి యాదరమున నెంతయు నయంబుదోఁపఁ దానిట్టులనియె.

ఉ॥ "ధన్యుఁడ నైతి. నాగరులు తన్మహిదేవుల ముప్పురకాఁ జగ
న్మాన్యుల రక్షసేయ రహిఁ నాకుఁ బ్రసాదము సేసినారు. నా
కన్యయు ధన్యయౌను మృతిగైకొనకుండిన బ్రాహ్మణత్రయికిన్
హైన్యము నాక తా మనిచి. యంతకుమిక్కిలి యేమి కావలెన్." ౧౦౫

వ॥ అనియిట్లుపలికి యతండు తత్క్షణంబ యాకన్యను రావించి బ్రాహ్మణులకు సమర్పించి ౧౦౬

కం॥ "మీమాటవలన నిచటికి నాముద్దులబిడ్డఁ బిలిచినాఁడను గనుఁ డో
క్ష్మామరులు! భర్తృయజ్ఞుం డేమనె నదిచేయుఁగాక యీవిప్రుడికన్." ౧౦౭

వ॥ అనిచెప్పుటయు భర్తృయజ్ఞుఁ డప్పరావసువు చేయిపట్టుకొని రత్నవతివిన నిట్లనియె. ౧౦౮

చం॥ "అధరముగ్రోలు వేళ భవదంబకఁ జూచెద వేని యాయమన్
మధురమునైన క్షీరములు మాటికి నంద్రుసవించు. నీకు నె
వ్విధమగుహానిలేక యగు వెంటనె సిద్ధి. వికారమొందెదేన్
రుధిరము నోటనిండఁబడి రూపఱిదీపు పరావసూ! వెసన్." ౧౦౯

కం॥ చనుమొనలపైని నీకరమును వైచినతోనె క్షీరములు గాఱెడిచో
మనమున శుద్ధినిబొందితినని యనుకొని సంతసింపుమయ్య ద్విజన్మా!" ౧౧౧

వ॥ అని యిట్లాతనిం గూర్చిపలికి కన్యకంజూచి ౧౧౨

చం॥ ఇతని సుతుంగఁ జూడవలె నీవు కుమారి! త్వదోష్ఠపానమీ
క్షితిసురు శుద్ధుఁజేయుఁ. బరికింపు. కుచగ్రహణంబుచేఁత పా
చితమగునంచుఁ దత్సఖులుఁ చెప్పిరి నవ్వుల. కట్లుగాన స
మ్మతిపడనొను దీని. కనుమానమునొందినఁ బాఱుఁ డిగ్గెడిన్." ౧౧౩

వ॥ అని నొడువుటయు నాపె వల్లెయని సవ్రీడంబుగం బరావసువుతో నిట్లనియె.

ఆ॥ "రమ్మువత్స! వచ్చి రయమ ప్రాయశ్చిత్త మాచరించుకొనుమ యాత్మశుద్ధి.
కమ్మగందలంపు మనుమానపడకన. న్నీవు కొడుకవైతి వింక నాకు." ౧౧౪

వ॥ అనియిట్లు నుడువుటయు నతండును దల్లిగందలంచి తత్సన్నిధింజేరి యఖిలజనులును నవలోకింప నాపె పయోధరంబులు పట్టుకొనియెఁ-బట్టుకొనుటయే తడవుగాఁ బాలిండ్లనుండి కుందేందుహిమసన్నిభంబులగు క్షీరధారలు వెలువడియె. నంత నధరాస్వాదనమాచరించుటయు నదేవిధంబుగా నాయమ యాననంబునుండి పయస్సు బయలువెడలెఁ. బదపడి పార్థివుండును బ్రాహ్మణులును బరావసువు పరిశుద్ధుఁడయ్యెనని పలుమాఱులు కరతాళంబులు వాయించి.రతండును ననేకపర్యాయములక్కన్యకుఁ బ్రదక్షిణనమస్కారంబులు సేసి "మాతా! నీవు పుత్రవత్సలవు. నన్ను క్షమింపు" మని ప్రార్థించె. నదియవలోకించి యానతుఁడాశ్చర్యపడుచుఁ బ్రాయశ్చిత్తప్రదుఁడగు భర్తృయజ్ఞుఁ బ్రశంసించి ౧౧౫

కం॥ "ఇట్టిచమత్కారపురిం బుట్టిన బ్రాహ్మణులు గేహమున కరుదేరన్.
బిట్టుభజింపంగలిగినయట్టిడ నాభాగ్యమెంత దరరేయరయన్. ౧౧౬

కం॥ ధన్యయగుగాని యీమత్కన్యయు సామాన్యురాలుగాదు తలంపన్.
మున్యధినాథులవలెఁ గడుమాన్య. మహాభాగ. నిరుపమాన సతులలో. ౧౧౭

ఆ॥ ఈపరావసువును నెన్న నసామాన్యుఁ డట్లగాకయున్న నలవియగునె
యిట్టియువతియొద్ద కేగి వికారముం బొరయకుండుటకును సురలకైన." ౧౧౮

వ॥ అని పార్థివోత్తముం డావిప్రుల సాఁగనంపి కన్నియందొడ్కొని యంతిపురంబునకుఁజనియె. నంత నాగరులందఱును ౧౨౦

చం॥ "సురయును మాంసమున్ మెసవి చొక్కుచు సోలుచు వేశ్య లిప్పురిన్
నిరతము నాగరాత్మజుల నిందితులం బొనరించు చెంతయున్
దురితముగాన నేఁటినుత దూష్యములౌనవి యుంచఁగూడ దీ
తరుణులు మందిరంబులను. దప్పిన శిక్ష విధింపఁగాఁబడున్. ౧౨౧

క౦॥ ఏపడపుఁజెలియ యీపురిఁ గాఁపురముం జేయఁజూచుఁ గాదనకదితా
నీపగిది నుండవలయును లేపఁగఁబడుఁ బురమునుండి లేకుండినచో ॥ ౧౨౨

వ॥ అని వ్యవస్థచేయుటయు నౌదుంబరియు మధ్యగుండును ద్రివారంబులు కరతాళంబులు వైచిరి. యీసందర్భమున రత్నవతిం బెండ్లియాడ నటకు వచ్చియున్న దశార్ణదేశాధిపతి పూర్వోక్త వృత్తాంతంబువిని విరక్తుఁడై స్వపురంబునకుఁ బయనమయ్యె. నతఁడు వెడలిపోవుటవిని యానర్తుఁ డతని వెంటఁబడి ౧౨౩

—* రత్నవతి వివాహమును మానుకొనుట *—

ఆ॥ " నాదుముద్దుబిడ్డ నర్మిలిఁ బెండ్లాడఁ బిలువఁబడితివిటకుఁ బృథివిపాల!
వచ్చియున్న కార్య మిచ్చ నొనర్పకే యేలయేగెదయ్య యివ్విధమున!" ౧౨౪
వ॥ అనివాఁ ప్రశ్నించుటయు దశార్ణుం డిట్లనియె ౧౨౫
ఉ॥ "నిందితురాలు నీదుసుత, నిక్కము. కన్నెతికంబు గోలుపో
యెం. దనవాతెలంగలచి యేఁడో పయోధరమర్దనంబు సే
యం దగునంచు నిష్టపడువాపె కెటుండును గన్యకాత్వ. మిం
కందురుపో పునర్భవని యందఱు నీదుతనూజ భూపతీ! ౧౨౬
క౦॥ ఎవఁడు పునర్భువుకడుపున భవమొందునో వాని తొంటిపదితరములవా
రవతలిపదితరములవా రవిచారితముగను బడుదు రతిదుర్గతులన్. ౧౨౭
క౦॥ ఇరువదియొకటువపురుషుని వఱకు నధఃపాతమొందు. వాఁ డాకల్పం
బురునరక మొందుఁ. గావున వరియింప భవత్తనూజ వసుధాధీశా!" ౧౨౮

వ॥ అనియిట్లు నిర్దాక్షిణ్యంబుగా వాఁ ప్రశ్నించి వాస్త్యశ్వరథపూర్వకబహూపాయనదానంబున హృదయ మాకర్షించుచున్నను నానర్తు నవమానించి యాత్మీయనగరంబునకు వెడలిపోయె. నంత నానర్తుఁ డింటికేగి వ్యాకులపడుచు బృహద్బలుఁడన్నమాట లర్థాంగికిని నమాత్యులకును వినుచుటయు వారలు ౧౨౯

ఉ॥ "చక్కని రాకుమారకులు స్యందనఘోటకహస్తియుక్తులై
లెక్కకు మించియుండిరిల. లేవడి యేమియులేదు. వారిలో
నొక్కనిఁ బిల్వఁబంచి భవదుత్తమకన్యనొసంగు. మీతఁడే
దిక్కటె లోకమంతటికి? తీఅనిదుఃఖముగూరె దేలయో" ౧౩౦
వ॥ అనినవిని యతండు కన్నియదిక్కు మొగంబై ౧౩౧
తే॥ " పుత్రి! చిత్తరువులలోని భూమిపతుల నెల్లరం జూచియుంటివి యీవుమున్నె.
వారిలోపలఁ ద్వన్మనస్సారసమును వికసితముఁజేయు మఱియొక్క విభువరింపు"
వ॥ అనవుడు రత్నవతి యిట్లనియె. ౧౩౩
క౦॥ "వరియింప దశార్ణాధీశ్వరునిడిచి మఱొక్క భూమివరు నెన్నటికిన్.
ధరణీశ! యేలయనుచో నెఱిఁగించెదవినుము దాని హేతువు నీకున్. ౧౩౪
క౦॥ ఒకపరి కాసింతురున్నపు. లోకపరివచియింతు రెదియొ యుర్వీసురు. ల
ట్లొకపరియీఁబడుఁగన్యక. యొకపరియేయగుచునుండు నొగి నీమాఁదునన్. ౧౩౫

ఆ॥ ఇదియెఱింగినన్ను నింకనొక్కమన్నీని కీయఁదలఁపవలయు నీవుతండ్రి !
యీవొనర్చెదేని యిది యే తెఱంబగుఁ. గాదు ధర్మమిద్ది కనుమెఱుంద" ౧౩౬

వ॥ అనియిట్లు వక్కాణించుటయు నానర్త్రుండు ౧౩౭

శా॥ "నాచేనీవు దశార్ణభూమిపతికి న్దత్తాలవుం దొందరన్
వాచాదత్తవ యైతి గాని శుచివిప్రప్రాజ్ఞమధ్యంబునన్
నీచెయ్యూఁతఁడు తాఁ గ్రహింపఁ డెటులన్ నీనాథుఁ డాతండిఁకా
నో చెప్పంగదవమ్మ ధర్మమును బిట్టూహించి డెందంబునన్" ౧౩౮

వ॥ నావుడు వెండియు రత్నవతి ౧౩౯

చం॥ "మనమునఁ జింతసేయఁబడు మంచిగఁ గార్యము లాదిలోన. వ
ల్లన నవి వాక్కుచేత నవలన్ బహిరుక్తములౌచునుండు, వా
నినె తగువారిఁ జేయుదురు. నేను మదాత్మను మున్నె యన్నరేం
ద్రునకు మనస్సుచేనిడితిఁ. దోడనె వాక్కున నిచ్చితీవునన్. ౧౪౦

ఉ॥ కావున నెట్లు నాకుఁ బతిగాఁడొ యతం డిఁకఁ జెప్పుమీవ. యా
భూవిభుఁ డప్పు నింకనొకపూరుషు మానసమందు నేనియున్
నావిభుఁ గాఁ దలంప. నిది నాదగు నిశ్చయ. మవ్విభుండు నన్
దావరియింపకున్నఁ జని తాపసినయ్యెద నేను నిక్కమై" ౧౪౧

వ॥ అనినవిని తన్మాతయగు మృగావతి కనులనిండ నీళ్ళు దెచ్చుకొని ౧౪౨

చం॥ " తనయ! తపంబు సేతునని తద్దయు సాహసమాచరింప. కీ
వనయము సౌఖ్యమొందు మృదులాంగముగల్గినయట్టిబాల వే
యనువునఁ గందమూలఫలహారమొనర్చుచు నారచీరలన్
దనువునఁ దాల్చి ఘోరమగు తత్తపముంబొనరింతు కానలన్. ౧౪౩

ఉ॥ కావున ముఖ్యుఁడైన యొకక్ష్మాపతికిచ్చెద నిన్. కుమారికా
భావము నాశ్రయించి యల బ్రాహ్మణి నీపరమాప్తురాలు నీ
వేవిభుఁ బెండ్లిచేసికొని యేగెదొ వాని పురోహితాత్మజున్
దా వరియింపనున్నయది తప్పక రత్నవతీ ! సుఖంపడన్ " ౧౪౪

వ॥ అని వాక్రుచ్చుటయు మఱియు రత్నవతియిట్లనియె. ౧౪౫

ఉ॥ " కూఁతురిమీఁద నీకుఁ గడుఁ గూరిమియుండిన నిట్టిమాటలన్
మాతరో ! చెప్ప కెప్పటికి. మత్తపముం జెడఁగొట్టెదేని త
ర్వాత విషాన్నముం దినియొ వహ్నినిజొచ్చియొ జిహ్వఁ జీల్చియో
యీ తనువుం త్యజించెదను. నేల బలాత్కృతిసేసెదివ్విధిన్ " ౧౪౬

వ॥ అనియిట్లు దృఢంబుగాఁ బలికి పరమాప్తురాలగు బ్రాహ్మణిం గౌఁగలించు
కొని యంజలిఁబట్టి ౧౪౭

క॥ "చనుమీ జనకునియింటికిఁ బనుపుచునున్నాను నేను ప్రాణసఖీ! తా
ఘనుఁడైన నాగరున కిచ్చునునిన్ను. వివాహమాడి సుఖపడు మింకన్. ౧౪౮

తే॥ ఎన్నడైనను నీతోడ నేను బరుసమాడియుండిన క్షమియింపుమమ్మ దాని.
నీవునుడివినపరుసం బెదేని యున్న నేను క్షమియించుచున్నాను నిశ్చయముగ" ౧౪౯

వ॥ అనవుడు బ్రాహ్మణియిట్లనియె. ౧౫౦

తే॥ "ఎనిమిదేండ్లది గౌరినా నెన్నఁబడెడి. నగును రోహిణి తొమ్మిదియబ్దములది.
దశశరత్ప్రాయ కన్య. యంతకనుమించినది రజస్వలఁ యిటు లార్యు లాడుచుండ్రు.

శా॥ కౌమార్యంబుగతించె నీదు చిరసాంగత్యంబున న్నాకు. స
ద్భామాధర్మయుతంబు షోడశశరత్ప్రాయంబు వచ్చెన్. స్మృతి
ప్రామాణ్యంబునెఱింగియున్నయెడ మత్పాణిగ్రహం బుర్వి నే
ధీమంతుండునుజేయనొల్లఁ డటుపై దిక్కేమి రత్నావతీ! ౧౫౧

పృథ్వి॥ రజస్వలవివాహమై రమణ దానిగర్భంబునన్
బ్రజంగన స్వపూర్వులా పదుగు రొందుదు ర్దుర్గతిన్.
రజస్వలకుఁ బెండిలిన్ రహినొనర్చు నాతండ్రియున్
నిజాన్వయజవింశతిన్ నిరయమందునం ద్రోసెడిన్. ౧౫౩

కం॥ కావున నేనును నీతోఁ గావించెద నుగ్రతపముఁ గల్యాణిరో! యిం
కేవిధమగుపనియునులే దావృద్ధులతోడ నమ్మయయ్యలతోడన్" ౧౫౪

వ॥ అని నిశ్చయించి యాకన్యలిరువురును ౧౫౫

సీ॥ ముంగిస ల్పాములు మోము మోమునఁజేర్చి ముద్దాడు నెద్దానిముంగిళులను
పిలుకలు పిల్లులుం జెలిమిమై నెచ్చోటు నాటలాడుచునుండు నన్వహంబుఁ
బులులును జింకలుం బూర్వవైరమువీడి క్రీడించు నెచ్చటం గూడిమిగులఁ
గాకము ఘూకము ల్గలసి యన్యోన్యంబు విహరించు నెచ్చోటి వృక్షవాటి
భర్తృయజ్ఞు తపఃప్రభావమున నిట్లు సత్వములకుఁ బరస్పరస్పర్థలేని
అట్టివాస్తుపదంబున కఖిలతీర్థసహితమున కేగి యట సుఖాసనమువైని. ౧౫౬

వ॥ కూరుచుండియున్న భర్తృయజ్ఞు సమీపించి కృతాంజలిపుటలై యందు
బ్రాహ్మణి సవినయంబుగా నిట్లనియె. ౧౫౭

ఆ॥ "ఏను సఖియునైన యీరాజకన్యతోఁ దపముఁజేయుటకుం బోఁ ద్వత్పదబ్జ
సవిధమునకు భక్తిఁ జనుదెంచియుంటిని. దద్విధిన్ వచింపు తాపసేంద్ర!" ౧౫౮

వ॥ అని యిట్లడుగుటయు భర్తృయజ్ఞుండు. ౧౫౯

కం॥ చాన! తపశ్చర్యావిధి నేను వచించెదను వినుము నిశ్శ్రేయస మ
ద్దాన నొనఁగూడు. స్వర్గమయైనం జెప్పనదియేమి. హస్తగతంబే. ౧౬౦

## —♦ బ్రాహ్మణీరత్నవతులు తపస్సు చేయుట. ♦—

సీ॥ చాంద్రాయణంబులు చరియించుటయుఁ దప్తకృచ్ఛ్రంబులాచరించి కృశులగుటయుఁ
సాంతపనంబులు సరిగ సల్పుటయును వర్షకాలంబున నానఁబడుటయు
నొకపూఁటనే తిని యూరకుండుటయును రెన్నాళ్ళకొక్కసారి తినుచుటయు
మూన్నాళ్ళకొకమాఱు భుజియించుటయు నయాచితమైనదాని భోంచేయుటయును
దపమునకు ద్వారములు గాఁగ ధాతచేతఁ జేయఁబడినవి-వీనిలోఁ జేతనైన
వాని రాగంబు ద్వేషంబు వదలిచలుపఁ గాంక్షితంబులు సిద్ధింపఁగలవు బిడ్డ! ౧౬౧

తే॥ శత్రులందును నత్యంతమిత్రులందు రాలయందును రతనపుఁ జాలమందు
నెపుడు సమమైనభావన యేర్పడునో యపుడ యయ్యెడు మోక్షంబు హస్తగతము

తే॥ ఎవఁడు లింగంబు గ్రహియించి యవల మరలఁ బాపరతుఁడగు వాని సర్వంబు భస్మ
మందు హుతమగునదివోలె వ్యర్థమగును-దపమువిధ మేమిచెప్పుదుఁ దనయ! నీకు"

వ॥ అనవుడు బ్రాహ్మణి వల్లెయని రత్నవతీసహితంబుగా స్వచ్ఛోదకపూరితం
బును బద్మినీషండమండితంబును నగు నొక్క జలాశయంబు సమీపించి ౧౬౪

సీ॥ చాంద్రాయణంబును జరియించె మునుమున్న-తరువాతఁ గృచ్ఛ్రసాంతపనములును
దదుపరి వత్సరత్రయము బద్ధశ్రద్ధ నాఱవకాలమం దారగించె-
మూఁడేండ్లు పదఁపడి మూన్నాళ్ళ కొకపరి యుపవాసముల నెంతయును గృశించె-
నొకనాఁడుగాక యింకొకనాఁడు పిమ్మట నొగిని నిరాహారయగుచునుండెఁ
గడఁగి హేమంతమున వారినడుమనిలిచె-నుండెఁ బంచాగ్నిమధ్యమం దెండవేళ-
బట్టబయలున వసియించె వర్షములను బ్రాహ్మణి తపంబుఁజేసెడిపట్లు నిట్లు, ౧౬౫

వ॥ దేవదేవుఁడగు చంద్రశేఖరు ధ్యానించుచు రేయుంబవళ్ళు నావె యట్లుంట
తిలకించి రాజకుమారి పరమసంతోషంబున ౧౬౬

సీ॥ నూటయేఁబదియేండ్లు నూటిగాఁ దపముండె ఫలభక్షణంబును సలుపుకొనుచుఁ-
బండుటాకులఁదింపుఁ బదఁపడి యన్నియేం డ్లాత్మలో ధ్యానించె నంధకారి-
నటుతరువాతఁదా నాఱునూఱులయేడు లుదకపానముతోడ నుండె నిష్ఠ-
నావల వెయియేడు లత్యంతనియతిమైఁ బవమానభక్షణ పరతమనియె.
నెట్టులెట్టులఁ దపముండె నట్టులట్టు లావెకుం దేజ మభివృద్ధియగుడు నపుడు
చంద్రశేఖరుఁ డంబికాసహితుఁడగుచు దరిసెనంబిచ్చి బ్రాహ్మణిఁ గుఱిచి ప్రేమ

క॥ "తనయా! యస్మద్వాక్యము విని చాలింపు మిఁకఁ దపము- వేగ నభీష్టం
బును వచియింపు మొసంగెద- ననుమానమువలన దేతదర్థ మెడంద" ౧౬౭

వ॥ అని ప్రసాదించుటయు బ్రాహ్మణి యిట్లనియె. ౧౫౯

తే॥ "ఏమి కావలెనింకను నీశ ! నాకు- దర్శనంబునొసంగితి దయనువచ్చి-
స్వప్నమునఁగూడఁ దాపకదర్శనంబు దొరకు నెంతయు దుర్లభ మరయ ధరణి"

వ॥ అని యిట్లు పలుకుచుండుటయు మరల భగవానుండు ౧౬౧

క॥ "నా దస్మదీయదర్శన మేతీనము వృథాగఁ దాపసీ ! కావున నీ
వేడేని వరముగోరుము- కాదనకది యిచ్చిపోవఁగాఁగలవాఁడన్" ౧౬౨

వ॥ అని వక్కాణించుటయు బ్రాహ్మణి మఱియు నిట్లనియె- ౧౬౩

శా॥ "రత్నవతీసమాఖ్యఁ గడు రాణవహించిన యానృపాత్మజా
రత్నము నాకుఁ బ్రాణసఖి- రాజశిరస్క ! చతుర్థయయ్యెఁదాఁ
బ్రత్నముగం బొనర్చెడిఁ దపంబును నేనుబొనర్చినట్టు- లీ
యత్నము పూర్వ మచ్చటనె యాచరితవ్యము నీకుఁ బూర్తిగన్- ౧౬౪

శా॥ చాలింపం దప మీపె తత్క్షణమ నేఁ జాలించెదన్- సంశయం
బే లే దిందుల- కీశ చెల్మి నిడలేకేఁ బెండ్లియున్ మాని యీ
లీలన్ మేలితపంబు సేయుటకు శూలీ ! పూనుకొన్నాను- నా
పాలన్ నీవు కృపాళువైన నిడు మీ పద్మాక్షి యిష్టార్థముల్" ౧౬౫

వ॥ అనినవిని భగవంతుఁడగు శశిశేఖరుండు రాజపుత్రినుద్దేశించి మేఘగంభీర భాషణంబుల నిట్లనియె. ౧౬౬

తే॥ పుత్రి ! నామాటవిని తపఁబును ద్యజించి చిత్తముననుండుకోరిక చెప్పుకొనుమ-
యీయరానట్టిదైనను నిపుడుదాని నీయనున్నాఁడనీకు నేఁ దోయజాక్షి ! ౧౬౭

వ॥ అనియిట్లనుడువుటయు రత్నవతి ౧౬౮

ఉ॥ "తామరతీవెమొత్తములఁ దద్దయు రాజిలు నేదియెద్ది శ్రే
యోమహితంబు బిట్టు తపముండెను బ్రాహ్మణి యత్తటంబునం
దామహనీయమైనహ్రద మాయుమ పేరటఁ దీర్థరాజమై
యీమహి ఖ్యాతిఁజెందవలె నెంతయు హైమవతీమనోధవా ! ౧౬౯

క॥ ఎవఁ డీతీర్థంబునఁదా నవగాహనమాచరించు నవ్వాఁడు సదా
దివమున వసింపవలయును భవదీయంబగు వరప్రభావమువలనన్- ౧౭౦

క॥ నేనుదపమున్న యదది శూద్రానామముతోడఁగూడి తత్సమమహిమన్
దానొకతీర్థోత్తమమై యేనస్సు వారింపవలయు నీశ్వర ! సరవిన్- ౧౭౧

క॥ ఈమహితతీర్థములకడఁ గౌమార్యంబునఁ దపంబు గావింపవలెన్-
స్వామీ ! యట నారాధ్యుఁడవై మనవలె నీవ తపనులందటిచేతన్" ౧౭౨

వ॥ అని కోరుసమయమ్మునకుఁ బుడమిం బగుల్చుకొని సూర్యసన్నిభంబగు శివలింగంబు బయలువెడలె-నంత భక్తవత్సలుండగు మహేశ్వరుండు తత్కన్యకల తపంబునకు మెచ్చి ౧౭౩

ఆ॥ "శూద్రియనఁగనీది సుందరీ! బ్రాహ్మణియనఁగ నీదు చెలిది యనఘమయిన
తీర్థయుగళమగుచుఁ ద్రిజగంబులందును బేరుగాంచఁగలవు-వెక్కసేల- ౧౭౪

తే॥ చైత్రశుక్లచతుర్దశీచంద్రవాసరమున నిటనాడి నాదులింగమున కధిక
భక్తి నభిషేకమొనరించి పంకజముల నర్చనముసేయ దీర్ఘాయువగు నరుండు" ౧౭౫

వ॥ అనిపలికి యంతర్ధానంబుఁజెందుటయు బ్రాహ్మణీరత్నవతు లిరువురును దత్తీర్థసవిధంబునఁ దపస్సుఁజేయుచు జరామరణవర్జితలై కల్పశతంబుండి యిప్పటికిని నక్షత్రరూపలై తారాపథంబునఁ గనఁబడుచున్నవా-రది మొదలుకొని యాతీర్థములు రెండును బ్రసిద్ధికివచ్చె-దవ్వుదవ్వులనుండి ప్రజలువచ్చి వానిలో స్నానమొనర్చి యాలింగంబును బూజించి పంచమహాపాతకములుచేసినవారైనను దీర్థప్రభావంబున స్వర్గంబున కరుగఁజొచ్చి-రింతలోపల భూలోకంబున యజ్ఞదానదేవతాపూజనాదిరూపమైన ధర్మకర్మంబులు నష్టంబులయ్యెఁ-ద్రిదివమంతయు విమానస్థులును నప్సరోగణసేవితులును నగు దేవతలతో స్పర్ధఁజేసెడి మానవులచే వ్యాప్తమయ్యె-నట్టితఱిం బరేతరాట్టు బ్రహ్మలోకంబునకుఁబోయి రెండుపత్రంబులు బ్రహ్మముందఱం బెట్టిచింతను వెలిపుచ్చుచు ౧౭౬

ఆ॥ "ఒకటఁ బాపములు మఱొక్కటఁ బుణ్యము ల్గలవు వీనిలోనఁ గమలజన్మ!
యొకటి చిత్రుచే మఱొకటి విచిత్రుచే వ్రాయఁబడినవివి మదీయసభను- ౧౭౭

తే॥ శూద్రి బ్రాహ్మణి యను పేళ్ళ శుద్ధతీర్థములు గలవు హాటకేశ్వరమునను రెండు-
పుణ్యతమమైన శివలింగమును జెలంగు నమ్మహాక్షేత్రమధ్యమం దవ్విధమున- ౧౭౮

కం॥ అమూఁడింటిమహాత్తను హేమ స్తేయాది దారుణోరతులుక్
వైమానికులంబలె స్వర్ధాములుకాఁజొచ్చి-రేటిధర్మము లింకన్- ౧౭౯

తే॥ రౌరవముదొట్టి యత్యంతరౌద్రములగు నారకములెల్ల నుండెడివారులేక
పాడువడియున్నయవి ప్రజాపతి! యిఁకేమిచెప్పుకొందును నీతోడ సిగ్గువిడిచి-

సీ॥ ఆత్మలోపల నేని యధ్వరంబులమాట తలపెట్టఁడొకఁడు- నీవిలయమే మొ-
పిడికెడుగింజలేన్ బీదసాదలకుఁదాఁ బెట్టఁడొక్కఁడు- నేమిపట్టుదలయొ-
దంభంబునకు నేని దైవతంబులఁగూర్చి నతిసేయఁడొక్కండు నాస్తికతను-
శ్రాద్ధంబునాఁడేని స్వపితృతర్పణమును విడువఁడొకండు దుందుడుకుమిగులఁ-
గాన వదలుకొంటి నే నీదునుద్యోగ- మిమ్ము శక్తుఁడైన యింకనొకని-
కేమిటికిలిఖించు టీకమ్మలం దింక జమ్మికిందివాత్రిచాయఁ దోఁప- ౧౮౧

వ॥ అనినవిని పంకజాసనుండు పాకశాసనుంబిలిచి ౧౯౩

తే॥ "శక్ర! నామాటవినినీవు క్షేత్రస్థలమునకేగి యిప్పుడ శ్రీహాటకేశ్వరమున
శూద్రి బ్రాహ్మణి యనువేళ్ళ శుద్ధతీర్థములను శివలింగమును బాంసువులను నింపు"

వ॥ అనినవిని శక్రుండు సత్వరంబుగా క్షేత్రస్థలంబునకుంజని యా తీర్థములను దల్లింగమును బరాగములచేఁ గప్పివైచె- నీకలికాలంబునసహితము సకలపాతకనివృత్తికై యాతీర్థంబులలోని మృత్తికతీసి నీరమాడి తిలకంబు ధరించునది- చతుర్దశీ సోమవాసరంబునఁ తత్తీర్థద్వయసవిధంబున శ్రద్ధాయుతంబుగా శ్రాద్ధంబుపెట్టినవానికి గయాశ్రాద్ధంబుతోఁ బనిలేదని స్వాయంభువమనువు వక్కాణించె- మీరలడిగిన బ్రాహ్మణీశూద్రీతీర్థవృత్తాంతముం జెప్పినవాఁడ- నియ్యది చదివినను విన్నను నిస్సంశయంబుగా నానాఁటి పాతకంబు నశియించు- నిట్లు తల్లింగపూజనంబున సిద్ధుండును జిరాయువును గాని నరుఁ డీలోకంబునఁ గానంబడఁ"డని వచించుటయు ఋషులిట్లనిరి. ౧౯౪

## —* నాగరాష్ట్రకుల శ్రైష్ఠ్యవర్ణనము. *—

తే॥ "మూఁడునరకోట్లతీర్థము లిమ్మను సకృత్స్నముగను శ్రవణించియుంటిమి మునులవలన
నఖిలతీర్థంబులందాడ నబ్బుఫల మెటుల లభించును నల్పాయువులకుఁ గలిని" ౧౯౫

వ॥ అనియిట్లు ప్రశ్నించుటయు సూతుండిట్లనియె- ౧౯౬

సీ॥ "ముఖ్యంబు లందులో మూఁడు తీర్థంబులు- రాణనొప్పను మూఁ డరణ్యములును-
ముక్తిప్రదాయకమ్ములు మూఁడు క్షేత్రముల్ -మును మున్న వాచ్యము లిమ్మూఁడు పురులు-
మూర్ధంబులనఁబడు మూఁడు పర్వతములు- కడు శస్తములు మూఁడు గ్రామములును-
మరి పెంపునొందఁ గూర్చు మూఁడు తరంగిణుల్ - మునివాసయోగ్యము లిమ్మూఁడువనము-
లఖిలపాపహరములై మర్త్యలోకమందున్న యట్టి వానియన్నిటను 'నె
వండు స్నాతుఁడగునో వాఁడు తా సర్వతీర్థావగాహఫలము నందఁగలఁడు- ౧౯౭

వ॥ ఈయిరువదినాలుగింటను నొక్కొక్క మూఁడింట నీరమాడిన సర్వతీర్థస్నానఫలంబు గలుగు"నని యిట్లువక్కాణించుటయు శౌనకాదులు ౧౯౮

సీ॥ "ముఖ్యంబులైన యామూఁడుతీర్థములెవ్వి? రాణనొప్పెడి మూఁడరణ్యము లెవి?
ముక్తిదాయకములౌ మూఁడు క్షేత్రములెవ్వి? పూర్వవాచ్యములైన పురములెవ్వి?
మూర్ధంబులనఁబడు మూఁడు శైలములెవ్వి? కడు శస్తమౌ మూఁడు గ్రామములెవి?
మరి పెంపునొందఁగూర్చు మూఁడు హ్రదులెవ్వి? మునివాసయోగ్యమౌ వనములెవ్వి?
యఖిలపాపహరమ్మైన మర్త్యలోకమందున్నయట్టి వాని నొక్కటొక్కటి
యానతీయు"మనుడు నారౌమహర్షణి యెలమిమీఱ వారి కిట్లులనియె- ౧౯౯

వ॥ కురుక్షేత్రంబును హాటకేశ్వరంబును బ్రాభాసికంబును బుణ్యక్షేత్రంబులు సర్వపాతకనాశకంబులు- నీక్షేత్రత్రయంబున స్నానమొనరింప నభీష్టసిద్ధియగుటయు కాక చతుర్వింశతిస్నానఫలంబు ప్రాప్తించెడిఁ- బుష్కరంబును నైమిశంబును ధర్మారణ్యంబును నరణ్యంబు- లీ మూఁడింటను స్నాతుఁడగువాఁడు చతుర్వింశతిస్నానఫలభాక్కయ్యెడు- వారాణసియు ద్వారకయు నవంతియుఁ బురంబు- లీమూఁడింటనాడు వాఁడును జతుర్వింశతిస్నానఫలభాక్క- బృందయు ఖాండవంబును ద్వైతంబును వనంబు- లీమూఁడింటఁ గ్రుంకువాఁడును జతుర్వింశతిస్నాతయ- కల్పగ్రామంబును శాలిగ్రామంబును నందిగ్రామంబును గ్రామంబులు- వీనిమూఁడింట స్నానమొనర్చినఁ జతుర్వింశతిస్నానఫలంబుగలుగు- వహ్నితీర్థంబును శుక్లతీర్థంబును పితృతీర్థంబును దీర్థంబులు- వీనిమూఁడింటఁ దీర్థమాడఁ జతుర్వింశతిస్నానుండగు- శ్రీశైలంబును నర్బుదంబును రైవతంబును బర్వతంబులు- వీనిమూఁడింట నీరమాడినఁ జతుర్వింశతిస్నానఫలంబు చేకురెడిని- గంగయు నర్మదయు సరస్వతియు నదులు- వీనిమూఁడింటనాడు వాఁడును జతుర్వింశతిస్నానఫలభాక్కయ్యెడు- నీయిరువదినాలిగింట స్నానమొనర్చిన సార్ధకోటితీర్థస్నానఫలంబు సమకూరు- నొకదాన మునుంగ మూఁడింటమునింగినంత యగు- మీచే నడుగఁబడిన దంతయు వాక్రుచ్చితి-మఱియు నేమివినవలతు"రనుటయు శౌనకాదులిట్లనిరి- ౨౦౦

తే॥ "హాటకేశ్వరమున నసంఖ్యాకములయి యలరుతీర్థంబు లాఢ్యదేవాలయములు
వినిచినాఁడవు నీవు సవిస్తరముగ మాను సూతాత్మజా! మంచిమాటె కాని ౨౦౧

తే॥ వర్షశతమునకేఁ విధివంతముగను వానియన్నింటు మునుగంగ వశముగాదు-
అవ్విధంబున దేవతాయతనములను నరుల కవలోకనము సేయఁ దరముకాదు- ౨౦౨

తే॥ అల్పమాయు వుకృతయుగమందుఁగూడ మనుజులకుఁ-దేత్రి ద్వాపరమునను నటులె-
కలియుగంబునఁ జెప్పంగవలసిలేదు వారియాయువ్యముంగూర్చి వసుధలోన- ౨౦౩

తే॥ ఇట్టు లల్పాయువులుగాఁగ నెఱిఁగి నరుల నధనులకుఁగూడ సర్వతీర్థావగాహ
బహుళదైవతదర్శనఫలముగలుగ నొకయుపాయంబువచియింపు ముత్తమంబు" ౨౦౪

వ॥ అనవుడు సూతుండు ౨౦౫

కం॥ "ఈవిషయంబును బూర్వం బా విశ్వామిత్రిపౌని యాశ్రమమునకుఁ
దావచ్చి యడిగె నానర్తావన్యధినాథుఁ డిటుల నార్యులు! వినుఁడీ- ౨౦౬

ఆ॥ "అనఘ! లెక్కలేని ఘనతీర్థములు వాన సలుపఁదగినయట్టి స్నానవిధులు
నేదినమున మఱియు నేవారమున నెట నాడవలసినదియు నదియుఁగాక ౨౦౭

ఆ॥ దానములును దేవతాదర్శనంబులు మునిముఖంబునుండి వినినవాఁడ-
వర్ష శతమునకును వానియన్నింటి ఫలంబుఁ బడయ నెట్టిలావరికిని ౨౦౮

ఆ॥ అలవికాదుకాన సులభమైనయుపాయమునను నొక్కదాన మునుఁగుమాత్రి
సకలతీర్థఫలము సమకూరువిధమును నానతీయుమయ్య యార్యవర్య! ౨౦౯

క॥ ఒక దేవతదరిసించిన సకలామరదర్శనమున సమకూరుఫలం
బకలంక! కలుగువిధమును బ్రకటింపఁగదయ్య నిన్నుఁ బ్రస్తుతిసేతుఙ్" ౨౧౦

వ॥ అనినవిని విశ్వామిత్రుండు పెద్దయుంబ్రొద్దు విచారించి ౨౧౧

చ॥ "విను సరవాస్య మోహాధిప! వేనమునింగిన సర్వతీర్థముల్
చని మునుఁగన్ లభించు ఫలసంచయ మబ్బునో యట్టితీర్థముల్
తనరెడి నందు నాలు- గటులన్ సకలాఘహారంబులై నచ
క్కని శివలింగము ల్కరము గాఁ లెడి నిర్వదియేడు తత్సలిల్- ౨౧౨

క॥ అలింగంబులనన్నిటి నోలిని దరిసించిన సకలోత్తమమదివిమ
జ్జాలముదరిసించిననగు మేలైన ఫలంబుగలుగు మేదిన్యధిపా! ౨౧౩

క॥ ఏదేవతదర్శించిన నేదేవతఁ గొల్చినను మహీపాలమణీ!
యీదివ్యలింగపూజకుఁ గాదెన- యింకేమిచెప్పఁగావలె నీకున్" ౨౧౪

వ॥ అని పలుకుటయు రాజిట్లనియె- ౨౧౫

తే॥ "వేన స్నానంబుఁజేసినచో నరుండు బహుళతీర్థావగాహనఫలమువడయు
నట్టిపావనతమములౌ ననఘతీర్థములను దయతోడ వాకొవ్వవలయు నార్య!" ౨౧౬

వ॥ అనియిట్లుప్రశ్నించుటయు విశ్వామిత్రుండు ౨౧౭

తే॥ "ఘ్నాజనక్రియమాణమహా శ్రాద్ధములఁ గరంబు నిర్విణ్ణయై బహుళంబునందు
వచ్చెడి చతుర్దశిని నమావాస్యయందు మఱియుఁ బిత్రుపక్షమున గయ యరుగుదెంచి

క॥ తనలో నివసించుటచేతను నొకకూపిక సత్యంబు తత్క్షేత్రమునన్
ఘనతీర్థంబయి వెలసెను- ననఘా! నాల్గింటిలోన నది యొక్కటిమా- ౨౧౯

క॥ ఎవఁ డతిభక్తిశ్రద్ధలఁ దవిలి యిదంక్షేత్రమందుఁ దానాడునొ త
ద్దివసంబున నే యవ్వాఁ డవుఁ బిత్రుసంతారకుం డిలాధిప! వినుమా- ౨౨౦

ఆ॥ అట్లు శంఖతీర్థమగు రెండవది-తపః ప్రథమదివసమందు భక్తి దాన
స్నానమాచరించి శంఖేశ్వరుం గొల్వ సకలతీర్థఫలము సరవిఁ గలుగు- ౨౨౧

ఆ॥ అట్లు నాదుపేర నలరెడితీర్థంబు మూఁడవది మహీశ! చూడు-భాద్ర
పదసితాష్టమిని సభక్తి నటం గ్రుంకి యేనునిలిపినట్టి యీశుఁ గొలువ ౨౨౨

ఆ॥ సర్వతీర్థఫలము సమకూరు- శక్రతీర్థాభిధానమునను ఖ్యాతమగుచు
బాలమండనంబు పరఁగుఁ జతుర్థమై హాటకేశ్వరమున నవనినాథ! ౨౨౩
ఆ॥ దాన నాశ్వయుజములోని పితౄష్టమీదినము మొదలు పంచదివసములును
స్నానమాచరించి శక్రేశ్వరుంగొల్వ సర్వతీర్థఫలము సంభవించు" ౨౨౪
వ॥ అనినుడువుటయు మఱియు రాజిట్లనియె- ౨౨౫
కం॥ నాపయి నత్యంతము శ్రద్ధోపేతుఁడ వైతివేని యుర్వీశ! గయా
కూపస్నానవిధానం బోపికతోఁ జెప్పుమయ్య యుండినరీతిన్" ౨౨౬
వ॥ అనియి ట్లడుగుటయు వెండియు విశ్వామిత్రుండు ౨౨౭
కం॥ "రవి కన్యారాశిగతుం డవునెడ నమవసను భర్తృయజ్ఞోక్తవిధిన్
దవిలియట హాటకేశ్వరభవులుం బరిశుద్ధులు నగు పాపలతోడన్ ౨౨౮
కం॥ శ్రద్ధాపూతమనస్కత శ్రాద్ధంబుం బెట్టునతఁడు స్వపితరులను సం
శుద్ధులఁజేయం గలుగును బుద్ధిమదగ్రేసరా! విభూ! నిక్కముగన్- ౨౨౯
ఆ॥ భర్తృయజ్ఞవిధిని బాటింపకుండఁ దత్స్నానజాతులైన ధరణిసురుల
వదలిపెట్టికాని వారిలోనైనను ఖలుఁగాని శ్రాద్ధకర్మమునను ౨౩౦
ఆ॥ పిలువఁగూడ- దట్లుపిలిచి పెట్టంబడు శ్రాద్ధ మన్నిటను సమృద్ధమయ్యుఁ
జవిటినేలవిత్తు సస్యంబునుంబోలె వ్యర్థమగును భూప! వాస్తవముగ- ౨౩౧
ఆ॥ అంధునెదుటజరుపు నభినయంబులువోలె బధిరునెదుటఁ జేయఁబడిన గాన
రవముభంగి స్థానభవులైనవిప్రుల వదలి చేయుపనులు వ్యర్థమధిప! ౨౩౨
తే॥ అజ్ఞులైనను స్థానికు లర్హులగుదు- రాగమజ్ఞులు నేనిని యుఁ ద్యాజ్యులన్యు-
లవనినాయక! పితృదేవతార్చనములఁ దమి నిశేషించి సోమపానమున- వింటె-
కం॥ స్థానికుఁడుదొరకకుండినచో ననలమె దర్భలో త్రిశుద్ధిగ నొక సు
స్థానమునఁజేర్చి శ్రద్ధను వాని పురస్థలమునందు వసియించి యొగిన్ ౨౩౪
ఆ॥ శ్రాద్ధమాచరించి చాలకాలమునకేన్ స్థానికుఁడు లభింప వానిఁ బిలిచి
తగ భుజింపఁజేసి దక్షిణయీయనౌ- స్థానికేతరునకుఁ దగదుతగదు- ౨౩౫
తే॥ స్థానికు ల్వెర్ఱియున్న నుజాలు నొక్కబాహ్యుఁ దలశ్రాద్ధమును దోమభాక్కుఁజేయ
పంచగవ్యంబుచే నింపఁబడినపాత్రి నొక్క కలుఁబొట్టుపడిక్రాదె యొగిని జెలుచు-
సీ॥ ఓ కన్ని వంకరలున్నవో యెఱుఁగని యత్యంతమూర్ఖుండె యగును గాక
ముకుచెవుల్మొదలైన ముఖ్యావయవముల హైన్యంబుగలయట్టిఁ డగును గాక
కాళ్లొ వ్రేళ్లో యధికంబయియుండుచు నతివికారశరీరుఁ డగును గాక-
వేదభామలలోన విద్వద్విజంబుచే ననయంబు దూషితుం డగును గాక-

స్థానికు సె పిల్వనగుఁజువిూ శ్రాద్ధకృతిని నుత్తముండు లభింపకయున్న యపుడు-
కన్యకాదానమున శ్రాద్ధకర్మమునఁ గులీను వార్జింపవలెఁ గోరె నేని శుభము-
సీ॥ బ్రాఁకులలో రావిమాఁడ్కి- నాయుధముల వజ్రమ ట్లేఱ్ల దేవనదివోలె
సురలలో హరివలె సరసుల శరధిలా గడవిజంతువుల సింహంబుపోల్కి-
గ్రహముల నాదిత్యువహిఁ జుక్కలం జంద్రులలి నద్రులను సురాలయముభాతి
వాజుల నుచ్చైశ్శ్రవంబువిధంబున ద్విపదంబులందున ద్విజునికరణిఁ
గరుల నైరావతముమాద్రిఁ గామినీజనంబులోన నరుంధతిభంగిఁ బక్షి
సంఘమునఁ దార్క్ష్యుచాడ్పున స్థానజాతవిప్రులం దష్టకులజుండు పెద్దయగును-
కం॥ ఈవిధమెఱింగి శ్రాద్ధముగావించెడిసమయమునను గన్యకనొసఁగక్
బోవువడి నధ్వరమునను గావలెనని యష్టకులజు గడియింపవలెక్- ౨౩౯
ఆ॥ అష్టకులుఁడువచ్చి యరుగుపై నెక్కఁచోఁ బ్రీతి నాడఁదోడఁగుఁ బితృగణంబు-
గర్జనంబొనర్చుఁ గడుఁ బ్రీతిమైఁ బితామహగణంబు-వింటె మనుజనాథ : ౨౪౦
తే॥ జందె మపసవ్యముగదొడ్గి సరిగమాకు లలిని దిలదర్భసహితమౌ సలిలములను
విడుచు దౌహిత్రుఁడని కడువేడ్కతోడఁ జెప్పుకొందురు పితరు లోక్షితిప! మఱియు॥
వ॥ అనివక్కాణించుటయు రాజిట్లనియె- ౨౪౧
తే॥ "అష్టకులజులు తన్నాగరాళియందు శ్రేష్ఠులని స్పష్టముగనీవు చెప్పినాడ-
వల్పమెయుండ దిటు హేతు వరసిచూడ-వినుచు మయ్యది నాకు సవిస్తరముగ"
వ॥ అనియిట్లుప్రశ్నించుటయు విశ్వామిత్రుండు ౨౪౪
ఉ॥ "సత్యము నీవుపల్కినది క్ష్మాతలనాయక! సాంగవేదముల్
నిత్యము వల్లెవేయఁగల నేర్పరు లింకను నున్నవారు సం
స్తుత్యులె నాగరుల్-సవనధూర్వహణంబునయందు శ్రాద్ధపుం
గృత్యమునందుఁ గన్యకలనిచ్చెడిపట్లను వారు యోగ్యులే- ౨౪౫
ఆ॥ ఇంక నేమియనిన నింద్రుండు వారియం దష్టకులులఁజేసె నగ్రణులుగ-
నన్యనాగరులును ననుమతించిరి దాని-కష్టకులులు శ్రేష్ఠులైరి యిట్లు- ౨౪౬
తే॥ అట్లుగావున శ్రాద్ధమం దష్టకులులు భోజ్యు-లవ్వారు దొరకకపోయినప్పు
డన్యనాగరులను బిల్చునది-మఱొక్క స్థానమునఁబుట్టినట్టిరు తగరు దాన- ౨౪౭
కం॥ శ్రుతులనునాల్గిటిఁజదివిన మతిమద్వరులైనఁగాని మాన్యులుగారిం
దితరద్విజు-లీనియమము కృతమయ్యెను భర్తృయజ్ఞకృతిచేతను ముక్- ౨౪౮
తే॥ నాగరద్విజుఁబిల్వ కన్యద్విజన్మఁ బిలిచి శ్రాద్ధంబొ యజ్ఞంబొ సలుపునేడల
వ్యర్థమగుఁగాని యయ్యది సార్థకంబుగాదు భూపాల! యింక నేమికలదు చెప్ప-

## —• నాగరబ్రాహ్మణులు పతితులైనవిధము •—

వ॥ అని విశ్వామిత్రుండు వారుప్రుచ్చుటయు నానర్తమహీవల్లభుం డిట్లనియె.

ఆ॥ "ధూర్తయజ్ఞుచేతఁ బలుమంది బ్రాహ్మణుల్ శ్రాద్ధయజ్ఞముల నిషిద్ధులైరి-
విబుధవరులు వేదవేదాంగపారగుల్ తీర్థజులును నన్యదేశజులును- ౨౫౧

సీ॥ ముడుచెవులు మొదలైన ముఖ్యావయవముల హైన్యంబుగలిగిన యట్టివారుఁ
గాళ్ళో వ్రేళ్ళో యధికంబయియుంటచే నతివికారశరీరులైనవారు
వర్ణాశ్రమాచారవర్తన ల్విడనాడి క్రొత్తపద్ధతిద్రొక్కఁ గోరువారు
నో కెన్ని వంకర లున్నవో యెఱుఁగక యగ్గలంబును మూర్ఖులైనవారుఁ
గునఖులైనవారుఁ గుష్ఠాదియుతువారు శ్రాద్ధయోగ్యులనుచుఁ జాఁటిచెప్పి
మంచిమంచివారి మర్యాదపోవ ననర్హులనఁగ నేటిన్యాయమయ్యె ! " ౨౫౨

వ॥ అని యిట్లడుగుటయు విశ్వామిత్రమహర్షి ౨౫౩

ఆ॥ "కలవు కారణములు కావలసినయన్ని- వినుము చెప్పెదను సవిస్తరముగ-
మహీసురాంగనలు చమత్కారభూనాథుపడఁతి దానములను బతితలైరి- ౨౫౪

చం॥ మగలు ప్రవాసమేగుతఱి మంచిగవచ్చి మహీశుభార్య మేల్
నగల నొసంగఁ దీసికొనివారు తదంగన- లాకతంబునన్
మిగులఁ బృథక్త్వమేర్పడియె మీఁదను లోపలఁగూడవారి- క
ట్లాగిని దదన్వయస్థుల కయోగ్యతయేర్పడె శ్రాద్ధపుంగ్రియన్- ౨౫౫

క॥ పదపడి విద్యాధనముల మదయుతులై తన్నుఁజూచి మాటాడమి బి
ట్టుదయుండై దుర్వాసుఁడు మదమేద శపించి పతితముఖ్యులఁజేసెన్- ౨౫౬

తే॥ కుశుఁడు రాజ్యంబుసేయుచోఁ గూళలైన రక్కసులువచ్చి భయపెట్ట నొక్కమొగిని
బ్రజలు భీతిని మన్నినిపాలికరిగి చెప్పుకొనిరి మహీశ! తచ్చేష్టితంబు- ౨౫౭

చం॥ అతఁడు విభీషణున్ గుఱిచి యంపెను లంకను వార్తయంత- నా
దితిసుతుఁ డయ్యుదంతమును దెచ్చినదూతకు జోతవెట్టి త
త్ప్రియగు జానకీపతి పవిత్రచరిత్ర స్మరించుకొంచు నో
ధిత తదనిష్టకారుఁడయి దిక్కులఁ బాఱఁగఁద్రోలె వారలన్- ౨౫౮

ఆ॥ కరముభీతిఁజెంది గంధర్వలోకంబుఁ జేరి రసురులంతఁ- జేరికూడ
రావణానుజన్ము రాపిడిపడలేక మనుజలోకమునకుఁ జనిరి పిదప- ౨౫౯

చం॥ కుశధరణీశుదాడి నటఁగూడ వసింపఁగలేక యెంతయున్
గృశులయి బ్రాహ్మణాకృతులఁ బృథ్విఁ జరించిరి- విప్రసత్తచే
వశపడదయ్యె నుండుటకు వారలలోన- ననంతరంబు వా

రక్షణవిహీనులౌచు భృశ మయ్యయిచోటుల కేగి రోగియుక్ ౨౬౦

కం॥ పతితులఖుక్ సంస్థానము తతము చమత్కారపురము దర్శించి యటుక్
కృతవసతులైరి రక్ష స్తతి తత్రిత్యులఖునడుమ ధాత్రీరమణా! ౨౬౧

కం॥ మాయావిశారదులయిన యాయసురులు విద్యచేత నర్థముచేతక్
బోయి సగ మాక్రమించిరి రాయుర్వీపాల! యాపురోత్తమ మోజక్- ౨౬౨

శా॥ నాటంగోలెను నాగరద్విజులు భూనాథా! నిలింపాహితే
ట్కోటిక్ దాఁటిరి మాటిమాటికి నెవో కూర్రకిర్యలేసేయు- చె
ప్పాటక్ వారిక నర్హులౌదు రవనీబర్హిర్ముఖుల్పెట్టు స
చ్ఛాటీదానముఖప్రశంసితములౌ శ్రాద్ధంబులం గొల్వఁగక్- ౨౬౩

ఆ॥ అట్లుగాన నరకమందునఁ బడఁద్రోయు వీరి శ్రాద్ధకృతుల విడువవలయు-
యత్నపూర్వకముగ నధ్వరంబులఁగూడఁ దగదు వీరిఁబిలిచి యొగిని గొలువ- ౨౬౪

చం॥ మఱియొకదోషముం గలదు మానవనాయక! విన్ము- కూషపా
ద్దరళ మడంచుహేతువున స్థాపితులైరి త్రిజాతు లప్పురీ
వరమున- నాఁటఁగోలెనది వాడఁబడె న్నగరాఖ్య- నెల్ల నా
గరులుఁ ద్విజాతులైరి- యటుగావున వారలు భర్తృయజ్ఞుచే ౨౬౫

ఉ॥ వర్జితులైరి శ్రాద్ధమున- వారి స్పృశించినవారె శుద్ధికిక్
మార్జనఁజేసికోవలయు- మాలనిమూలమునం బొసంగె నీ
దుర్జనతాప్రసక్తి సవధూర్వహులైనను నాగరాళి- కో
యార్జితభూరివైభవ! సమర్హులెటయ్యెద రట్టివారికన్?" ౨౬౬

వ॥ అని వక్కాణించుటయు నానర్తమహీవల్లభుండు వెండియునిట్లనియె-

కం॥ "ఈకారణమును దయతో వాకొనవలయును మునీంద్ర! వరగుణసాంద్రా!
నీకుఁ జరాచరరూపక లోకజ్ఞానంబులోన లోపములేమిన్" ౨౬౭

వ॥ అనియిట్లు పృచ్ఛఁజేయుటయు మఱియు నగాధిసూనుండు ౨౬౮

కం॥ "ఇక్కడవారుచ్చెద నీ కొక్కపురావృత్తమును నృపోత్తమ! వినుమా-
మిక్కిలిగ భర్తృయజ్ఞన్యక్కృతులౌ విప్రులెవరొ యదియు వచింతున్- ౨౭౦

—* { విప్రవేషముతో నొక చండాలుఁడు చమత్కార పురిఁ బ్రవేశించుట. } *—

తే॥ వర్ధమానపురంబున వర్తిలె నొకయంత్యజుఁడు మును కుంభకుఁడనెడిపేరఁ
గఠినచిత్తుండు నత్యంత కలుషకృత్తుఁ బిల్లికనులుగలాఁడును నల్లమొద్దు- ౨౭౧

తే॥ కొంతకాలమునకు వాఁడు కొడుకుఁగనుడు వాఁడుమాత్రము కడురూపవంతుఁడయ్యె
నఖిలలక్షణలక్షితుం డఖిలకార్యదక్షుఁడుం గూడ నై శుక్లపక్షచంద్రు ౨౭౨

తే॥ అనుకరించుచుఁ బెంపొందు నతని చక్కదనము నగ్గింపఁజొచ్చె భూజనము కరము-
బుద్ధిఁదెలిసి కుటుంబంపు శుద్ధిఁగనుడు నాత్మను విరక్తియుదయించె నతని కకట!

తే॥ అంతఁ జింతావృతస్వాంతుఁడగుచునతఁడు దేశదేశంబులకుఁబోయి తిరిగితిరిగి
క్షుత్పిపాసురాకృతితోఁ జమత్కారపురముఁ జేరి మున్ప్రాపటు స్నానము ల్సేసికొనుచు

సీ॥ ఛాందోగ్యుఁడను పేరి సన్మానిగోత్రమం దత్యంతమగు ఖ్యాతినందినట్టిఁ
డేపార్ద్రుఁజూచిన నేదియోవ్రతమును బొనరించుచుండెడి పూతచరితుఁ
డఖిలవేదములఁ దదంగంబులును బేర్మిఁ గొనవెళ్ళఁజదివిన కోవిదుండు
ప్రతివర్షమునను వైభవసమేతంబుగా యాగంబుఁజేసెడి రాగరహితుఁ
డగు సుభద్రాఖ్యుఁ డవ్విటు నలరుచుండ మాధుకరమెత్తుకొనుచుఁ దన్మందిరంబు
"భవతి భిక్షాం దదా" తని సవినయముగఁ జని ప్రవేశించె- నింక నేమనివచింతు-

తే॥ తత్సుభద్రాఖ్యనాగరధారుణీసురునకు నొకకూఁతు- రది మూఁడుచనులుగలది-
పంటిపైఁ బల్లు మఱి పృష్ఠభాగమందు సుడియొకండును నుండెఁ దత్సుతకు క్షితిప!

ఉ॥ పుట్టుదరిద్రుఁడుం గులముపోయినవాఁడు విపత్తులోన ను
న్నట్టిఁడుగూడఁ జచ్చెదనటన్న భయంబునఁ దండ్రివచ్చి "యీ
పట్టిని నీకొసంగెదను, బాణిగ్రహింపు" మటంచు దండముల్
పెట్టి కరంబు వేడినను బెండిలి సేసికొనండఁ కేమనన్- ౨౭౪

కం॥ దేనిపలువరుస యిమ్మడిగానుండునొ యాఱునెలలు గడియకమును పే
దానిపతి ధృతశరీరుండౌనని సాముద్రికవిదులందురు ధరణిన్- ౨౭౫

తే॥ మూఁడుపాలిండ్లుగలిగిన యాఁడుపడుచు మామవంగసమంతయు మాయఁజేయు-
లేదు సందేహ మిద్దాన లేశమేని- గాన దూరంబునను వీడనొను దాని- ౨౭౬

తే॥ పృష్ఠమందున సుడిగలపిల్ల రయము కులటయై పాపముం జాలఁ గూడఁబెట్టు-
నట్లుగావున భూపాల! యట్టికన్యఁ బరిహరింపంగవలయు సత్పురుషులెపుడు-

కం॥ అంతనది దినదినంబున కింతింత పెరుంగుటయును నీక్షించి కడున్
జింతించి యాసుభద్రుఁడు శాంతిం గనలేకపోయె! స్వాంతములోనన్- ౨౮౧

తే॥ "ఏమి సేయుదు- నేనింక నెటకుఁజనుదు- నెట్లు దీనికి మగఁడింక నేలుపడును-
మాటిమాటికి సంప్రార్థ్యమానులయ్యు దీనబధిరాంధపంగులున్ దీనిఁగొనరు- ౨౮౨

తే॥ ఎనిమిదేండ్లది గౌరినా నెన్నఁబడెడి- నగును రోహిణి తొమ్మిదియబ్దములది-
దశశరత్ప్రాయ కన్య- యంతకునుమించినది రజస్వల- స్మృతికారు లందురిట్లు-

శ్లో॥ "మాతాచైవ పితాచైవ జ్యేష్ఠభ్రాతా తథైవచ
త్రయ స్తే నరకం యాంతి దృష్ట్వా కన్యాం రజస్వలాం- ౨౮౪

చం॥ అనియిటు ధర్మశాస్త్రముల నార్యులువ్రాసి" రటంచు నెంతయున్
మనమునఁ జింతసేయ నెడ మాధుకరార్థము తన్నిపాదుఁ డా
తనియిలు సేరవచ్చుటయుఁ దద్రమణీయతఁ గాంచి బ్రాహ్మణుం
డని మది నిశ్చయించుకొని యబ్బురమంది సుభద్రుఁ డిట్లనున్. ౨౮౫

ఉ॥ "ఎచ్చటినుండివచ్చితివి ? యెచ్చటికేగుచునుంటి వియ్యెడన్ ?
ముచ్చటయయ్యె నిన్నుఁగన ముద్దులుగారెడి మోమువాఁడవై
బిచ్చము పెట్టుమంచు నిలు వేదవిధంబున నడ్గెదేల ? నీ
యచ్చపుగోత్రమేది ? చెపుమయ్య భవత్ప్రవరాభిధానమున్" ౨౮౬

చం॥ అనవుడు వాఁడు "గౌడవిషయంబున భోజకటాభిధానమై
తనరెడి మామకీనమగు స్థాన మటం బలుమంది బ్రాహ్మణుల్
మనుదురు వారిలోపలను మాధవనామక వేదపారగుం
డనఘుఁడు నాదుతండ్రి యతఁ డార్య ! వసిష్ఠసగోత్రుఁ డయ్యెడిన్. ౨౮౭

ఆ॥ ఎంతయును ఘనుండు నేకప్రవరసూచితుఁడు మదీయనామ మడిగెదేని
జ్ఞను గాగ్రగణ్య ! చంద్రప్రభుం డందు రష్టమాబ్దముననె యయ్యె వడుగు.

కం॥ వడివడి వడుగుం బొనరిచి మడిసెను నాజనకుఁ డంత మాయమ్మయుఁ దాఁ
బడియెం దచ్చితిపైన న్నడవులపాల్సేసి యేమియడిగెద వింకన్. ౨౮౯

ఉ॥ అంత విరక్తిగల్గుటయు నయ్యయితీర్థములందుఁ గ్రుంకు చ
త్యంతము సంచరించి యిట కాఁగతుఁడైతిఁ బ్రభాసతీర్థ మీ
ప్రాంతమునం జెలంగునఁట యచ్చటికేగెద నేఁడొ రేపొ నా
కింతయు మించుకర్జ మిఁక నెయ్యది గానఁగరాదు చూచినన్. ౨౯౦

చం॥ చదువఁగలేదు వేదములు శాస్త్రము లంతయు మున్నె సున్న య
య్యదియొకతంబుగా నిటుల యాత్రలు సేయుచు భిక్షుఁడనై
బ్రదుకుచునున్నవాఁడ నెదొ పద్ధతిదొక్కక కూరుచుండినన్
జదువును సంధ్యలేని పశుసన్నిభు నెవ్వఁడు గౌరవించెడిన్ ?" ౨౯౧

—♦ సుభద్రుఁడను బ్రాహ్మణుఁడు చండాలునకుఁ దనబిడ్డనిచ్చుట ♦—

చం॥ అనవిని యాసుభద్రుఁడు ప్రహర్షముఁ జెంది "సుదేశసంభవుం
డనుపమసుందరాకృతియు నందును బ్రాహ్మణుఁ డట్లుగాన నీ
తనికి మదీయకన్యకను దప్పకయిత్తుఁ బ్రతిగ్రహించుచో
ననఘుఁడులంబు పుష్పవతియై యది దూష్యము సేయులోపలన్" ౨౯౨

మ॥ అని చింతించి ద్వితీయకుం దెలిపి యాయంత్యోద్భవుం గూర్చి "నా
తనయన్ నీకు గ్రహించుచో నొసఁగ సిద్ధంబున్నవాఁడన్ ద్విజా !

నిను నీపెండ్లము నింటనుంచుకొనుచున్ నిత్యంబుఁ బోషింతు నే”
నని వాఁడు ప్రిచ్చి యతండు సంతసిలి బిట్టద్దాని కిష్టంపడన్ ౨౯౩

సీ॥ వేయినూటపదాఱు వివిధమౌ నాణెముల్ కనకంపుఁదళియలోఁ గాన్కవెట్టి
వ్రీహిగోధుమముఖ్య విశ్రుతధాన్యముల్ కొలిపించి లలిని గాదెలను నింపి
యత్యున్నతంబైన హర్మ్యంబునొకదానిఁ గాఁపురంబుంటకుఁ గాను జూపి
యేఁటేటనుం దప్ప కేటినీట ఫలించు పల్లంపుభూమి నర్పణముచేసి
మంచియావులమందఁ దోలించి యింటి కపుడు గృహోక్త విధమున నాత్మజాత
నంత్యజునకిచ్చి యుద్వాహమాచరించి తనఁ గృతార్థునిగా నెంచుకొనియె ద్విజుఁడు-

సీ॥ తీరుతీరగు పండ్లు తెప్పించుకొనితించు బలుపిండివంటలు సలుపుకొనుచు
ఫలరసంబులు నప్పుపట్టిన తేనియల్ గోక్షీరములు దధి గ్రోలుకొనుచు
సాల్జోళ్ళుగప్పుచు సకిఁగూడియొప్పుచు గడెకొక్కతీర్చుట్ట గట్టుకొనుచు
సిగఁ బూలుచుట్టుచు శ్రీగంధమలఁదుచు మెయినిండఁ గ్రొన్నగల్ మెట్టుకొనుచుఁ
దత్సుభద్రాఖ్య నాగరధరణిసురుని పట్టిఁ బెండ్లాడుపిదప నాపంచముండు
కడువిలాసంబుగా నుండఁగడఁగెఁ గాని యొకవిశేషంబు వానిని బ్రికటపఱచె-

కం॥ అతఁడేగుదారివెంబడి జతజతలై కుక్కలఱకసాగెను- మఱియున్
శ్రుతిపాఠముసలిపెడివో నతులితముగఁ బడియె రక్తమాస్యము వెంటన్- ౨౯౬

చం॥ అదిగనిసంశయించి ప్రజ “యంత్యజుఁడీతఁ” డటంచుఁ జెప్పుకో
మొదలిడఁ దత్సుభద్రు చెవి ముల్కులవోలెఁ బడెం దదుక్తు- ల
య్యదనునఁ బెద్దపెద్ద లకటా! యని యయ్యపవాదపోకకై
యెదొయొక నిష్కృతింజలుప నెంతయు యోజనచేసి యంతటన్ ౨౯౭

కం॥ చని బ్రహ్మస్థానమునకు జనునొక్కనిఁబంపి యల్ల చండాలుని జ
య్యనఁ బిలిపించుడు వానికి ఘనభయమున మొగమునందుఁ గళ లోపించెన్- ౨౯౮

తే॥ మధ్యగునిద్వారమున సంత మహీసురవ్వ లతని కులమును స్థలమును నడుగుటయును
గడగడవడంకి గద్గదకంఠుఁడగుచుఁ బట్టిదోసిలి మెలమెల్ల నిట్టులనియె- ౨౯౯

చం॥ “ఎనిమిదియేండ్లవాఁడనయి యే మన నా తలిదండ్రు లిర్వురున్
దనువునుబాసిపోయిరి. పదంపడి తద్వ్యథతోడ లేచి స
న్మునితతివెంటఁ దీర్థముల మున్గుచుఁ గ్రుమ్మరుచుండ మీపురం
బునను సుభద్రుఁడన్ ద్విజుఁడు పుత్రికనిచ్చి సమాదరించె నన్- 300

కం॥ ఏకప్రవరుఁడ. భువనప్రాకటవాసిష్ఠగోత్రభవుఁడ. వినుఁడు సు
శ్లోకులు! గౌడాభిధమౌ శ్రీకరదేశమున మధుపురిన్ మనువాఁడన్ ” 301

కం॥ అని యిటు వక్కాణించుడు విని "నీదు కోలంబు మాకు విచికిత్స్యంబై
కనుపట్టెం గావున ఘటశోధనముం గావించి తెలుపఁదగు నద్దానిన్- ౩౦౨
తే॥ అట్లు గావున ఘటమెక్కు మద్దుచెప్ప. కివ్విధంబున సంశుద్ధి నెనసి యవల
నఖిలభోగంబు లిచటన యనుభవింపు"మని ద్విజాతులు పలుకుడు నతఁడు మఱియు
తే॥ "మూసలోఁ గ్రాఁగు బంగారమును గ్రసింతు. దూఁకుదును మండునిప్పులందొట్రుపడక
విసము నేనియు భక్షింతు విప్రులార! యింక ఘటశోధనము సేయ నేమిలెక్క- ౩౦౪
కం॥ ఉండిన నా బ్రాహ్మణ్యము పండితసభ నిలుపుకొనఁగ భయమేమి? ద్విజుల్!
రండు ఘటశోధనము మీదండన సుఖముగ నొనర్తు. దయఁగన కొడలిన్-" ౩౦౫
కం॥ అని సాహసమొనరించుడుఁ గని రవివాసరమునందు ఘటశోధనమున్
బని నిర్దేశించి వెసం జని రిండ్లకు భూమిసురులు. చనె మాదిగయున్- ౩౦౬
మ॥ చని వాఁడంతట భార్యతోడను రహస్యస్థానముం జేరి "రో
నన బోఁడీ! నను మాలఁడంచుఁ గనుగొన్నారీ పురీబ్రాహ్మణుల్
మననీరింకిట. నట్లు గాన నిపుడే మా యూరికిం బోద. మీ
వనుమానింపక లెమ్ము" నాఁగ విని యాయబ్జాక్షి కోపంబునన్- ౩౦౭
కం॥ "నరకాగ్నిఁ గూలుకంటెను దురితాత్మ! యగ్నిలోన దూఁకుట మేలా.
నెఱిఁగియు మాలని వెంబడి యరుదెంతునె యింకఁ గూడ నడుగులనొత్తన్- ౩౦౮
శా॥ ఏతత్స్థానమునంతయుం జెఱిచితీ. వింకన్ శరద్వ్యాజియై
ఖ్యాతింగాంచిన తాతపాదునిలు దూష్యంబౌనటుల్సేసి. తీ
హేతుద్వంద్వముచేత నెవ్వఁడును దానీక్షింపకుండంగ నే
పో. తర్వాత విపత్సముద్రమున నిన్ ముంపంగలా రందఱున్- ౩౦౯

— చండాలస్పృష్టాములకుఁ బ్రాయశ్చిత్తము. —

చం॥ అనియిటు లుచ్చరించుటయు నప్పురవాసులు గాఢనిద్రలో
మను నెడ గోచిపెట్టుకొని మాలఁడు చచ్చితిరాయటంచు భీ
తిని జనె నిష్టమాశదకుఁ. దీక్ష్ణకరుం డుదయాద్రి నెక్కఁ జోఁ
గనుగొని దీక్షితాత్మభవ కన్నుల నశ్రుకణంబు లుర్లఁగన్- ౩౧౦
ఉ॥ ఏడుచుకొంచుఁ దండ్రికడకేగి "పితా! యిదియేమి పాప? మె
వ్వాఁడొ మహీసురుండనని వచ్చినయంతన నన్నొసంగి, త
వ్వాఁడిపు "డంత్యజుండ" నని వాకొని నా కెటొ పోయెఁ. గాన నీ
నాఁడె ప్రదీప్తపావకమునంబడి వీడెద నేను బ్రాణముల్" ౩౧౧

చం॥ అనవిని దీక్షితుండయిన యల్ల సుభద్రుఁడు వాతధూతమా
ఘనతరువట్లు చేష్టలుడుగన్ మహిపైఁబడి శీతవారిసే
చనమునఁ గొంతసేపటికి సంజ్ఞనుబొంది సబాంధవంబుగ
మ్యొనరుచుచున్ విలాపములు మూర్ధము మోఁదుకొనెన్ మహీపతీ ! ౩౧౨

తే॥ అంత సంపర్కదూషితులైనయట్టి యెల్లవాలులు నచ్చోటి కేగుదెంచి
యాసుభద్రుని నాతని యాత్మజాతఁగొంచుఁ దద్భర్తృయజ్ఞుని పంచకరిగి- ౩౧౩

పృథ్వి॥ "సుభద్రుఁ డవిచారతన్ సుతనొసంగి చంద్రప్రభున్
సభార్యకముగా రహిన్ స్వగృహమందుఁ బోషించినాఁ
డభాజనుఁడు నంత్యజుం డనుచు వాఁ డెఱుంగంబడెన్
విభావరినిలేచితా వెడలిపోయె నెచ్చోటికో. ౩౧౪

తే॥ సార్ధసంవత్సరంబు నస్పృశ్యుండు దైవపితృకార్యములలోనఁ దర్పితుండు.
తెలిసికొనఁడయ్యె నెవఁడు నీకలుషమతిని. ప్రకటమయ్యెను నేఁటికిఁబంచముఁడుగ-

తే॥ ఆగమయ్యెను నీస్థాన మంతయును సుభద్రుసంబంధమునఁజేసి భర్తృయజ్ఞ !
నీవె దక్షుఁడ విద్దాని నిగ్రహింప. నేమిచేసెదవో చేయు. మేల తడవు ? ౩౧౬

కం॥ కొందఱు భుజియించిరి తన్మందిరమున. నింకఁగొంతమందియు నుదకం
బుం ద్రావిరి. మతికొందఱు విందొనరిచి రతనిఁబిలిచి వేశ్మంబులలోన్- ౩౧౭

కం॥ తత్పాపసంభవంబగు నుత్పాతము వాఁతఁబడకయుండినవాఁ డే
తత్పురమునఁ గనఁబడఁ. డో సత్పురుషా ! యేల పెక్కుసంభాషణముల్- ౩౧౮

కం॥ నీవే పుణ్యస్థానముఁగావించితి మున్నుదీనిఁ గరుణాబ్ధీ ! మా
కీ వందఱకును గురుఁడవు. కావున శుద్ధులనొనర్చి కావఁగఁగలయున్ " ౩౧౯

కం॥ అని మొఱపెట్టుటయును దద్ఘనుఁడు శ్రుతుల్శాస్త్రములును గలయవెదకి వా
కొనియెం బ్రాయశ్చిత్తము జననాథా ! బ్రాహ్మణులకు సముచితభంగిన్- ౩౨౦

సీ॥ చాంద్రాయణంబును శతముపర్యాయము ల్పూతమతిం దాఁ జరియించుటొకటి
తనయింటిలోపలఁ దనరారునటువంటి యఖిలభాండంబుల త్యాగమొకటి
అదిఁ దాఁజేసిన యాధానమును వెండి విధ్యుక్తముగను గావించుటొకటి
లక్షహోమవిధానదీక్షావిచక్షణుండయి నూత్నదీప్తితో నలరుటొకటి
భర్తృయజ్ఞుఁ డర్హభంగిఁ బ్రాయశ్చిత్త మాసుభద్రకునకు నానతిచ్చి
యతనియాత్మజాత కగ్నిప్రవేశంబు తప్పదనుచుఁ జాఁటి చెప్పెనకట ! ౩౨౧

ఆ॥ ఎవ్వరెన్నిసారు లేగి సుభద్రునియింటఁగుడిచి తృప్తినెనసినారో
యన్నికృచ్ఛ్రములను నాచరించుకొనుం డటంచుఁ జెప్పె వారి కందఱికిని- ౩౨౨

ఆ॥ అట్టులెన్నిమాఱు లాతనిలోగిఁట సలిలపానమెవరు సలిపియుండి.
రన్నిపరులు వారి నరిగి ప్రాజాపత్యమును బొనర్చుకొనఁగ మొదలయిడియె- ౩౨౩

సీ॥ తత్‌స్థానగతులకుం దత్‌స్పృష్టులకును నొక్కొక్క ప్రాజాపత్య మొగి విధించి
చెప్పి తదర్ధంబు స్త్రీశూద్రులకుఁ దదర్ధము బాలవృద్ధుల కమరఁ జెప్పి
మొగిని బ్రహ్మస్థానమునఁ గోటిహోమంబు స్థానసంశుద్ధికై సలుపఁ బనిచి
రసజాతి యంతయు వెస వీడనియమించి పాఱవేయించి మృత్పాత్రములను
హస్తమెత్తి మీఁది కఖిలనాగరులను బేరెలుంగుతోడఁ బిలిచిపిలిచి
భర్తృయజ్ఞుఁ డపుడు "బ్రాహ్మణులార! వినుఁ"డంచు నింక నొక్క మాట యిట్టులనియె
సీ॥ తనయింటఁ గల యెల్లధనసంచయంబును లక్షగాయత్రియు దీక్షితుఁడును
నర్ధచతుర్థాంశ మంత గాయత్రియు నతనియింటఁ భుజించినట్టివారు
నష్టభాగధనంబు నంత తన్మంత్రముం దద్గృహంబున నీరుఁ ద్రావినట్టి
రాత్మశక్తికొలంది నయ్యుభయంబును దుశ్శ్వపచస్పర్శదూషితులును
క్ష్మాసురుల కొసంగి జపియించుచో శుద్ధియగును. వినుఁడు మఱియు నందఱకును
దప్పకుండ గోప్రదానంబు కార్యంబు స్పర్శదోషమెల్ల సమసిపోవ- 3౨౫
కం॥ నేనును బ్రాణాయామము లూని శతత్రయము నిత్య మొనరుచుకొనుచున్
మానెద దివాశనం బిఁకమైనన్ శుద్ధుండ నగుదు నబ్దంబునకున్" 3౨౬
ఆ॥ అని యిటు లెవచించి యా భర్తృయజ్ఞుండు మధ్యగాస్యమునను మరలఁ బిలిచి
యాదుష్కలైనయట్టి యల్ల బ్రహ్మస్థాన మెనసియుండు ద్విజుల కిట్టులనియె- 3౨౭
కం॥ "ఏతద్దివసంబాదిగ ఖ్యాతుండగు నాగరునకు కన్నియ నిడినా
నీతి రెఱుఁగక యిచ్చినయాతనిఁ బతితునిగ నెన్న నగు ద్విజులారా! 3౨౮
ఉ॥ ఎవ్వఁడు నాగరేతరుని నింటికిఁ దోడ్కొనిపోయి శ్రాద్ధమం
దవ్వసుధామరోత్తముని యర్చితుఁ జేయునొ తత్పితృవ్రజం
బవ్వడి దేవయుక్తముగ నావలకుం జను. నాగరున్ వినా
యెవ్విధిఁ జేయఁగాబడియు నీపయి శ్రాద్ధము వ్యర్థమయ్యెడిన్- 3౨౯
కం॥ యాగముల సోమపానము బాగుగనే యాచరింపఁబడుఁ గాక మహిన్
నాగరుఁడు లేనిచో నది వేగ సురాపానమగును వినుఁడు ద్విజాతుల్! 330
తే॥ శుద్ధి లేనట్టి నాగరు శ్రాద్ధమందుఁ గుడువఁ బెట్టినచో నది గూడ వ్యర్థ
మెల్ల నాగరజనులకు నెడఁదనరసి యేరుపఱచితి మర్యాద యిట్లు నేను- 33౧
కం॥ కాన నిజస్థానంబును బూని విశుద్ధంబు సేయుఁ డొందెద ద్విజన్మల్
మానక శుద్ధిం బొందరుచు కొనా "నేఁ టేఁట" ననుచుఁ గ్రొత్తగ నిటులన్- 33౨
తే॥ భర్తృయజ్ఞుండు నాగరబ్రాహ్మణాళి కొక్క మర్యాద గావించె నోయిలేశ!
తావకంబైన ప్రశ్నకుఁ దగినయుత్తరంబు వచ్చెను. దదనంతరంబ మఱియు- 333

## —♦ నాగర ప్రశ్న నిర్ణయము ♦—

తే॥ పుడమివేలుపు లెల్లరు బుద్ధిశాలురై రహించెడి యుల భర్తృయజ్ఞుఁగూర్చి
దోయిలిఘటించి కరము సంస్తుతులొనర్చి బిట్టువినయంబుదోఁపఁగా నిట్టులనిరి.

ఉ॥ "శోధితుఁడైన నాగరుఁడె సోమము ద్రావఁగఁ గన్యనీయ శ్రా
ద్ధాధికృతుం బొనర్పను సమర్హులటుంటి. కులంబు గోత్రముల్
బోధయొనర్పఁజాలని ప్రబుద్ధులు మున్నగువారిపట్ల నా
శోధన మేవిధింబొసఁగుఁ జూచి వచింపఁగదే మహామతీ!" ౩౩౫

చం॥ అనియిటు ప్రశ్నసేయుటయు నా ద్విజులంగని భర్తృయజ్ఞుఁ డి
ట్లనియెను "బ్రశ్నరూపపు మహాభర మీరలు నాదుశీర్షమం
దునిచితి. ఔను గాక. నళినోద్భవుఁ గూరిచి కేలుమోడ్చి మీ
మనసులఁ బట్టునట్టులు సమస్తము చెప్పెద నాలకింపుఁడీ. ౩౩౬

మాలిని॥ "అవిదితపితృవంశుం డన్యదేశాగతుండున్
సవినయముగ మీతో నాగరుం డేఁటన్నన్
దవుగతిఁ బరిశుద్ధిన్ సల్పి పంపుండు గర్తా
భవసహితులరై యో బ్రాహ్మణశ్రేష్ఠులారా! ౩౩౭

సీ॥ అధికమౌదక్షిణ యార్జించుటకుఁగాను బిఱుసువాఁడిడి కోర్కిపేర్మిఁగాని
యపకృష్టుమీఁదికిం గృపణతం బరువెత్తు వ్యర్థమౌ కోపంబువలనఁగాని
యెదోయొక్క యత్యల్పహేతువునం జేసి యుదితమౌ ద్వేషంబునుండి కాని
శుద్ధియిచ్చినపైని చ్యుతిగల్గునని మదిం బీఁటవెట్టినయట్టి భీతిఁగాని
పాచితంబును యాచించు పతితజనుని శుద్ధుఁజేయుస నాగరశ్రోణిసురుల
బ్రహ్మహత్యోద్భవంబగు పాపమెనయుఁ. గాన నెటువంటివారికిం గార్య మద్ది.

ఆ॥ అస్మదుక్తమైనయట్టి ముత్తెఱఁగులశుద్ధి వడయునెవఁడు శ్రద్ధతోడ
వాఁడు దూరదేశవాసియే యగుఁగాక నాగరునిగ నెఱుఁగనాఁ గులమున. ౩౩౮

కం॥ మును జనయితృవంశంబును జనయిత్రీవంశ మవల సంశోధితముల్
బొనరిచి శీలంబును నటువెనుకను శోధింపఁదగు వివేకముతోడన్. ౩౪౦

కం॥ ఈ మూఁడింటను శుద్ధుఁడు సామాన్యపదార్హుఁడగును. సకలద్విజులున్
నేమమున నేటికొకపరి తామును శుద్ధులగుటొప్పు స్థానం బటుకాన్. ౩౪౧

ఆ॥ అందుకొఱకుఁబూర్వ మబ్దాంతమున శుభఋతువునందునను జితేంద్రియులయి
శాంతి దాంతి గలిగి చాతుశ్చరణసంపదన్వితులయియున్న యవనిసురుల ౩౪౨

ఆ॥ వారిమధ్యమందు వ్రాసి గర్తాతీర్థ వాసి భూసురుని సభక్తిఁ గూరు
చుండఁబెట్టి నాలు గుత్తమపీఠికల్ వారియెదుట వేయవలయు సరిగ. ౩౪౩

సీ॥ ప్రథమపీఠం బందు బహ్వృచుకొలఁదిను. నన్యమౌపీఠంబు యాజుషునకు.
మఱి తృతీయంబు సామగునినిమిత్తము తరువాతి దాద్యుండు తావసింప.
వేఱొక్కపీఠంబు వేయునౌ నచ్చోట ముద్రికార్థము విప్రముఖ్యులార !
శ్రీసూక్త శాకున శ్రీవిష్ణుదైవత పారావతంబులు పావమాన
జీవసూక్తములును జెప్పనౌ బహ్వృచుఁ డపుడు శాంతికముగ. నటు చతుఃప్ర
కారమైన ఋషులకల్పంబు మండలబ్రాహ్మణంబును మధుబ్రాహ్మణంబు ౩౪౪

కం॥ గాయత్రీబ్రాహ్మణమును శ్రేయస్కర పురుషసూక్త శివసంకల్పా
లా యంగపంచకంబును బాయని రుద్రములు నిష్ఠఁ బఠియించి వెసల్ ౩౪౫

సీ॥ అధ్వర్యుఁ డొనరించునది శాంతికంబును. ఛందోగుఁడును బేర్మి సౌవ్రతంబు
దేవవ్రతంబును దినమణి చంద్రమోవ్రతములు విష్ణుసంహితయు జ్యేష్ఠ
సామము నేకవింశతిసాంకనౌ రథంతరమును గాయత్రి మఱియుఁబినుఁడు
భారుండసామసంపన్నంబులౌ సామరుద్రము ల్చదువనౌ రూఢముగను.
స్కందసూక్తమును బ్రశస్తగర్భోపనిషత్తు నీలరుద్రసహిత ప్రాణ
రుద్రములు మఱి నవరుద్రముల్ క్షురిక నాద్యుఁడు పఠింపవలయు యుక్తఫణితి.

తే॥ అంతఁ బుణ్యాహఘోష గీతాదికములు సెలఁగ శ్వేతాంబరంబులు లలి ధరించి
శ్వేతగంధము మెయిఁబూసి శ్వేతపుష్పమాల మెడవైచి యాధరామరులకడకు

మ॥ చని కేల్మోడిచి శుద్ధికామజనుఁ "డీక్ష్మాదేవులకు నీవు ప్రా
ర్థనముం జేయుము నానిమిత్తము మహాత్మా ! శుద్ధిగావింత్రువా"
రని యమ్మధ్యగుఁగూర్చి పల్కనగు. న స్థానంబు గోచర్మముల్
దన కాయంబునఁ దాల్చి యివ్విధమునం దా వేడనౌ వారలన్. ౩౪౮

కం॥ "ఏతన్నాగరభూసురుఁ డేతెంచినవాఁడు శుద్ధినీప్సించి. భవ
చ్చేతమునకు రుచియించినఁ బ్రీతి నొసంగుండు శుద్ధి పృథివీదేవుల్ !" ౩౪౯

చం॥ అనియిటు ప్రార్థ్యమానులయి యమ్మహిదేవులు వేదసూక్తవా
చనమున శుద్ధుసల్పుటయొ సల్పకయుంటయొ చెప్పనౌను. వా
క్కున నది శుద్ధికామజనుఁగూర్చి వచింపఁగరా. దదఃప్రకా
రనియతి నేనచేసితిని బ్రాహ్మణు ! లింకను నాలకింపుఁడీ. ౩౫౦

ఆ॥ అంత శుద్ధికాముఁ డధ్వర్యు ఛాందోగ్యు నాద్యు నన్యుఁ జూచునది క్రమముగ.
వారు మదిని దృప్తివడసినచో సూక్తముల్ సౌమ్యములును భద్రసంయుతములు ౩౫౧

సీ॥ మాంగల్యజనకముల్ మంత్రలింగములును వృద్ధితుష్టిదములు శ్రేష్ఠములును
నైంద్రవారుణములు నై విరాజిల్లెడి వాక్యము ల్పలికింపవలయు నెలమి.
మనమున సంతృప్తి యొనరకయున్నచో నైరుత్యములును వినాశకరము
లాగ్నేయములు మఱి యామ్యము ల్గడు రౌద్రములును ననిష్టము ల్పలుకవలయు-
నదిని సంతృప్తిపడిన యమ్మహీసుపర్వు లచట శ్రుతిపారగతిలేని యజ్ఞతతికిఁ
బుష్పదానంబు సేయనా భూమిదేవవర్యులార! జగద్ధితచర్యులార! ౩౪౨

ఆ॥ తుష్టిపడక యలుకతోడ వర్తించెడివారి సీయుటంచు వదలవలయు.
నెల్లకృత్యములను నీప్రకారంబునఁ జనుచు నిర్ణయింపఁ, గనుఁడు ద్విజులు! ౩౪౩

తే॥ ప్రాకృతోక్తులచేత నే ప్రజలు చేయుమాడ్కి నిర్ణయమైనపై మధ్యగుండు
చక్కఁ దాళత్రయంబు నొసంగవలయు నందఱికిఁ గూడ నిర్ణయమగుట దెలియ"

## —♦ భర్తృయజ్ఞవాక్యనిర్ణయము ♦—

కం॥ అనవిని బ్రాహ్మణులందఱు మునివరుఁడగు భర్తృయజ్ఞుముందఱ వినయా
వనతులయి నిల్వఁబడి యిట్లని రదివిను చెప్పవాఁడ నవనీనాథా! ౩౪౪

తే॥ "మనుజభాషను గాక యామ్నాయభాష భూసురేంద్రులు మధ్యముం బొందియున్న
యెవనికిం దాము నిర్ణయమీయవలయు? నెటు త్రితాళాలమధ్యగుం డేయవలయు?"

ఆ॥ అనుడు భర్తృయజ్ఞుఁ డనియె "బ్రాహ్మణస్థానమునను గూరుచుండి ఘనులు నాగ
రులు వచించువాక్యములు దబ్బఱలు గావు శుభముగాని లేక శుభముగాని ౩౪౫

తే॥ అట్లుగావున వేదవాక్యములచేతఁ జూపుచుందురు శుభమో యశుభమొ వార.
లర్థియై వచ్చి ప్రశ్నించునట్టి వాని కో మహీసురులార! యింకేమిగలదు. ౩౪౬

తే॥ కాన మాటికిమాటికిఁ గార్యనిర్ణయంబు గావించువఱకును నడుగవలయు
శుద్ధికాముని మిత్త్రమై క్షోణిదేవులార! మధ్యస్థుఁ డవహితుండగుచు మిగుల- ౩౪౭

తే॥ బ్రాహ్మణాలాపవిప్లుల భాషితంబు వ్యర్థమైన నశించు మహాత్వమెల్ల.
దానఁ గ్రోధంబు గలుగు. నద్దాన ద్రోహ. మంతఁ గలుషమ్ము. గాన నిట్లనుగఁబడెడు

తే॥ అందఱుం గుమిగూడ మధ్యగుఁడు లేచి యిచ్చుఁ దాళత్రయంబు శుద్ధిచ్ఛువనరుఁ
గామము హరించు మొదటిది కడకుఁ ద్రోయుఁ గ్రోధమును రెండవది. లోభగుణము నెల్ల

ఆ॥ పాయఁజేయు మూడవది గాన మువ్వురు తాళములను నీయఁడగు" నటంచు
భర్తృయజ్ఞుచేతఁ బలుకంగఁబడుటయు నెలమి ద్విజులు మఱియు నిట్టులనిరి. ౩౫౨

తే॥ "తమను నాథర్వణ బ్రాహ్మణము చతుర్థముగను గీర్తింపఁబడియెడిఁ బూర్వమందుఁ
నాగరబ్రాహ్మణుల కది యొకటిఁ బ్రథమపుఁ బ్రశ్నంబు దానయ్యె మునికులేంద్ర!

కం॥ అనియిటు ప్రశ్నించుటయును విని యమ్ముని "యిచటు నీర్ష్యబడువుం డేత ద్వినిమయము నేనచేసితిఁ గని స్వస్థానము విశుద్ధికలిగి రహింపఁగ. ౩౮౪

తే॥ ఋగ్యజుస్సామ సంజ్ఞల నెసఁగునట్టి క్రతువులెల్లను బాదత్రికములుగాని యైహికములయి వెలసెడి యాభిచారికములుగావు వినుండు నాగరులు! మీరు

తే॥ సర్వలోకహితార్థమై సృష్టచేత నాభిచారికమంతయు నార్యులార! యొగి నథర్వణవేదమం దుక్తమయ్యెఁ. గార్యసిద్ధికి నది యగుం గారణంబు. ౩౮౬

కం॥ ఏతద్ధేతువుచేతను భూతలమున నది చతుర్థముగనున్నను నా చేతం బ్రథమంబుదిగా నీతతిఁ గావింపఁబడె మహీసురులారా!" ౩౮౭

వ॥ అనివాక్రుచ్చెనని విశ్వామిత్రమహార్షి వర్ణించుటయు నానర్తమహీ రమణుండు ౩౮౯

తే॥ "ఈవిధంబున శుద్ధ్యర్థమేగుదెంచి నాగరులమ్రోలనుండిన నాగరుండు తానెటు లృద్ధిగాంచునో తత్ప్రకార మానతీయుము వాచంయమాగ్రగణ్య!"

వ॥ అనిప్రశ్నించుటయు నమ్మహాముని యిట్లనియె. ౩౯౦

తే॥ "ఈవిధంబున సముదాయ మేరుపడుడు 'నీదుగోత్రం బెదా? నేది నీదుప్రవర? నాయనమరెవ? రాయమ నాయనయెవ?' రనుచుఁ దచ్ఛుద్ధి కాముని నడుగవలయు.

తే॥ ఆటు సగోత్రప్రవరమగు నతనియన్వయము నెఱింగి యనంతర మతనితల్లి నామెతల్లిని మఱియును నా పెతల్లి శుద్ధికృతియుం దెలియంగనౌ క్షోణిసురులు! ౩౯౧

సీ॥ పితను బితామహుఁ బిత్రుపితామహుఁగూడ నెవరంచుఁ బ్రశ్నించి యెఱుఁగవలయు మాతఁ బితామహి మఱిఁ బ్రపితామహిం గ్రమముగాఁ దెలిసికోఁ గడఁగవలయు. మాతామహుని వెండి మాతృపితామహుం దత్ప్రపితామహుం దలఁచవలయు. మాతామహియు నోజ మాతృపితామహి ప్రపితామహి యెఱుంగఁబడఁగవలయు. నిటు మహావిటపింబోలి యెదుఁగుచున్న యాలఘు తద్వంశవృక్షముం దెలిసికొనుచుఁ బ్రీతి సిందూరతిలకముం బెట్టినొసట శుద్ధినీయఁగవలెఁజుమీ క్షోణినాథ! ౩౯౩

కం॥ చాతుశ్చరణసుమంత్రవ్రాతంబున దీవనములు వరుసగ నిడి సం ప్రీతిమెయి నంత మధ్యగుచేతఁ బ్రదతాళముల నీయఁజేయఁగవలయుఁగ. ౩౯౪

కం॥ పదపడి తద్ద్వారమునన సభయత "నీనాగరుండు సామాన్యపదా స్పదుఁడయ్యె శుద్ధిఁగని" యని పదుగురువినఁ జెప్పవలయు బాగుగ భూపా! ౩౯౫

తే॥ అవల నగ్నిగృహంబున కరిగి సరవిఁ దృప్తినొందించి మిగుల నాదేవు భక్తిఁ "బంచవక్త్రేణ" యనుమంత్రపఠనమునమునిచ్చి పూర్ణాహుతిని భూసురేంద్రులకును

తే॥ అన్నదానంబు గావించి యంత శక్తికొలఁది దక్షిణ యీయంగవలయు రాజ! ద్విజులు తమమ్రోల సిందూరతిలకకలితు నలిపి పరిశుద్ధుఁ డితఁడంచుఁబలుకుటయును

కం॥ "మావంశము నిల్పంబడె నీవడి" నని తత్పితరులు నెంతయు నాత్మన్
భావించి తృప్తిపడుదురు భూవల్లభ! యపుడె శుద్ధి పూర్తియగుం గా. ౩౭౮

ఉ॥ ఎవ్వఁడు వంశభూమిరుహ మెంతయు శోధితముం బొనర్చి తా
నివ్విధి శుద్ధిఁజేసికొన నెంచఁడొ వానికిఁ దగ్గరీతిగన్
నెవ్వగఁ గూర్పఁగావలయు నేర్పరులౌచు మహీసురాళి యిం
కెవ్వఁడునుం బ్రమత్తుఁడయి యీవిధ ముండక యుండుఁ బార్థివా! ౩౭౯

కం॥ అష్టకులోద్భవుఁడైనను స్పష్టంబుగ నివ్విధముగ సంశోధితుఁడే
యష్టవ్యుఁడు శ్రాద్ధమున. నశిష్టునియెడ నింక నేమి చెప్పఁగఁగలయున్. ౩౮౦

కం॥ శుద్ధుండు కానిద్విజుఁడే శ్రాద్ధమునం దధికృతుఁడుగ సల్పంబడుఁ ద
చ్ఛ్రాద్ధంబు బూదినిడిన సమృద్ధ గవీఘృతమువోలె వృథయగు నధిపా! ౩౮౧

తే॥ అట్లుగావున విశ్వప్రయత్నముగను శోధనీయులు నాగరక్షోణిసురులు
ఆత్మకులమెల్లఁ బరిశుద్ధమగుటపొంటె నటులె స్వస్థానమును శుద్ధమగుటకొఱకు"

## ప్రేతశ్రాద్ధము

వ॥ అనియిట్లు వర్ణించుటయు వెండియు నాభూవల్లభుండు. ౩౮౩

ఉ॥ "నాగరవంశశుద్ధివిధి నాకు వచించితి విస్తరించి కా
నీ గ్రహచారమూలమున నెంతయు నష్టనిజాన్వవాయుఁడై
బాగుగఁ దల్లిదండ్రులనె బ్రాహ్మణసన్నిధిఁ జెప్పలేని యా
నాగరుఁ డెట్లు శుద్ధుఁడగు? న్యాయవిదగ్రణి! యానతీయుమా" ౩౮౪

వ॥ అని యడుగుటయు యతియు నమ్మనుని యిట్లనియె ౩౮౫

తే॥ "నన్ను నీవడిగినమాడ్కి నాగరులును భర్తృయజ్ఞుని నడిగిరీప్రశ్న మున్ను.
నష్టవంశునిమిత్తమై న్యాయమార్గ మెడఁద యోజించి యాతఁడప్పు డిట్టులనియె ౩౮౬

తే॥ నష్టవంశుండువచ్చి నే నాగరుండననుచు సభలోనఁ జెప్పుచో నతని శీల
మును బరీక్షించి ప్రథమంబు వెనుక శుద్ధినీయవలెఁగాని యూరకుం ద్రోయఁజనదు.

కం॥ నాగరధర్మములుం గడుబాగగు వ్యవహారములును బరికించి యటన్
దాఁగూడఁ బ్రవర్తించెడి నాగరు మన్నింపవలయు నయమార్గమునన్. ౩౮౭

తే॥ అతనిశుద్ధినిమిత్త మీయంగవలయు ఘటము. నది శుద్ధమైనచోఁ గర మతండు
శుద్ధుఁడును శ్రాద్ధయోగ్యుండు సోమపానయోగ్యుఁడుం గన్యకాయోగ్యుఁడుర్వియందు

తే॥ అఖిలవాస్థానకర్మమందతఁడు యతియునగును సామాన్యపదయోగ్యుఁ"డనుచునిట్టుల
భర్తృయజ్ఞుండు నాగరబ్రాహ్మణులకుఁ జెప్పె. నది యేను నీకును జెప్పినాఁడ.

ఆ॥ నష్టవంశుఁడైన నాగరు నెడలనా నిది ద్వితీయశుద్ధి సదయహృదయ!
కనుక యతియు నేమివిన నిచ్చగించెదో యడుగు ముత్తరంబు నుడువనుంటి" ౩౯౧

వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు వెండియు నానర్తధరాఖండలుండు ౩౯౨

సీ॥ "అగ్గలం బుగ్రమై యనయు మవ్యగ్రమౌ తపము వెంపున మహాధన్యులైరొ?
బహుదక్షిణాకమై పాపలుంటాకమౌ మఖములనొనరించి మాన్యులైరొ?
వేదశాస్త్రార్థ్యమై విధ్వస్తమౌఢ్యమౌ చదువున లబ్ధసౌజన్యులైరొ?
యుపగతలాభ్యమై యనితరాలభ్యమౌ త్యాగంబునను ధూతదైన్యులైరొ?
యూర్జితంబైన యెదొ హేతు వుండవున్న శుద్ధినెనసిన నాగరశ్రోణిసురుల
యందఱకు లేనియాత్మోత్కృష్ట వస్తువులు కెట్టులేర్పడె? చెప్పుము మునీంద్ర! నాకు"

వ॥ అని పృచ్ఛఁజేయుటయుఁ గుశికనందనుండు మఱియు నిట్లనియె. ౩౯౪

ఉ॥ "నాగరులందఱుం గుణసనాథులె యైనను వీరికిం మహా
యోగమొకండు పట్టి పురుహూతునిచేతను సుప్రతిష్ఠితుల్
గాఁగనొవర్చె. నియ్యదియె కారణ మప్పటుల ప్రసూతులే
నాగరధారుణీసురజనంబున గౌరవభాక్కులై మనన్" ౩౯౫

వ॥ అని యిట్లు వచించుటయు నానర్తదేశవిభుండు ౩౯౬

తే॥ "ఎప్పుడానసుధామరు లింద్రుచేత సంప్రతిష్ఠితులైరి యీ స్థలమునందు?
బలిమి నేల ప్రతిష్ఠింపవలసివచ్చె? విస్తరంబుగ వాక్రువ్వవే మహాత్మ!" ౩౯౭

వ॥ అని ప్రశ్నించుటయు గాధిసూనుం డిట్లనియె. ౩౯౮

శిఖరిణి॥ "హిరణ్యాక్షుండన్ రాక్షసునకును నయ్యింద్రునకు సం
గరం బెంతో ఘోరంబుగ నడుచుఁ బ్రాక్కల్పమున నో
ధరాజానీ! యం దెందఱో పడిరిపో దైత్యులు సురల్
చిరం బన్యోన్యంబుం గదుఁబెనఁగి యాలిన్ నిహతులై ౩౯౯

తే॥ అంత నింద్రనిహతులైన యసురులెల్ల స్వగురువిద్యాబలంబున బ్రదుకఁజొచ్చి-
రొక్కరేనియు జీవంబునొందరైరి వేలుపులు. దానిఁజూచితా వెఱఁగుపడుచు

క॥ ఒకనాఁ డింద్రుఁడు పేంద్రుని నికటంబున కరిగి యిట్లనెను "లోకోద్ధా
రక! ధారాతీర్థంబునఁ బ్రకటప్రహరణములకును భయపడ కడఁదన్ ౪౦౧

ఆ॥ ఎదురునడచువారి కేగతిగల్గునో ప్రాణభీతిచేతఁ బాఱిపోయి
మృతిని గాంచువారి కేగతిగల్గునో నాకు శ్రీజనార్దనా! వచింపు" ౪౦౨

క॥ అనియడుగుడు మధుసూదనుఁ "డని ధారాతీర్థభూమి నభిముఖులై యీ
ల్గినవారు పునర్జన్మంబును జొందరు భిన్నబీజుపోల్కి సురేశా! ౪౦౩

చ॥ భయమునఁ బాఱుచున్ రిపుల బాణతతిన్ నిజపృష్ఠమందునన్
రయమునఁ గొట్టఁగాఁబడి ప్రణష్టకళేబరులైన భృత్యులెం
తయును నిలఁ బ్రేతలయ్యెదరు" నాఁ బురుహూతుఁడు వెండియుం గడున్
నయమునఁ గేలుమోడిచి జనార్దనుఁగూరిచి భక్తి నిట్లనున్. ౪౦౪

ఆ॥ "కొంతమంది యమరు లెంతయు శూరులై పగర కెదురునడచి ప్రాణములను
విడిచి. రెంతొమంది వెన్నిచ్చిపాఱుచు నిహతులైరి యుద్ధమహిని దేవ! ౪౦౫

క॥ కావునఁ బ్రేతత్వం బీదేవతలకుఁ గూడఁ గలిగితీరునొ లేకా
కావలులగు దానవులకె యేవంవిధనియతిగలదొ యెఱిఁగింపు" మనన్ ౪౦౬

క॥ "సందేహములేకుండఁ బురందర! వెన్నిచ్చిపాఱి రణమున హతులౌ
నందఱును బ్రేతత్వమునందుదు రెక్కైన నేమి. యదిగాక మఱిన్ ౪౦౭

తే॥ విషముద్రావియొ లేక యుర్వీతిహోత్రమందు దూఁకియొ మడిసిన యాత్మఘాత
కులు కృతఘ్నులుగూడ నోకుధరభేది! యధిగతప్రేతవిగ్రహు లగుదు రవని ౪౦౮

తే॥ పసులకొమ్ములచేతఁ బొడ్వంగఁబడియొ వన్యమృగములకోఱల గ్రచ్చఁబడియొ
మృతినిగాంచినయట్టివారుక్ వృత్రహరణ! ప్రేతలయ్యెద రుజ్ఝితప్రీతులగుచు" ౪౦౯

క॥ అని మధుసూదనుఁ డనుటయు విని లేఖర్షభుఁడు మరల "విష్ణూ! యత్నిం
తును గావునఁ బ్రేతత్వంబును వారు దొరంగు తెఱఁగు బోధింపు" మనన్ ౪౧౦

ఆ॥ "భాద్రపదమునందు బహుళచతుర్దశీతిథిని వారిఁగూర్చి దేవనాథ!
గయను భక్తిపూర్వకముగ శ్రాద్ధముఁబెట్ట ముక్తిగలుగు నిక్కముగను నపుడె" ౪౧౧

క॥ అని హరి పల్కుఁడు శక్రుం "డని శస్త్రచ్ఛిన్నదేహులగువారికి నీ
దినమే యెటులొ శ్రాద్ధమ్మునకై యన్నింటిలోన ముఖ్యం" బనఁగన్. ౪౧౨

క॥ "భూతప్రేతపిశాచము లాతతకూశ్మాండనులును యమరారులుఁ దా
మేతద్వాసరమందున భూతేశుసకాశమునకుఁ బోయి యదృచ్ఛన్ ౪౧౩

క॥ "అరుణుఁడు కన్యారాశికిఁ దిరిగిన యాసమయమునందు పీనులవరా మా
కొఱకై యొకదిన మీఁయవె కరుణను వంశజులు శ్రాద్ధకర్మము సేయన్. ౪౧౪

ఉ॥ తద్దినమందుఁ బెట్టఁబడు తద్దినమందు భుజించి వెండి మే
మద్దినమేగు దెంచుకఱ కాత్మను దృప్తిని బొందియుందు" మం
చొద్దికతోడ వేడుటయు నుగ్రుఁడనున్ "వినుఁ డీచతుర్దశిన్
దద్దయు భక్తి శ్రాద్ధమును ద్వత్కులసంజనితుండు పెట్టుచోన్. ౪౧౫

క॥ ఏఁడాదివఱకు క్షుధచేఁ బీడితులరు గారుమీరు. ప్రేతలు! చనుఁడీ.
యేఁడేని భవద్వంశపువాఁడు గయం బిండమిడిన వడిముక్తులరే. ౪౧౬

ఆ॥ శస్త్రవివిహతులకు స్వర్గమేన్ బ్రాప్తింప నిశ్చయముగఁ బ్రేత నేతలార!
యాదినమున శ్రాద్ధ మెవరికి నకృతమా నబ్దమెల్ల వారి కంగలార్పె. ౪౧౭

క॥ ఎవఁడీదినమున శ్రాద్ధముఁ దనిలి యొనర్పండొ భువిని దత్పితరులు క్షు
ద్వివశులయి వత్సరాంతము నవయుచుమం డెదరటంచు నలువ వచించెన్. ౪౧౮

తే॥ అట్లుగావున సర్వప్రయత్నములను సలుపఁదగు నీచతుర్దశి శ్రాద్ధకర్మ.
మద్ది యెవరినిగూర్చియే యగును గాక ప్రేతలకుఁ జెంది యధికమాప్రీతిఁ జేయు"

కం॥ అనియిట్లు చంద్రచూడుఁడు మును ప్రేతశ్రాద్ధమునకు ముఖ్యంబుగ నీ
దినము విధించెను. జని నీకనుఁగులె యగుచో నొనర్పు మది వారలకున్. ౪౨౦

### — గయాశ్రాద్ధఫలము —

మ॥ భవదర్థంబయి యుద్ధ్యమానులయియో ప్రాణాలు గాపాడుకో
నవలం బాఱుచుఁ గొట్టఁగాఁబడియొ యత్యంతంబు పృష్ఠంబునం
దెవ రాలంబున మిత్రవాతఁబడిరో యీవేగి యవ్వారికిన్
సవిధానంబుగ నాచరింపుము గయాశ్రాద్ధంబు వృద్ధశ్రవా!" ౪౨౧

ఆ॥ వారు తృప్తులగుచు వరుసగాఁ బ్రేతత్వమునను ముక్తులగుదు" రని మురారి
యానతీయుటయును హరిహయుం డింకను నెదియొ తెలియఁగోరి యిట్టులనియె.

మ॥ "ప్రతివర్షంబును నీదినంబె గయకుం బద్మాసనుం డేగి త
త్పితృదేవార్థము శ్రాద్ధముం జలుపు గోవిందా! యటుల్గాన నే
నిత మేన్ శ్రాద్ధముఁబెట్టుపొంటె నటకుం బ్రీతుండనై పోదు. నీ
క్షితి నింకొక్క మహాస్థలంబు చెపుమా శ్రేయఃప్రదం బేగదన్" ౪౨౩

కం॥ అని యీరీతి వచించుచు మనమున ధ్యానించి చిరము మాధవుఁడపుడి
ట్లను. "గలదు దానికంటెను ఘనమగు తీర్థంబె కూపికామధ్యమునన్. ౪౨౪

ఆ॥ హాటకేశ్వరమున నదియుండు. దానిలో నఖిలతీర్థసహితమగుచువచ్చి
సంక్రమించుగయ నృపా! తచ్చతుర్దశీదర్శతిథులయందుఁ దద్దమహిమ. ౪౨౫

మ॥ రవి కన్యన్ మన నష్టవంశభవవిప్రశ్రేష్ఠులంబిల్చి యం
దెవఁడేన్ శ్రాద్ధముఁబెట్టుచోఁ బితరు లెంతేనిం దరిం త్రింద్ర! యి
ట్భువిఁ బ్రేతత్వము నొందినట్టిరె కనుం బూతత్వముం దాల్ప నా
దివమందుండెడి వారిసంగతి యిఁకం దెల్పంగ నేముండెడిన్. ౪౨౬

తే॥ తన్మహాక్షేత్రమున సముద్భవముఁజెందినట్టి యష్టకులోద్భవు లనఘులగుటఁ
జేసి యానర్తపతియిచ్చు భూనువర్ణములను బట్టుట కొల్లక తొలఁగిపోయి. ౪౨౭

ఆ॥ మంచుఁగొండపై వచరించులులె తపంబున్నవారు. వారియొద్దకరిగి
సామపూర్వమైన సదుపాయములచేత గౌరవంబుఁజూపి కడుజవమున. ౪౨౮

తే॥ తోడుకొనివచ్చి వారియెదుట యథావిధిగను శ్రాద్ధంబుఁబెట్టుము. తీరు నీదు
నభిమతము. వచ్చినటువంటియష్టకులజు లచట సుఖముండుదురు త్రిదివాధినాథ!

కం॥ నీతోపాటుగ మేమును నేతద్భూసురుల శ్రాద్ధహేతువుచేతన్
బ్రీతిం బూజించెద" మని యీతీరునఁబల్కి యంబుజేక్షణుఁ డంతన్. ౪౩౦

ఆ॥ పాలకడలికరిగెఁ. బరమహర్షముఁజెంది తత్క్షణంబలేచి తద్బలారి
హిమనగంబుఁజేరి యీక్షించెద్రత్యుల్లైన యష్టకులుల నగ్రజనుల. ౪౩౧

—• ఇంద్రుఁ డష్టకులనాగరులఁ దోడ్కొనివచ్చుట •—

ఆ॥ నియమసంయమములు నిత్యసదాచారములును గలిగి కామమును సహించి
క్రోధముం ద్యజించి గురుత వానప్రస్థులగుచు మనిరిచూ తదష్టకులులు. ౪౩౨

సీ॥ చాంద్రాయణవ్రతాచరణులు పెక్కండ్రు పక్షకాలాశను ల్పాలకుండి.
యే కాంతరితభుక్తు లింకనుం గొందఱు. కొందఱు పాషాణకుట్టకులును.
దలఁప దంతోలూఖలులు మఱికొందఱు సబ్భక్షకులుకొందఱు అందులోన
వెండిపరయాకులనే తినువారు కొందఱు. అేకంగొంద అనిలభక్షకులు మఱియు.
నట్టి యయ్యష్టకులజుల కమరవిభుఁడు కిన్నరులచేత నెంతయు గేయమానుఁ
డగుచు నైరావతంబెక్కి యరుగుదెంచు నంతయును దత్సమీపస్థులైనజనులు.

కం॥ 'మీయాశ్రమమున కింద్రుం డాయాతుండు ద్విజులార ! యాయనకు యథా
న్యాయమయినట్టిపూజను జేయుం' డని చెప్పుటయును జెంది వితాకుల్ ౪౩౪

కం॥ పులకితవిగ్రహులై యంజలులం బట్టుకొని యెదురుంచని వినయమునన్
"దలఁప నిరీహుఁడ. వైనను గలకత మెది యిటకు రాను. గౌతుకమయ్యెన్". ౪౩౫

చ॥ అనుడు మహేంద్రుఁ డోమహిసురాగ్రణులార ! త్వదగ్నిహోత్రముల్
ఘనముగ సాఁగుచున్నవె ? సుఖంబుగ మీరలు వేదశాస్త్రముల్
దినదినముం బఠించెదరె ? దేనను విఘ్నములేకయుండఁగన్
బొనరుచుచున్నవారె తపముల్ ? మహనీయులు ! చెప్పుఁడీ దయన్. ౪౩౬

తే॥ హాటకేశ్వరమన్నను నఖిలతీర్థమయము. దానినివిడిచి యిమ్మహాచముగొండ
కేలయరుదెంచితిరి చలి కిడుములొందఁ ? జనుద మరుదెండుమరలఁ దత్స్థానమునకు.

తే॥ తామరసనేత్రు వానతి తలధరించి యటు గయాకూపికను భువనగమందు
భక్తి శ్రాద్ధంబుఁ బెట్టుదుఁ బాలులార ! రండు. మీకందఱకు క్షేవరత్వ మబ్బ

కం॥ పిల్లల నిల్లాండ్రను ముదుసళ్ళను శ్రౌతాగ్ని దేవసహితంబుగ తో
ళ్లుచుఁ దోడ్కొని నాతోఁ జల్లగ నరుదెంచు గగనచారులగుచున్. ౪౩౯

ఆ॥ భూదమగుసుమీకుఁ బదపడి యమ్మహాస్థలమునందు యష్టకులజులార !
ప్రేతకృత్యశీకోటికిఁ బితృపక్షపుం జతుర్దశిని బెట్టుచుండు శ్రాద్ధమేను. ౪౪౦

చం॥ అనవుడుఁ బాలురిట్లనిరి. 'యచ్చోటు క్రమ్మఱ మేము తోడ్క. మిం
కను నటు వేదశాస్త్రములు గట్టిగఁ బాఠముసేసి స్మార్తులై
మను ఘనయాజ్ఞికు లిలరు. మమ్మనె వేడఁగనేల. శ్రద్ధయుం
డిసఁ జని వారిముందఱఁ బనిన్ నెఱవేఱిచికొమ్ము నెమ్మదిన్'. ౪౪౧

ఉ॥ నావుడు దేవనాథుఁడను. బాగరులే మఱికొంతమంది భూ
దేవు లటుం గలారని మతించితి రష్టకులాగ్ర్యులార ! మీ.

రావిధ మంగయుక్తముగ నన్నిక్రతు ల్వరియించి యాజ్ఞికుల్
గావుటయున్న వాస్తవమె కాని గుణంబు ఖపుష్ప మచ్చటక్॥ ౪౪౩

సీ॥ ఒండొరుల్ విద్వేషమూని తామెంతయుఁ దగవులాడుటలోన దక్షులెపుడు.
నిరకఁ గట్టెపిటీచి పొయ్యినిబెట్టినట్టులే మాటలాడిన. లేదు మార్దవంబు.
మఱి దురహంకారపరిపూర్ణు. లాత్మలో నొకరినొక్కరు గెల్వ నూహచాలఁ.
దపముమాటఁదలంపఁ దలనొప్పి. భోగలాలసులును. మఱియు స్త్రీలంపటులును.
నిట్టి దుర్గుణముల కెల్ల నిరవువార. లఖిలసద్గుణములును మీయందుఁగలవు
వారి ప్రశంసించె మిమ్ముల. నట్లుగాన రావలయుమీరు హాత్రోడ రమణ నటుకు"

తే॥ అని యిటు ల్వచియించుడు "నదేకతముగ విడిచితిమి మేము స్వస్థాన మడుగనేల
కానిచో స్వర్గమార్గంబుఁ గాపఁబఱచు బహుసుతీర్థంబు నద్దానిఁ బాయఁగలమె.

శా॥ నీతో వచ్చుటి కేము వచ్చునెడలన్ నిత్యంబు నీర్ష్యాసమా
వేతుల్ ద్వేషపరీతులైన స్వజనుల్ కెల్లాగముంజేతు. రా
చేఁత ల్కాఁతలు కోపహేతువులు. మాచేతం గృతంబైన యెం
తో తీరింబగు తత్తపంబు క్షయమా నోయిందరి! యద్దానిచే. ౪౪౫

ఆ॥ అంత మోక్షమునకు నంతరాయముగల్గు. నట్లుగాన నెట్టులరుగుదెంతు?
మదియుఁగాక యచట పానగర్భూహాలుఁ డెంతయునుఁ బ్రసిద్ధుఁ డీగియందు.

ఉ॥ గుఱ్ఱము లేనుఁగు ల్మగలు గోవులు మున్నగువాని సర్వదా
యొఱ్ఱుగనిచ్చుచుండు నతఁ. డొల్లదుటన్న నమగ్నమూను. నా
వెఱ్ఱినుసీనికోపమును వీరి విరోధము నైఁచి యొక్కటే
టిఱ్ఱునఁ జేయఁజాలదుటఁ బెద్దతపంబు పులోమజాధవా! ౪౪౬

చ॥ మనము చలించినం దపము మంచిగ సిద్ధినిబొందనేర. దం
దునఁ ద్యజియింపఁగావలెను దొడ్డదియైన నదీయధామముల్.
జనపతియిచ్చువానిని వెసన్ గ్రహియించితిచో దపంబు నా
శనముగుఁ దప్పకుండు మును సృష్టపచించుటు యీవెఱుంగవే. ౪౪౭

సీ॥ శ్రీ దశసహామ్రూలం దసలి కావించిన కటికకుఁ దుల తిలఘాతకుండు.
తత్తిలఘాతకదశకంబునకు నిటు కలుగియయు నల వృక్షఘాతకుండు.

---

శ్లో॥ శ్రీ దశసూనాసమ శ్చక్రీ దశచక్రిసమో ధ్వజీ
దశధ్వజిసమా వేశ్యా దశవేశ్యాసమో నృపః.

ఈ శ్లోకము ద్వితీయాశ్వాసము ౩౦వ పుటలోఁగూడఁ దెనిఁగింపఁబడినది. కాని యక్కడ సాంప్రదాయికార్థము గ్రహింపలేక నట్లొకరీతి వ్రాసితిని. అదటఁగూడ నీవైపద్యమునే చదువుకొననది. ఈ స్థలమున వ్రాయఁబడిన టీక ననుసరించి వైద్య మార్గ్రీకృతము.

తద్వ్రతఘాతకదశకంబునకుఁ దుల్య విటసమూహ్రకాంత వేశ్యకాంత.
తద్దశవేశ్యకాంతలకు సమానుండు శిక్షకుండగు నృపశేఖరుండు.
కాన లోభమునకుఁ గైవసంబైయున్న సకలపాగరులకు జతగ మేము.
రమణ రాజొసంగు రత్నాదికమ్ముల నెటుగ్రహింపవలయు నింద్ర! యనుచు ౪౪౯

సీ॥ "తండ్రియాజ్ఞ కొడుకు తలఁదాల్పకుంటయుం గొడుకులపైఁ దండ్రి కూర్పమికిని
నత్తపైఁ గోడలు బత్తిచూపమికిని గోడలి నత్త పోరాడుటయును
మగనికిఁ బెండ్లాము మార్మసంగుటయును బెండ్లమున్ మగఁ డేడిపించుటయును
నన్నతోఁ దమ్ముఁన కానుదూల్యములేమి కన్న తమ్మునితప్పు లెన్నుటయును
నక్క చెల్లెలిసేవుంబు నరయమికిని జెల్లె లక్కను గరము ద్వేషించుటయును
జుట్టములు నొండొరు ల్బిట్టు కొట్టుకొనుట కమ్మహాక్షేత్రపుం మహాత్మ్యమ్మె కతము.
ఆ॥ ఆపురంబుక్రింద హాటకేశ్వరదేవుఁ డున్నవాఁడు. వాని యుగ్రప్రతాప
తపనుఁ డఖిలజనులఁ దపియింపఁజేయుటం బో రొకళ్ళకొకరి కేరుపడెదు. ౪౫౧

కం॥ వినరే సీతాలక్ష్మణు లనఘుండగు దాశరథియు నరుదెంచి యటన్
మనసులుగలియక యొండొరు లనుకోఁదగనట్టిమాట లనుకొను టలుకన్. ౪౫౨

చం॥ అయినను నొక్కమాస మట నాగ్రహావర్జితుఁడై వసించినన్
గయివసమౌను మోక్షము. సుఖంపను స్వర్గతుఁడై యదేవిధం
బయిదుదినంబులున్న. ననఘాత్ములు! కావున రండు పోద మ
య్యాయనముఁగూర్చి. కల్గదిఁక నచ్చటిపాటుల కీర్ష్య వీపయున్. ౪౫౩

ఉ॥ వారలు మిమ్ముఁగన్గొనియు వారలఁగన్గొని మీరు నింకఁ గ్రో
ధారుణితాక్షులౌదురని యాత్మఁ దలంపకుఁ డార్యులార ! మీ
కేరికి వస్తువాహనము లీయఁడు బల్మియొనర్చు సామి. యీ
తీరగు నత్ప్రసాదమున. దీనికి సందియముండ దిం తయున్. ౪౫౪

కం॥ మీ పుత్రులకుం బౌత్రుల కేపురుషులు కన్యకలను నీయంగలరో
యాపురుషులకున్ వెయిరెట్లౌ పుణ్యము గలుగు బ్రాహ్మణాగ్రణులారా! ౪౫౫

కం॥ రవి కన్యాగతుఁడగునెడ నెవఁడు గయాకూపి రాక నెంతయు శ్రాద్ధం
బు విధించెడినో గయాశ్రాద్ధవిధికి వెయిరెట్లుఫలము తక్కరగతమా. ౪౫౬

ఆ॥ శ్రాద్ధమునకుమీరు చనుదెంచరేని నాతోఁడనిప్పుడటకుఁ జూడుఁ డేను
దపము భంగమొంద శపియించియేగుదు. నెఱిఁగి సత్వరముగ నరుగుదెండు" ౪౫౭

కం॥ అనియీవిధమున వనియుని కొన కింద్రుఁడు తనదు కనులకొన లెఱ్ఱఁగఁజే
సినఁ గని చనుదే లేచిరి యెనమండ్రుకొలాలపెద్ద. లెవరన వారల్ — ౪౫౮

సీ॥ కశ్యపుఁడను పేరఁ గ్రాలెడుఁ బ్రథముండు కాండిన్యుఁడన ద్వితీయుండు పరఁగు.
నక్షత్రశానమతుం డొగిని దృతీయుండు, కార్కవుఁడగుఁ జతుస్సంఖ్యవాఁడు.
ద్విషుఁడు వాఁబడియెడి ధీరుఁ డైదవవాఁడు. డగును భైజావాపుఁ డాఱవవాఁడు.
కాషిష్ఠలాభిఖ్యగలవాఁడు సప్తముం. డగు ద్విక సంజ్ఞితుం డష్టముండు.
నీటులాష్టకమును గాక యగ్నిష్వాత్తముఖరులౌ పితాళ్ళ మొట్టమొదలె.
యర్చనీయులైన యల్ల విశ్వేదేవతలను బిలువఁబంచెఁ గులిశధరుఁడు. ౪౫౯
తే॥ అవ్విధంబున వారి కాహ్వానమంపి కదలెఁ గడుఁ శ్రద్ధమైఁ జమత్కారనగరి.
కపుడె లోకపితామహుండైన బ్రహ్మ చనియె శ్రాద్ధార్థమై తాను సరిగ గయకు.
కం॥ ఆయనచేఁ బిలువంబడి యాయమరేంద్రుండు పెట్టనగు శ్రాద్ధమునం
దాయానంబొనరింపక వే యరిగిరి గయకుఁ దాము విశ్వేదేవుల్. ౪౬౧

—• ఇంద్రుఁడు విశ్వేదేవతల శపించుట •—

కం॥ వేగంటియుఁ దత్పురమున కేగి గయాకూపి వాడి యెంతయుఁ శ్రద్ధన్
దాఁ గుతపకాలమందున "నాగచ్ఛంతు పితర" యని యాహ్వానిచెన్. ౪౬౨
ఆ॥ దేవరూపులగుచు దివిమైఁ గొందఱుఁ బ్రేతరూపులగుచుఁ బ్రీతిఁ గొంద
ఱంద రరుగుదెంచి యచ్చటులబ్రాహ్మణుల సకాశమందు నిలువఁబడిరి. ౪౬౩
కం॥ కానీ విశ్వేదేవులు కానంబడరైరి యందుఁ. గాలవిలంబం
బేని సహించి తదీయాయానంబున కెదురుచూచె హరిహయుఁ డచటన్. ౪౬౪
ఆ॥ అగ్రపూజ్యులగుట వవ్వారి రాకకై యెదురుచూడఁజూడ నివ్విధమున
నింతలోన నారదర్షి యేతెంచి యయ్యింద్రుతోడ సరవి నిట్టులనియె. ౪౬౫
కం॥ "విశ్వేదేవులు గయకున్ విశ్వస్పృదాహూతులగుచు వేంచేయఁగ నా
కేశ్వర ! మాచితి నీపై విశ్వాసమెయున్న నేలవెడఁ దరటకున్". ౪౬౬
కం॥ అనియివ్విధమునఁ గలహాశనముని వచియించుటయు శతమఖుఁ డటనుం
డినభూమిదేవులెల్లరువిన రోషావిష్టుఁడగుచు వే యిట్లనియెన్. ౪౬౭
సీ॥ "విశ్వేదేవులు లేక పెట్టుదును నీ వేళం బితృశ్రాద్ధ. మీ
విశ్వంబందున నిల్లె దొల్లరును గావింపంగలా. రిందుఁ ద
ద్విశ్వేదేవుల కగ్రపూజయిడి యావశ్యం కృతశ్రాద్ధము
కశ్యకేయుసమీయ దూనరభువిం దాఁబడ్డ వర్జంబటుల్". ౪౬౮
కం॥ అనియిట్లుపలికి స్వారాట్టని మును హాటులైన దివిజులందఱుతం దా
నొనరిచె శ్రాద్ధోద్దిష్టములను సాకల్యముగ నో యిలావిభుచంద్రా ! ౪౬౯

ఆ॥ ఇట్టితతని నెవ్వరెవరికిఁ బిండంబు వైవఁబడెనొ వారివారి దైన
యతనువాణియొక్కటి హరిహయా! వినుమంచు బయలునుండి సరవి బయలువెడలె.

క॥ "ప్రేతలగుచు నపగతసంప్రీతిని మనువారికెల్లఁ బిండములిడి యా
ప్రేతత్వంబును బాపితి దైతేయరిపూ! త్వదీయ దయయెంతదయా. ౪౨౧

ఆ॥ యూర్ధ్వమానులగుచు నొరగి స్వర్గంబున దివ్యరూపములను దేజరిల్లు
వారు ముక్తులైరి వాసవా! నీపెట్టు శ్రాద్ధమునను నీప్రసాదమునను." ౪౨౨

క॥ అనియిట్లు బయలు వెడలుడు విని యనిమిషపతి ప్రమోదవివశత వాహా
యని తత్తీర్థమహాత్త్వము వినుతించెఁ గరంబు. నట్టివేళను సరిగన్. ౪౨౩

శా॥ వేదశ్రాద్ధము పూర్తిచేసి గయను విశ్వేదేవతప్రీతి స్వా
ర్థానధున్ డాయఁగవచ్చి "పెండియును గార్యం బింద్ర! శ్రాద్ధంబు ని
ర్వాపనంబౌనది మత్సనాథమయినం బాడౌను తేరున్నచో.
నీధర్మంబు గ్రహించి శ్రాద్ధఫల మెంతే నొందు నూహింపుమా. ౪౨౪

ఆ॥ తాత ముత్తమొదలు తాఁబిల్చుటం జేసి గయను నేగ శ్రాద్ధకర్మమును ము
గించి నీవు శ్రాద్ధకృత్యంబునకు దవ్వునుండి వచ్చియుంట మోమహేంద్ర!" ౪౨౫

చం॥ అనవిని పాకశాసనుఁ డాగ్రహపూరితుఁడై "ధరిత్రి నీ
దినము మొదల్గ నెంతయును దీనత మిమ్ములఁ బిల్చి శ్రద్ధమైఁ
బొనరుపఁ బద్ధశ్రాద్ధమటు పూర్వము పెట్టిన శ్రాద్ధమున్ ఫలం
బును నిడఁజాల వీరలు కుబుద్ధిని జేసిన చేత పెల్లునన్. ౪౨౬

క॥ ఏకోద్దిష్టంబుల నరలోకంబున నెల్లవారలుం జేయఁగలా
రీకరణిఁ గట్టుచేసితి. మీ కిటఁబనిలేదు పొండు మీ యిండ్లకికన్. ౪౨౭

క॥ భూతప్రేతాదికమగు నేతచ్ఛ్రాద్ధక్రియలకు హేతువయిన యే
జాతము విశ్వేదేవులు ప్రోతురొ యద్దాని నేను బ్రోచెద నింకన్. ౪౨౮

ఆ॥ యత్నపూర్వకముగ యజమానుమేన సంయోజనంబొనర్చి యోజ శ్రాద్ధ
మేను హతమొనర్చు నేగదు నయ్యావి దూరదూరమునకు ద్రుతముగాను" ౪౨౯

క॥ అని గంభీరంబగు వాణిని విశ్వేదేవతలకు నిష్ఠురముగ వా
కొని మఱి "వీరలు లేకుండనె శ్రాద్ధము పెట్టుఁడింక జాగరు! లనుచున్ ౪౩౦

ఆ॥ అట్లెయనిరివార. లంత విశ్వేదేవతలు కుగ్ధిమూనిఁగి పలవరింపఁ
గనులనుండి నీళ్ళు కాల్వలై పాఱెను ధరణితలము నెల్లఁ దడుపుకొనుచు. ౪౩౧

క॥ ఆవెచ్చని కన్నీటం బ్లావితమగు నేలపైని ప్రభవించెను భూ
తావళియు నండములు సంఖ్యావర్జితముగను వింటె యానర్తపతీ! ౪౩౨

సీ॥ కప్పు వైచినయట్టు కంటికింగనుపట్టు బహుదీర్ఘమగు కోఱపండ్లతోడఁ
గఱకుకొయ్యలమాడ్కిఁ గడునిక్కపొడిచి వంచిన కంగనటువంటి చెవులతోడఁ
గొసలువోఁద్రుంచిన కుశలవిధంబుగాఁ జక్కనిల్చిన శిరోజములతోడ
నగ్నికణంబుల ననుకరించుచు బిట్టు రక్తంబుగ్రక్కు నేత్రములతోడ
నతిభయంకరంబులౌ ప్రాణు లొకకొన్ని యందవములను జననమందిలేచి
శాపనిహతులైన సకలవిశ్వేదేవతలగుఱించి యిట్లుపలికెనపుడు. ౪౭౩

క॥ "మాకందఱికినిమిక్కిలి యాఁకలియగుచున్న. దితరమదుఁగంబో. మీ
వా కవధరించి వేగమ మాకుఁజ భోజనమునిడుట మంచిదిమీకుఁజ". ౪౭౪

క॥ అనియిటువా ప్రుచ్చుటయును విని వారల కిట్టులనిరి విశ్వేదేవుల్.
జనలోకంబున మనుష్యులవినాగ శ్రాద్ధములు శ్రద్ధఁ బెట్టెపరింకన్. ౪౭౫

ఆ॥ వానియందొసంగు వరభోజనంబులఁ గుడువుఁ డేగిమీరు కొడుకులార!
యనియిటుల్వచించి యరిగిరి బ్రహ్మలోకమునకపుడు వారు కష్టముగను ౪౭౬

ఆ॥ అరిగి కేలుమోడ్చి "యార్య! నీచే మేము ప్రాజ్ఞమంత్రితులము శ్రాద్ధమందుఁ.
గాన మున్నెవచ్చి గయలోన శ్రాద్ధనిర్వర్తనంబు సేయవలసివచ్చె. ౪౭౭

క॥ తనశ్రాద్ధమునకెముంచుగఁ జనుదేరము మే మటంచు సక్రోధుండై
ఘనవాహనుండు మమ్ములఁ బనివడ శపియించె శ్రాద్ధబాహ్యులు గాఁగన్. ౪౭౮

క॥ నీసన్నిధి కరుదెంచితి మో స్రష్టా! మమ్ము శ్రాద్ధయోగ్యులు గాఁగన్.
జేసి కరుణింపు మనుటయు నాసారసయోని యతికృపాళుండగుచున్. ౪౭౯

క॥ సహితద్విశ్వేదేవుఁడు సహకూశ్మాండగణుఁడగుచు శివునికడకున్.
రహిఁ బయనమయ్యె. నా వృత్రహుఁడచట దివౌకసులకు శ్రాద్ధక్రియలన్. ౪౮౦

—♦ బ్రహ్మ విశ్వేదేవతల ననుగ్రహించుట ♦—

క॥ నిర్వర్తించినవాఁడై సర్వంసహఁ దీర్ఘయాత్ర సలుపఁగడఁగె. న
ప్పిర్వురు నొకచోఁగూడ సుపర్వేశుఁడు సరవి నర్ఘ్యపాద్యంబులతోన్. ౪౮౧

ఆ॥ ఎదురుగానుబోయి యిచ్చియవ్వాని సాష్టాంగముగనుమ్రొక్కి ప్రాంజలియయి
స్వాగతంబునీకుఁ జతురాస్య! నా జన్మత్రయముగూడ నీదుదర్శనమున. ౪౮౨

క॥ తెలియఁగఁబడినది. పూర్వము సలిపితి శుభకర్మమేను. సలుపుచునుంటిన్.
సలుపుదుఁ బరలోకంబునఁ. గలదంతయు వ్యక్తమయ్యెఁ గట్టిగ నాకున్. ౪౮౩

తే॥ అంతయును నిర్వహించెద. నట్లుగాన నిస్పృహుండవైన నీవును నేఁడిటేల
రావలసివచ్చెనో చెప్పు రయముననుచు నింద్రుతోడఁ జతుర్ముఖుం డిట్టులనియె.

ఆ॥ "ఏరిఁబిల్వఁదగుండ నేను శ్రాద్ధంబుఁ బెట్టవలయునపుడదొ ప్రీతితోడ
నగ్రపూజ్యులైన యట్టి విశ్వేదేవతలను శ్రాద్ధబాహ్యతములుగాను. ౪౯౫

తే॥ చేసితివిగాన నటువంటిచేతఁజేసినట్టి నీచే నమంగళ మాచరితము.
అప్రమాణంబుగావించి తఖిలమైన శ్రుతుల స్మృతులను. నీఁక నేమిగతియొ యొబుఁ ౪౯౬

శా॥ మీరింబూర్వము నేనుబిల్చితిని. నా వెన్కన్ నిమంత్రించితీ.
వీరిం బరికింప వీరియెడఁ దప్పేలేదు. కానన్ బహి
ష్కారంబున్ బరలింపు. శ్రాద్ధమున యోగ్యత్వంబు గోల్పోకతన్
వీర ల్వందురుచున్నవారు మిగులన్ వీక్షింపు మాఖండలా! ౪౯౭

కం॥ ఏతత్పూర్వకముగనగు నాతత్ శ్రాద్ధంబు సఫలమగునని మును సం
ప్రీతినచించితి బ్రాహ్మణజాతమున. కసత్యమెట్లుసలిపెదు దానిన్". ౪౯౮

కం॥ అనియిటువక్కాణించుడు "వనఘా! నేనును దురాగ్రహంబున శపియిం
చినవాఁడఁ. గాన నానుడి యనృతంబెటుగాకయుండు నటుచేయుమిఁకన్".

కం॥ అనవుడు వెండియుఁ వనజాసనుఁడిట్లను. "యుష్మదుక్తి సత్యంబగున
ట్లాచరింపెద విశ్వేదేవనిమిత్తం బాలకింపు వాసవ! దానిన్. ౫౦౦

కం॥ ఏకోద్దిష్టంబని కడుఁ వీఁకను నేశ్రాద్ధమీవు విశ్వేదేవుల్
లేకుండఁ బెట్టుమంటివో పాకారీ! యద్ది పెట్టఁబడు లోకులచే. ౫౦౧

ఆ॥ కాని ప్రేతపక్షగతమౌ చతుర్దశియందె శస్త్రహతుల కది సమగ్ర.
మాన్పృతాహమునను నట్లు విశ్వేదేవతావివర్జితముగఁ దద్విజాలి. ౫౦౨

కం॥ సలిపిన శ్రాద్ధమునను ఫలమొలయును మద్వాక్యమహిమ. నొరు లీరీతిన్.
సలిపిన ఫలముండదు నాపలుకున నిస్సంశయముగ బల్యభియాతీ! ౫౦౩

ఆ॥ శస్త్రనిహతిఁజచ్చు జనునకుఁ దచ్చతుర్దశినిగాక యితరతరుణమునను
సలుపఁదగదు శ్రాద్ధ మలఘువిశ్వేదేవతావివర్జితముగ దేవనాథ! ౫౦౪

కం॥ సలుపంబడుచో భూతంబులు తచ్ఛ్రాద్ధాన్నమెల్ల భుజియించు"నటం
చల బ్రహ్మ యీవిధంబునఁ బలుకుటయును సమ్మతించె వజ్రధరుండున్. ౫౦౫

కం॥ లోకపితామహుఁడగు తన్నాకిజ్యేష్ఠునిగుఱించి వినయసంయుతులై
వాకొనిరి యీవిధంబున వీఁకను దదనంతరంబ విశ్వేదేవుల్, ౫౦౬

కం॥ "మాకన్నిటం బుట్టిరి యీకొడుకులు క్షుధితులగుచు. నిచ్చితి మేమున్
బాకారిమీఁదియలుకను మాకుం జెడినట్టి శ్రాద్ధమఖముల దేవా!

కం॥ కావున నస్మద్వాక్యము నా వాసవువాక్యమును యథార్థంబగు న
ట్లీ వాలోచించి కరుణ మావారందఱికిఁ దృప్తి ఘటిల్లఁగలుగఁగన్ ౫౦౯

తే॥ మంచియాహారమును నిరూపించి ప్రోవు" మని కరంబిట్లు ప్రార్థింప వినివిధాత
"బ్రాహ్మణులు శ్రాద్ధవేళలఁ బాత్రములకుఁజుట్టు భస్మంపురేఖలం బెట్టుచుంద్రు.

కం॥ ఏకోద్దిష్టమొ పార్వణమో కా కింకొక్క శ్రాద్ధమో యగుఁగా కా
రేకలు లేకుండినచో మీకాడుకులు గుడుచునది సమృద్ధిగ నచటన్. ౫౧౦

ఆ॥ బాష్పములను దశుపఁబడుట భూమి కుశబ్దవాచ్యయయ్యె. దానివలనఁబుట్టె
నండగణము. దానవైరి మీ రాకనఁ గూశ్మాండులనుచు ఖ్యాతినందఁగలరు" ౫౧౧

కం॥ అని పేరువెట్టివారల కొనరిచి మూర్తిఁగలుగను నొగి నగ్నికి వా
యువన కాదిత్యున కర్పించినవాఁడయి యీవిధమునఁ జెప్పెను మరలన్. ౫౧౨

మ॥ "యజూరాఖ్యంబగు వేదమందుఁగల యా"యద్దేవ" యనెడు క్రియన్
బ్రజ లవ్వారికి భాగమీయనగు. నింకం గోటిహోమంబులో
నిజభాగంబున మీరు తృప్తులగుచున్ నిశ్చింతమైనుండు" రం
చజుఁడీరీతివచించి తత్క్షణమునం దంతర్థిఁ జెందెంజుమీ. ౫౧౩

కం॥ ఆవిధముగాను విశ్వేదైవతములు ప్రీతులైరి. తత్కూశ్మాండా
ఖ్యావళియు విశేషించి ముదావృతమయ్యెను నరేంద్ర! యాలించితో కో. ౫౧౪

తే॥ అట్లుకూశ్మాండజంబగు నగడువలన బ్రాహ్మణులు శ్రాద్ధములయందు భస్మరక్ష
సలుపఁగడఁగిరి. నాగరక్ష్మాసురాళి కిదృశంబగురక్షలే. దెలయునిన ౫౧౫

ఆ॥ వారిస్థానమందె మీటి కూశ్మాండముల్ జననమందుకతన సదయమగుచు
వారిశ్రాద్ధములను గోరవు ఛిద్రముల్. భర్తృయజ్ఞుఁడుడివె భస్మరక్ష. ౫౧౬

తే॥ హాటిహాయుండును బరమేష్ఠియరుగుపిదపఁ దచ్చమత్కారనగరస్థ ధరణిసురుల
గండఁజేకిని గృతాంజలియగుచు వినయ మెంతయునుదోఁప భక్తిమై నిట్టులనియె.

తే॥ వినుఁడునామాట నాగరవిప్రులార! వినినతరువాతఁ జేయుఁడుచ్చీఁకదాని.
దేవదేవుఁడయిన శూలి దివ్యలింగ మేను స్థాపింపఁదలఁచితి నీ పురమున" ౫౧౭

చం॥ అనియిటులన్ వచించుటయు సర్వహితమంబగుస్థానమెక్కడ
య్యనిమిష నేతకున్ మహీసురావళి చూపెను. దత్స్థలంబునన్
ఘనమగులింగమున్నిలిపి కైవసముం బొనరించివారికిన్.
జనెఁ ద్రిదివాలయంబునకు స్వాంతము రంజిల నమ్మహేంద్రుఁడున్. ౫౧౮

—• ఇంద్రుఁడు బాలమండనమున లింగప్రతిష్ఠ సేయుట. •—

వ॥ అనవుడు నానర్తమహీపతి. ౫౨౦

ఆ॥ "ఆర్య! చెప్పితివి గయాకూపికామహత్త్వము సవిస్తరముగఁ గ్రమముగాను.
బాలమండనము ప్రభావంబుగూడ మా కెఱుఁగఁజేయుమయ్య కరుణయుంచి.

కం॥ మఱియును నేస్థానమున స్వరపతి లింగప్రతిష్ఠ నూతనముగఁదా
జరిగెను? దత్పూజనమున ధరణీజనులు పొరయఁగలుగు తత్ఫల మేమా". ౫౨౨

వ॥ అని ప్రశ్నించుటయు విశ్వామిత్రుం డిట్లనియె. ౫౨౩

కం॥ "శివలింగము నిలుపుటకై పవిధరుఁ డా క్షేత్రమధ్యభాగంబున నె
ప్దవనీబర్హిర్ముఖులను బవిత్రమగుస్థలము వేఁడ బాగుగనపుడే ౫౨౪

సీ॥ ఎచట దితీదేవి యెంతయుం దపముండె సురలగెల్వఁగఁజాలు సుతునిగోరి
మరుదాహ్వయములతో గరిమమై నెచట నా దితి యుద్భవించిరి సుతులు పెక్కు
రెచటఁ దత్సుతులెల్ల రింద్రుచే హతులయ్యు వృద్ధినొందిరి చాల మృతులుగాక
యెది మేధ్యతమమైన యిద్ధపదంబంచు మేటికీర్తి గాంచె నాఁటఁగోలె
నట్టి బాలమండనాఖ్యమౌ స్థాన మా బాప లేఁగుదెంచి చూపుటయును
క్రతుభుగీశ్వరుండు కలయ విలోకించి యిజ్యతోడ భక్తి నిట్టులనియె. ౫౨౫

తే॥ "సద్గురూ! శివలింగసంస్థాపనంబు సలుపఁదలఁచినవాఁడ నీస్థానమందుఁ
బ్రళయమునఁగూడ క్షతిలేనిభంగిదాని కొకముహూర్తంబు పెట్టు మత్యుత్తమంబు".

కం॥ అనియిటు వక్కాణించుడుఁ దనమనమునఁ బెద్దప్రొద్దు ధ్యానించి యుతం
డను "మాఘసితత్రయోదశి యినవాసరయుతముఁ బుష్యబుధాన్వితముల్. ౫౨౬

కం॥ అయి కడుబాగుగనున్నది. స్వయముగ శివలింగమీవు స్థాపింపుము. సం
క్షయమందకుండునది. హరిహయ! యాకల్పాంత మధిగతాభ్యుదయంబై." ౫౨౭

కం॥ అనవిని యానందాంబుధి మునిఁగి శునాసీరుఁ డదియెమూర్తంబున గా
యనవాదనములతోడను మొనయుచుఁ బుణ్యాహఘోషములు సెలఁగంగన్.

ఆ॥ బాలమండనంబు పజ్జఁ దల్లింగ ప్రతిష్ఠఁజేసి భూమిదేవతలకుఁ
దనియఁ గుడువఁబెట్టి దక్షిణ యాఘాటము నెడి స్థాన మిడియె నగ్వాభంగి. ౫౩౦

కం॥ హాంకాలమునందుండెడి, దింకం జుట్టును గరంబు నింపగుగోడల్
పొంకముగఁ గలిగినది సుగుణాంకా! యాస్థానమదె సమర్పితమయ్యెన్. ౫౩౧

తే॥ ఇట్లు సామాన్యముగనిచ్చి యెల్లద్విజుల కష్టకులజులఁబిలిచి "చంద్రార్కకాలి
కంబుగా మీకుఁ బంద్రెండు గ్రామముల సమర్పణము సేతుఁ గైకొనుఁ డార్యులార!

కం|| కైకొనియవి యీలింగము వీఁకం జింతించు చెప్పుము విప్రులు! మముఁ " దం
చీకరణిని వాకొనుటయుఁ బాకారింగూర్చి యిట్లుపలికిరి వారల్. ౫౩౩

ఆ|| "విప్రధనము మఱియు విబుధులధనమును నటు తటాకభవము నల్పమేని
యెవఁడుతినునో వాని యేడేడుతరముల ప్రాక్తనులును గ్రిందఁబడఁగలారు. ౫౩౪

తే|| అస్మదన్వయభవుఁడెవఁడైన వానిఁ గుడుచుచో మే మధస్థలింగూలఁగల, మ
టంచు భయమందుచున్నార, మందువలన యీవస్మదుక్తముగావింప నొప్పకొనము"

చం|| అనియిటు లేద్దు రాడుటయు శ్వపచుఁడుం బ్రబరత్రయాప్తకీ
ర్తనుఁడగు దేవశర్మ కృతపాత్రగుపకారుఁడు శక్రుఁ డేదిరో
మనమున నుండియుండు టనుమానముఁజేసి భయంబు భక్తియుక్
బెనఁగొన దోసిలొగ్గి యతిపేశలభావలతోడ నిట్లనుక్ ౫౩౬

పంచచామరము|| "అపుత్రకుండనైన నాదు నన్వయంబు వర్ధిలన్
కృపం గృతజ్ఞుఁ డింక దేవరిక్థవర్జకుండునో
సుపుత్రు ధర్మవేత్త నిచ్చుచోఁ ద్వదీయ శంభులిం
గపూజసేతు" నా నతఁడు కౌతుకంబునొందుచున్ ౫౩౭

సీ|| సకలప్రపంచంబు తృణముగాంచెడి దాఁకఁ దనసంతతిని నిల్పు దక్షుఁడగుచు
మనుజులెల్లరుగూడఁ దనుజూచి నేర్చుకో వ్రతముఁబూని యథార్థవాదియగుచు
దుష్కృతి యెంతయు దూరంబునకుఁబోవ ననవరతంబు ధర్మాత్ముఁడగుచు
దేవస్వమును దానుదినకుండుటే కాక ప్రజల కయ్యది బోధపఱచుకొనుచుఁ
జెలఁగునట్టి సుతుఁడు గలిగెడునీకుఁ, దదన్వయమునఁబుట్టు నాత్మజాతు
లందఱుం గడు న్మహాత్మత వేదపారగతఁ దత్సమానులగుదు రిలను ౫౩౮

కం|| మఱియొక వ్యాపారంబును ధరణీసురవర్య! వినుము, తద్విధమున నిం
దఱు దెంచియున్న భూసురవరులందఱుఁగూడ వినుఁడు. వక్కాణింతున్. ౫౩౯

ఆ|| బాలమండనాఖ్యఁ బరఁగు నీతీర్థమం దీచతుర్ముఖముల నెసఁగునట్టి
యలఘులింగ మనఘ మస్మత్ప్రతిష్ఠితంబైనయది చతుర్ముఖాజ్ఞ వలన. ౫౪౦

కం|| ఎవరీతీర్థంబునఁదా మవగాహనమాచరించి యాహ్నికమగునై
నవహితులై పితృతర్పణము విధింతురొ తత్పితలకు మోక్షముగలుగున్. ౫౪౧

తే|| ఈ మహాదేవునకు భక్తి నేనొసఁగిన ద్వాదశగ్రామములనుండు మేదినీసు
రులు పితృశ్రాద్ధమున ముందు సలుపవలయు నీమహేశ్వరశ్రాద్ధంబు నేమమునను.

తే|| అట్లు ప్రథమంబు గావించి యధికభక్తి నిజపితృశ్రాద్ధకృత్యము ల్నెఱపుకొనిన
విఘ్నములులేక యెంతయు వృద్ధిగలుగుఁ, గాకయుండిన విఘ్నము ల్గలిగితీఱు.

తే॥ మాఘశుక్లత్రయోదశి మఱునుండ వచ్చి యిచ్చటి కాగ్రిమవాసిజనులు
బాలమండనమునఁ గ్రుంకి భక్తి నేతదాఢ్యలింగంబుఁ బూజింప నబ్బు సుగతి.
కం॥ మాయకలింగార్పిత సద్గ్రామస్థద్విజుల కెంతకాలంబున కేన్
మైమఱచి పీడసలిపెడి పాపరు లగుదురు వినాశభాజులు ధరణిన్. ౫౪౫
తే॥ ఆసముద్రసరస్సులో నవనిమీఁద మను సుతీర్థంబులన్నియు మాఘమాస
మందు శుక్లత్రయోదశి నరుగుదెంచు బాలమండనమునకు నోపాపులార "! ౫౪౬
ఆ॥ అనియుపన్యసించి యగ్రమందున్నట్టి యష్టకులఁ గాంచి యాగ్రహమున
వీరలేడుగురును వినక నామాట కృతఘ్నులైరి. కాన దండ్యులింక. ౫౪౭

—♦ ఇంద్రుం డష్టకులనాగరుల శపించుట. ♦—

కం॥ కృతఘ్నుపఱచిన సకలక్షితిజనముం గూర్చి యిటులఁ జెప్పినవాఁ డా
ఋతవాదియును స్వయంభూసుతుఁడును నగు మనువు మున్ను-చూడుఁడు దానిన్

శ్లో॥ కృతఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే శఠే
నిష్కృతి ర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః. ౫౪౮

సీ॥ సర్గాదిగా వేదశాస్త్రంబులన్నింటిఁ బాలించుకొనివచ్చు బ్రాహ్మణులను
దధిపయోఘృతముల ధరణీజనంబును దృప్తి పెట్టుచునుండు ధేనువులను
సృష్టికృత్యమునఁ దత్స్రష్టకు బాసటై ప్రజ వృద్ధిఁ జేసెడి భామినులను
బిట్టుజకంగూరి కట్టినఁ గొట్టినం బ్రతిసేయలేనట్టి బాలకులను
నెవరి తెరువుఁబోక యొచటనో కూర్చుండి ధ్యానమునుబొనర్చు తాపసులను
దునుమఁదగదు. కాన దోషులేయగుదురు గాక, వీరి దునుమఁగడఁగ నేను " ౫౫౦

మ॥ అనివాఁడుగ్రిచ్చి సదర్భమైన జలముఁ జేహస్తంబునం బట్టి " ని
ర్ధనులై పోఁగలవారు వీరు, వఱియీయుం దద్వంశజుల్గూడ నే
జనులన్ యాచనఁజేసి యన్నమును వస్త్రంబున్ సమార్జించి జీ
వనముంజేతురొ పన్నఁబోలెఁ దుద కవ్వారిన్ విసర్జించుచున్. ౫౫౧
ఆ॥ కఠినమానసులును గరుణావిహీనులుం దిండిపోతు లగుచుఁ దిరుగుచుండు "
రనిశపించి మరల నవశిష్టనాగరభట్టులనుగుఱించి యిట్టులనియె. ౫౫౨
ఆ॥ " ఇమ్మహేశు మిమ్మెల్లరఁ బూజించి భూతలీయసుఖము పొందుపొంటె
నైదుదినములుండు నభ్రాంతమందిందుఁ, జూపుఁడయ్యవాఁడు జోటొకండు ". ౫౫౩
కం॥ అనియిటు వాక్రుచ్చుటయును ననుకూలంబై నస్థలము నగుపఱచి వెసన్
మనముల నుప్పొంగుచు నిట్లనిరి కుశాసీరుతోడ నవనీదేవుల్. ౫౫౪

ఆ॥ "బ్రహ్మకాలమనుచుఁ బంచరాత్రములును మనుజలోకసుఖము ననుభవింపు,
మలఘుగీతవాద్యములతోడ నీవు మహోత్సవంబు సేయుచుండు మచట" ౫౫౫

కం॥ అనవిని యత్యంతంబును మనమున సంతోషమంది మఘువంతుండ
య్యనఘద్విజులకుఁ బూజన మొనరిచి స్వర్లోకమునకు నొయ్యనఁ జనియెన్. ౫౫౬

మ॥ మాఘసితత్రయోదశిని మర్త్యులు దేనమునింగి యొక్కమా
ఈ ఘనమైనతీర్థముల యన్నిట మున్గి గడించునట్టి సం
శ్లాఘనయోగ్యపుణ్యమును జక్కఁ గడింతురొ తాదృశప్రభూ
తాఘహ బాలమండన మహత్త్వము సర్వము నీకుఁ జెప్పితిన్" ౫౫౭

## — గౌతముఁ డింద్రాహల్యల శపించుట. —

వ॥ అనియిట్లు నొడువుటయు శానత్రథరాపురందరుండు. ౫౫౮

తే॥ "ఏలభూలోకమందున నింద్రునికి యేనుదినములవఱకేయుం చేరుపడియెఁ?
దక్కఁ వేలుపులుంబోలెఁ దెక్కనాళ్ళు మనుటకభ్యంతరంబేమి? యనఘ! చెప్పుమ

ఆ॥ వత్సరాంతమందు వచ్చి యాపాకారి యవనినుండునట్టి యహము లెవ్వి?
యిందుకొఱకుఁగాను నేనేల నిర్దిష్ట? మంతయును వచింపవయ్య నాకు." ౫౬౦

వ॥ అనియడుగుటయు విశ్వామిత్రుండు వెండియునిట్లనియె. ౫౬౧

ఆ॥ "పంచరాత్రములకుఁ బైని ధరాస్థలి నేలయునికిలేదొ యింద్రునకును
వినిచెదం దదర్థ మనఘాత్మ! యొకగాథ. యవహితుండవగుచు నాలకింపు ౫౬౨

కం॥ అలరె బృహత్కల్పంబున నెలమి బృహత్సేనుఁడనెడి యింద్రుఁడు త్రిజగం
బులకు దొరయయి యటం బూజలఁగైకొను చసురదర్పసంహారకతన్. ౫౬౩

కం॥ ఒకసమయంబున నాతం డపటిలుఁడగు గౌతమర్షి యబల నహల్యన్
సకలాంగసుందరిం గని ప్రకటంబగు మోహమునను బ్రతిదివసంబున్. ౫౬౪

చం॥ సమిధలకున్ ఫలంబులకు సంయమి మిత్రులతోడఁ దా నర
ణ్యమునకుఁబోవువేళలను నాకమునుండి ధరిత్రి డిగ్గి యా
కమలదళాక్షి నెంతయును గౌఁగిటఁజేర్చి రమించుచుండుడున్
సమిదళనుండు గౌతముని సన్నిధికేగి వచించె నంతయున్. ౫౬౫

చం॥ అదివిని తత్క్షణంబ యతఁ డాత్మగృహంబునకేగి చూచుడున్
మదవతిఁగూడియుండు శతమన్యుఁడు దిగ్గనలేచి భీతిమైఁ
జెదరినవస్త్రమేని సరిచేసికొనం దడవుండకున్కి న
య్యదిరియులలిం బలాయనపరాయణుఁడయ్యె. నిఁకేమి చెప్పుదున్. ౫౬౬

పంచచామరము॥ అహల్యగూడ వచ్చినట్టి యాత్మనాథుఁ జూచి తా
మహాభయంబుతోడ లేచి మ్లానమైనయాస్యమున్
మహింబడంగ వంచి మాఱుమాటలేకయుండ నా
గ్రహంబుఁ బెంచి గౌతముండు కన్ను లెఱ్ఱఁజేయుచున్. ౫౬౭

శా॥ "శక్రా! నాప్రియభామినిం జెఱచి-తీచ్చెదంబు దూష్యంబు కా
దే. క్రూరా! వృషణంబు లూడిపడు నీ కీదుష్కృతిం జేసి-యీ
వక్రత్వంబున కిద్ది చాలమిని నీవక్త్రాంబుజం బింకయో
న్యాక్రాంతంబగు-వేయియోనులకు నీ వాధారమై తేకుమా. ౫౬౮

తే॥ మూఁడుజగములదొరనని మురియఁబోకు ఖలుఁడ! నాననె యాపద ల్గలుగునీకు-
నందు భూలోకమునను నీ వడుగువెట్టఁ బగిలి తల తత్క్షణమ వేయిబ్రద్దలగును"

మ॥ అని యింద్రున్ శపియించి పత్నిదెస కాస్యంబున్ వెసం ద్రిప్పి క
న్గొనలన్ నిప్పులురాలఁ జూచుచును నెగ్గుల్వల్కి భర్త్సించుచున్
"జనదూష్యంబగుచేఁత చేసితివి-కాసన్ రాయివై యుండు పో"
మ్మని యిబ్భంగి శపించుటే తడవుగా నయ్యోష ఱాయైపడెన్. ౫౭౦

కం॥ వృషయాను దచ్ఛాపంబున వృషణములం గోలుపోయి వేవిక్రియను వే
ఝుష కేతునిండ్లుఁ గలదయి మషిఁబూసిన కాగితంబుమాదిరి గాఁగన్. ౫౭౧

ఆ॥ వ్రీడతోడ నేగి విజనమౌ మేరుకందరముఁ జొచ్చెఁ దనదుపురికిఁ జనక-
తెలియఁజాలరైరి తెఱఁగఁటు లాతండు కొండబిలములోన నుండియుంట. ౫౭౨

కం॥ నాకము రాజకమగుటను భీకరదానవులచేతఁ బీడితులగుచున్
బాకాభియాతి లేమికి శోకించిరి వార-లనిమిషసతియు నటులన్ ౫౭౩

చం॥ భయపడుచున్ సుపర్వగురుపార్శ్వముఁ జేరి "మహాత్మ! మామక
ప్రియుఁ డెటకేగెనయ్య" యని పృచ్ఛయొనర్చుటయుం జిరంబు ధ్యా
నయుతకనుండి జ్ఞాననయనంబున వీక్షణఁ జేసి చక్కఁగన్
రయముగ దేవయోక్తము పురందరుసన్నిధికేగి యిట్లనున్. ౫౭౪

ఉ॥ "ఏమిది రాజ్యభోగములనెల్ల విసర్జనఁ జేసి నిర్జనం
బౌమహి నాశ్రయించితివి-యన్నియుఁ గల్గియు ధ్యానమూనితీ-
వేమినిమిత్త? ముగ్రతప మీగతిఁ జేయుచునుంటి-వెండినీ
కేమిటకష్టమయ్యె?" నని యెంతయుఁ బ్రశ్నముఁ జేయఁ జేయఁగన్ ౫౭౫

కం॥ భగవదనతఁ గడుసిగ్గున మొగమెత్తఁగలేక బాష్పములఁ దడిసె యొడల్
విగతాధముగా దైన్యం బగుపఱచుచు జంభభేది యపుడిట్లనియెన్- ౫౭౬

క॥ "ఏల నిఁక నెంతమాత్రము త్రైలోక్యముగూడఁ-జూడు తద్గౌతమరు
ణ్యాశ్రమంబుగ నాకియ్యెడ నేలీలలుగలయవస్థ యేర్పడినదియో. ౫౭౭
క॥ వేయోనిచిహ్నములగల యీయానసమునను బోయి యేమని యాద్రై
తేయారుల సంభావనఁజేయంగలవాఁడ ? నీవెచెపు మాచార్యా ! ౫౭౮
క॥ శోభాయమాన యాశచి, సౌభాగ్య, తదంగనాజనమతల్లి, ముఖం
బీభగముఖమునఁజని నే నేథంగిని ముద్దులాడి యిష్టముదీర్తున్ ? ౫౭౯
ఆ॥ మర్త్యలోకమునను మహనీయులెల్లరు నాదుఁజేయుభ్రాజ నష్టమయ్యె
నొక్క కారణమున నుగ్రుఁడై గౌతమసంయమీంద్రుఁ డిచ్చు శాపమునను" ౫౮౦
కం॥ అనియిటువాకుృచ్చుడుఁ గడుఁ బనవుచు వేలుపులతోడఁ బయనంబై య
మ్మునిశార్దూలముపాలికిఁ గొనకొని పనివిని స్వయంబ గురుఁ డిట్లనియెన్. ౫౮౧
చ॥ "హరిహయుచేత వీడఁబడినట్టి జగంబులు మూఁడుగూడ న
ధ్వరములులేక దానవులబాధల కగ్గములయ్యె, పిగ్గునన్
మరల స్వకీయరాజ్యమును మానసమందునఁ గోరఁడాతఁ డె
త్తెఱఁగున నేని శాపమును ద్రిప్పు మనుగ్రహముంచి సన్మునీ !" ౫౮౨
చ॥ అనవిని గౌతమర్షి "యయథార్థము గాదు మదుక్తి, నోటవా
కొనఁబడు దానిలోన నిఁకఁ గొంచెమొనర్ప" ననన్ సురేజ్యుఁ "డీ
యనిమిషులెల్లరున్ హరియు నట్లు స్వయంబుగ నమ్మహాత్ముఁడున్
వినయముతోడవచ్చి నిను వేఁడుచునుండినవారు చూడుమా. ౫౮౩
తే॥ సలువనుడి కన్యథా నీవు నడవఁగూడ, దట్లుగావున విప్రేంద్ర ! యమరపతికి
శాపమోక్షము గావించి సత్కరింపు" మనుచు నతని మనోదార్ఢ్యమును నెఱింగి
ఉ॥ వెన్నుఁడు మున్నుగాఁగలుగు వేల్పులతోడ విరించిసూనుఁడున్
గన్నఁ బోయి "వాసవుని గౌతముఁ డల్గి శపించె, నీసడిన్
గన్ననిశాచరాళి త్రిజగంబుల వ్యాధుల పెట్టఁ జొచ్చె, నే
మున్నది యింక, పిగ్గుపడి యొల్లఁడు రాజ్య మతండు" నావుడున్ ౫౮౪
ఆ॥ పద్మజుండు త్ర్యక్షుపద్మాక్షసహితుఁడై యందు చింద్రుఁడున్న గుహకుఁబోయి
రయమ గౌతమర్షి రావించి యతనితో నెల్ల రాలకింప నిట్టులనియె. ౫౮౫
క॥ "కామాతురుఁడై యింద్రుఁడు నీమడఁతిం జెఱచుటన్న నింద్యమె-నీత
ప్పేమియు నుండదు తాదృగ్ధిమంతులఁబట్టి బిట్టు దిట్టుటలోనన్. ౫౮౬
తే॥ కాని తపసుల కోరుపు కడుఁబ్రశస్య-మెల్లత్రైలోక్యరాజ్యంబు నితఁడు మరలఁ
జేయునట్లు ప్రసాదంబు సేయుమయ్య గౌతమా ! యింక నీ కేమికలుపవలదు.

ఆ॥ ఇచ్చి యండములను నితనికిఁ గ్రమ్మఱ నాననమును రహితయోనిఁజేసి
భూతలమున కెపుడుఁ బోవఁదా నభ్యంతరంబుగలుగకుండ రయము సలుపు" ౫౯

కం॥ అనియిట్లుబోధపఱచిన విని యనిమిషనిష్ఠమైన విశ్వాసముతోఁ
గొనితెచ్చి మేషవృషణము లునిచె సహాలోఖపతికి నుర్వీరమణా! ౫౦

కం॥ ఆయ్యాడుగు బులమీఁదం జయ్యనఁ జెయివైచుటయును జతుస్సులుగా
నయ్యె నవన్నియుఁ బదపడి నియ్యమునను గౌతముం డనిమిషులతోడన్ ౫౧

శా॥ "వేగంటిం బొనరించినాఁడ మఘవున్ వేల్పుల్! వినుం డెంతయున్
బాగా వీక్షణశోభగల్గి మను నీపై నేతదాస్యంబు దు
శ్శ్లాఘాండుండయికూడఁ దొంటిదగు పుంస్త్వంబందు లోపంబులే
కీగండంబు స్వరాజ్యమున్ సలుపుఁగానీ యేగతేఁ దుర్వికిన్" ౫౨

—§ ఇంద్రగౌతమసంవాదము. §—

మ॥ అనివాఁడుచ్చుడు నింతలోపలఁ ద్రిలోకాకీర్ణ మా వేల్పురా
యని మో మయ్యె మునీంద్రుసత్తను సహస్రాక్షుండు శోభాయుతం
బునన్ సాష్టాంగుడు గౌతమర్షి చరణాంభోజంబులన్ వ్రాలి "యో
యనఘా! మర్త్యమునందు నాకగు సపర్యల్ చాల దుష్ప్రాప్యముల్. ౫౩

కం॥ వానికి భంగమువాటిలె నేని త్రిలోకేశసంజ్ఞ యెడలెడినటులన్
గానటులఁ బ్రసాదింపుము" నా నాతం డక్కటికమునను విన నమరుల్ ౫౪

తే॥ ఆయిను రాత్రులు భూలోకమందు నీకు భక్తి జరుపంగఁబడుఁ బూజ ప్రజలచేత.
నెంతయుం దృప్తినొందెద వీవుదాన నొక్కవత్సరమగు దాన నొందినట్లు. ౫౫

సీ॥ ఏదేశమున నానో యీయుత్సవంబు దా నాదేశమునఁ గలి వదుగు వెట్టి
దేపురి నైదునా ల్బ్రహ్మమహోత్సవమగు నాపురిదొర కగు నక్షయంబు
ఏగ్రామజనులెల్ల రీమహంబును జేతు రాగ్రామజనులకు వ్యాధులుండ
వేపల్లెలోపల నీపండు వగుచుండు నాపల్లియం జింత లాశ్రయింప
వెవటఁ బంచరాత్ర మీక్రమంబ లరారు నచటు నావుపాడి కలిసమృద్ధి,
యధికమేల యిట్టులగుచోటు లోకయుద్ద మఖిలసుఖములకును నాస్పదములు"

కం॥ అనియిటు కక్కాంజించుచు మనమున యోజించిచాల మఖవంతుండి
ట్లను, "నాదునుత్సవంబున కనఘా! పాత్రశ్స్త్రమిదేతి, వట్లగు నెడలన్. ౫౬

సీ॥ ఏడాకులరఁటుల నెంతయురమ్యమై జాజిపూవాసన ల్చాలఁగలిగి
మంకెనపూలచే మటిమటివ్యాప్తమై కలువలు తామర ల్కరమెసంగి
తుమ్మెద లెల్లెడ ఝుమ్మని కడుమ్రోయఁ బండువెన్నెలల రేల్నిండియుండఁ

బచ్చనిపై రులం బంటవలంతిదా నఖిలసత్వములకు హర్ష మిడఁగ
నలరునట్టి శరత్కాలమందు మనుజులమ్మరుత్సవ మొనరించునట్లుచేయు,
మీఁగతిని బాలవృద్ధుల కెల్లర కది మిగుల నానందదాయకం బగునుగాక" ౫౯౮

క॥ అనివక్కాణించుటయును మునినాథుఁడు శ్రవణఋతువున నీకు జనుల్
పొనరించెదరు మహోత్సవ, మొనయు ముసంతృప్తి నిర్జరేశ్వర! మఱియున్ ౫౯౯

తే॥ రేవతీఋతువందున నాశధూటి పూనభంగంబుఁ జేసితి గాన నీదు
సుకృతి పరికటీకృతంబుగా వికృతభంగిఁ బఠనమయ్యెడు నీకుఁ దద్భంబునందు. ౬౦౦

ఆ॥ దాన మామకీనధవళయశోజ్యోత్స్న యలము మూఁడు లోకములను గూడ,
నితరుఁడెవఁడు నిట్టి యేనస్సు గావింప భయము నొందు భంగపడుదుననుచు. ౬౦౧

క॥ శ్రవణాదిపంచతారలు భువిపయి వేర్వేఱ నీదుపూజనమునకున్
సవనసమానములగు వాసవ! తీర్థమయంబులును ననుం దేహముగన్. ౬౦౨

క॥ ఎవఁడేకోర్కి నిగోరుచు భవదర్చనసేయు మఱియుఫలపుష్పములన్
బవిధర! వానికి లబ్ధములవు నవి, కానీ త్వదర్చ్యయ యనర్చ్యగొటున్. ౬౦౩

శా॥ ఈ వస్మత్ప్రియ బ్రాహ్మణిం జెఱచినా విల్లోకిఁ జెట్టన్ భవం
బా విచ్ఛిన్న సుతుష్టి వేదవిదవన్యాదిత్యవర్యు ల్కడున్
దీపిం దావకసర్వమంత్రములచే నిల్పంగలా రందునీ
ప్రావీణ్యంబునఁ జొచ్చి మానవకృతార్చం గొన్ము సంతృప్తియా. ౬౦౪

క॥ ఎవఁడేవిధి సుస్తంబగు భవదీయంబైన యుష్టి బాగుగ లేపున్
భువి వాని కావిధంబున నవు నగ్గలమైనసిద్ధి యస్వప్నపతీ! ౬౦౫

తే॥ పంచరాత్రవ్రతస్థుఁడు బ్రహ్మచర్యమూనినట్టిఁడు నగుచు శాస్త్రోదిక ఫల
పుష్పములతోడ నీపూజ పొనరుచునరుఁ డితరపత్నీరతాఘుముం జిఱుపఁగలుగు.

శ్లో॥ "నమ శ్శక్రాయ దేవాయ శునాసీరాయ తే నమః
నమ స్తే వజ్రహస్తాయ నమ స్తే వజ్రపాణయే" ౬౦౬

క॥ అనునీమనువున నెవ్వఁడు నినుఁగూరిచి యర్ఘ్యమిడునో నిత్యమెయిని వాఁ
డును నన్యదారసంగమఘనపాపమునుండి తొలఁగుఁ గ్రతుభుగధీశా! ౬౦౭

ఆ॥ ఎవఁడు నీకు నాకు నిపుడైన సంవాద మధికభక్తిఁజదువు నాలకించు
వాఁడు వత్సరంబువఱకాచరించిన వృజిన మంతరించు వేల్పుఱేఁడ!" ౬౦౮

తే॥ అనినవిని తెలిఁగఁటులు హర్షపడుచుఁ జనిరి యమరావతికి శక్రసహితులగుచు.
గౌతముండును గ్రోధసంకలితుఁడగుచుఁ దనదునాశ్రమభూమికిం జనియె నపుడు.

## —• అహల్యా శాపవిమోచనము •—

కం॥ చని గౌతమముని యీగతి యనుఁగుం గొడుకయిన యా శతానందునకున్
వినుచుడు జరిగినసంగతి వినయావనతుఁడయి యాతఁడు వే యిట్లనియెన్.

తే॥ "తండ్రి! యంతయు సరియె. నాతల్లి కేల శాపమోచన మబ్బంగి సలుపవైతి?
నా వెలె వెడిపనికూడ నరసిచూడ నలవి కానిది కాదునీ. కట్లు గాన. ౬౧౨

కం॥ దీనుఁడ నుత్కంఠితుఁడను నా నాకు మదంబతో సమాగమ మగున
ట్లో నాయన! కరుణించుము నానతియి మ్మింకె శుద్ధయగు పాచితమున్. ౬౧౩

కం॥ అనియిట్లు వేడుకొనుటయు మునియిట్లను. మద్యభాండమును శుద్ధముఁజే
యను సాధ్యమైన నగు విటుజనరేతస్సిక్తభగయు సంశుద్ధియుడన్. ౬౧౪

కం॥ కలుద్రావిన బ్రాహ్మణుఁడును నిల మౌంజీహోమమునను నెనయు విశుద్ధిన్
బలు తింగిని సాధించియుఁ గులటాంగన శుద్ధగాదు కొంచెముగూడన్. ౬౧౫

కం॥ తలఁచుగను సురాభాండము పరిశుద్ధిని గాంచు వహ్నిఁ బతితంబై. య
క్కారణిఁ బరపురుషరేతఃపరిపూరితభగయు నగ్నిఁబడి శుద్ధయగున్. ౬౧౬

కం॥ ఈకారణమునఁజేసియె యోకొడుకా యమ్మదంబ కొసఁగితి శాపం
బేకృచ్ఛ్రమ్ములవలనను నాకె విశుద్ధాత్మగా దఁ"కని నొడువుటయున్. ౬౧౭

ఆ॥ అట్టులైన నగ్నియందైన దూఁకుదుఁ. బడుదుఁ బోయి పెద్ద బావి నేని.
గరళ మేనితిందుఁ. గాని మాతృవియోగమును సహింపఁజాల జనక! నేను. ౬౧౮

మ॥ మనుహారీతపురోగమర్షి కృత ధర్మగ్రంథము ల్లేవె? యిం
కను నైతిహ్యపురాణము ల్గలవు వీకన్ వాని శోధించి నా
యన! మాయమ్మకుఁ జెప్పు మేదొ యొకప్రాయశ్చిత్త. మద్దానిచే
తను శుద్ధంబొనరింతుఁ. గాదనిన సంత్యక్తంబులౌఁ బ్రాణముల్." ౬౧౯

తే॥ అని శతానందుఁ డనుటయు విని మహర్షి పెద్దయుంబ్రొద్దు ధ్యానించి ప్రేమ నతనిఁ
గౌఁగిటను గ్రుచ్చి బాహుయుగ్మమున మఱియు నెలమి మూర్కొని తచ్చిరం
[ బిట్టులనియె. ౬౨౦

ఆ॥ "తనయ! యాత్మహత్య యొనరించికొని యిట్లు కలుష మేల మూటగట్టుకొనెద
వింతసాహసంబు నేల కావించెద? వాలకింపుమయ్య యస్మదుక్తి. ౬౨౧

కం॥ పుత్రా! నీజనయిత్రి పవిత్రయగుచు మామకీన వేశ్మములోనన్
రాత్రిందివములు మనుఁ. జిన్నేత్రమునం గంటి దీని నేను నిజముగన్. ౬౨౨

ఉ॥ రావణుసంహరించుటకు రాముఁడువాఁగ నరాకృతిన్ ధరన్
శ్రీవిభుఁ డర్కవంశమునఁ జెల్వుగఁబుట్టుఁ దదంఘ్రిసోఁకునన్
బావనయౌను నీప్రసువు మానవరూపము దాల్చుఁ గ్రమ్మఱన్.
గావున నంతదాఁక తమగల్గి నిరీక్షణసేయు మాత్మజా!" ౬౨౩

క॥ అనవిని మంచిదియని యమ్మునినూనుఁడు జనని శాపమోచన కాల
ముౘ్మన కెదురుచూచుచుండెను. దనయూల నుండదె యుపేక్ష తల్లులమీఁదన్. ౬౨౪

తే॥ అంత బహుకాలమునకు జనార్దనుండు పంక్తికంఠవధార్థమై పంక్తిరథుని
యింట రామావతారంబు నెత్తియుండ బాల్యమందునె యాభగవాను నేను.

చం॥ క్రతువును సాఁగనీక బహుకష్టము పెట్టెడి దుష్టరాక్షస
ప్రతతిని రూపుమాపుటకు బల్మిని దోడ్కొనిరాఁగ నేర్తెఱన్
హాత మొనరించె వారల. మదధ్వరముం బరిపూర్ణమయ్యె నో
క్షితిపతి వీనులంబడియె సీత స్వయంవరమాట యయ్యెడన్. ౬౨౬

ఉ॥ ఏలిక లందఱం దరుఁగ నేనును దద్రవిడవంశభూమిభృ
ద్బాలకుఁడైన పంక్తిరథుపట్టినిఁ దోడ్కొనిపోతిఁ. బోవఁ బో
నోలిని గౌతమాశ్రమమునొద్ద విశాలశిలాస్వరూపయై
నేలఁ బఱుండియున్న సువినీత యహల్య గనుంగొనంబడెన్. ౬౨౭

చం॥ పదపడి రాముఁగన్గొని “ కృపామతి నియ్యుపలంబుమీఁద నీ
పదవనజంబు మోపుమయ పంచజనత్వమునొందు. గౌతమ
ర్షి దయితయీపె. యల్కఁబతిచేత శపింపఁగఁ బడ్డదై యిటన్
బెద శిలయైన” దంచు నిటు నేను వచించినవాఁడ భూధవా! ౬౨౮

ఆ॥ అటు మదుక్తమగుడు నవికల్పముగ నతం డతిమతూహలమున నట్లుచేయ
నపుడెయద్ది మానవాకృతిధరియించి దివ్యరూపయగుచుఁ దేజరిల్లె. ౬౨౯

క॥ అంతం దా మునుసలిపిన మంతువు స్వాంతంబునందు స్మరణమునకు రా
నెంతయు బిడియంపడు చక్కాంత జోహారుల్పొనర్చి గౌతమమునికిన్. ౬౩౦

క॥ “ పరపురుషునితో సురతము జరిపినగరితకు విరించి సముచితమని యే
ర్పఱచిన ప్రాయశ్చిత్తము సరవినివచియింపవయ్య స్వామీ! నాకున్. ౬౩౧

క॥ నేనది దుష్కరమైనను బూని యొనర్చికొని శుద్ధిఁబొందెద”నన న
మ్మౌనియుఁ బెద్దయుఁబ్రొద్దెవ ధ్యానించి తదబ్జముఖికిఁ దా నిట్లనియెన్. ౬౩౨

తే॥ అఱువదెనిమిదితీర్థంబులందుఁగ్రుంకు చాచరింపుము నూఱు చాంద్రాయణములు
వేయికృచ్ఛ్రంబులును. వాన వీన నుండి యీవు సంశుద్ధవయ్యెద విందువదన! ”

మ॥ అని యిబ్భంగి వచింప నాపె “యటులే” యంచుం బ్రతిజ్ఞన్ వహిం
చినదై తత్స్థలవర్తిలింగముల నన్నింటిన్ సమర్చించు చో
య్యన వారాణసియాదిగాఁగలుగు నాయష్టోత్తరంబైన వ
ట్టైనఘక్షేత్రములం జరించెఁ బృథివీశా! యెంతయున్ భక్తితోన్. ౬౩౪

ఆ॥ అవిధంబునఁ జరియించు చవ్వధూటి హాటకేశ్వరమున కేగి యట్టైకనుడు
నాగరుం డొక్కరుఁడు వచ్చి నాగలోకపుం బథంబగు నాగబిలంబు పూడ్చె.

తే॥ తత్పథంబున నేగి పాతాళమునకు నఖిలదేవాదిదేవుఁ డాహాటకేశు
పూజ సేయుచునుండిరి పూర్వమందుఁ దీర్థయాత్రికులౌ మునుల్పార్థివేంద్ర ! ౬౩౬

ఉత్సాహము॥ అంత " దేవదేవుఁడైన హాటకేశు దర్శనం
బింతదవ్వువచ్చి కూడ నేను జేయకున్న చో
సుంతయేని యాత్రవలని సుఫలముండ దందుచే
నెంతయుం దపంబొనర్తు నేతదర్థమిచ్చటన్." ౬౩౭

తే॥ అనివిచారించి కరముగ్రమగు తపంబు సలుపుచును శివలింగసంస్థాపనంబు
చేసి ముప్పూఁటలును సమర్చించుకొనుచు గౌతమునిగోల యటుఁ జాల కాలముండె

ఆ॥ మంచియెండవేళఁ బంచాగ్నిమధ్యమం దారుబయట వానకారులోనఁ
గొంతుబంటినీటఁ గ్రుంకి హేమంతమం దాయహల్య తపమునాచరించె. ౬౩౯

కం॥ అంతంత శ్రమలకోరిచి యింత తపించినను హాటకేశ్వరలింగం
బింత కనఁబడదు ధాత్రీకాంతా ! యంతటను గొంతకాలంబునకున్. ౬౪౦

కం॥ మరలెత్తఁ దల్లిమీఁదం దరలి శతానందమౌని తత్తత్తీర్థో
త్తరముల నన్వేషించుచు నరిగెను శ్రీహాటకేశ్వరాహ్వాయమునకున్. ౬౪౧

ఆ॥ అరిగి ఘోరతపము చరియించుజనయిత్రిఁ గాంచి మానసంబు కరఁగి నీర
మగుడుఁ గరయుగంబు మొగిచి దైన్యంబుతో బిట్టుదుఃఖపడుచు నిట్టులనియె.

ఆ॥ " ఇచటఁజేరి కాయ మేటికి శుష్కింపఁజేసె దుగ్రతపముఁ జేసికొనుచుఁ
దిరిగి తలుపదేశతీర్థంబు లటనుండు శంభులింగములను జక్కఁగంటి. ౬౪౩

తే॥ ఈరసాతలగత హాటకేశలింగ మేసరుండును వీక్షించియెఱుఁగఁ డవని.
నొకటి దర్శింపఁబడకున్న నుండుఁ గాక. నాదుతండ్రియె నీకిచ్చినాఁడు బుద్ధి.

తే॥ అట్లుగావున నేగుద మరుగుదెమ్ము జననునాశ్రమమునకు నోజనని యింక.
దారులం జూచుచున్నాఁ డతండు నీదురాకకై కర్షకుండు వర్షమును బోలె."

ఆ॥ అనుడు " నెంతవఱకు హాటకేశ్వరదేవ దర్శనంబు నాకుఁ దనయ ! కాదొ
యంతవఱకుఁగూడ నరుదేర నాదేవుదరిసెనం బొనర్చి యరుగుదెంతు" ౬౪౬

కం॥ అనుడు శతానందుం " డో జననీ ! యిది గట్టియైన జనకుసకాళం
బున కేనును నీతోడన చనియెద"నని శంభులింగసంస్థాపకుఁడై ౬౪౭

శా॥ ముప్పూఁట ల్సుమచందనాదికములం బూజించు చాలింగమున్
బప్పుం బువ్వయుఁ బాలు నెయ్యి పెరుగు న్నైవేద్యముల్పెట్టుచుం

చుప్పుం గారము లేని యోగిరము సూర్యుండేగు పైఁ దానుదిం
చిప్పాటం దపముండె నాతఁడును నెంతేఁగాల మోయేలికా ! ౬౪౮

శా॥ వేదోక్తంబగుసూక్తము ల్చదువు చర్విప్రోత్తముం డెంతయో
యాదేవున్ భజియించెఁగాని యెటులున్ హర్షంపడం డాతఁడా
మీఁదన్ గౌతముఁ డెంతో కాలమునకుం బ్రేమాస్పదుండౌ సుతున్
దా దర్శింపఁగఁబోయి యందు నిజమాతంగూడి యుగ్రంబుగన్ ౬౪౯

కం॥ తపమున్న కొడుకుఁగని మొదల పరిమితంబైన హర్షమందియు మగుడన్
నృప మానవసహజంబగు నపథమునఁ బ్రవిష్టుఁడగుచు నాత్మగతమునన్ ౬౫౦

ఉ॥ "కష్టముకష్ట మార ! యధికంబు తపంబు చరించుకొంచు పై
పుష్టినిబాసె నాదు వరపుత్రుఁ. డెటుల్లానిపోదు నింటికిన్ ?
నష్టనిజానవాభయగు నాసహధర్మిణి దర్భకజ్ఞనాఁ
జేష్టలుదక్కియున్న యది చేయఁగఁదగ్గదియెద్ది నాకిఁకన్ ? ౬౫౧

మ॥ అని చింతించి "తపంబు చాలు నిఁక లెండా. యింటికింబోద" మం
చని వాక్రుచ్చుడుఁ దత్తనూభవుఁడు "తాతా ! యీపనిన్ మాన్పఁగన్
జననింగూర్చి యనేకధా నుడివితిఁ. దద్ధాతుకేశుం గనుం
గొనకే రాదఁట. యామెవచ్చుఁ బలె కేనన్ రాను పొ మ్మింటికిన్. ౬౫౨

ఉ॥ ఈయది నాదునిర్ణయ. మిఁకేయది యుక్తమటంచుఁదోఁచునీ
కాయది యాచరింపుము మహామహా!" . నావుడు గౌతముంఁడు "తం
డ్రీ ! యిది నీదునిశ్చయమయేనియుఁ జూడెద హాటకేశ్వరున్
నీయమరుం దపోమహిమ నే"నని చెప్పి యనంతరంబునన్ ౬౫౩

సీ॥ ఆటవకాలమం దారగించుటకుఁ గా బ్రతిమానె మును నూఱువత్సరములు.
ఒకనాఁడుమాని వేలోకనాఁడు కుడువంగ సాహసించెను నూఱుసమలు పిదప.
మూన్నాళ్ళకొకసారి భుజియింపదొరకొనె నంత నింకొక నూఱుహాయనములు
ఫలభక్షణముతోన నిలిపె శరీరంబు నటుపైని మతియొక్క యబ్దశతము.
నీళ్ళుత్రాఁగియుండె నిష్ఠమై నూఱేండ్లు. గాలితినియె కుడవ గడపెఁ గాల.
మవ్విధమున వేయియబ్దము ల్తపముండె గౌతమర్షి గూడఁ గాశ్యపీశ ! ౬౫౪

చం॥ అపుడు భవిం బగుల్చుకొని యర్కసమద్యుతి సర్వలక్షణం
బు పయికివచ్చె లింగ- మదెమూర్తమునన్ భగవానుఁడైన ఖం
డపరశువుం దవీయనయనంబులకుం దగ గోచరించి స
త్కృపమెయి డాయఁబోయి తనకేలునఁ గేలు గ్రహించి యిట్లనన్- ౬౫౫

ఉ॥ "గౌతమ ! నీవ్రతంబునను గల్గెఁ బ్రమోదను- హాటకేశ్వర
ఖ్యాతము మామకీనమును నై మను నేత దనాదిలింగము

ద్యోతితనాగలోకమువనుండి మహీస్థలి కేగుదెంచె నీ
చేతఁ జరింపఁగాఁబడెడి శ్రేష్ఠతపంబు కతంబున న్మునీ! ౬౫౬

చం॥ ఎదిమదిఁగోరి నీవు సుతుఁ డింతి తపంబు చరించుచుంటిరో
యది లభియించె- నీదుసతి యర్చ్వదియెన్మిది క్షేత్రరాజముల్
వదలకసంచరించుటను వచ్చినయట్టిఫలంబు గాంచుఁగా-
కిదియునుగాక వేఱయొక డీవును గోరు వరం- బొసంగెదన్-" ౬౫౭

చం॥ అనియిటుపల్క- గౌతమమహాముని "దేవ! రసాతలంబునన్
మనునెడ హాటకేశు నొకమాఱు గనుంగొనఁ గల్గుపుణ్యమే
జనముల కీస్థలంబునను జక్కఁగఁ గన్గొనఁ గల్గఁజేయు- మిం
కను గర మెక్కుడై యొలయఁగావలయున్ ఫల మేతదర్చనన్- ౬౫౮

తే॥ చైత్రశుద్ధచతుర్దశి సరిగవచ్చి యెక్కుడగుభక్తి నీ హాటకేశలింగ
మునకుఁ బూజన మొనరించుమనుజులెల్ల రరుగవలయును త్రిదశాలయమున కెలమి-

తే॥ నాదుసతిచేత సుతుచేత నవ్యముగఁ బ్రతిష్ఠితములగు లింగము ల్నిష్ఠతోడ
నదెదినంబునఁ బూజించునట్టిప్రజయుఁ గలుషములనుండి తొలఁగఁగవలయు గిరిశ!"

కం॥ అని కోరుకొనుడు "నగుఁగాకని యాఖండేందుమౌళి యంతర్ధానం
బునఁ జెందె- నాఁటఁగోలెను జనులకుఁ దద్దర్శనమున సమసె నఘంబుల్- ౬౬౧

కం॥ నరులు శతానందేశ్వరు మఱియు నహల్యేశ్వరుం గ్రమంబుగఁ బూజిం
చి రహిం త్రిదివాలయమున కరిగిరి పరసతులఁగూడినట్టిరుగూడన్- ౬౬౨

తే॥ అంతలో స్వర్గమంతయు వ్యాప్తమయ్యెఁ గలుషతరమగు మానవగణముచేత-
నిఁకను నీవెంతయనిన నీవెంతయనుచు సరకుసేయకయుండి రామరల నరులు-

సీ॥ క్రతుకర్మమొనరింపఁ గడఁగనే యొకఁడేని తల్లింగదర్శనతత్పరతను-
సువ్రతంబొనరింపఁ జూచెనే యొకఁడేని లింగత్రయిం గాఁగలించుకొనుచు-
దానంబుసలుపంగఁ దలఁచెనే యొకఁడేం యాలింగములమూటి యర్చవిడిచి-
తీర్థసేవయొనర్పఁ దిరిగనే యొకఁడేని యాహాటకేశంబు నవలకరిగి-
యట్లు లింగదర్శనాదికంబులచేత స్వర్గమాక్రమించి జనచయంబు
స్వర్గసీమ సురలు భయపడి వ్యథతోడ నింద్రునొద్దకేగి యిట్టులనిరి- ౬౬౪

శా॥ "భూలోకంబున సర్వధర్మములునుం బోకాడెఁ బాకారి! దు
శ్శీలంబయ్యెను వచ్చి యిచ్చటికి నుశ్రీయందు మాతోడనే
పోలంజూచెడిఁ బూరుషాళి సతతంబున్ గర్వసంయుక్తమై-
క్రాలుం జాలఁగ హాటకేశ్వరమునాఁగన్ క్షేత్ర మొక్కండటన్- ౬౬౫

ఉ॥ అందల గౌతమర్షియుఁ దదంగనయైన యహల్యయున్ శతా
నందుఁడునాఁగఁబిల్వఁబడు నందనుఁడుం దపముండి పెద్దప్రా

ద్దందఱు నన్ని లింగముల హాయన స్థాపనచేసినారు- త
త్పుందరలింగపూజనము చూ కత మిందులకుం బురందరా! ౬౬౬

క॥ గౌతముఁ డీతీరునఁ దనుఁ బ్రీతుం గావింపఁ దపము వెల్లున మఱియున్
బాతాళంబుననుండియు నేతెంచినవాఁడు హాటకేశ్వరుఁ డటకున్ ౬౬౭

మత్తకోకిల॥ తత్ప్రభావముచేత నేర్పడె ధాత్రి నీవ్యవహార. మీ
మత్ప్రయోజన మేమిలేదిఁక శ్రాద్ధదేవున కారయన్-
దత్ప్రసిద్ధములైన నారకతండముత్తదియయ్యె- నే
తత్ప్రకార మెఱింగి చేయుము దానిఁ గాఁగడి చెదమున్- ౬౬౮

ఆ॥ యజ్ఞవిధులు మగుడ నవనీతలంబున సాఁగవలయు దేవతాగణేశ!
వానివలనితృప్తి వేనను గలుగదు మనకు నెంతమాత్ర"మనుడు నతఁడు ౬౬౯

క॥ కామాద్యంతశ్శత్రుస్తోమంబును బిలిచి "మీరు తొందరగం ద
ద్భూమిపయికి దిగి యందఱు సామర్థ్యముకొలఁది నేనుశాసించువిధిన్- ౬౭౦

ఆ॥ గౌతమేశ్వరునకు ఘన శతానందేశ్వరునకు నట్లె మఱియు ననఘుఁడౌచు
నచటనుండియున్న యయ్యహల్యేశ్వరునకును నిఁకను బూజనంబు లెలమి ౬౭౧

చం॥ జరుపకయుండ మానవుల స్వాంతములన్ మరలింపుఁ"డన్న నా
హరిహయశాసనంబు తలయందునఁ దాలిచి వారు గౌతమే
శ్వరముఖదేవతాత్రితయభక్తమనంబులఁ జొచ్చి యాజనుల్
జరిపెడిపూజ లాఁగి, రరిమట్కములూనిఁ గానిదేది"నాన్ ౬౭౨

—§ సిద్ధసేనుఁడు రాజ్యభ్రష్టుఁడై చింతించుట. §—

ఉత్సాహము॥ "ఏమిక్షేత్ర మేమిక్షేత్ర మెన్న హాటకేశ్వరం
బోమునీంద్ర! తృప్తిగా దహాయహా! వినన్ వినన్-
నామనోరథంబుదీర నష్టకల్మషుఁడను గాఁ
బ్రేమ శంఖతీర్థమహిమ విస్తరించిచెపుమిఁకన్" ౬౭౩

క॥ అనియానర్తనృపాలుఁడు వినయంబున నడుగుటయును విశ్వామిత్రుం
డను. "వినుము శంఖతీర్థమ్మునకుం గతమగు మఱొక్క మునుపటిగాథన్. ౬౭౪

శా॥ ఆనర్తంబున కీవు ప్రస్తుతమునం దైనట్లె యన్యుండు మున్
దా నాథుండయి కొంత కాల మవనిం బాలించి యామీఁద నెం
తో నింద్యంబగు కుష్ఠరోగమున నే రోగాలిం గృశించెన్ ధరా
జానీ! యాతఁడు- పెక్కు-లేల-పలుకష్టంబుల్పడెంబో తుదన్- ౬౭౫

సీ॥ తనుఁజూచి భూజను ల్దవుదవ్వులం బోవఁ బెద్దవ్యాధికిఁ బీటఁ బెట్టినాఁడు,
కాలు సేతులు కార్యకారులు గానట్టు లూఁచిపోయిన వేళ్ళ నుండినాఁడు,
పడెడిచో వడి లేవఁబట్టుటకై నను గొడుకులు లేమండఁ గుందినాఁడు
పరరాజు లరుదెంచి పురమాక్రమింపంగ హాయంచు గడగడలాడినాఁడు,
రణము సేయలేక రాజ్యంబు గోల్పోయి పాఱి రైవతాద్రి దూఱినాఁడు,
అచటఁగూడ ననుదినాగతప్రతిరోధిబాధ్యమానుఁడగుచుఁ బనవినాఁడు, ౬౭౬
చం॥ అతఁడపు డాంధ్రఁగూడ నటు నాటవికు ల్వారియించుచున్కికిన్
మతి నెది కార్యమంచుఁ బలుమాఱులు చింతిలి నారదుండు స్వ
స్మృతిస్మృతిగోచరింప మెలమెల్లగఁ దా హరివాసరంబునం
దతనిగుఱించి యేగె, నపు డమ్మునివర్యుఁడు తీర్థయాత్రలన్ ౬౭౭
ఉ॥ చేయుచు విష్ణుమందిరము చెంతకు రాఁ దిలకించి యాతనిన్
డాయఁగఁబోయి మెల్ల నచటం గడుదీనతఁ గూరుచుండి కై
దోయి మొగిడ్చి యిట్టులను "ద్విషదనీకతిరస్కృతుండనై
యీ యచలంబుఁ జేరితి, నిఁకేమని చెప్పుదు సంయమీశ్వరా! ౬౭౮
సీ॥ అస్మదీయములైన హస్త్యశ్వరథములే యిపు డాటవికులు తా మెక్కి తిరుగ,
నస్మదీయహిరణ్మయామూల్యభూషలే చెంచుత లిపుడు కైసేసికొనుట,
యస్మదార్జితమైన యర్థంబె పరిస్తుతిం బనుభూయమాన మంత్రాళిచేత,
నస్మదుద్వాహితలౌ స్త్రీలె యీనాఁడు దాసీలు తురకల తలిరుబోండ్ల,
కరినృపాలుఁడు రాజ్యంబు నాక్రమించు చపహరింపంగ మిగిలిన యాయొకింత
వైభవముగూడ జడవారివలతిఁ జోఁడ కైవసంబయ్యె వల్లడి కాంధ్ర కిటుల. ౬౭౯
ఉ॥ ఇట్టివిపత్పరంపరల కే గుఱియౌటకుఁ బూర్వజన్మమం
దెట్టియఘంబు సేసితినొ యీవు వచింపు మహానుభావ!" నా
నట్టెనిమీలితాత్ముఁడయి ధ్యానమొనర్చి చిరంబు దివ్యమై
నట్టికనుంగవన్ సకల మాత్మ నెఱింగి మునీంద్రుఁ డిట్లనున్. ౬౮౦
సీ॥ సకలశాస్త్రంబులుం జదివినాఁడవుగాని నా వేదియెఱుఁగని కాఁపుదున్న,
వధ్వరంబులు పెక్కు లాచరించితిగాని సంఘసంస్కరణ ముల్సలుపఁగఁడఁగ-
వనయంబు, దానంబు లొనరించితివి కాని బెదరించి పంపవు బిచ్చగాండ్రఁ-
బుడమి వేల్పుల భక్తిఁ బూజించితివి కాని దూఱియుండ వెవేవొ కాపులఱచి-
యట్లు సిద్ధపన్న గాహ్వాయపురమునం జంద్రవంశ్య రాజచంద్రుఁడవయి
యించుకంతపాపమేన్ జేసియెఱుఁగవు పూర్వభవమునందు భూప! నీవు" ౬౮౧

చ॥ అనవుడు భూమిపాలుఁ "డటులైనను నీజననంబునందు నా
యొనరిచియున్న యట్టియఘు మొక్కటియుం గనుపట్ట-దేలయి
ట్లొనరెను రాజ్యవిప్లవ మహో! ముని! యిప్పుడెటుం గనయ్యెఁ బో
ధనరహితుండు లోకమునఁ దా మను టెంతయు వ్యర్థముం చెదన్. ౬౮౨

సీ॥ ధనహీనుఁడై నయాతండు జీవించియు మృతుఁడపో-యవ్వాని నెవ్వఁడడుగు?
రాజునుగోల్పోవు రాష్ట్రి మున్నదియయ్యు లేనిదే-యొవఁడొందు దాన సుఖము?
నశ్రోత్రియునకిచ్చునది యీయుని యదయౌ-నెవనిచే నయ్యది యెన్నఁబడును?
దక్షిణాహీనమై ధరనై నయజ్ఞంబు కానిదే-యటు వేనికౌను దృప్తి?
ధనవిహీనునిచుట్టంబ త న్నెదేని యడుగునను భీతిఁ బెట్టును బేడ మొగంబు
వెనుక నాచేత సంతృప్తి వెట్టఁబడియుఁ గాంచినన్నిప్పు దవ్వేగు ఘనులథంగి- ౬౮౩

తే॥ ఉత్తమాన్వయసంభూతు యోగ్యునైన విత్తహీనుని స్వజనంబు విడిచిపోవు-
సుందర రసాలమైనను శుష్కవృక్షమును బులుంగులు విడనాడి చనువిధమున-౬౮౪

క॥ తనకార్యంబును గూరిచి ధనహీనుఁడు ధనికునిల్లు తాఁ జొచ్చెడిచోఁ
గని చీదఱపఁడుఁగానీ మనసిచ్చి రవంతయేని మాటాడఁడహో! ౬౮౫

క॥ ఎంచఁదగులోభియైనను సంచితధనుఁడయ్యెనేని చని వానినె యా
చించుచునుందురు మనుజులు కొంచెము గొప్పయు యొసంగఁ గొనునూహమెయిన్-

శా॥ "నాకుం దొల్లి టిచుట్టమీవు-వెనుకన్ నాతండ్రి నీతండ్రి య
స్తోకస్నేహముగల్గి వర్తిలిరి. యిచ్చో నేలొకో నాపయిన్
నీకే లేదది" యుంచు విత్తయుతు సాన్నిధ్యంబు నంజేరి యే
మో కోలాహల మాచరింత్రు ద్విజులయ్యున్ లోకు లర్థాళితోన్- ౬౮౭

క॥ దారిద్ర్యసహితుఁడెవ్వఁడు తా రాజ్యం బెవఁడు సేయుఁ దన్మనుజుల వ్యా
న్నీరజములకుఁ బ్రకోపం బారూఢిగ నగుచునుండు నమరమునీంద్రా! ౬౮౮

ఆ॥ అధనుఁడయ్యు నెవ్వఁ డడియాసపడుచుండు నెవఁడు కుపితుఁడగు ననీశుఁడయ్యు
నా విచారశూన్యులగువార లిరువురే కాయశోషఁజేయు కటురుముండ్లు. ౬౮౯

క॥ ధనలుబ్ధు లర్థార్తను కనుకని సేవింత్రు వల్లకాడును గూడన్-
జనయితనువదలిరేనియు ననయము బహుదూరమునకు నరుగుదు రకటా! ౬౯౦

చ॥ ధనికుఁడు మూర్ఖుఁడయ్యు నగు దండిమనీషి-మనీషియయ్యు ని
ర్ధనపురుషుండు మూర్ఖుఁడగుఁ-ద ద్ధనవంతుకులంబు నీచమ
య్యును ఘనమౌ-గులీనుఁడయియుం గులహీనుఁడగున్ దరిద్రుఁ-డీ
ధనముప్రభావ మేమనుదు-దాసులఁజేసెడి నెంతవారలన్. ౬౯౧

—◆ లిఖితుఁడు శంఖునిచేతులు తెగఁగొట్టుట. ◆—

చం॥ అనవిని నారదుండు కరుణాళుతఁ బెద్దయుఁ బ్రొద్దు ధ్యానమున్
బొనరిచి సాదరంబుగను "భూధవ! నీవు విశుద్ధియౌవిధం
బును నిజరాజ్యమున్ మగుడఁ బొందువిధంబునుగూడఁ జెప్పెదన్.
విను. మిల హాటకేశమన విశ్రుతమౌ నొకక్షేత్ర ముండెడిన్. ౧౯౨

తే॥ మూఁడుజగములవారికిం బూజ్యమైన తన్మహాక్షేత్రమునను దీర్థంబు నొకటి
యఖిలపాపవినాశకంబగుచునుండు. శంఖతీర్థంబటందురు జనులు దాని. ౧౯౩

తే॥ అచట వైశాఖమాసమం దాదివారయుక్తశుక్లాష్టమిని భాస్కరోదయమున
స్నానమొనరించుమనుజుండు సకలకష్టములను దొలఁగి యినద్యుతిగలిగి యొప్పు.

తే॥ అన్నిటం దుర్లభంబైన యద్యదిష్ట మభిలషించునో నిస్సంశయముగ దాని
నపుడ పడయును శంఖేశ్వరాభిధానతత్తటస్థితశివలింగదర్శనమున. ౧౯౫

ఆ॥ ఇంతదవ్వువచ్చి తీవు స్వదేశస్థశంఖతీర్థవిధమె సరిగవినవె?
శంఖతీర్థవిధము శంఖేశ్వరునివిధ మెఱుకపఱతువిను మహీశ! నీకు. ౧౯౬

ఉ॥ ఉండిరి శంఖుఁడున్ లిఖితుఁ డుర్విని మున్నొకతల్లిబిడ్డ లు
ద్దండులు వేదశాస్త్రముల ధార్త్యమ రేంద్రులు. వార్విభక్తులై
దండిగ నాశ్రమంబులను దౌదవ్వులన్ రచియించి యప్పుడ
ప్పొండొరు చూచుకొంచుఁ గర ముగ్రతపంబు చరించి రో ప్రభూ! ౧౯౭

ఉ॥ ఆమునిజంటలో లిఖితుఁ డగ్రజుఁ డాతనిఁ జూచిరా మదిన్
బ్రేమజనింప శంఖునకుఁ బ్రీతి నొకానొకనాఁడు మెల్లఁద
ద్ధామమునొద్దకుం జని యతం డటలేమిని బ్రొద్దుపోక కా
రామవిహారమున్నలుపు చందలి పక్వఫలంబులం గనెన్. ౧౯౮

క॥ కని యగ్రజునెడలం గలచనువున నొకకొన్ని ద్రెంపుసమయంబునన్
జనుదెంచి లిఖితుఁడచటికిఁ దను నడుగ కెత్రెంపినట్టితమ్మునిమీఁదన్. ౧౯౯

చం॥ అలిగి "దురాత్మ! యేమిపనిరా యిది? పెంచుచుఁ బెద్దఁజేయు నా
ఫలములఁ గొన్నవాఁడవు తపఃక్షయమౌనటు. భూమిదేవతా
కులమునఁ బుట్టి చౌర్యమునకుం దలపడ్డవిధంబుఁ జూచి పె
ద్దలు నిను నిందసేయు దురితంబు గడించితివీవు" నావుడున్. ౨౦౦

ఆ॥ "ఏకగర్భభవులమిరువుర, మదియునుంగాక జ్యేష్ఠుఁడవును నాకు నీవు
పృథివి నిందువిన్నఁ "బిత్రుసమో జ్యేష్ఠ" యన్ శ్రుతి ప్రసిద్ధయగుచు శ్రుతులఁబడెడి

ఆ॥ కానఁ బితృధనమున సూనున కధికార ముండియుండదొక్కొ పండితేంద్ర!
చౌర్యమిదియటంచుఁ జాలఁ గఠోరోక్తులాడుచున్నవాఁడ" వనుడు నతఁడు.

చం॥ ఇరువురుఁజీలిపోక యొకయింటన యుండినయప్డు తండ్రిసొ
మ్మరయక తీయవచ్చుఁగొడు. కందున దోషమురాదు కాని యే
వ్వరిగృహమందువారు స్థిరవాసముసేయుచు వేఱుపోయియుం
డరలఁ దదీయవిత్త మణుమాత్రముగొన్నను జౌర్యమయ్యెడిన్. ౨౦౩

తే॥ కొడుకుసొత్తు విభక్తుఁడై కూడఁ దండ్రి కొనుటగాకది యొక దొంగతనముగాదు
మనువు దీనికిఁ జెప్పెఁ బ్రమాణముగను శ్లోకమొక్కటి. యద్దానిఁ జూచుకొనుము.

శ్లో॥ త్రయఏవాధనాఃప్రోక్తా భార్యా దాస స్తథాసుతః
యత్తే సమధిగచ్ఛంతి, యస్యతే తస్య తద్ధనం." ౨౦౪

చం॥ అనవుడు శంఖుఁ "డియ్యది మహత్తరచౌర్యమ యయ్యెనేని నా
యొనరిచియున్నయట్టి యఘమ్మాగ్రతపంబు నశింపకుండఁగన్
నను మును శిక్షితుంజలుపు" నా లిఖితుండు దయానపేతుఁడై
యనుజు భుజద్వయిన్ నఱికె నక్కట! స్వచ్ఛతరాసిధేనుకన్. ౨౦౬

ఆ॥ అహహ! యాబ్రాహ్మణుఁడు ఛిన్నహస్తయుగళుఁడై వ్యథంపడుచుంగూడ నదినిజాగ్ర
జుని ప్రసాదంబుగా మది౦ జూచెఁగాని యన్యథాయెంచఁ. డెంతసహనమొ కనుమ.

క॥ అంతట సకలేష్టదమని యెంతయు భావించి హాటకేశ్వరమునకున్
జింతిలక పోయి యటనొక కాంతసరఃప్రాంతమందుఁ గడునిష్ఠమెయిన్.

సీ॥ వర్షరుతువునఁ బెద్దవర్షంబులందుండి శతరుద్రములఁజాల జపమొనర్చెఁ.
జలికాలమున శీతజలమునలనిలుచుండి సామరుద్రముల హ్వాత్రములఁజలిపె.
నలఘుగ్రీష్మమునఁ బంచాగ్నిమధ్యస్థుఁడై భవరుద్రములలెస్సఁ బఠనసేసె.
మప్తకాలమునఁ బసాపడుచుం బ్రీతిఁ బ్రాణరుద్రముల స్తోత్రంబుసలిపె.
నొగిని స్కాందసూక్తయుత నీలరుద్రపారాయణంబుమిగులనాచరించెఁ
దానునిలిపినట్టి స్థాణుభాస్కరవిగ్రహములయెదుటఁజేరి యాద్విజుండు. ౨౦౯

ఆ॥ అంత వేయిరేండ్ల కాదిత్యముఖరాష్ట్రమూర్తియైనయట్టి మూఁడుకనుల
సామి దర్శనంబొసంగి "శంఖా! నీదుతపము నన్నుఁ జాలఁ దనియఁజేసె. ౨౧౦

చం॥ ఎదిమదిఁగోరి యాతపము నీవు చరించుచునుంటొ దాని ని
చ్చెదఁజెపు"మన్న నాద్విజుఁడు చేతులుమోడ్చి "మహేశ! నీవు స
మ్ముదమునుబొంది యిష్టవరమున్ దయసేయఁదలంచెదేని నా
కుదిలెను లోఁగాక మునుపుండినభంగి మదీయహస్తముల్. ౨౧౧

శా॥ నాపై నక్కటికంబుఁ జూపుచును గంగాజూటు! యీలింగమం
దేప్రొద్దున్ రహిఁ సంక్రమించి మను. మింకేత జ్జలాధారమున్
నా పేరం బ్రథితంబొనర్చి యొగి దీనన్ స్నాతులౌ వారి దు
ష్ప్రాపార్థంబును బెద్దఁ జేసి యిడు చాచంద్రార్క మిందుంచు” నాన్. ౨౧౨

మ॥ “ఇది వైశాఖసితాష్టమీదినము. వ న్నీనాఁడు దర్శించితీ.
వదియే హేతువుగాఁగ నేతదురులింగాకారముం జొచ్చి యుం
డెద నీయొక్కదినంబు. వచ్చి యెవఁడేనిన్ భానువారాన్వితై
తదహోమస్సునఁ దావకీనఘనతీర్థంబందు సుస్నాతుఁడై ౨౧౩

తే॥ త్వత్ప్రతిష్ఠితమన్మూర్తి తద్దభక్తితోడఁ బూజింపఁగలిగినఁ దోడుతోడ
వాఁడు కుష్ఠాదిగదముల వీడి నాదు లోక మొందును. వలదిందు నీకు శంక. ౨౧౪

కం॥ మఱియొకనాఁడేనియు నీకరణిని ద్వత్తీర్థజలవగాహ మదర్చా
పరిచర్యల జరిపినవరు లెఱుఁగక చేసినయఘంబు లెల్ల నశించున్. ౨౧౫

శా॥ ఆమాడ్కిం దెగఁగొట్టఁబడ్డ భవదీయం బైన కైదోయియున్
దా మత్ప్రోక్త సము త్తలక్షణయుతైకద్యోగసుస్నాతవా
చో మున్నున్నటులుండు వెండి. యిపుడే చూపింతు. నిందాడియా
నామూర్తిన్ విధిచోదితంబుగ వెసన్ క్ష్మాపాల! పూజింపుమా. ౨౧౬

శా॥ ఈవైశాఖసితాష్టమీదినమునం దిందాడి మన్మూర్తి సం
సేవింపన్ వికలాంగులైన యొరులున్ శీఘ్రంబుగన్ ముక్తి గం
ద్రో విప్రా!” యని యష్టమూర్తి నిజఖద్యోతస్ఫురన్మూర్తిచేఁ
దా వాక్రుచ్చి యదృశ్యుఁడౌటయును నాతం డప్డు శుద్ధాత్మతన్. ౨౧౭

మ॥ అభిషేకం బొనరించి యాసరసిలో నాదిత్యు నర్చించియున్
శుభమాఁగాకని తన్నుఁదాను గలయంజూడన్ యథాపూర్వమా
ద్విభుజంబుల్ కనుపట్టె దేహమునఁ బృథ్వీపాల! యమ్మేదినీ
బుభుఁ డబ్బంపడి నాఁటఁగోలెఁ దప మందే చేసి ముక్తిం గనెన్. ౨౧౮

కం॥ కావున నీవును భూవర! యా వైశాఖీయమగు సితాష్టమిదినమం
దావిధమున నే స్నానము గావించి యజింపు ముష్ణకరవిగ్రహమున్. ౨౧౯

కం॥ ఎవఁడీయ్యది ప్రతిదినమును రవిముందఱఁ గూరుచుండి రహిఁ బఠియించున్
శ్రవణింపఁ దదన్వయసంభవులుం గుష్ఠంబుబాఱఁ బడ రొక్కపుడున్.” ౨౨౦

—♦ శాంబూల ప్రభావము. ♦—

మ॥ అని దేవర్షి వచించుడున్ విని నృపుండా సిద్ధసేనుండు త
ద్ఘనవైశాఖసితాష్టమీతిథియం మార్తాండయువారమ్ముగా

డను రాఁ గల్యమునంద పోయి కడువేడ్కఁ శంఖతీర్థంబులో
మునుకల్ వైచి యిషార్చనంబు నెఱపంబో యెట్లో కష్టంబుగన్. ౨౨౧
ఆ॥ అంతఁ దత్క్షణంబ యపగతకుష్ఠుఁడై దివ్యదేహుఁడగుచుఁ దేజరిలుచు
ధరణిపాల! యతఁడు పరమసంతోషంబు పడసె. నంతకన్న భాగ్యమున్నె.
తే॥ అవలఁ దాంబూలచర్వణప్రాప్తమైనకొలఁదుఁ బాచితమొనరించుకొని యతండు
స్వపితృపైతామహంబగు సకలరాజ్య మాక్రమించుచు శ్రీమంతుఁడై చెలంగె.
ఆ॥ నాగవల్లిపైనె నలిగెయో చినిఁగెయో చూర్ణమయియె యున్న పర్ణములను
భక్షణంబు సేఁత పాపంబు గావున దానిఁగూర్చి పాచితంబు వలయు ౨౨౪
ఆ॥ శంఖతీర్థరాజసంబంధమై నట్టి దీని నీకు వినిచినాను సరిగ
నిఁకను నేమివినుట కిష్టంబుగలదో వచింపవయ్య. చెప్ప సిద్ధముంటి." ౨౨౫

వ॥ అనివక్కాణించుటయు నానర్తనృపాలుండు. ౨౨౬

ఉత్సాహము.—"చూర్ణపర్ణభక్షణమున క్షోణినాథునింట వి
స్తీర్ణమైయెసంగులక్ష్మి చెదరిపోయెననుట యా
కర్ణనంబు సేయ నయ్యెఁ గరమువింత. యెటులిఁకన్
నిర్ణయించెఁబాచితంబు? నీవనుడువు మద్దియున్." ౨౨౭

వ॥ అనియడుగుటయు విశ్వామిత్రుండిట్లనియె. ౨౨౮

చం॥ "తములపుటాకు పావనము. ధర్మదమున్ విధితోడ దాని వ
క్త్రిమునఁ బ్రవేశపెట్టనగుఁ దప్పిన దోషము. గావునం బ్రయ
త్నమునను నంతొ యింతొ మును దానముసేసి యనంతరంబునన్
దములము సేయుటొప్పను సనాతనపద్ధతి నుండువారికిన్." ౨౨౯
వ॥ అనియిట్లు నొడువుటయు వెండియు నమ్మహీవల్లభుండు. ౨౩౦
కం॥ "తాంబూలి యేప్రకారమునం బుట్టెను? దాని చర్వణంబు నశాస్త్రీ
యంబుగఁ జేసెడిచో దోషం బెటులఘటిల్లుఁ. జెపుము సంయమివర్యా!"

వ॥ అనఁబ్రశ్నించుటయు మఱియువిశ్వామిత్రుం డిట్లనియె. ౨౩౧

తే॥ "ప్రశ్నభారంబు నిడితి నాపైని గాని యుత్తరంబిత్తుఁ గౌతుకంబున్న నీకుఁ
జూర్ణదళభక్షణంబునఁ బూర్ణదోష మేలప్రాప్తించునదియును నోలి వినుము.
చం॥ అమృతముఁగూర్చి పూర్వము సురాసురు లబ్ధి మధించి. రష్డు క
వ్వముగనొనర్చి మందరము వాసుకి యోక్త్రముగానుజేసి పు
చ్ఛము నమరుల్ ముఖంబు బలి చక్కఁగఁబట్టిరి. విష్ణునాజ్ఞ చేఁ
గమఠము మోయుచునొప్పఁగానెఁ గష్టమునోర్చి కవ్వపుంగులన్. ౨౩౪

కం॥ తరిగొండ యంత బలిమిని గిరగిరఁ ద్రిప్పంగఁబడుచు క్షీరసముద్రాం
తరమునఁ బ్రభవించెను మొద ల్చిరుతరరత్నములుమూఁడవహో యన. మఱియున్.
సీ॥ అగ్గలంబును నల్లనైనబట్టలతోడ దడ్డమైన యదేవన్నె యొడలితోడఁ
బల్లకీబొంగుఁ బోల్పఁగఁదగు ముకుతోడఁ గడుఁ బెద్దదగు తలకాయతోడఁ
బోలుఁగట్టనుబోలు పొడవైన మెడతోడ గుట్టువెళ్ళెడి బానపొట్టతోడ
నటుకులయంతేసి యలఁతికన్నులతోడఁ గంచిచేటలవంటి కాళ్ళతోడఁ
గప్పుపండ్లతోడఁ గర మడల్గలిగించు చొకఁడు నట్టిరూపె యొలసి ప్రేలఁ
గొడుకుఁగుఱ్ఱఁ బట్టుకొని చాలుబరువునకుండు వానిపెండ్ల ముట్టిపడిరి. ౨౩౬
కం॥ తరుచుచుఁ దరుచుచు నుండిన గిరివరముఁ బరిత్యజించి గీర్వాణులు నా
శరు లంతకుమిక్కిలి యా వరరత్నములను గ్రహింపఁ బరువెత్తిరటన్. ౨౩౭
కం॥ పరువెత్తి యచటనుండిన పరమవికారంపుటాడలి భార్యను భర్తన్
సరిగం గనుగొని వెనుకకు నరుదెంచిరి బిట్టు నవ్వు చన్యోన్యంబున్. ౨౩౮
కం॥ పదపడి బలి సాంజలియయి యదితిజులకు మాకు ముఖ్యుఁడగుహేతువుచే
నెదిమొదలు పుట్టు నయ్యది త్రిదశజ్యేష్ఠుండు పొందితీరఁగవలయున్. ౨౩౯
ఆ॥ తత్సమర్పణమునఁ దప్పక యీమంథనమున నిష్టసిద్ధి యమరుమనకుఁ.
గావ నయ్యజుండు కైకొనుఁగాక యీమూఁడురత్నములనుగూడ" ననుడు.
సీ॥ బలిపల్కినది చాల బాగుగానున్నదం చురరీకరించె నాయుక్తి శౌరి.
బాగుబాగని పదింబదిగఁ బ్రశంసించె రూఢి బోశాశంకరుండు దాని
నింతకంటెవిశేష మేమియుండునటంచుఁ బురుహూతుఁడొట్టివేల్పులు పొగడిరి.
మాదొర యెంతయు మంచియోజనచేసెనని విశేషించి వాకొనిరి యసురు.
లంతలోన బ్రహ్మ యనభిలాషుండయ్యు వారిమాటమీఁది గౌరవమున
రత్నములనుమూఁడు రమణమై గ్రహియించె. మరల నెల్ల రబ్ధి తరిచి రంత.
సీ॥ సుడియొక్కఁ డ్రొలయుదుఁ బొడమె వారుణి. బలి రహి దానిఁగొనె బలారాతియెదుట
నిఁకనొక్కయావర్త మేర్పడఁ గౌస్తుభం బుదయించె. హరి దాని నెద ధరించె.
మఱియొక్కయుదకభ్రమంబురా జాబిల్లి కలిగె. నాతని శూలి తలను జేర్చె.
వేఱొక్కటుంబుట్టెఁ బారిజాతము. నందనమున వేల్పులు దాని నాటుకొనిరి.
వత్సయుత కామధేను వాపయిని బుట్టి చనియె గోలోకమునకు ద్యోసరణిఁబట్టి
వైద్యరాజయినట్టి ధన్వంతరియును నమృతకలశంబు కైకొని యవల వెడలె. ౨౪౦
ఉ॥ అంతట నొక్కమూ [illegible] సుర లాశరు లీయది మాది మాది యం
చెంతయు గుంజులాడుచు మహీశ్వర! దైత్యుఁడు దేవతాళికిన్

గాంతసుధాకలశం బెలుఁగు నుగ్రవ్యథు గాలికిఁ జేతఁజిక్కె. న
త్యంతము నబ్ధిలో తరిచి రంబుధి యందమృతముఁ గూడి వెండియున్. ౭౪౩

చం॥ పదపడి శుభ్రవస్త్రయును బంకజహస్తయునై వెలుంగు శ్రీ
యుదయమునొంది తానచని యోగ్యుఁడటంచు హరిన్ వరించె. స
మ్మదమునఁ గమ్మలం దనుప మందుచు లేచెను గాలకూట. మ
య్యదిగని దేవదానవులు హాయని దూరముపాఱి రేమనన్. ౭౪౪

ఆ॥ తీవ్రమైనదానిఁ దీవ్రపరాక్రముండగు కృశానురేతుఁ డందుకొనుచు
భక్షణంబుసేసెఁ బదపడి. యదె హేతు వతఁడు నీలకంఠుఁడై రహింప. ౭౪౫

ఉ॥ మందరవాసుకిప్రభృతి మంథనసాధనముల్ త్యజించి య
ల్లంద దదనంతరంబున విలాపరిపాల! సుధానిమిత్తమై
యందఱుఁ బోరొనర్చిరి సురాసురు లొండొరు. యోషిదాకృతిన్
బొంది యుపేంద్రుఁ డప్సరుల మోహపయోనిధి ముంచె నాదటన్. ౭౪౬

ఉ॥ ఆవగలాడిముచ్చటల కగ్గలమున్ బలి మోసపోయి గో
త్రావర! పొందుసేసి యమృతంబునొసంగెను. దానిఁగొంచు నిం
ద్రావరజుండు స్వాకృతి రయంబుగ వేల్పులఁజేరి "తృప్తిగన్
ద్రావుఁడు చావులేకమని దైత్యులగెల్తు" రటంచుఁ బల్కుడున్. ౭౪౭

తే॥ వారు మంచిదియని యటం గూరుచుండి క్రోలి రమృతంబు నందఱుంగూడి కరుసఁ
బడసి యమరత్వముం దత్ప్రభావమునను నసురవీరులఁ బరిమార్చి రాలమందు.

ఉ॥ పానవిధిన్ విధుంతుదుఁడు బాగుగ దైవతవేషధారియై
తానును గూరుచుండి సుధ ద్రావఁగడంగుడు గుర్తుపట్టి రా
భానుఁడు చంద్రుఁడయ్యసురుఁ. బద్మదళాక్షునకున్ వచించి. రా
ధీనిధి వానిశీర్షమును ద్రెంచె సుదర్శనచక్రధారలన్. ౭౪౮

కం॥ తలదెగఁగొట్టఁగఁబడియును నిల్వాలక యమరభావమెనసిన యామొ
క్కలుఁడగు రక్కసుఁ గనుగొని వలమురిదాల్పపుడు సాంత్వవాక్యంబులచేన్.

కం॥ "వదలుము రాహూ! దైత్యులఁ. బ్రిదశులకున్ సమ్మతముగఁ దేజరిలుము. ని
న్నిది మొదలుగ గ్రహమండలిఁ బదిలముగం జేర్చి భక్తిఁ బ్రజ పూజించున్."

చం॥ అనివచియింప వల్లెయని యాదితిసూనుల నుజ్జగించి య
ల్లన గ్రహమండలస్థుఁడయి లాభమొనర్చియు చేసికొంచు భూ
జనుల సమర్చనంబులను జాలగ్రహించుచునుండె నాతఁ. డ
య్యనిమిషు లెంతయున్ విజయమందిరమాంపతిమంథనంబునన్. ౭౫౧

తే॥ త్రావఁగా మిగిలిన యమృతమును సురలు నందనమునకుఁ గొనిపోయి నాగరాజు
కట్టుకంబము మొదటను బెట్టుటయు నహర్నిశములు పదస్రావియైన దాని. ౨౫౩

ఉ॥ వేటులకుం గమండలువు భిన్నముగా నట నంకురించెఁ దా
నాటు పుఁదీవయొక్కటి. దది వైళము తద్గజబంధనంబుపై
నీటుగఁ బ్రాఁకుచుం గరము నివ్వటిలం బొడగాంచి దేవతల్
గాటు సుగంధముం గలిగి క్రాలుచునుండు తదీయపర్ణముల్. ౨౫౪

తే॥ త్రెంపి భక్షింపఁగడఁగిరి. దేవవైద్యుఁడైన ధన్వంతరియు దాని నరసి సరిగ
నాగబంధోద్భవంబౌట నాగవల్లియన స్వర్గస్థానమునగునిది యుంచుఁ బలికె. ౨౫౫

తే॥ తములంబయ్యెడి విధమునఁ గ్రముకంబులతోడ మఱియు ఖాదిరపుం జూ
ర్ణముతోడఁ గూడ సంయుక్తముఁ జేసెనతండు దానిఁ గడుఁ జతురుండై ౨౫౬

ఆ॥ అంతఁ గొంతకాల మరుగుపై వాణివత్సరికనామధేయధరణినాథుఁ
డింద్రుఁ గూర్చి తపము నెంతయుఁ గావింప మెచ్చియచటికపుడు వచ్చి యతఁడు

తే॥ "ఓయి ధరణీశ! నీచేయు నుగ్రతపమువలన మిక్కిలి సంతోష మొలసె నాకు.
నీదుమదిఁ గోరుకోరిక యేదొ చెప్పు మిచ్చిపోయెద" ననపుడు నెలమి వొంది ౨౫౭

క॥ ఆ రాజన్యుండిట్లను. "గోరాజా! మెచ్చి నాదుకోరిక యిడెదేన్
సారెకు నీలోకమునకు నే రా సువిమానమొకటి యీఁగదవయ్యా." ౨౫౮

క॥ అనియిట్లు వేడుకొనుటయు మనలకు గవేగమైన మహితవిమానం
బును గరుణ నొసఁగె నింద్రుఁడు. దినదిన మదియెక్కి యతఁడు త్రిదివముఁ గలిగెన్.

క॥ చనుదెంచి త్రిదివమునకుం దను దర్శించి చనునపుడు దైవతవిభుఁడా
యనకుం దాంబూలంబిడి యని పెడివాఁ డతనిమీఁది యక్కటికమునన్. ౨౬౧

ఆ॥ పరమహర్షమునను భక్షింప నద్దాని వృద్ధునకును గామవృద్ధియయ్యె.
నంత నింద్రునడిగి యవనికిం గొంపోయి నాటెఁ దనదుతోఁట నాగవల్లి. ౨౬౨

ఆ॥ అది క్రమక్రమముగ నఖిలదేశంబుల వ్యాప్తమగుడు దాని భక్షణమున
నఖిలజనులుగూడ నయిరి కామాత్ములు. యజనయాజనాదు లంతరించె. ౨౬౩

క॥ అంతం గ్రతుభుక్సంతతి చింతిలుచుం దమ్మి చూలి చెంతకుఁ జని యా
వింత నివేదించిరి. యవ్వాంతరమున నే యతండు యజనార్థముగన్ ౨౬౪

తే॥ పుష్కరక్షేత్రమునకుఁ దాఁ బోవుటయు దరిద్రదేవత కడు దేవురింపుతోడ
నతనికడకేగి యభివాదమాచరించి యెంతయును వినయంబుతో నిట్టులనియె.

తే॥ "బ్రాహ్మణులయిండ్లలోనుండి పనవు మంటిఁ గాన ధనికులగృహములం గాఁపురంబు
నేను గొక స్థానముం జూపవే. సుచరితను తృప్తితోడ వసింతు నో దేవ! నేను"

క౦॥ అనియిటు వాక్రుచ్చుటయును వనజాసనుఁ డాత్మఁ గొంతవడి ధ్యానంబున్
బొనరిచి దరిద్రదేవతఁ గనుగొని యోదార్చుకొనుచుఁ గడ కిట్లనియెన్. ౨౧౯

సీ॥ "నలుగుడువడినట్టి నాగవల్లిదళాలు స్థానంబులగునీకు జడికుకోయి.
పర్ణాగ్రములు నీకు భాగ్యకు నీకును విడుదులగును దుఃఖపడకుమోయి.
తొడిమలన్నియు నీదు కొడుకునకును నీకు నెలవులయ్యెడు మదిం గలఁగకోయి.
రాత్రివేళల ఖాదిరంబగుపొడి మీకు ముగురకుం డెంకియౌ నగవకోయి.
యెరుపలచినాఁడ నీవాలిగింటిని మీకుఁగా దరిద్ర! వీఁక నేగి
భాగ్యవద్గృహములు ప్రభువులగృములుం జొచ్చి ఛిద్రములను జూచుకొనుము"

క౦॥ అనియీగతివచియించెను జననాథ! దరిద్రుఁగూర్చి చతురాస్యుఁడు. దీ
ని నెఱుంగక యా భూపతి యొనరిచెఁ దాంబూల మవిధి నొగి సిరి తొలఁగన్.

క౦॥ తాదృగ్విధతాంబూలాస్వాదనముననైన దోసఁగు సకలంబును నా
భూదయితుఁడు పాచితమునఁ దాఁ దొలఁగంద్రోసికొనియె ధారుణినాథా!

ఆ॥ పర్వకాలమునను బండితబ్రాహ్మణుఁ బిలిచి యతని పాదములను గడిగి
కట్టఁ గప్ప రెండు పుట్టంబు లర్పించి యర్ఘ్యాథంగిఁ బూజ లాచరించి ౨౨౦

ఆ॥ స్వర్ణపర్ణములను స్వచ్ఛమౌ ముత్తెంపుఁ జూర్ణమలఁది చాల శుభ్రమైన
రౌప్యఖాదిరమున రమ్యమై దూర్యపుం గ్రముకములను విడెముగట్టి దాని. ౨౨౧

శ్లో॥ యన్మయాభక్షితం పూర్వం వృంతాగ్రపత్రసముద్భవం
చూర్ణపత్రం తథైవాస్య రాత్రౌ ఖాదిరమేవచ
తస్యపాపస్య శుద్ధ్యర్థం తాంబూలం ప్రతిగృహ్యతాం. 223

క౦॥ అనుమంత్రంబున నవ్విప్రునకు సమర్పింపవలయు ముదమున. విప్రుం
డును వక్ష్యమాణమంత్రంబును నుడివి గ్రహింపవలయు భూవర! దానిన్. ౨౨౪

శ్లో॥ యజమానహితార్థాయ సర్వపాపవిశుద్ధయే
అజ్ఞానాత్ జ్ఞానతోవాపి కుతాంబూలం ప్రభక్షితం ౨౨౪
భక్షయిష్యసి యచ్చాన్య త్కదాచిన్మే ప్రసాదవాత్
తస్యదోషో నతేభావీ మమవాక్యాదసంశయం. ౨౨౫

తే॥ ఈవిధంబునఁ దాంబూల మిచ్చెనేని చనుఁ గుతాంబూలభక్షణజనితదోష
మట్లువివరించి నారదుఁ డవనిపతికిఁ బాచితంబును జేయించి పావె నఘము. ౨౨౬

—♦ సిద్ధసేనుఁడు నాగరబ్రాహ్మణుల సన్మానించుట. ♦—

ఆ॥ అట్లు నారదర్షి యాతని దారిద్ర్యమునకుఁ గుష్ఠరుజకు ముఖ్యమైన
కారణములఁజెప్పి క్రమ్మఱ ధరణీశ! యెక్కుడైనప్రేమ నిట్టులనియె. ౨౭౭

తే॥ "నీదు దారిద్ర్యమునకును నిష్ఠురంపుఁ గుష్ఠరుజకును నుండిన ఘోరకార
ణమును దివ్యాక్షి గురుతెఱింగి మహినాథ! వినిచినాఁడను నీకు సవిస్తరముగ.

కం॥ ఇఁకనీకుఁ బగరవలనం బ్రకటంబగు పరిభవంబు ప్రాప్తించుట కే
దుష్కృతము కారణమయ్యెనొ ప్రకటించెద నాలకింపు పార్థివ దానిన్. ౨౭౯

కం॥ ఆనర్తరాజ్యమందున వేనికిఁ బట్టాభిషేకవిధి జరిగెడినో
యానరనాథుఁడు ప్రథమము తా నాగరసవిధమునకుఁ దరలెను భక్తిన్. ౨౮౦

కం॥ నీవు ప్రమాదవశంబున నావిధముగ జరుపవైతి. వదియునుగాకా
భూవిబుధుల కవమానము గావించితి యాచ్నసేతఁగాఁబడి కూడన్. ౨౮౧

తే॥ తండ్రితాతలనాఁటి యాధరణిసురుల శాసనంబులు లెగ్గించి తీసుమెయిని.
దాన మూర్తురు నిన్నవమానపఱచి. రిమ్ము తచ్ఛాసనంబుల నీవు మరల" ౨౮౨

కం॥ అనియిటు వక్కాణించుచుఁ జనియాతఁడు శంఖతీర్థసవిధంబునకున్
మునిఁగియట సముద్యగమగు ఘననాగరభూమిదేవగణమును భక్తిన్. ౨౮౩

ఆ॥ పిలిచి కాళ్ళుగడిగి యలఘు శంఖాదిత్యునెదుటఁజేరి నూటయిరువదాఱు
శాసనంబులిచ్చె. సమసెను దచ్ఛత్రుసంచయంబు తత్ప్రసాదమునను. ౨౮౪

కం॥ ఈశంఖతీర్థమహిమ మిలేశా! యంతయును నీకు నేఁ జెప్పితి. నిం
కేశుభచరితము వినెదో త్వదాశయ మెఱిఁగింపు" మనుచు నమ్ముని మఱియున్.

వ॥ బహువిధేతిహాసంబులు వచించె" నని వాక్రుచ్చుటయు. ౨౮౬

ఆ॥ "హాటకేశ్వరమున నలరారునటువంటి పెక్కుతీర్థములను బ్రీతితోడ
నీముఖమున వింటిమే, మిఁక గాధేయుతీర్థపుంమహత్త్వ తెలుపవయ్య" ౨౮౭

కం॥ అనియిటువాక్రుచ్చుటయును మనమున నొకకొంతసేపు మాసహచరు నె
క్కొనఁజేసి శౌనకాదులఁ గనుగొని సూతుండు మృదువుగా నిట్లనియెన్. ౨౮౮

—♦ రత్నాక్షోపాఖ్యానము. ♦—

వ॥ పారావారపారంబును నవనీతలాంతంబును నక్షత్రసంఖ్యయుఁ గనుగొన నగుంగాని విశ్వామిత్రు గుణగణంబు లెక్కింప నొక్కనికిని వశంబుగాదు. క్షత్రియుఁడయ్యు నెవ్వఁడు బ్రహ్మత్వము సాధించె నెవఁడు చండాల భావంబెనసిన త్రిశంకునిచే యజ్ఞంబుసేయించి యందు దేవతలకు హావిర్భాగంబు లిప్పించె నెవఁడు బ్రహ్మతోడి స్పర్ధమై సృష్టి కుపక్రమించి క్రతుభుజులు కాళ్ళుపట్టుకొన మగుడఁ జాలించె నా గాధేయు

తీర్థపుం బ్రభావము గీర్తించెద నా మహాత్ముండు ఖననసాధనం బెద్దియు లేకుండం దన చేతిమీఁదుగా నొక కుండంబు త్రవ్వి ధ్యానబలంబునం బాతాళంబునుండి గంగను రప్పించి దానం బూరించె. భూతలంబున కానీతంబగు తద్గంగాజలంబు నిర్మలంబును స్వాదువును నై స్నాతుల సర్వపాపంబులును హరింపఁగలిగియున్నయది. గూమునీంద్రుఁ డచట నాదిత్యుఁ బ్రతిష్ఠించియున్నవాఁడు. మాఘశుక్లసప్తమీభానువాసర మాహా దంబునఁ గ్రుంకి యయ్యాదిత్యున కభివాదమాచరింప నఖిలకుష్ఠంబులును నఖిలాఘంబులును నశించు. దాని పశ్చిమోత్తరదిగ్భాగంబున ధన్వంతరిచే నిర్మింపఁబడి సర్వరోగనివారకంబగుచు నొక నడబావియుండెఁ. దొల్లి యచట ధన్వంతరి తపంబొనరింపఁ బెద్దకాలంబునకు భాస్కరుండు ప్రత్యక్షుఁడై వర మడుగుమన నతండు. ౨౮౯

క॥ "ఏతత్కుండంబున సుస్నాతుండగునట్టిజనుని సకలామయముల్
ధూతములు కావలయు ఖద్యోతా! నాశితసమస్తదురితవ్రాతా!" ౨౯౦

వ॥ అని ప్రార్థించుటయును సూర్యభగవానుం డిట్లనియె. ౨౯౧

ఆ॥ "ఎంతయుం బ్రశస్తవిూ మాఘశుక్లసప్తమి మదీయవాసరమునఁ గూడి.
యిట్టిదినమునందు నే నుదయించుచో నిందుమునుఁగువాఁడు పొందు శుభము.

తే॥ సామయుండైన నగును నిరామయుండు, నిరామయుండైనఁ బడయు నిష్టార్థములను
మెగి నిహాముత్రఫలభోగమున విరాగి యిచట స్నాతుండుగా మోక్షమే ఘటించు."

వ॥ అనియిట్లు కీర్తించి యర్యముం డంతర్ధానంబుఁ జెందుటయు ధన్వంతరి సంతసించి స్వస్థానంబునకుఁజనియె. నంతఁ గొంతకాలంబునకు ౨౯౪

సీ॥ శ్రీమదయోధ్యాపురీపరిపాలకుం డుష్ణరశ్మ్యన్వవాయోద్భవుండు
నడిగిన లేదనకటువంటి నెఱదాత కృతమునకుం బ్రతికృతివిధాత
యర్థదేహులఁ గాక యన్యులఁ గన్నెత్తియైనఁ జూడని ధీరుఁ డధికశూరుఁ
డత్యంతతేజస్వి యరినిషూదనుఁడు నా రత్నాఖ్యుఁడను మేటిరాజొకండు
పూర్వకర్మవశత భూరికుష్ఠవ్యాధి కగ్గమగుచు దాని నపనయింపఁ
దిరిగె ముజ్జగములు. తినె నౌషధంబులు-దానములను దనిపె ధరణిసురుల ౨౯౫

వ॥ కాని యెన్ని చేసినను నెక్కుడయ్యె నా జాడ్య మతని క్షీణింపఁజేయుటయు విరక్తుండై రాజ్యభారంబు పుత్రుపైఁబెట్టి చెప్పవలసినబుద్ధులుం జెప్పి స్నేహితుల కప్పగించి దేవతలం బూజించి భార్యలును బంధువులును జెలికాండ్రును సేవకులును వలదు వలదని వారించుచున్నను వినక యగ్నిం బ్రవేశింపనున్న సమయమం దొక దివ్యతేజస్వి భుజంబు కాశికావడిం గైసేసికొం చరుగుదెంచి యత్యంతవిపాసమందున్న యాపురంబు నవలోకించి యాశ్చర్యపడి యందొకజను నాహ్వానించి ౨౯౬

కం॥ "పెద్దలుఁ బిన్నలుగూడం దద్దయు వాపోవ మదముదక్క యనూనా
పద్దశనున్నది యీపుర. మిద్దియొకత మిటులనునికి కెఱుఁగం జెపుమా." ౨౯౭

వ॥ అనియడుగుటయు నతం డిట్లనియె. ౨౯౮

ఉ॥ "ఈపురమేలునట్టిదొర యెంతయుఁ గుష్ఠముతోడ సంయుతుం
డై పడలేక బాధ జ్వలదగ్నిఁ బ్రవేశము సేయనున్నవాఁ
డోపథికా! యతండు సుగుణోదధి యట్టిని వీడియుండలే
కీపగిదిన్ జనంబు తపియించెడిఁ జెల్లుటనిక్క మందఱున్." ౨౯౯

వ॥ అనినవిని యాకార్పటికుండు త్వరితంబ రాజుపాలికింజని. ౩౦౦

చం॥ "నృప! సకలామయంబులను నిర్వృతి సేసెడి తీర్థముండఁగా
నిపుడొక కుష్ఠజాడ్యమున కెంతయుఁ జింతిలి పావకంబునన్
వపువు దహింపఁజేయకుము. నాయొడలున్ భవదంగమట్లె కా
నపుడట స్నానముం సలిపి యైతినిటు ల్మఱి దివ్యదేహుఁడన్. ౩౦౧

తే॥ సప్తమీభానువారము సవిత్రుదయమందుఁ బోయి రుజాగ్రస్తుఁ డచట స్నాన
మాచరించిన నీరోగుఁడగును నపుడ. యట్లు పాపవినిర్ముక్తుఁ డగును మఱియు"

వ॥ అనిచెప్పుటయు రాజిట్లనియె. ౩౦౨

సావిత్రి॥ "ఏదేశంబందుండెం దాదృక్తీర్థశ్రేష్ఠం.
బోధివ్యాంగా! నాకీ వాదేశంబి మ్మయ్యా" ౩౦౪

వ॥ అనియడుగుటయు మఱియు నాకార్పటికుండు. ౩౦౫

చం॥ "కలదిల నాగరాఖ్యఁ గడు ఖ్యాతము క్షేత్రము. కుష్ఠరోగసం
కలితుఁడనై తదంతర మొకానొక కాలమునందుఁ దీర్థయా
త్రల నొనరించుచుం జనుచుఁ దత్స్థలవర్తి తపస్వియొక్కఁ డి
బ్బులురుజపొంది కుందునను బాగుగఁజూచి కృపావిశిష్టుఁడై. ౩౦౬

ఆ॥ 'జలములనుశయించు చక్రికిఁ బశ్చిమోత్తరదిశం జెలంగుఁ గరముపుణ్య
మైన తీర్థమొకటి యనఘవిశ్వామిత్రమునివినిర్మితంబు మోక్షదంబు. ౩౦౭

ఆ॥ చనుము మాఖశుక్లసప్తమీభానువాసరమునందునీవు సరిగ నటకుఁ
జని యినోదయమున స్నానంబుగావింపు. నీదుకుష్ఠజాడ్యమేదునంత.' ౩౦౮

చం॥ అనవిని యాదివారయుతమాఘసిత సప్తమి నేను దత్స్థలం
బున కతిభక్తితోడఁ జని పుణ్యతమంబగు తద్హ్రదంబునన్
మునిఁగి వినిర్గతుండనయి మూర్తి కనుంగొన నిద్ధశంబుగన్
గనఁబడియెన్. యథార్థమును క్ష్మాపరిపాలక! నీకుఁ జెప్పితిన్. ౩౦౯

ఆ॥ అట్లుగాన నీవు నరిగి యాసప్తమీభానువాసరంపు భాస్కరోద
యమున నచటఁ దీర్థమాడుము. నీవ్యాధియడంగుఁ. బాతకంబు నంతమొందు ”

వ॥ అనినవిని యాక్షణంబ రత్నాఖ్యుఁ డాకాశికావడివానివెంటం జని మాఘశుద్ధ సప్తమీభానువాసరంబున విశ్వామిత్రతీర్థమందుఁ గృతావగాహుండై కుష్ఠంబున విడువం బడి సంతసంబునం బొంగుచుఁ గార్వటికునకు మూఁడుకోట్లమాడలర్పించి,

ఉ॥ త్సాహము:—“భవదనుగ్రహముఁజేసి భయదమైనయట్టియీ
తెవులుపోయెఁగానఁ బొమ్ము తీర్థవాహ! నేనిటన్
దవిలి తపము సేసికొందు దారతోడఁగూడి—యి
య్యవనికిఁక విభుండు తనయుఁ. డతఁడు దక్షుఁ డోమఁగన్.” ౨౧౨

వ॥ అనిపలికి యాయనను సేవకులను నిండ్లకుఁబనిచి యాశ్రమంబుగట్టించికొని కళత్రసహితంబుగా నచట వసించి సిద్ధిం బొందె. నతనిపేర వెలసినతీర్థంబు సర్వవ్యాధిహారంబును సకలపాతకనాశకంబును నయ్యె. దేవదేవుఁడగు దివాకరుం డతనిచే నటఁ బ్రతిష్ఠితుండై రత్నాదిత్యనామంబునఁ బ్రసిద్ధికివచ్చె. సప్తమీభానువాసరంబునం దాతీర్థంబునం గ్రుంకి యయ్యాదిత్యు దర్శించినఁ బాపంబులనుండి తొలఁగి సూర్యలోకంబునకుఁ జను. మఱియొకక్షేత్రం బచట వర్తిల్లెడి. తత్ప్రదేశంబున గ్రామ్యుండగు నొకజనుండు కుష్ఠరోగంబున బాధపడుచుండియుఁ బశువులంగాచి జీవించుచు నొకనాఁడు కొండక్రిందిభాగమం దప్పసులమేపుచుండ నందొక్కావు తృణలోభంబున యూథంబువిడిచి చని సప్తమీరవివాసరంబున నమ్మడుఁగునం బడుటయు నదిగొనుటకుం గక వాఁడు తక్కుపసులం దోలుకొని సాయంసమయమం దింటికిఁజనఁ దప్పదకుస్వామి వానిపాలికింబోయి గద్దించుచు

కం॥ “రాతే జేలర ఖల! యీవేళను మా పాడియావు వేశ్మంబునకున్
దోలుకొనిరమ్ము. దానిని మాలోఁగిలిఁ జేర్పకున్న మననీ నింకనిన్.” ౨౧౪

వ॥ అనినవిని వాఁడు భయపడి యాక్షణమ పగలది తిరిగిన మార్గంబుపట్టిపోయి రాత్రివేళయగుట గాఢాంధకారంబునఁ బెనుగోలింబడి కొట్టుకొనుచున్న దాని యఱపు దూరమున వినరా నందు దూఁకి పంకంబునుండి పైకిలాగి మెలమెల్ల నతనియింటికిం దోలుకొనిపోయి యప్పగించి స్వగృహంబునకుఁజని పండుకొని తెల్లవారినపిదప లేచి స్వశరీరంబుఁ జూచుకొని కుష్ఠవిసర్మక్తమై మంచిచాయనుండుట కాశ్చర్యపడి

కం॥ “ఏమిది యాకస్మికముగ నాపుడు మెడలినది. నిశ్చయంబుగ నిది వి
శ్వామిత్రతీర్థమహిమము. నే మునిఁగితి దానఁ బశువు నెమకుచు రాత్రిన్.” ౨౧౫

వ॥ అనివిచారించి యపగతకండూతియై యధిక తేజంబునం బొదలు నప్పశుపాలకుండు మరల నాతీర్థంబున కరిగి యయ్యటవీమధ్యస్థితుండగు నాదిత్యు ధ్యానించుచు నందుఁ దపంబుండి పరమసిద్ధిం బ్రాపించె. గాన సర్వప్రయత్నములచేతను నందుఁ దీర్థమాడి భాస్కరుం బూజించునది. యిక్కలికాలంబునఁ గూడ సప్తమీభానువాసరంబునఁ దత్పుణ్యతీర్థజలస్నానంబున శుచియై యెవ్వఁడా దేవు భక్తిచేఁ బూజించు వాఁడు విముక్తపాతకుండగుఁ. దదగ్రంబునం గూరుచుండి యెనిమిదివేలగాయత్రీమంత్రంబు జపించిన నీరోగుండును నిష్కల్మషుండును నగుఁ. దదుద్దేశంబుతో శ్రద్ధమై నెవ్వఁడు గోదానంబొనరించు వానివంశీయుఁడు సహితము వ్యాధిచే స్పృశింపఁబడఁడు. కుష్ఠవ్యాధిచేఁ గుమిలికుమిలి పూర్వ మొకభూసురుం డందు రక్తచందనంబున నాదిత్యప్రతిమ యమర్చి యర్చించుటయు వేయియేండ్లకు దేవుండు ప్రీతుండై దర్శనంబిచ్చి వరంబడుగుమన నతం డిట్లనియె. ౭౧౭

తే॥ "సంతసించితి వేని యోసవిత! నాదు కుష్ఠరోగము హరియించి కూర్పుమయ్య
యట్లు కాకుండ స్వర్గరాజ్యము నిడినను మన్మనఃప్రీతి సేయ. దీమాట నిజము" ౭౧౮

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయు సూర్యభగవానుండు ౭౧౯

తే॥ "సప్తమీభానువారము సరిగనీవు పావనహ్రదమున నాడి పండ్లు చేతఁ
బట్టుకొని నూటయెనుబదిపరులు నాకు వలగొనుము కుష్ఠజాడ్యంబు వదలిపోవు.

కం॥ భూతలగతుఁ డెవ్వఁడైనను నేతద్వ్రతముం జరింప నెల్లగదంబుల్
భూతంబులగును వానికి. నాతర్వాతను లభించు నస్మత్పదమున్." ౭౨౧

వ॥ అనినవిని యాబ్రాహ్మణుం డట్లాచరించి నష్టకుష్ఠుండును నవ్యకాంతియుతుండును నయ్యె. నట్టియాతని నవలోకించి వెండియు సూర్యభగవానుండు

పం॥ "ఏమిప్రియంబు న్నే మతిచేతున్ నీమతమేదయ్య మహిదేవా!" ౭౨౨

వ॥ అనిప్రశ్నించుటయు బ్రాహ్మణుం డిట్లనియె. ౭౨౩

పం॥ "ఎప్పటికిన్ని విప్పదమందే తప్పకయుండన్ మెప్పగు దేవా!"

వ॥ అనియిట్లునొడువుటయు మరల సూర్యభగవానుండు ౭౨౪

మధ్యమ॥ "మహీసురేంద్ర! యిఁకన్ రహిం వసింతు నిటన్.
గుహారవాఖ్యుఁడు నా విహితసంజ్ఞుఁడనై." ౭౨౫

వ॥ అని తదిష్టవరంబిచ్చి యంతర్ధానంబునొందె. నంతఁ గొంతకాలంబునకు శ్రీకృష్ణుండు సాంబుంగనుటయు నతఁడు రాజమార్గంబునఁ జనుచోఁ బురస్త్రీలు మోహించి గవాక్షంబులెక్కి కాంచుచుండెడివారు. ౭౨

## సాంబోపాఖ్యానము

సీ॥ సగ మలందినయట్టి మృగమదంబులతోనె పరువెత్తిపోయెడిఁ దరుణియోర్తు
యొకకంటి కిడిన మేల్రకపుఁగాటుకతోనె వడివడినడ తెంచుఁ బడఁతియోర్తు
కలయదువ్వనియట్టి తలవెంట్రుకలతోన వేవేగనరుదెంచు వెలఁదియోర్తు
సన్న్యమిచ్చుచుఁగూడ సంత్యక్తబాలయై శీఘ్రంబ చనుదెంచుఁ జెలియయోర్తు
యొక్కకాలి కుపానహ మెక్కఁదొడిగి తక్కుకాలునఁ బాదుకం ద్రొక్కుకొనుచు
జనును దొరతొర నోర్తుక చంటిబిడ్డ లేద్వ నత్తలు మామ లెంతేని యుఱక.

సీ॥ కదలక మెదల కొక్కర్తుక నిలుచుండుఁ జిత్రంబునందలి స్త్రీవిధమున.
వేఁడినిట్టూర్పులు విడుచు నొక్కర్తుక బుసకొట్టుచును బిట్టు భుజగమట్లు.
వడు గవాక్షమునుండి పడఁతి యొక్కర్తుక క్షితిమీఁద నెంతయుం జేష్టలుడిగి.
చెప్ప నొకర్తుక చెలికత్తెతోడ నాతనిఁగూడినదియె తా ధన్యయనుచు.
నట్లు నవమన్మథాకారుఁడైన సాంబు రూపరేఖావిలాసంబు లాపురాంగ
నలు గనుంగొని మోహ మగ్గలముగాఁగఁ బరవశతఁజెంది రోనిరాబారులార!

సీ॥ పీతాంబరునిచేతఁ బెండ్లాడఁబడి సపత్నీమాతలైనట్టి కామినులును
నవ్వారియందు శ్రీహరివలనం గల్గి యక్కసెల్లెండ్రైన యంగనలును
నన్నదమ్ములచేత నగ్నిసాక్షికముగాఁ బరిణీతలైనట్టి భామినులును
గులగురులైనట్టి కుంభినీదేవుల పాణిగృహీతలౌ పతివ్రతలును
మోహ మాఁగలేక యాహాయటంచు నాయదుకుమారుఁజూడ నరుగుచుండి.
రదియటుండనిండు. పెదపెద్దలౌ పూరుషులె భ్రమించి రతనిఁ జూచిమిగుల. ౨౩౦

వ॥ అట్లు భ్రమించి విరాళపడువారును నర్థాపేక్షలేకయే యతని సేవింపనెంచువారును నతనియౌవనంబు నవలోకింపఁగోరువారును సౌందర్యంబు వర్ణించువారును నై వర్తించుచుండిరి. అంతఁ గొంతవడికి క్షపాసమయంబున నందినియను నతని సవతితల్లి తత్పత్నీ వేషంబు వేసికొని తచ్ఛయ్యం బరుండియుండుటయు నతండు రతిక్రియలం బరితృప్తినొంది తచ్చేష్టితంబు లనుమానాస్పదంబులుగా ౨౩౧

తే॥ "నాదుప్రాణాలకన్న నెంతయుఁ బ్రియయగు నంగరాజతనూజ యీయదియె యుంగు
రతిచమత్కృతు లెఱుఁగ, దొర! గణికలకు నిట్టి రతిచాకచక్యంబు పట్టువడును"

వ॥ అని వికల్పించి దీపంబుదెచ్చి విలోకించి నందినింగాఁ దెలిసికొని ౨౩౩

తే॥ "అఖిలజనులు తతూయని యానవమున నుమియ యమభటు లగ్గలం బుగ్రముగను
దుర్గతిశతంబునం బడఁద్రోయ నకట! యేమిపనిసేసినావె యిసీ కుశీల!" ౨౩౪

వ॥ అని గర్జించుటయు నాబిడ తత్క్షణంబ లేచిపోయె. నంత నతం డార్తనాదంబునం బ్రలపించి కూర్కు సెందక వర్షశతోపమంబుగా రాత్రిశేషంబు వెళ్ళించి సూర్యోదయంబున నావశ్యకకార్యంబులుసహిత మవలఁద్రోసి ధర్మశాస్త్రవిదుం బిలువఁబంచి ౨౩౫

తే॥ "అక్క సెల్లెండ్రతోడను నంబతోడఁ గన్నకూఁతుండ్రతోడను గలసినతని
కెవ్విధము శుద్ధియగునో వారివ్యవయ్య ధర్మశాస్త్రంబులన్నియుఁ దరఁబతించి."

వ॥ అనిపలుకుటయుఁ దద్ద్విజన్మకుం డిట్లనియె. ౨౩౭

కం॥ "పరనారీసంభోగము జరిపినపురుషులకు సర్వసాధారణమై
యొరలెడిఁ బ్రాయశ్చిత్తము ధరణీవర! వర్ణతారతమ్యముతోడన్. ౨౩౮

తే॥ అప్ప సెల్లెండ్రతోడను నమ్మతోడఁ గన్నకూఁతుండ్రతోడను గలసినతఁడు
తింగినింగాక వేఱొక్కతీరుగా విశుద్ధిగాంచుట యెటుఁగూడఁ జూచియెఱుఁగ.

తే॥ ధర్మశాస్త్రంబులందు నేతద్వినిర్ణయంబునకు భిన్నముండఁ. దియ్యది నిజంబు.
స్మృతుల నన్నింటిఁ బలుమఱుం దిరుగవైచియే వచించితి నివ్విధ మేను నీకు.

తే॥ పాచితంబునుగూరిచి ప్రశ్నసేయఁబడి యథేచ్ఛగ నన్యథా నుడువువాఁడు
పాపమునఁ దాను భాగముం బంచుకొనుచుఁ గర్తవోలెను బడును దుర్గతుల వత్స!"

కం॥ తినలోఁతుగోతిలోనం గొనకొని నిలుచుండి యెండుగోమయచూర్ణం
బును నాగళముం బోయించి నిజాంఘ్రిప్రాంతమందు నిప్పుంచఁగనా. ౨౪౨

ఉ॥ కాలుచుకొంచువచ్చునది గాత్రము మెల్లగ. నైన దానికిన్
డాలిమిఁబూని యించుకయుఁ దాఁ జలియింపక యేద్వ కారమా
లోలుని ధ్యాసతోడఁ బరలోకముఁజేరిన శుద్ధగాత్రుఁడై
యోలి నఘంబువాయును విభూ! యిదె తింగినినాఁబడున్ ధరన్" ౨౪౩

వ॥ అనినవిని సాంబుండు తింగిని సాధించుటకు నిశ్చయించి వాసుదేవుఁజేరంబోయి

మ॥ "జనకా! నీప్రియభార్య నందిని ధృతాస్మద్దార నేపథ్యయై
నను వంచించె నఘాత్మురాలు. మదిలోనన్ భార్యగానెంచి యా
కెను నేఁ జీకటియింటఁ గూడితిని. తత్కృత్యంబు లీక్షించుపై
ననుమానంపడి గుర్తెఱింగితి. నిసీయం చావలంద్రోసితిన్. ౨౪౫

శా॥ నాఁటంగోలెను కుష్ఠమేరుపడి యె న్నా దేహమం. దంత ని
వ్వీటన్ వర్తిలు ధర్మశాస్త్రవిదులం బిల్పించి ప్రశ్నింప నా
మేటుల్ "తింగినినాచరించుకొను, మామీఁదన్ విశుద్ధుండవై
దాఁటంగల్గు దఘాబ్ధి" యంచనిరి తాతా! దాని సాధించెదన్. ౪౪౬

ఉ॥ నే నెదియేని కూడనిపనిం బొనరించిన బాల్యమందునన్
దాని క్షమించి వేగముగఁ దండ్రి! యనుజ్ఞయొసంగు. మేగదన్
దీనత నన్నుఁగూర్చి పరిదేవనసేయకు మదంబ. యామె దుః
ఖానల మార్పుమీవు సదుదాహరణంబులు చెప్పి మెప్పుగన్" ౪౪౭

వ॥ అనినవిని శ్రీకృష్ణుండు గద్గదస్వరంబున నతని కిట్లనియె. ౪౪౮

ఉ॥ "ఈపని కాముకుండవయి యీవొనరింప. వెటింగిచేయ వ
ప్పా! పొరపాటునన్ జరిగె. నందున నీకొల యల్పమయ్యెడిన్.
క్ష్మాపతి యగ్ర్యదండనము సల్పకయున్న నెఱింగిచేయు నా
పాపముమాత్రి మగ్గలము. పాచిన మాచరితవ్య మెంతయున్. ౪౪౯

ఆ॥ కాన నీదు కుష్ఠగద మేది సంశుద్ధి యొనరఁ బాచితంబు నుచ్చరింతు.
దానమును వచింతుఁ దనయ! యాకర్ణించి యవ్విధమునఁ జేయుమా రయంబ.

ఆ॥ పాపములకుఁ దగినభంగిఁ బ్రాయశ్చిత్తములు విధింపఁబడియు మునులచేత
నవి నిషిద్ధమయ్యె సాపేక్షనిరపేక్ష భేదములనుబట్టి బిడ్డ! మరల. ౪౫౧

కం॥ కావునఁ బ్రాయశ్చిత్తము కావింపు మదుక్తరీతిఁ. గలఁడీహాపరసౌ
ఖ్యావహుఁడై మార్తాండుఁడు శ్రీవిశ్వామిత్రమౌనిచే స్థాపితుఁడై. ౪౫౨

ఆ॥ హాటకేశ్వరమున నలరెడి యాదేవు మాఘశుక్లపక్షమధ్యగమగు
సప్తమి రవివారసహితముం బిత్రుదేవతాకథింబు నగుచుఁ దనరుతఱిని. ౪౫౩

ఆ॥ ప్రొద్దువొడువ శ్రద్ధఁ బోయి యష్టోత్తరశతఫలములుగొంచు సరిగ నొక్క
టొకటి పళ్ళెరమున నుంచుచు వలగొను మన్నిపరులు. కుష్ఠ మపుడ యెడలు.

తే॥ రోగమును నొప్పి లేని పూరుషుఁడు పోయి యెన్నిసారులువలగొన నన్నియుగము
లాదివాకరులోకమం దధివసించు. నేమివచియింతు నీకుఁ తత్స్వామిమహిమ.

ఆ॥ ఆదివాసరమున నాదేవునకుఁ బ్రదక్షిణము లాచరించి కేలుమోడ్చు
వాఁడుగూడ రోగవర్జితుఁడగుఁగానఁ గొలువు మధికభక్తిఁ గొడుక! యతని.

ఆ॥ కుష్ఠమెడలు. నీదు కొలవాయు. దివ్యదేహుఁడవు నగుదు. దుఃఖపడకు కొడుక!
హాటకేశ్వరమున నా కుహరాశ్రయస్వామియుండియుండ నేమిభయము." ౪౫౭

వ॥ అనినవిని యర్బుదాచలమార్గంబున హాటకేశ్వరంబున కరుగుటకు నిశ్చ
యించి సాంబుండు శుభదినంబున హాస్త్యశ్వరథపదాతిసహితంబుగాఁ బ్రయాణంబు

– సాంబుని దీర్ఘయాత్రకుఁ బంపుచుఁ గృష్ణాదులు దుఃఖించుట. –

సీ॥ కొడుకా! యటంచు వాపోని యేడ్చుచుం బ్రేమఁ దరలిరి తోడ్తోడఁ దల్లులెల్ల.
రరిగెదా వెనువెంట నశ్రుపూర్ణాక్షుఁడై యుండుచు దేవకీనందనుండు,
దిగులువెల్వఁగఁజాలు దీనాననంబుతో ననుగమించెను దమ్ము వలరువిల్తుఁ.
దళ్లీలకంకపై నదలించు చందుఁ గదియ నేగెఁ గుమారుఁ గాపపాలుఁ.
దట్లు చాలదూర మరుగుచో నాతని ప్రసువు జాంబవతి పెరరివిధమున
విధిని దూఱిదూఱి విలపించుచుం బట్టి బిట్టు కౌఁగలించి యిట్టులనియె. ౨౫౯
ఆ॥ "హా! హతాశనైతి-దేహంబువాసితి-మందభాగ్యనైతి మతియు నేను.
ఏకపుత్రనైన నాకీవిపద్దశ యనుభవింపవలసె నక్కటకట!" ౨౬౦
వ॥ అని యిట్లు విలపించు నాయమ్మంగని వాసుదేవుండు ౨౬౧
కం॥ "తల విరియఁబోసికొని కనుకొలఁకుల నీరంబునింపి కుయ్యిడెదేమే
లలిఁ బయనమైన సుతునకు జలజాక్షీ! యమంగళంబు సంపాదింపన్. ౨౬౨
తే॥ కష్టమును బాపుకొని నీదుకొడుకు మరలఁ దీర్థయాత్రాఫలంబును దీసికొనుచు
వచ్చు నీయంతికమున కోవనజగంధి! యేలయేడ్చెద వూఱకుండు మింక నీవు"
వ॥ అని చెప్పుచుండుటయు యానంబునుండి డిగ్గి సాంబుండు త్వరితంబుగం
దల్లికడకరిగి యొరఁగి నవ్వుచు ౨౬౪
ఆ॥ "తీర్థయాత్రఁజేసి తిరిగి శీఘ్రంబుగా నరుగుదెంచువాఁడ నంబ! నేను.
అస్మదర్థమునను వ్యర్థంబుగా నీవు ఖేదపడకుమమ్మ కేలుమోడ్తు" ౨౬౫
వ॥ అని వాక్రుచ్చుటయు జాంబవతి ౨౬౬
కం॥ "పులులుం బిశాచములు నిను బలిమిని బాధింపకుండఁ బవలును రేయున్
బలుపూనికఁ బాలించుత మల వనదేవతలు గాఢమగు ననుకంపన్. ౨౬౭
సీ॥ తావకశీర్షంబు గోవిందుఁ డోముత-మధుసూదనుఁడు గ్రీవ మనుచుఁగాతఁ.
గేలుదోయిని హృషీకేశుండు కాచుత-దైత్యనాశనుఁడు హృత్థ్సలి నిలుచుతఁ-
బుండరీకాక్షుండు పోషించుతన్ గర్భ-మరయుత శ్రీగదాధరుఁడు కటిని-
జానువుల్ కృష్ణుండు తాను రక్షించుత-ధరణీధరుం డేలుతం బదంబు"
లని కరంబున స్పృశియించి యంగములను గ్రుచ్చికౌఁగిట శిరము మూర్కొని కరంబు
పనిచి తనయుని శుద్ధాంతజనముతోడ మరలె నిట్టూర్పులన్ విడ్చుచు రగమట్లు.
వ॥ భగవంతుఁడైన కృష్ణుండును హలాయుధాద్యఖిల పుత్ర పౌత్ర మిత్ర యాదవ
పురస్సరంబుగా నశ్రుపూర్ణేక్షణుండును నతిదీనవదనుండును నై యాత్మీయనగరంబు

ప్రవేశించె. సాంబుండు ద్వారకనుండి బయలువెడలి యంబరీషప్రతిష్ఠితుండై యఖిల జంతువుల యఘంబు లడంచుచు హాటియుండిన సింధుసాగరసంగమంబుఁ జేరనరిగి స్నాతుండై శార్ఙ్గి నర్చించి ద్విజదీనాంధకృపణాదులకు వస్త్రరత్నాద్యనేకదానంబు లొనరించి త్రిరాత్రంబులుండి చ్యవనాశ్రమంబునకుం జని యటఁగూడ యథాపూర్వం బుగా నన్నియు నిర్వర్తించి మెలమెల్లఁ బుష్కరాదితీర్థంబులం గ్రుంకుచుఁ బోయి పోయి సప్తమీభానువాసరంబున స్వపితృసూచితుండగు మహార్కాశ్రయు దర్శించి పూజించి ఫలహస్తుండై ప్రదక్షిణంబు లాచరించుచు సూర్యగాయత్రి జపియించుటయుఁ గుష్ఠంబు నష్టమయ్యె. నంత నెనిమిదివేల గుఱ్ఱంబులను నాలుగునూఱుల రథంబులను మూఁడునూఱుల యేనుంగులను నైదు గ్రామంబులను ననేక రత్నంబులను నాగరుల కర్పించి గృహంబునకుఁ బోయె. ఈసాంబోపాఖ్యానంబుఁ జదివినను విన్నను వానివంశం బునఁ గుష్ఠరోగ మేర్పడదు. ౨౬౯

—: విశ్వామిత్రుఁడు బ్రాహ్మణ్యము సాధించుట. :—

ఆ॥ అవ్విధమున మతియు నలఘువిశ్వామిత్రయమిప్రతిష్ఠితుండు నఖిలసిద్ధి
కరుఁడు నైనయట్టి గణనాథుఁ డుండె నాక్షేత్రమందు మానిసింహులార!”

ఆ॥ అనుడు శౌనకాదు “లార్య! యాగణనాథుఁ డెవ్విధమున నచట వెలసెడియె?
నెట్టి దతనిమహిమ? యిపుడు మాకు వచింపుమీ” యటన్న సూతుఁ డిట్టులనియె

సీ॥ చేటలయంతేసిచెవులుఁ దొండంబును మొప్పసంగంగ నేనుఁగుమొగము వెట్టి
పరశువిశిష్టమై పరగంగ రచియించి బాగుగా నాలుగు బాహువులను
గరమువినోదంబుగాఁ గనంబడుటకై యెక్కించి సంప్రీతి నెలుకమీఁదఁ
గుడుములు మండ్రాళ్ళుఁ గొనకొని భక్షింప నఖిలసిద్ధిప్రదంబై రహింప
గట్టుపట్టి యొడలిపట్టిచే నొకబొమ్మ యమరుచుటయుఁ దొల్లి యద్రియులేచి
తారకాసురునకు దైవతములకైన పోరఁజొచ్చి యిట్లు పోరెనార! ౨౭౨

వ॥ ఎవరునుం జేయని యుద్ధమొనరించి లెక్కలేని రక్కసుల యుక్కడంచు టయు క్షతవిక్షతసర్వాంగుండును రుధిరపరిప్లుతుండును దత్సంగ్రామరంగాధికారియు నగు శత్రుండు సంతసించి ౨౭౩

ఉ॥ “మాకొఱకీవు యుద్ధమతిమాత్రము సల్పి యసంఖ్యదానవా
నీకము గూలఁద్రోసి గణనీయుఁడవైతి విభాస్య! కావునన్
నీకు సమస్తదేవతలు నిశ్చలభక్తిని బూజసేయుదు
రాక-యుఁ కెంత విఘ్నములఁ గష్టములొంది తపించు భూప్రజల్. ౨౭౪

కం॥ కార్యారంభంబులనీ కార్యుఁడవని పూజసేయు నవ్వారల కో
యార్యకుమార! తత్తత్కార్యంబులు సిద్ధిఁబొందఁగల విఁకమీఁదన్ ” ౮౭౬

వ॥ అని బహూమానించి గౌరీశంకరపార్శ్వంబున వదలిపెట్టె. సర్వవిఘ్నవినా
శార్థమై పూర్వము ధీమంతుఁడగు రోహితాశ్వుండు మార్కండేయమహామునింగూర్చి

కం॥ “ భగవానుఁడ! జనులెల్లరుఁ దగుగతి శుచులయియు చేయు ధర్మక్రియలం
దగపడియెడు విఘ్నంబ లు సుగముగ నారబ్ధపూర్తి చూడకయుండన్. ౮౭౭

సీ॥ దేవతారాధనాదికముతోడంగూడి వర్తించునటువంటి వ్రతము గాని
ఘనపుణ్యమును బుణ్యము కూడ యథేచ్ఛమై మననీని వెను నియమంబు గాని
హృదయంబునను నిత్య మేకాగ్రతంగూర్చి తను కార్శ్యమొనరించు తపము గాని
గోభూహిరణ్య రత్నాభరణాశ్వమా నానాప్రకార దానంబు గాని
యొన్న నాపై ననుగ్రహముంచి దాని నానతీయుము వాచంయమాగ్రగణ్య!
భక్తి సత్ప్రాచరితమైన బ్రతికినంత కాల మెటువంటివిఘ్నము ల్గలుగకుండ ”

వ॥ అని ప్రశ్నించుటయు నతం డిట్లనియె. ౮౭౯

కం॥ “ ఈవిషయంబున నీ కుర్వీశ్వర! కీర్తింతు సకలవిఘ్నవినాశం
బై వివిధపాపహరమగు శ్రీవిశ్వామిత్రమానిచీర్ణవ్రతమున్. ౮౮౦

కం॥ విశ్వామిత్రుండని మును విశ్వఖ్యాతినివహించి విలసిలెనొకఁడీ
విశ్వంభరను దానొక యీశ్వరుఁడగు గాధిసుతుఁ డహీనగుణుండై. ౮౮౧

కం॥ మహనీయుఁడగువసిష్ఠున కహితుండయ్యెను నతండహో! యతఁ డతనిన్
మహిసురుఁడని యనఁడందున బహుళంబగు వైర మేర్పడె నిరువురకున్ ”

వ॥ అనియిట్లు వచించుటయు రోహితాశ్వుండు ౮౮౩

కం॥ “ స్వయముగ బ్రహ్మదులె యెంతయు బ్రాహ్మణుఁడనఁగ నతనిఁ దానేలనఁడా
నయవిదుఁడైన వసిష్ఠుం? డయరో! యటువంటికచ్చె యతనికిఁ దగునే? ”

వ॥ నావుడు మార్కండేయుండు వెండియు నిట్లనియె. ౮౮౫

తే॥ “ క్షత్రియుండు పూర్వ మతఁడు-క్ష్మాభరంబు నూనియుండు చొకప్పుడు కాననమున
కరిగి వేఁటాడి క్షుత్పిపాసార్తుఁడగుచు నవ్వసిష్ఠునియాశ్రమం బాశ్రయింప ౮౮౬

ఆ॥ ప్రభువటంచెతింగి బలముల కతనికిం గుడువఁబెట్టి యతఁడు గొప్పఁజేసెఁ-
గోరుదానినిచ్చు గోవొకర్తె డాత్మీయ మందిరంబునందు మసటఁజేసి. ౮౮౭

తే॥ గాధిజుఁడు తత్ప్రభావంబు గాంచియపుడు “ హయగజాదులనిచ్చెద నావుని”మ్మ
టంచుఁ బరిపరివిధముల నడిగియడిగి సామమున దానమునఁగూడ సాధ్యపడమి.

ఆ॥ అలుకఁ జెంచియంత నర్థానిఁ బట్టించుకొని చనక వసిష్ఠమునినిగాంచి
"యీమహీశ్వరునకు నిచ్చితో కోన" న్నటంచుఁ బృచ్ఛసేయ నాతఁడపుడు

కం॥ "నేని న్నన్యుల కిత్తునె ? తానె బలాత్కారముగ నితఁడు కొంపోవక
బూనినవాఁడటు గావున దానికిఁ దగుపనియొనర్పఁ దలపడు మింకక" ౨౯౦

తే॥ అనినవిని నందినీధేను వానృపాలబలము గని యావలించుడు బయలు వెడలె
వక్త్రమువనుండి పొగలటుపైని భయదమగుచు మంటలంలేచె-నేమనివచింతు ! ౨౯౧

సీ॥ విల్లమ్ములందాల్చి వీరులై యనిఁజొచ్చి పోరి వైరులఁగూల్చు బోయవాండ్రు
వక్త్రక్రియత్నేర్చి వ్యర్థత సమరూర్చి దాయలం దెగటార్చు కోయవాండ్రు
ముతకగోచులు వెట్టి మొలమ లిక్కులుగట్టి యరుల బావలనెట్టు నెలుకవాండ్రు
కత్తులుధరియించి గడ్డము ల్పెరించి దురమున విహరించు తురకవాండ్రు
వేనవేలుగఁ దద్వక్త్రవివరమున జనించి యమకింకరులవలెఁ జెంచి యొడలు
"లేమిటికిమమ్ము సృజియించితి"వటంచు నేకముఖముగ నడుగ నా విట్టులనియె.

కం॥ ఈరాజభటులు బలిమిం గ్రూరత నను గట్టి పట్టుకొని చనుచుండక
వే కేమికలదు-తత్సంహారము సేయుండు మీర లఁదఱు నొకపై" ౨౯౩

కం॥ అనియి ట్లానతియిచ్చుడుఁ జని విశ్వామిత్ర రాజసైన్యంబులతో
ననియొనరిచి వారలు పదిదినములలో మిగులకుండఁ దెగటార్చి రహో ! ౨౯౪

కం॥ విశ్వామిత్రుఁడు కనుగొని యాశ్చర్యదమైనయట్టి యాబ్రహ్మబలం
బుశ్వాసంబులువిడిచి మహీశ్వర ! యెల్లరును విన నహీనరవమునన్. ౨౯౫

ఉ॥ "ఇట్టిమహాత్త్వ మేరుపడ నేమను నయ్యెద బ్రాహ్మణుండ-నా
పట్టికి మోయుమంచు మహీభారమునంతయు నంసపీఠిపైఁ
బెట్టి సుపర్వకోటికిని బెట్టిదమౌ తప మాచరింతునిం-
కొట్టి యటు ల్పావనప్ప కెటులో చరియించిన నిశ్చయంబుగన్" ౨౯౬

ఆ॥ అని ప్రతిజ్ఞవట్టి యత్యంతభీకరంబైన తపము సేయఁబూనెఁ గాని
పడయఁజాలఁడయ్యె బ్రాహ్మణ్యమతఁ-డంత నాననంబు వెల్లనయ్యె-నకట. ౨౯౭

కం॥ పదపడి కైలాసంబున పదవతి హైమవతిఁగూడి మనుచుండెడి యా
త్రిదశారాధ్యు మహేశ్వరు పదవనజములను భజించి బహుభక్తిమెయిన్. ౨౯౮

తే॥ "నేను బ్రహ్మత్వకాంక్షినై నీదుశిఖరిఁ దపము సేసెద-ఘోరమౌ తత్తపంబు
విఘ్నములులేక పూర్తిగా వృషపతాక ! నీవురక్షింపు-శరణుఁబొందితిని వచ్చి"

కం॥ నావుడు భగవానుండను - "ఓవసుధానాథ ! సిద్ధినొందునిమిత్తం
బీవు వినాయకపూజను గావింపుము-బ్రాహ్మణుఁడవు కాఁగల వంతక" ౩౦౦

క॥ అనవుడు విశ్వామిత్రుం డను- "దేవా! తద్విధంబు నానతియి-మ్మె
జని మొదలు విఘ్నకాలంబున హేరంబదేవు పూజయొనర్తుర్ " ౯౦౧

కం॥ అనుటయు శివుఁడనుఁ- "పార్వతి కొనకొని మును నలుగు వెట్టుకొని రాలిన యా
మనుచేతఁ జేసె నొకబొమ్మను-దనయుఁడటంచుఁ జెప్పి మఱిఁ గ్రీడించెన్. ౯౦౨

సీ॥ గండ్రగొడ్డలిఁ దొట్టి కలుటుస్త్రీ ల్వెట్టి యొప్పారు నాల్గుబాహువులతోడ
నంభఃకలశతుల్య కుంభస్థలముచే రాజిల్లు దంతివక్త్రంబుతోడ
గచ్ఛఁ జేసిన మాద్రిఁ గరము నున్నగనొచుఁ బరగుచుండెడి మహోదరముతోడఁ
జూచువారికిఁ జాలఁ జోద్యముం గలిగించు నలిమాత్రమైన దేహంబుతోడఁ
బొట్టిమోకాళ్ళతోడ నా బొమ్మఁ దీర్చి "యిది సజీవంబు గానుండి యెపుడు నాకుఁ
బుత్రుఁడుగనుండ లోకులు పూజసలుపఁ గరుణ సేయుము" నా నేను గరము ప్రీతి.

తే॥ సృష్టిసూక్తము మఱియును జీవసూక్తముం బఠించి స్పృశించుడు భూమిపాల!
ప్రాణములువచ్చె నూతనప్రతిమ-కపుడు గట్టుపట్టినిగుఱిచి నే నిట్లులంటి. ౯౦౪

"జీవసూక్తమహిమ దేవి! నిర్మించితి నీభవత్కుమారు నేఁ జతుర్థి
నితఁడు నాగణముల కేలికయ్యె గణనాథుఁడనఁ బరంగు నీధరిత్రి. ౯౦౫

చం॥ చదువుచు జీవసూక్తమును జాన! చతుర్థి నెవండు వీనికిన్
జెదరని భక్తిఁ బూజనము సేయునో వాఁడొనరించునట్టి బె
ట్టిదమగు నెల్లచైదములు దీవి సమాప్తములౌను విఘ్నముల్
మొదటికి నాశమొంద శ్రుతిమూర్ధ్యుదయంబునఁ జీకటుల్వలెన్. ౯౦౬

శ్లో॥ "నమో లంబోదరాయేతి నమో గణవిభో తథా
కుఠారధారిణే నిత్యం తథా వాక్సంగతాయచ
నమో మోదకభక్షాయ నమో దంతైకధారిణే" ౯౦౭

కం॥ అనుమంత్రంబులచేతను మును పూజయొనర్చి యంత మోదకములతో
డను నైవేద్యము నర్ఘ్యము ఘనముగ నర్పించి యవలఁ గడుభక్తి మెయిన్. ౯౦౮

కం॥ "నేనొకశుభకార్యంబును బూని యొనర్చెదను శంభుపుత్రా! కరుణన్
దాని సమాప్తముఁ జేయఁగనా నిర్విఘ్నంబుగాఁగ" నని వేఁడి యటన్ ౯౦౯

తే॥ విత్తశాఠ్యము లేకుండ విధియుతముగ శక్తికొలఁదిని మోదకసంయుతమగు
భోజనంబును బెట్టినా భూమిసురుల" కనుచు నిబ్భంగి నంబిక యగ్రమందు. ౯౧౦

చం॥ పలికితి నేను బూర్వమునఁ బార్థివ! దానికి సంతసించి యా
యలికులవేణి "నేఁటిసుత యస్మదభీష్టసుతుణ్,వినాయకున్

దాలుత నిదేశక్రమంబుగను దోరపుభక్తిఁ జతుర్థిఁ గొల్చినన్
దొలఁగును విఘ్నసంచయము-తోడనె కార్యములెల్ల నయ్యెడిన్. ౯౧

కం॥ గజవదనుని స్మరియించియొ భజియించియొ మొదలువెట్టు పనులన్నియు నే
గజిబిజి లేకుండ నెవే విజయంబును గాంచు-నచట వెలసెడి సిరియున్" ౯౧.

కం॥ అనినోడి వేఁగాన నీవును జని గణపతిపూజసేయు చవితి-నభీష్టం
బెనసెద"వని పరమేశ్వరుఁ డనుటయు నగ్గాధితనయుఁ డాగణనాథున్. ౯౧

తే॥ విధియుతంబుగఁ బూజించి విఘ్నవర్జితముగ నత్యంతఘోరమౌ తపమొనర్చి
పడసె బ్రాహ్మణ్యమును గానఁ బడమి ఱేఁడ! కొలువుము వినాయకుఁ
[జతుర్థిఁ గోర్కె దీర. ౯౧

ఉ॥ పుత్రులఁగాంత్రపుత్రకులు భూరిధనంబును గాంత్రు నిర్ధనుల్
శత్రులగెల్తు రేలికలు శ్రద్ధ వినాయకదేవుఁ గొల్చినన్-
ధాత్రి నెవండు దేని మదిఁ దా స్మరియించి తదర్చ సేయునో
పుత్రక! వాఁడు దాని వెసఁ బొందు గిరీశుఁడు చెప్పినట్లుగన్. ౯

ఆ॥ అందగత్తె గామిఁ బ్రాణేశ్వరునిచేత వెడలఁగొట్టఁబడిన వెలఁది యీ గ
ణేశు పూజసేయ నెంతయు సౌభాగ్య మెనయఁగలదు ధారుణీశ! తాను. ౯౧

కం॥ ఎవఁడీయాఖ్యానము ప్రతిదివసము చదివియును వినియుఁ దెలిసికొనునో వై
భవయుతముగ వాఁడొనరుచు వివిధార్థములును ఫలించు-విఘ్నము లెడలున్."

వ॥ అని మార్కండేయుండు రోహితాశ్వునకుఁ జెప్పెనని సూతుండు వా
చ్యుటయు. ౯౧౦

గద్య

ఇది శ్రీమ జ్జగద్గురు గురుకరుణాకటాక్షసంప్రాప్తోభయభాషాపాండిత్య రసవత్కవిత్వ
విధాన హారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబికా గర్భశుక్తిముక్తాయ
మాన విద్వత్సభావిశృంఖలావధానవిధాన జానపాటి పట్టాభిరామాభిధాన
సమాంధ్రీకృతంబగు శ్రీ స్కాందమహాపురాణాంతర్గత
నాగరఖండంబునం దష్టమాశ్వాసము.